# ఉత్తమస్థాయిలోని క్రొంగ్రొత్త రచనలు

## 1. 'రామాయణ రహస్యాలు'

వెల: రూ. 4/-

[వాల్మీకి మును బట్టియే సోదాహరణముగ వెల్లడించిన ఎన్నో రహస్యాలు]

క) రాముడు ఏకపత్నీవ్రతుడా? కానే కాదు.
129 మంది భార్యలున్నారు.

చ) 'రామో ద్విర్నాభి భాషతే' రాముడు రెండు నాల్కలవాడు కాడట. కాకేమి? సమయానుకూలముగ అందరికోలె 'అసత్యవాది' అనుటకు ఎంతో సాక్ష్యమున్నది.

ట) రాముని రాజకీయ కౌటిల్యము

త) రామ-రావణుల స్వరూప స్వభావములు.

ప) లక్ష్మణుని ధూర్తలక్షణము.

గ) సీత అవ్యక్తత

జ) ఊర్మిళా - భరతులలోని ఉత్తమ గుణాలు.

డ) సుగ్రీవ-విభీషణుల దుష్ట రాజనీతి

ద) వసిష్ఠ - పరశురామ - హనుమదాదుల పుట్టుపూర్వముల గుట్టుమట్టులు

బ) రాముడు దేవుడా?
[అట్లని వాల్మీకి అనలేదు]

## 2. 'కామశాస్త్రము'

వెల రూ: 3/-

[వాత్స్యాయన మహర్షి కామసూత్రములకు సమగ్రమైన తెలుగుసేత]

క) శాస్త్రీయ గ్రంథము

చ) ఇంద్రియనిగ్రహము కలవారే చదువవలెను.

ట) ప్రాచీన కామశాస్త్ర గ్రంథములన్నింటికి ఇదే మూలము.

(Scholars' Edition
for Private Circulation only)

---

## 3. 'పంచశతీ పరీక్ష'

వెల రూ: 1/-

[విశ్వనాథవారి 'పంచశతి' అనెడి పద్యరచనకు విమర్శనము]

త) 'పంచశతి' పద్యాలలో ఉన్న అసంగతములను సహేతుకముగ ఖండించిన రచన.

N. B: పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

---

గ్రంథకర్త

కొత్త సత్యనారాయణచౌదరి

నిడుబ్రోలు - గుంటూరు జిల్లా

'కల్పవృక్షంబుపేరటఁ గయిత యల్లి
తెలుఁగునకుఁ దీర్పరానట్టి తెగులు తెచ్చి
బూజుపట్టిన కథలచే మోసపుచ్చు
'విశ్వనాథుని' వైఖరి విశదపఱుతు.'

# కల్పవృక్షఖండనము

'భావనాశూన్య-పదాడంబర-ధారాశుద్ధిహీన-కష్టకల్పనా-నీరసా-
వరసరసముచ్ఛాయా-పునరుక్తి-పాదపూరణ-వ్యర్థపదాపప్రయోగా-
నౌచిత్యాశ్లీల - క్లిష్టాన్వయ - దుష్టాన్వయ - రసనాభాసయుక్తమైన'
విశ్వనాథమునకు సర్వతోముఖ విమర్శనము.

రచయిత

పండిత కొత్త సత్యనారాయణచౌదరి

Retd. లెక్చరర్

నిడుబ్రోలు

# గురుజనస్మృతి

| | | | |
|---|---|---|---|
| 1. | వైదికవాఙ్మయచరిత్రము—గురుదక్షిణ: | శ్రీమత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులవారు | 1931 |
| | కలిపురాణము (పద్యకావ్యము) | ,, ,, | 1953 |
| 2. | చాణక్యము | ,, కళాప్రపూర్ణ-బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు | 1954 |
| | మల్లిక (పద్యాలు) | ,, ,, | 1967 |
| 3. | శకున్తలా (సంస్కృతవచనము) | ,, మీమాంసా శిరోమణి బ్రహ్మశ్రీ కంబంపాటి స్వామినాథశాస్త్రిగారు | 1957 |
| 4. | చారుదత్తము | ,, వ్యాకరణశిరోమణి శ్రీమాన్ కరి రామానుజాచార్యులవారు | 1971 |
| 5. | సతీసప్తతి (పద్యాలు) | ,, పితృపాదులు | 1931 |
| | వరరుచి | ,, ,, | 1946 |
| | కులపతి | ,, ,, | 1969 |

పంచకావ్యాలు మొదలు కళాశాలావిద్యవఱకు నా విద్యావ్యాసంగములో ప్రేమతో సహకరించి నన్నాదరించిన గురువర్యులు నల్వురకును — నా కీ యాకృతి యొసఁగి పెంచి పోషించిన నా జననీజనకులకును నా యీ రచనలు 'గురుదక్షిణ'గా సమర్పించుకొని కొంతైన అప్పు తీర్చుకోఁగలిగితినని విశ్వసించుచు మఱల ఈ రూపమున వారిని స్మరింతును.

—వ

# ప్ర స్తా వ ము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి రచనలలో 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము' సర్వోత్తమ మని కొందఱు భావింతురు. అది వాల్మీకమునుసైతము మించినదన్నట్టు దేశములో ఉపన్యాసములు కొన్ని విన్పించును. ఈ 'కల్పము'లోని లోపములనుగూర్చి ఇప్పటికి ఇరువురి వ్యాసములు మాత్రమే నా కంటఁ బడినవి.

ఇంతకు మున్నే ఈ 'రచనను' గూర్చి నా కున్న భావములను గొన్నింటిని 'తెలుఁగువిద్యార్థిలో' అక్షర రూపమునఁ దెచ్చియుంటిని. ఆవల 'భారతి'వారి కోరికమొయిని మఱికొన్ని వ్యాసములు వ్రాసి పంపితిని. వానివలన దేశములోఁ గొంత 'సంచలనము' కలిగినది. అది సాహిత్యచర్చగా ఉపక్రమించి వివాదరంగముగా పరిణమించినది. ఈ రంగములో ఇంచుమించు ముప్పదిమంది ప్రవేశించిరి. వారిలో ఒక రిద్దరుమాత్రమే నా విమర్శనమును గూర్చి విషయప్రధానముగాఁ గొంతవఱకు చర్చించిరి. ఆ యిర్వురిలో ఒకరు 'అపశబ్దములని' నేను జూపిన వానిని అన్యకవులు వాడిన ప్రయోగముల నెత్తిచూపి సమర్థింపఁ జూచిరి. ఆ ప్రయోగములు నాయెఱుఁగనివి కావు. గిడుగువారి సంపుటములలో అట్టివి కోకొల్లలుగాఁ గన్పట్టును.

నన్నయ్యయుఁ దిక్కన్నయు నన్నావేశించిరనియు, [ఎట్టిన మహాకవి ఎగిరిపోయెను] వారలు పోయిన తెన్నున మెఱుఁగులను దీర్చి దిద్దుచుఁ బోదుననియు వారు వ్యాసభారతమునకు భాష్యముగా మహా

కావ్యముగా ఆంధ్రమహాభారతము రచించిరనియు, ఆ త్రోవలో నేనును వాల్మీకమునకు భాష్యముగా మహాకావ్యముగా ఈ కల్పమును సృష్టించితి ననియు కల్పవృక్షకర్త చేసిన శపథము కల్పమందేగాక ఆ కవి పలికెడి పలుకులలోను హెచ్చుగా వినఁబడుచుండును. నన్నయ్య తిక్కనల రచనలలో ఒక విశిష్టత ఉన్నది. ఆ విశిష్టతను అనుసరించి అనుకరించి ఈ కల్పములో ఈ కవి ఎట్టి త్రోవలు త్రొక్కెనో వారి సత్సంప్రదాయమును ఈ కవి ఎంతవఱకు పాటించెనో, పాత్రౌచితి మున్నగువానిలో వారి ధోరణి ఈ కవికి ఎంతగా అలవడెనో, వాల్మీకమునకు ఈ కల్పము ఎంతవఱకు భాష్యముగా బ్రదుకునో, దీనిలో మహాకావ్యలక్షణములు ఎంతవఱకుఁ గన్పించునో ఇత్యాద్యంశములను ప్రాతిపదికగా పర్యాలోచించికొని ఈ పరామర్శనమునకుఁ గడంగితిని.

మహాకవులు సకృత్తుగా ప్రయోగించిన ప్రయోగములను అనంతర వైయాకరణులు అపవాదములుగా స్వీకరించి గతి కల్పింతురు. అట్టి 'ద్వితీయ-తృతీయ శ్రేణిలోఁ' జేరఁదగిన ప్రయోగములను కుప్పతెప్పలుగా అప్పనముగా 'కల్పములో' వాడుకొని నాది మహాకావ్యమంచు నన్నయతిక్కన్నల రచనలనుసైతము నా రచన మించినదన్నట్లు కల్పవృక్షకర్త ఘోషించుటలో ఎంత సత్య మున్నదో స్పష్టమగుటకే దీని నుపక్రమించితిని. కవిత్రయేతరులు సకృత్తుగా ప్రయోగించిన ప్రయోగములను పుంఖానుపుంఖముగ ప్రయోగించి పాత్రౌచిత్యాదులను బగ్గము పాడు చేసిన ఈ కవి, కవిత్రయమువారి పఙ్క్తను కూర్చుండవలెనని-కాదు కాదు, వారికన్న మహోన్నతమైన ఆసన మధిష్ఠింపవలెనని ఆశించుట-ఘోషించుట-శిష్యపరంపరచే చాటింపించుకొనుట సమంజసము కాదన్న భావములోనే ఈ రచన చేసితిని.

ఈ ఘట్టములో ఈ వ్యాసములను గ్రంథరూపముగా ప్రకటింపవలెనని ఎందఱో వందలకొలఁది ఉత్తరాలలో నన్ను కోరిరి. ఈ 'కల్ప

మును'గూర్చి తెలుఁగువారి కున్న అభిప్రాయములను ఎన్నో కోణము లలో కొంతవఱకు పసికట్టి, వాల్మీకమును-దీనిని జంటగాఁ గేలఁబట్టి ప్రత్యక్షరము పరిశీలించి 'ప్రస్థానము' మున్నగు ఖండములమీఁద మఱి కొంత రచన చేసి ఈ రూపముతో అచ్చునకుఁ దెచ్చితిని.

ఇది వ్రాసి ఇంచుమించు ఒక దశాబ్దము కడచుచున్నను ఆర్థిక ముగా ఓపికయు-'వార్తికము'గా తితిక్షయు లేక ఇన్నేండ్లుగా ఆఁపవలసి వచ్చెను. పోనీ, ఇప్పటికైన ఈ తీరుగ వెలుఁగునకు వచ్చుటఁజేసి నా చేసిన సర్వకృషియు సార్థకమయ్యెనని సంతృప్తి వహింతును.

మున్మొదట ఈ నాభావములను వ్యాసరూపమున తెలుఁగు వారికి వినిపించిన 'తెలుఁగు విద్యార్థి' సంపాదకుల సహకారము మఱువ లేను. ఆవల-పెరిఁగిన ఇంత గ్రంథమునకు-ఇట్టి 'సాహితీసమరమునకు' కారకులైన 'భారతీ సంపాదకులకు' కృతజ్ఞత చూపవలసియున్నది. మా యిరువురిపట్ల సాహిత్యపరముగా 'భారతి'వారు చూపిన వైఖరి కల కాలము మఱువరానిది.

ఇందలి మంచిసెబ్బరలకు విద్వల్లోకమే పరమప్రమాణము.

గుణదోషముల గుట్టుమట్టులు గుర్తింపఁగల 'న్యాయపీఠము' నధిష్ఠించిన పూజ్యులు – శ్రీ ఆవుల సాంబశివరాయలకు ఈ 'ఖండన' మిచ్చుటలోని ఔచిత్యమును సహృదయులు గుర్తింతురని యెంతును.

సత్యనారాయణచౌదరి

## మాన్యశ్రీ - సాంబశివరాయలకు

[ఆంధ్ర హైకోర్టు జడ్జి]

ఉ. కేవల వాదభేదముల
    కీలకమున్ గుఱుతించి న్యాయమున్
  తీవిగఁ జెప్పఁగాఁ దగు ప
    టిష్ఠత లెస్స గడియుంచియున్న శ్రీ
  'ఆవులవంశ్య సాంబశివు'
    సర్హతకుం దగినట్టి ధోరణిన్
  భావన చేసి యీ కృతి శు
    భంబును గూర్పఁగ నెంచి యిచ్చితిన్.

—స

# 'పరీక్ష'

ఏది వ్రాసినఁ జేసిన నేదొ కొంత
సృష్టి కావింతు నాకు నీడెవఁడు లేఁడు;
నాది 'యవతార' మన్న నే నాఁటికైన
నిజము గుర్తించి నవ్వెడి ప్రజలు లేరె?

౨

నన్నయతిక్కనాది కవినాథులు సైతము నాదుకావ్యమం
దున్న 'విశిష్టవైఖరికి' నూహము సేయఁగఁజాలరైరి; నే
నన్నివిధాల 'ఆర్షకవి' నైనను 'భాష్యము' చెప్పనోఁచి, 'రా
మన్న కథాసుధారసము' నారఁగఁ గ్రోలఁగఁ 'గల్ప'మిచ్చితిన్

3

అంచుఁ దీండ్రించి లెస్స గర్వించినట్టి
'కల్పకర్తను' డీకొనఁగలుగు నేర్పు
నాకుఁ గలదంచు నెంచను; నాదుశక్తి
నెఱిఁగి యీ 'ఖండనము' రచియించినాఁడ

౪

'కల్పమునఁ' దిష్టవైచి యనల్పమైన
సంఖ్యలో నిండియున్న దోషములఁ గొన్ని
ఖండన మొనర్చి పండిత మండలికిని
విన్నవింతుఁ బరీక్ష గావించుకొఱకు

—న

'విశ్వనాథ' గ్రంథావళీ—నికషాయమాణ రచనలలో

మొదటిది – 'పంచశతీ పరీక్ష' రూ. 1/-

రెండవది – 'కల్పవృక్ష ఖండనము' రూ. 10/-

రాబోవునవి:

'వేయి పడగలలోని విమర్శ్యాలు'

'విశ్వనాథుని' వేనరాజు

–స

# సూచిక

పుట

ఓమ్

# కల్పవృక్ష ఖండనము

## అవతారిక

కవికులగురువుగా ప్రపంచవిఖ్యాతి పడసిన కాలిదాస మహాకవి, తన మహాకావ్యమైన రఘువంశములో–'నేనొక మందుఁడననియు, కవీశ్వరుల యశస్సును గాంక్షించు వ్యక్తిననియు, ఈ కావ్యరచనలో అపహాస్యము పొందెదనేమో యనియుఁ' దన వైఖరిని వివరించుకొనెను. ఈతఁడే జగ మెఱిఁగిన 'శాకుంతలము'లో విద్వజ్జనులు మెచ్చునందాఁక – తన ప్రయోగవిజ్ఞానమును గూర్చి సందేహింతునని వినయము చూపుకొనెను.

తెలుఁగులో కవిసమ్రాట్టుగా కొందఱు పిలుచుకొనుచున్న 'విశ్వనాథ'వారు, వారి జన్మము ధన్యముగాఁ జేయఁజాలినదనుకొన్న 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము' ప్రారంభములో ఇట్లని చెప్పుకొనిరి.

మ. 'అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ మస్మాదృశుం
డలఘుస్వాదు రసావతారధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుఁడయినాఁడన్నట్టి దావ్యోమపూ
శలచాంద్రీ మృదుకీర్తి చెళ్ళపిళ వంశస్వామి కన్నట్లుగన్. [కల్ప' బాల 7ప.

చెళ్ళపిళ్ళ వంశస్వామి కున్న – ఆ భోగము నన్నయ తిక్కనలకే లేదఁట! దేనినిబట్టి ? తనయంతవాఁడు – అహంకార సంభార దోహల బ్రాహ్మీమయమూర్తి శిష్యుఁడయినాఁడన్నట్టి యదృష్టము చెళ్ళపిళ్ళకు దక్కినదిగాని నన్నయాదులకు దక్కనేలేదఁట. గైర్వాణిలో కాలిదాస మహాకవి కవితాధోరణి ఇట్టిదై యుండఁగా – తెలుఁగుపలుకులలో ఈ 'కవిసమ్రాట్టు'పదవాచ్యుని వైఖరి ఇట్టిదై యున్నది. ఈ యిర్వురి విలువలు కట్టవలెనన్న వీరి రచనలదాఁకఁ బోవలసిన పని లేదు. వీరి పేరుప్రతిష్ఠలు గుణశీలములు గుర్తించుటకు ఈ తొలిపలుకులే చాలును.

నన్నయ్యకు 'విశ్వనాథు'నివంటి శిష్యశిఖామణులు ఉండిరో లేకో చరిత్ర కెక్కుటకు 'రామాయణకల్పవృక్షము'వంటిది

భూలోకమునకు దిగిరాలేదు. ఎందఱు విశ్వనాథులకు-ఈ యాంధ్ర విశారదుఁడు గురువయ్యెనో గురువీర మయ్యెనో తొమ్మిదివందల యేండ్లనాఁటి కథ 'రికార్డు' కాలేదుగాని, విపుల శబ్దశాసనుఁడును ఉభయభాషాకావ్యరచనాశోభితుఁడును-సత్ప్రతిభావిభాసితుఁడు నగు నన్నపార్యుఁడు చెళ్లపిళ్ళస్వామికన్నఁ దఱుగే యని చెప్పఁగలమా! ఉభయకవిమిత్రుఁడై తెలుఁగుకవితను దిద్ది తీర్చిన తిక్కన సోమయాజులే 'ఆంధ్రకవితావిశారదుఁ'డని అభినందించియున్న నన్నయ్యకుఁ గాని, ఆయన 'అజ్ఞాతశిష్యులకు'ఁగాని అందఁగారాని ప్రతిష్ఠ, ఈ గురుశిష్యులకు అబ్బినదని యర్థమా! నన్నయ్యతిక్కనాదుల వాఙ్మయ యుగముకన్న-ఈ గురుశిష్యుల వాఙ్మయయుగమే మిక్కిలి దొడ్డదని మనము భావింపవలెనా! ఈ 'స్వామి'కున్న 'మృదుకీర్తి' పయి స్వాముల కిరువురకును లేదఁట. ఎందువలన? తనంతవాఁడు 'బ్రాహ్మమయమూర్తి' ఈ స్వామికి శిష్యుఁడయినాఁడు కాఁబట్టి తన యంతవారు ఆ స్వాములకు శిష్యులు కాలేదు కాఁబట్టి". ఇది - ఈ రామాయణకర్త ధీమా!!

తిక్కయజ్వకు కేతనమహాకవి, శిష్యుఁడన్నమాట యెఱుఁగని వారు లేరు. ఆ శిష్యశిరోమణి ఆ గురువతంసునకుఁ దన కావ్యమంకిత మిచ్చినదియు-చరిత్ర కెక్కినది. ఇటీవలి యుగములో చెళ్ళపిళ్ళవారికి నలుమొగాల శిష్యపరంపర తామరతంపరగా నుండుటయు లోకమునకుఁ దెలియును. వారిలో 'గురుకుల'వాసశిష్యులు కొందఱు, 'ఆంగ్లపాఠశాలాశిష్యులు' కొందఱు, 'ఏకలవ్య'శిష్యులు మఱికొందఱు. 'అవ్వారి-వేటూరి-వేలూరి'వంటి దిగ్దంతులు - ఆ మొదటిశ్రేణిలోని వారు. రెండవశ్రేణిలో 'త్రిపురనేని-పింగళి-కాటూరులు-విశ్వనాథ వారు' చేరవచ్చును.

సాహితీనిష్ణాతులైన 'అవ్వారి' వారికన్న - ఈ విశ్వనాథవారు పేరుపడసిన శిష్యులని పేర్కొనవలెనా! పరిశోధకప్రాగ్రసరులైన వేటూరివారికన్న వీరు మెఱుఁగైన ఛాత్రులని పరికింపవలెనా! సర్వతోముఖ పాండితీవిరాజితులైన 'వేలూరి' వారికన్న వీరు మేలైన అంతేవాసి యని మెచ్చుకొనవలెనా! యుగకర్తయైన 'త్రిపురనేని' వారికన్న-ఈ 'రామాయణకర్త' మహామహుఁడని

మన్నింపవలెనా! మహాకవులైన 'పింగళి' యుగళముకన్న వీరు కొమ్ములు తిరిగిన మొనగాండ్రని మురిసిపోవలెనా! మధురకవులని మంచి పేరు గడించుకొన్న 'పింగళి-కాటూరి' యుగళము, మధురాతి మధురమైన 'సౌందరనందము'ను తెలుఁగువారి కందించి 'గురుదేవు' లైన చెళ్ళపిళ్ళస్వామికి అంకితమిచ్చి-అందు వారన్నమాట, ఇది:-

ఉ. 'కేతనతోడఁ బొత్తునకుఁ గేల్ కలపం వలపోసి కాదు నీ
చేతను మెచ్చఁగాఁ గవిత చెప్పఁగ నేర్తుమటంచుఁ గాదు, వి
ఖ్యాతికిఁ గాదిఁకేమనిన నద్యతనాంధ్రకవి ప్రపంచ ని
ర్మాతకు భక్తిమై నడుగరల్ ఘటియించెడి పూన్కియే సుమీ!'

ఈ జంటకవులు - కేతన చేసిన దొడ్డపని చేసియు - ఈ యుగములో కేతనవంటి ప్రసిద్ధకవులయ్యు ఆతనితోడి పొత్తునకే జంకి వినయము చూపుకొనిరి. గురుదక్షిణ యిచ్చిన వీరు 'ఇది యొక కొంచెపుఁ బూలమాల కయికొమ్ము స్వామీ!' యని మంచిమాట చెప్పుకొనిరి. ఈ కథలు వినియు - ఇందఱు మంచి శిష్యులను గనియుఁ దానే అందఱికన్న మొనగాఁడ నన్నట్లును, తిక్కనకే ఆ భోగము లేదన్నట్లును 'కల్పవృక్ష' కర్త వర్ణించుకొనుటలో ఎంత యౌచిత్య మున్నదో మనము గుర్తింపవలెను.

ఈ యహంకార మీ తీరుగ వెలయించుకొనుటలోనె ఈ కవి సమ్రాట్టు 'దర్పము - హుందా' స్పష్టమగుచున్నదనియు, ఇట్టి యహంకార సంభార దోషాల వర్ణనము లెండఁటో తెలుఁగుకవు లింతదనుకఁ జేసికొనియే యుండిరనియు విశ్వనాథవారి వందిమాగధులు 'భజగోవిందము' పాడవచ్చును. ఇతివృత్త ప్రవృత్తిలో కథాసంవిధానములో రచనావిశేషములో కవితాధోరణిలో పాత్రౌచితిలో విశ్వనాథవారిది ప్రత్యేకప్రతిభ యని మెచ్చువారును గొందఱుండవచ్చును. వీరు బహుముఖ ప్రజ్ఞాసమన్వితులనియు - ఏతత్కవితాశిల్పము అత్యద్భుతమనియు, ఆ ప్రతిభ అనన్యసామాన్యమనియు దేశములో కొన్ని ప్రాంతములందు ఒక 'వదంతి' కద్దు. అది 'కృత్యవిచారణ' చేసి సర్వతోముఖముగ పరిశీలించి చూచితిమేని విశ్వనాథవారి వ్యక్తిత్వము వ్యక్తమగును. ప్రతిపదములో వీరు గావించెడి ధర్మోపదేశముద్ర-వర్ణాశ్రమ ధర్మసంరక్షణము -

సనాతనమ్మన్యధోరణి, ఈ వ్యక్తి తత్త్వమును, గుణశీలములను పేరువెట్టి వ్రేలెత్తి చూపఁజాలును.

పరమపవిత్రులైన సీతారాముల చరిత్రను మహాకావ్యముగా వర్ణింపఁ దలపెట్టిన ఈ మహాకవి, ఆదిలోనే

'మ. కలిలో దైవము లేఁడు భూసురు లనంగా ద్వేషమైపోయె నీ
తెలుఁగున్నాట మఱీ విచిత్రమయి పొందెన్ బూని ముక్త్యాల తే
దులు బద్ధాదరులైరి నాఁడు మఱి నేఁడున్ సంప్రదాయంపుఁబో
కలకున్ వారికి విన్చి రామకథ యీ కాలుష్యముం ద్రోచెదన్'

[కల్ప. బాల. 80 పు]

అని వ్రాసి కాలుష్యము త్రోచెద నని శపథము చేసెను. దైవము లేఁడన్నవారు–ఇతరయుగములలో లేరని చెప్పుటకు వీరి కాధార మేమున్నది? మొత్తముగా లెక్క కట్టి తేల్చి ముక్కోటి యాంధ్రులలో ముప్పాతిక మువ్వీసము భూసురద్వేషముతో బ్రదుకు చున్నారని భ్రమపడుటకు ప్రధాన హేతు వేమై యుండును? భూసురు లనఁగా ఎవ్వరికి ఎందులకు ద్వేషమైపోయెను? అసలు నేఁడు భూసురు లనఁగా నెవ్వరు? మేమే భూతలములో దేవతలమనియు మమ్ము మీ రెల్లరు పూజింపవలెననియు శాసించి ముందునకు రాఁదగిన 'తాహతు' గలవా రెంద ఱున్నారు? కేవల మా పేరు పెట్టుకొని బ్రదికెడివారిని జాతిమాత్రోపజీవులను – తక్కినవారు దరిచేరి నిచ్చలు మిక్కిలిగా ఆరాధింపవలెనని విశ్వనాథవారి సిద్ధాంతమా! ధర్మోపదేశమా! అడ్డమైన అనాథప్రేతములవంటి 'విభీషణయ్య'లను ఒడిలోఁ బెట్టుకొని, ఆడినది యాటగా పాడినది పాటగాఁ జేసి సంప్రదాయపుఁబోకలనియు సనాతనమార్గములనియు 'జీవుఁడు – వేదన' ఇత్యాదులతో నింకను బూకరించుచు వర్ణించెడి కవనము నే డెవ్వరికిఁ గావలెను? ధర్మ శాస్త్రములు చెప్పిన షట్కర్మములనే పాటించుచు సత్త్వగుణ ప్రధానులై లోకమునకు వెలుఁగు కూర్చు దివ్యమూర్తులను దేవతా మూర్తులుగా సర్వలోక మారాధించును. తన కుండవలసిన ధర్మము లన్నియు–ఆవలఁ గట్టిపెట్టి పరోపదేశపాండిత్య మగ్గలముగా గడించి తా నొక పెద్దనని తానే సంభావించుకొని తన చేతిలో నున్న కవిత్వసాధనముచే ఏదేదో సాధింపవలెనని చూచినచో ఎవ్వ

రాలకింతురు? ఎవ్వరు మన్నింతురు? 'తే హి నో దివసా గతాః.'

కల్పవృక్షకర్త రచనలో ఏ మూల చూచినను ఒకానొక ధార్ష్ట్యము – ఆభిజాత్యము – నిరంకుశత్వము – జాతిద్వేషము వ్యక్తమగుచుండును. మన పూర్వులు గడించి యిచ్చిన వాఙ్మయ భండారములో – ఇట్టి ప్రసంగములు ఘట్టములు కావలసినన్ని కలవు. ఏ శాస్త్రము తడవి చూచినను ఏ కావ్యము చదివి చూచినను కులగోత్రముల నిమ్నోన్నతముల సందడి దందడి కావలసినంత కద్దు. అదే సారమును బిండి కొంగ్రొత్త సీసాలలోఁ బోసి ఏవేవో చిలవలుపలవలుగా పలుకులు పలికి, మైకము కలిపి వడఁబోసి వడ్డించెడి వ్రాఁతలే 'విశ్వనాథ' వ్రాఁతలని యొడ్డోలగములో అడ్డమాఁకయు లేక వాదింపవచ్చును. ఆ వర్ణనలోని సొగసులు దిక్సూచిగా సూచించుటకే ఈ పరిశీలన ప్రారంభమైనది.

# కల్పవృక్షావతారము

మధురాతిమధురమైన వాల్మీకమునకు 'మందరము'వంటి వ్యాఖ్యలతో మంచి యనువాదము లుండఁగా, వీనుల విందులు గొలుపుచు ముద్దుమురిపములు గూర్చు మొల్లరామాయణమువంటివి యుండఁగా, '(శ్రీ)రామ కథామృతము'వంటి మనోహర ప్రౌఢకావ్యము లుండఁగా, కవిత్రయమువారి తరువాత - కనిష్ఠిక కెక్కఁదగిన 'గోపీనాథ - భాస్కరములు' మన కుండఁగా 'రామాయణ కల్పవృక్షము' వలన మనకు సిద్ధించు పరమార్థ మేమి? ఈ తెలుఁగు వారికి ఏమి తలుగయ్యెనని తోఁచి కవిసమ్రాట్టు, ఈ కల్పవృక్షమును భూలోకమునకుఁ దెచ్చి యిచ్చెను? చేసిన సంసారమే చేయ నోఁచిన మానవులకు పారాయణము కోసమై ఇయ్యది కావలసి వచ్చెనా! తిన్న యన్నమే తినుచున్న ఈ జీవులకు 'బలవర్ధకము'గా ఈ మహాకావ్యము అవతరించెనా! ఆ 'జీవుఁడు' వేదనలోఁ బడి కొట్టుకొని 'పితృవాక్యపరిపాలనార్థ'మై పితృవాక్యపరిపాలనాపరాయణమగు ఈ రామాయణకల్పవృక్షమును సృష్టించి యిచ్చెనా! అసత్యములో సత్యమువలె - ఈ నవ్యకల్పవృక్షములోఁ గానవచ్చు 'కల్పము' మహిమ ఎంతవఱ కున్నది? ఈ తెలుఁగురామాయణము... రామతత్త్వ మెంతవట్టు అభివ్యక్తమగుచున్నది? ఇది మనము చదివి యానందించుటకు - ఉపాసించి తరించుటకు, అధ్యయనము చేసి సిద్ధి పడయుటకు - పారాయణము కావించి కృతార్థులమగుటకు, ఆరాధనము చేసి మోక్షము పొందుటకు సాధనమైన మహాకావ్య కల్పవృక్షమని బోధింపవలసియున్నదా! అప్పకవివంటి ప్రబుద్ధులు 'శూద్రమని' పేరు పెట్టి పిలిచిన ఈ తెలుఁగుబాసలో ఉద్భవించి గీర్వాణముద్ర వేసికొన్నట్టు కానవచ్చు - ఈ బృహద్గ్రంథము మన కెట్లు ఉపకరించును! మనుమార్గుఁడగు విష్ణువర్ధనుని యనుమతమున విద్వజ్జనుల యనుగ్రహమునఁజేసి మత్యమరాధిపాచార్యుఁడైన నన్నపార్యుఁడు భారతగాథను వినిపించినట్టు, 'మవ్వంశసంభూతుఁ'డైన చంద్రమౌళినృపతికి 'నేను మనస్సన్యాసి'నని వ్రాసికొన్న 'విశ్వనాథ పార్వతీ శోభనాద్రి గర్భమైన సత్యకవి' - ఈ

కల్పవృక్షగాథను వినిపించుటలో ఊహింపఁదగిన పరమార్థ మేమి! తండ్రికి పరమభక్తాగ్రగణ్యుఁడైన పుత్త్రుఁడు వ్రాసిన ఈ రామాయణము లోకమున కేమి ఒఱిగింపఁగలదు? కృతిశతనిర్మాతయైన ఈ బిడ్డ చేసిన ఈ దొడ్డ కార్యమువలన తెలుఁగుగడ్డకు లాభించిన ప్రయోజన మేమి? వందల తరబడిగా పద్యములు వ్రాసి యిచ్చెనన్న సంబరము మనము పొందవలెనన్న 'జనమంచి' ప్రభృతులెందఱో ఆ పని యెన్నఁడో చేసియుండిరే! ఎన్నేండ్లు తపస్సు చేసియున్నను ఏమేమి నోములు నోఁచినను 'గోపీనాథ – భాస్కర'ములకు ఈ కల్పవృక్షము ఈడు జోడు కానేరదే. శ్రమపడి చెట్టెక్కి కోసి, బొండము పగులఁగొట్టి, పీచు లాగివైచి బద్దలు చేసి డిప్ప యూడ్చి ముక్కలు ముక్కలు చేసి నోట వైచుకొని నమలి నమలి రసము మ్రింగవలసియుండు – ఈ 'నారికేళపాకము' వ్రాఁతలు రామకథామృతమును జుఱ్ఱనచూఱలుగాఁ గ్రోలనిచ్చునా! ఈ గచ్చకాయపాకము, వైదర్భీరీతిలో వచ్చియున్న వాల్మీకమును మనకు రుచిచూపునా! ఈ – ఎగుడు దిగుడు సమాసములు–ఏకదేశాన్వయదోషదూషితములు – చీకిలిమాకిలి వర్ణనలు – గ్రాంధికాభాసములైన పలుకుబళ్లు, కావ్యస్వరూపమును మనకుఁ గన్నులకుఁ గట్టినట్టు చూపఁగలుగునా? బూతుల బుంగలైన ఈ శృంగారఘట్టములు – విచిత్రధోరణిలో వెలికిఁ దెచ్చిన ఈ వెకలిపాత్రలు – వెఱ్ఱివెంగళప్పలైన విశ్వసింపనేరని ఈ వర్ణాశ్రమ ధర్మసంరక్షణలు, ఆదికవి వాల్మీకి మహర్షి మాటలకు అనువాదములుగా 'పరపతి' కెక్కునా! ఈ వికారపుటాకారమునకు – ఈ బృహత్స్వరూపమునకు ఆధ్యాత్మికత్వమారోపించి ప్రచారము సేయు ప్రబుద్ధులు వందిమాగధులు కొందఱుండవచ్చును. 'భజగోవిందముగ' – వారు ఈ రచనను పారాయణము చేయవచ్చును. కావ్యస్వరూపముగా – ఆధ్యాత్మికగ్రంథముగా ఈ కల్పవృక్షము ఎందఱి కానందమును కూర్చు ధోరణిలో నున్నదో అంతర్ముఖులై పరిశీలింపవలెను.

సనాతనమైన శ్రీరామకథలో 'పురుటిండ్ల' సంబరములా మనము క్రొత్తగ నేర్చుకోవలసిన ఘట్టములు? సాగనారమట్టలు వ్రాఁత దెప్పలు వాకిటఁ గట్టినారన్న మాటలా మనము కల్పవృక్ష

ములో వినవలసినది? వియ్యాలవారి 'పానకాల కావళ్ళను' పానకాల
త్రాగుళ్ళను ఈ రామాయణము మనకు నేర్పవలెనా! కోసలక్ష్మాత
లేంద్రు సుత స్తనచూచుకమును శ్రీరామచంద్రులవారు పంటితో
నొక్కఁగా — ఆ భాగము 'కందిగింజ' అయ్యెనఁట! అవురా! ఈ
చిత్రము చూపుటకా మన కీ కల్పవృక్షము దిగినది? 'లం[illegible]!
ఎంత క్రిందికి గుంజినావె' — అని విశ్వామిత్రుల నోట పలుకులు
పలికించుటయే విశ్వనాథుల పరమార్థమా? అమ్మకూఁతుల సంభాష
ణములో 'మాడుపట్టున నింత చమురు పెట్టుట — మంగళవారము
పళ్ళెము పట్టుట' వంటి ఆచారములు వినిపించుటకా ఈ యధ్యాత్మ
రామాయణము అవతరించినది? 'అలుకుగుడ్డకై' జనకదశరథ మహా
రాజుల పరిచారికలలో కలహము రేఁగి పెండ్లికి శోభ తెచ్చెనన్న
తెలుఁగుపోకడ, యావద్భారతగాథలో వన్నె తెచ్చునా? ప్రబంధ
మండలిలో 'సహసానఖంపచాది' శృంగారవర్ణనములు జుగుప్సా
వహములని నవీననాగరకులు నిరసించుచుండఁగా పవిత్రదంపతులుగా
భావింపవలసిన సీతారాములకు విశ్వనాథులు శృంగార మెట్లు రంగ
రించి పోసిరో మున్ముందు చూతము. సీతారాముల శృంగార
విలాసములలో కైకమ్మ జోక్య మున్నదఁట. ఇది యొక కొంగ్రొత్త
ఘట్టముగా కవిసమ్రాట్టు ఊహించి వర్ణించిన భావికావ్యార్థసూచన
కాఁబోలు! ఆబిడ అడవికోడి కూసినట్లు నవ్వెనదఁట. అసలు వీరి
యుపమానములే 'వల్లమాలిన' అపూర్వకవిసమయ నిబద్ధములు. ఈ
మహాకల్పవృక్షములో రెమ్మరెమ్మకు కొమ్మకొమ్మకు నీచోపమలు
న్యూనోపమలు లక్షోపలక్షలు వ్రేలాడుచుండును. ఈ సొబగుకోసమే
ఈ రామాయణమును మనము పారాయణము చేయవలెనా! కోడలిని
గదిలోనికి నెట్టి పకపకలు వికవికలతో తలుపులు మూసెడి — తీసెడి
తల్లులు గలిగిన ఈ రామాయణములో మనము నేర్చుకోవలసిన
సంబరము లేవి? ఈ ఘట్టములోని వింతలు విడ్డూరములు శృంగార
రంగములు చవి చూడవలెనన్న 'రైల్వేవాఙ్మయము' దినదినాభ్యు
దయ పరంపరగా పుట్టుకొని వచ్చుచున్నదికదా! ఈ గోఁతలో
దిగఁబడిన ఈ కల్పవృక్షమును మన మేల కన్నెత్తిచూడవలెను!

ఆచరణలో లవలేశము చూపఁగారాని ఏవేవో సనాతనభావములను పూర్వసువాసినిని బోలునవి యూహించి భావించి, వానినే ఈ కవనములో దూర్చినేగాని పాత్రపోషణలోని యౌచిత్యమును - ఈ కవిసమ్రాట్టు అంతగాఁ బాటింపలేదు. జారయై పతితయైన అహల్యపుత్త్రుఁడు, విశ్వామిత్రుని శృంగారగాథను 'శిశువు'లైన రామలక్ష్మణుల సన్నిధిలో వినిపించుటలో ఔచిత్య మేముండును? వసిష్ఠులవారి మహామహిమను వర్ణింపఁబూని సాక్షాత్తు - ఆ కథనే వినుచున్న విశ్వామిత్రుని తేలికపఱిచిన ఘట్టము లెన్ని యున్నవో గమనింపవలెను. ఆ మాటలు చెవులార వినుచు నోరప్పగించి యూఁకొనుచున్న ఈ విశ్వామిత్రుఁడు అసలు విశ్వామిత్రుఁ డగునా? హాయిగా పురాణముగా - ఇతిహాసముగా ఈ కల్పవృక్షములోని గాథను ఒకరి కొకరు చదివి వినిపింపవలెనన్న - ఒక్క యడుగు సొగసుగా ముందునకు సాగదే. కావ్యముగా భావించి ప్రబంధముగా మన్నించి ఏదో యొక ఘట్టము చూడవలెనని పట్టు పట్టినను ఆ కావ్యసారస్యము మచ్చునకైన నిచ్చట దొరకదే. ఏమి యూహించి తెలుఁగువారు దీనిని పారాయణము చేసికోవలెనో తెలియదాయెను. సారస్వతములో మునిఁగి తేలి వాఙ్మయమును జవి చూచిన విద్వజ్జనమునకా - ఈ కల్పవృక్షములోఁ బని లేదు. సరసమైన త్రోవలో హృద్యమైన ధోరణిలో రచనలు చేసి లోకమున కింత యానందమును బంచియిచ్చు మహాభాగ్యము గడించిన కవిశేఖరులకా - ఈ 'కల్పము' లో అక్కఱ పట్టదు. అక్షరాస్యులమైనఁ గాలేదే యన్న బెంగతో క్రుంగి కూలారి, పురాణమే సాధువన్న భ్రమలోఁ బడి, పూర్వాచారములనే పాటింపవలెనన్న - ఒకానొక 'మోజు'చే ఈ గాథ వినిపించుకోవలె నని యూఁగులాడు అమాయికులకా - ఈ నారాయణము కొఱుకరాని బండకొయ్య; నమలరాని ఇనుప ముక్క. మిక్కిలి యోపికలు లేక చదువుటకుఁ దీరికలు నొరకక ఏవేవో విలాసములతో వినోదములతో ప్రొద్దులు పుచ్చువారికసలు - ఈ రచనజోలి పట్టనేపట్టదు. ప్రాథమిక శిక్షగా బాలశిక్షగా రామాయణముగదా యన్న మమకారములో పద్యగద్యములను పఠింపవలెనన్నను బోధింపవలెనన్నను రామ

రామ! ఒక్క పద్యమేని నోరారఁ జదివి పదచ్ఛేదము చేసి
దండాన్వయము చెప్పి భావము వినిపింపవలెనన్న సాధ్యమే కాదే.
ఆ దూరాన్వయములు - క్లిష్టాన్వయములు - పెళుచు సమాసములు-
కక్కుర్తి పలుకుబళ్లు - అక్కఱలేని సముచ్చయములు - కోశముల
లోనే నిలువయుండి 'పసరులు' వేసిన ప్రాంబద్ధ మూఱుమూల
మాటలు - వానికి టుప్పీకలు x వెకలి వర్ణనలు, ఇయ్యవి విద్యార్థుల
కేమని బోధింతుము? గ్రాంథికముగాఁ గానవచ్చి వ్యావహారిక
ముద్రతో పడుగుపేకలుగా నడచిన ఈ రామాయణరచనలో అడు
గడుగునకు 'నేనన్నదే మాట' యన్నట్లు బాట సాగుచుండఁగా - ఆ
తప్పుడు పదములను ఏమని సాధింతుము? ఎట్లు సమర్థింతుము?

ఒకప్పుడు కవిసార్వభౌముని శ్రీనాథునే వెక్కిరించిన ఈ
కవిసమ్రాట్టు చేసిన ఇట్టి రచనలో ఎన్ని దోషములు రాశీభూతములై
యున్నవో ఎఱిఁగినవా రెందఱో యుందురుగాని వెలిఁ బుచ్చువారు
కొందఱే యుండవచ్చును. అంధపరంపరగా - 'ఆయన కేమి మహా
రాజు' అన్నట్లు - అధికారికముగా అంత 'లావు' పలుకుబడి గడించి
యుండుటవలననో, ఏవో ఇన్ని రచనలు బండ్లు మోసినవిగా
ఈయనచేతిలో ఉద్భవించియుండుట చేతనో - అవి యన్నియు
'సత్యము శివము సుందరము'గా భావించువారు కొందఱు ఉండుటఁ
బట్టియో, ఈ కవిసమ్రాట్టునకు నేఁడు దేశములో కొన్ని ప్రాంతము
లలో 'పరపతి' వాలుగాఁ గుదిరి వీలుగా జరుగుచుండవచ్చును. కాని,
వాఙ్మయ ప్రపంచములో ఈ కవి పోయినపోకిళ్లు - ఈ రచనల
విలువలు గుర్తించినవారు లేకపోలేదు. 'పానకము'వంటి కొంగ్రొత్త
'వృత్తములు' సృష్టించి గ్రచ్ఛకాయపాకములో పదనుగా మెదపి,
వెనుక ఒకానొకప్పుడు తెనుఁగురచనలు చేసిన 'కొక్కొండ'వారి
సాహిత్యమునకుఁ బట్టిన గతియే ఈ కవిసమ్రాట్టు రచనలకునై తము
పట్టవచ్చును. పలుకుబడినిబట్టి ప్రచారకాండనుబట్టి వందిమాగధులు
తెచ్చి యందించు కీర్తిప్రతిష్ఠలు మానిసికి శాశ్వతములు కావు. అవి
'సూపరు' వేసిన పాఁడి-పంటలవంటివే. వీరి దృష్టిలో వీరి రచనలు
'అర్థకృతే' కావచ్చునుగాని 'శివేతరక్షతయే' అన్న దశమునకు
సుతరాము అర్హములు కావు. విశ్వకల్యాణము గూర్పవలెనని

రోళ్ళు రోఁకళ్ళు వేనోళ్ళఁ బాడుచున్న నేఁటి మహానాయకులయు-ప్రవక్తలయు ఉపదేశముద్ర పొంది నవనవోన్మేషముగ రాణించుచు వచ్చుచున్న నేఁటి సమాజములో సనాతనమ్మాన్యముగా స్ఫురించు — ఈ గోముఖ వ్యాఘ్రరచనలు, ఈ 'తేనెపూసిన కత్తుల' వ్రాతలు బొత్తిగా అక్కఱలేదు.

సార్వకాలికములుగా సార్వదేశికములుగా నాలుగు కాలములు నిలుచు ధర్మములే నేఁడు అనుష్ఠింపవలసియున్నది. ఇంకను, నేను ఉత్తమవంశసంజాతుఁడ నన్న 'ధీమా' రచనలలోఁ జూపరాదు. లాఁతివారికి నేను 'స్వామిపీఠ' మన్నమాట తానుగాఁ బలుకరాదు. విషపూరితములై బుద్బుదప్రాయములైన రచనలను గట్టిపెట్టి, ఏకదేశముగా అన్వయించు వ్రాఁతలను ఆఁపివైచి, స్వార్థమే బుఱ్ఱ కెక్కిన భావములను మూలఁబెట్టి విశ్వశ్రేయస్సును బ్రసాదించు రచనలనే లోకమున కందింపవలసియున్నది. ఏ కోశములోను లవలేశమేని ఈ ధోరణి కానరాని ఈ కవిసమ్రాట్టు ఏలెడి కవితాసామ్రాజ్యము ఎవ్వరికిఁ గావలెను? అట్టి సామ్రాజ్యములోని వర్ణనాఘట్టములను-భాషా చిద్విలాసములను సనాతనధర్మములను పరిశీలించి ప్రదర్శించుటకే ఈ నా ప్రయత్నమని మనవి.

# రచనావైలక్షణ్యము

'రామకథ అందఱికీ తెలుసు, ఎవరూ వ్రాయనక్కఱలేదు. ఒకవేళ వ్రాస్తే ఏదో ఒక వైలక్షణ్యాన్ని చూపగలిగితేనే వ్రాయాలి. అందుకే నేను వ్రాశాను' – ఇది విశ్వనాథ కవిసమ్రాట్టు చేసిన శపథము.'

[2–11–60 ఆంధ్రపత్రిక]

ఈ ధోరణిలో ఉన్నదనుకొన్న వీరి 'రామాయణకల్పవృక్షమును' పరిశీలింపఁగా ముప్పాతిక మువ్వీసము ఈ శపథము నెఱవేరినట్లే నాకుఁ దోఁచినది. విలక్షణమనఁగా–వేఱైనది – అన్న యర్థమే గాదు; విశేషమైన లక్షణము గలది – అన్న యర్థముకూడ ఉన్నది. కావున–ఈ యర్థములోనే 'వైలక్షణ్యా'మన్న మాట ఆయననోట వచ్చియుండును.

ఇది రామాయణమున కనువాదము కాదు; వాల్మీకమునకు భాష్యమన్న ధోరణిలో కల్పవృక్షకర్త పలుకవచ్చును. మన కున్న ప్రాచీనాంధ్రవాఙ్మయ మంతయు అనువాదరూపమే యయ్యు–అందలి యొకానొక వైశిష్ట్యముచే కేవలానువాదముగా అనిపించుకొనలేదు. కవిత్రయమువారు కావించినదిగాని శ్రీనాథాదులు చేసినదిగాని ఒక యపూర్వసృష్టి. అనువాదముగా ఆ యితివృత్తమును దీసికొనుటలో దానిని తెలుఁగులో చిత్రించుటలో వారి కున్న ప్రతిభ అసామాన్యము. అందువలననే వారికావ్యములు స్వతంత్రకావ్యముల కన్న మిన్నగా ఇన్ని వందల యేండ్లనుండి 'పరపతి' కెక్కియున్నవి. నిన్న చదివిన తెలుఁగు భారతమును నేఁడు మఱలఁ జదువను బుద్ధి పుట్టుచున్నదనఁగా – ఆ కవిత్రయమువారి హస్తకౌశల మట్టిదని యర్థము. రవ్వంత ఇతివృత్తమునే ఆధారముగాఁ గైకొని సర్వాంగీణ ముఖమైన కావ్య సౌందర్యమును దెచ్చి యిచ్చి తెలుఁగులో తిక్కన్న వన్నె చిన్నెలు కూర్చుటఁ జేసియే తెలుఁగు భారతము కొన్ని పట్టములలో మూలమునే మించిపోయినదని అభిజ్ఞు లభివర్ణించిరి.

కల్పవృక్షములోని కథ రామాయణమే కావచ్చును. నిజముగా – కథకోసమని ఈ 'కల్పమును' ను జదువవలసిన యక్కఱ లేదు; చదివిన లాభమును లేదు. ఆ దృష్టిలో ఇంతకన్న వేయి విధాల మెఱుఁగైయున్న 'మొల్లరామాయణము' తెలుఁగువారికి ఉండనేయున్నది. కాఁగా, ఆ వైలక్షణ్యము గుర్తించుటకే ఈ కల్పవృక్షము మనకుఁ గావలసి యున్నది.

త్రేతాయుగములోని ఈ కథకు ఇరువదవ శతాబ్దిలోని వింతలు విశేషములు కొన్ని సంతనచేసి ఆధ్యాత్మికభావము లేవేవో ఉన్న యట్టులు చూపిన ఘట్టములు ఇందుఁ గొన్ని కానవచ్చును. ఆ మాత్రము స్వాతంత్ర్యము ఏ కవికైన ఉండకతప్పదుగాని, ఆ వైలక్షణ్యములో ముఖ్యమైన యౌచిత్యము – మర్యాదమన్ననలు ఏవేవో కొన్ని పాటించి తీరవలెను. అప్పుడే ఆ కావ్యము నాలుగు కాలాలు నిలిచియుండును. 'కల్పము' లో – ఆ వైలక్షణ్యము ఎన్ని ముఖాల నడచెనో కొన్ని ఘట్టములలో విన్నవింతును.

(క)

కైకేయి కోరిన వరము లిచ్చితీరవలెనని నిశ్చయమైనపిదప సుమంత్రుఁడు జోక్యము తీసికొని యందఱిముందు కైక నిట్లని మందలించును :—

శ్లో॥ 'ఆశ్చర్యమివ పశ్యామి యస్యాస్తే వృత్తి మీదృశం,
ఆచరంత్యా న వివృతా సద్యో భవతి మేదినీ.

శ్లో॥ మహాబ్రహ్మర్షిజుష్టా వా జ్వలంతో భీమదర్శనాం
ధిగ్వాగ్దండా న హింసంతి రామప్రవ్రాజనే స్థితామ్.

శ్లో॥ ఆమ్రం ఛిత్వా కుఠారేణ నింబం పరిచరేత్తు యః
యశ్చైనం పయసా సించే న్నైవాస్య మధురో భవేత్ ' ఇత్యాది.

[వాల్మీకము–వావిళ్ళ–అయోధ్య 625 పుట]

ఈ ఘట్టములో 'కల్పము' చిత్రించిన వైఖరి చూతము.

ఆ. 'రాజు మూర్ఛ పొందె రాణులు మూర్ఛిల్లి రంత మూర్ఛ పొందె
సా సుమంత్రుఁడుం.'

చం. కడకను నందఱుం దలిని గాంచి సుమంత్రుఁడు పెద్ద యూరుపుల్
విడిచిగఁ బుచ్చి దంతములు పెట్టన పీడన చేసి కోపపుం
బడలున ...... కైకయిం గని ...... ఇట్లనెన్.

గీ. నీవు రాజునుగాని వనీనితాంతవీథులకుఁ బంప నిన్ను శపింప మింతి
అజ్ఞను బతిఘ్నివగుదు కులఘ్నివగుదు వంతె యింది యేమి చేసితి వబ్బురముగ.

గీ. అవుర ! సుకుమారశిల్పినీ! యంబునిధిగభీర వక్షోభ్యుఁ బతి నెంత పట్టినావు ?

కం. ధరణి నిను ద్రింగ నోరుం దెఱవదు బ్రహ్మర్షి వాక్యదీపిత శిక్షా
సరణియుం నిన్నంటదు నీ పరమాఘం బెంత గట్టిపడినదొ కైకా !

ఉ. తెచ్చిన వేఁపపెంకొక్కఁకను దేనియ పోయుము చేదు మానునా !
యెచ్చటఁ బుట్టె నా గుణమె ? యెవ్వఁ డెఱుంగఁడు నీదుతల్లి నా
మచ్చరి మూఁడు మూర్తులను మాకయి పుట్టితి ....

కం. ఆ తల్లిబిడ్డ వంగన ! మాతం బడి పుట్టునంద్రు మహి, భూపతి యే
రీతిఁ దలంచునొ చేయుము భూతల మిది నీదుఁగరుణపొంటెఁ జరించున్

ఉ. ఎయ్యదియైన మానవుల కెంతయు నోర్చుట తెలికాఁజామి
ప్రయ్యెదునట్టి మానవులపజ్జఁ జరించుటకంటెఁ బంపకే
యయ్యడవుల్ రఘూత్తముని, నాతని మాఱుగ రాజు పోవు నా
దయ్యములున్ నినుం గని కృతజ్ఞులుగా మనుచుందు రెంతయున్.

గీ. అని సుమంత్రుఁడు సాక్షేపసానుకంపముగను బలిమాల.

[కల్ప-అయోధ్య-99 పుట]

ఇట్టి నీ వృత్తమును జూచి ఈ నేల ద్రవయ్యలు కాలేదే యన్నదే నా కాశ్చర్యముగా నున్నది. వసిష్ఠాదులు ఛీ ఛీ యని తిట్టిపోసిన తీవ్రమైన మాట లేవియు నిన్ను బాధింపలేదే! అని వాల్మీకము చెప్పఁగా 'ధరణి నిను ద్రింగ నోరుం దెఱవదు' అని 'కల్పము' క్రొత్తభాష్యము వినిపించినది. మూలము చూడనివారికి 'బ్రహ్మర్షి వాక్యదీపిత శిక్షాసరణియు నిన్నంటదు' అన్న వాక్యమర్థమే గాదు. 'ధి గ్వాద్గండా' :— అన్న భావము కల్పములో లేదు. ముక్కకు ముక్కగా అనువాదము కాకపోయినను మొత్తము మీఁద భావము స్ఫురింపవలెనుగదా! ఆవల — కైకేయీ దశరథుల నిర్వారను గూర్చి అన్యాపదేశముగా మందలించినట్లున్న 'ఆగ్రమం

ఛిత్వా' ఇత్యాది శ్లోకమునకు ఒక విలక్షణమైన పద్యమునే కల్పము మన కిచ్చినది. వాల్మీకములో మనకుఁ జూపినవి రెండు చెట్లు. ఒకటి మామిడి, రెండు వేము. మామిడిని గొడ్డలితో నఱకి వేమును పాలు పోసి పెంచినట్లు సుగుణాభిరాముఁడైన శ్రీరాముని వరములవంకతో అడవులకుఁ బంపి భరతుని రాజుగాఁ జేసెదరా మధురఫలముల నిచ్చు శ్రీరాముని విడనాడి కైకేయిమాట వినుట నీకు న్యాయము కాదయ్యాయని వృద్ధరాజును మందలించినట్లు అర్థము రావలెను. 'తెచ్చిన వేఁపమొక్కకును దేనియ పోయుము చేదు మానునా?' అన్నది కల్పములోని కవనము. ఈ వేఁపమొక్క ఎవరు? తల్లి కైకేయికి అన్వయించునా? బిడ్డయైన భరతునకే చెందునా? నీ తల్లికథ ఎవ్వఁ డెఱుఁగఁ డని పూర్వవృత్తాంతము జ్ఞప్తికిఁ దెచ్చుచున్నారుగాన కైకమ్మయే కల్పమునుబట్టి వేఁప మొక్క కావచ్చును. మొక్క గావున భరతునకే అన్వయించుట మంచిది. మూలమందలి సారస్యమును ద్రుంచివైచి ఈ వైలక్షణ్యము చూపుటకా ఈ కల్పవృక్షము మనకు దక్కినది?

'ఉ. ఎయ్యదియైన......' ఈ పద్యములో అంతరార్థ మేమున్నదోగాని అసలు కావలసిన యర్థము సులువుగా స్ఫురించుట లేదు. ఒకటి రెండు పాదములను గలిపి చూచినను రావలసిన యర్థము రాదు. 'పంపకే యయ్యడవుల్ రఘూత్తముని'— రఘురాముని అడవులకుఁ బంపకుమా యని యర్థము కాఁబోలు! అడవులు పంపుట ఒక వింత కారకము. వాఁడు ఊరెళ్ళి, అన్న వ్యావహారికమునకు గ్రాంథికరూపముగా దీనిని సమర్థించుకోవలెను. ఆ వెంటనే 'అతని మాఱుగ రాజు పోవు' అన్న మాటకు, వెనుక విశ్వామిత్రుఁడు వచ్చినపుడు శ్రీరామునిబదులు నేనే వత్తునయ్యా యని దశరథుఁ డన్న మాట జ్ఞప్తికి వచ్చినది. కాని, మూలము చూచినప్పుడే ఈ మాట నా కర్థమైనది.

శ్లో॥ రామే హి యావరాజ్యస్థే రాజా దశరథో వనం
ప్రవేక్ష్యతి మహేష్వాసః పూర్వవృత్త మనుస్మరన్.

[అయోధ్య – 628]

చం. కడకును నందఱుం దెలివి గాంచి సుమంత్రుఁడు పెద్ద యూరుపుల్
నిడివిగఁ బుచ్చి దంతములు పెట్టిన పీడన చేసి కోపపుం
బడలున ...... కైకయిం గని ...... ఇట్లనెన్.

గీ. నీవు రాజునుగాని వనీనితాంతవీథులకుఁ బంప నిన్ను శపింప మింత
అజ్జను బతిఘ్నవగుదు కులఘ్నవగుదు వంతె యిది యేమి చేసితి వబ్బురముగ.

గీ. అవుర ! సుకుమారశిల్పినీ! యంబునిధిగభీరు నక్షోభ్యుఁ బతి నెంత పెట్టినావు ?

కం. ధరణి నిను మ్రింగ నోరుం దెఱవదు బ్రహ్మర్షి వాక్యదీపిత శిక్షా
సరణియుఁ నిన్నంటదు నీ పరమాఘం బెంత గట్టిపడినదొ కైకా !

ఉ. తెచ్చిన వేఁప మొక్కకును దేనియ పోయుము చేదు మానునా !
యెచ్చటఁ బుట్టె నా గుణమె ? యెవ్వఁ డెఱుంగఁడు నీదుతల్లి నా
మచ్చరి మూఁడు మూర్తులను మాకయి పుట్టితి ....

కం. ఆ తల్లిబిడ్డ వంగన ! మాతంబడి పుట్టునండ్రు మహి, భూపతి యే
రీతిఁ దలంచునొ చేయుము భూతల మిది నీదుఁగరుణపొంటేఁ జరించున్

ఉ. ఎయ్యదిరైన మానవుల కెంతయు నోర్పుట తెలికాఁజుమీ
ప్రయ్యెదునట్టి మానవులపజ్జఁ జరించుటకంటెఁ బంపకే
యయ్యడవుల్ రఘూత్తముని, నాతని మాఱుగ రాజు పోవు నా
దయ్యములున్ నినుం గని కృతజ్ఞలుగా మనుచుందు రెంతయున్.

గీ. అని సుమంత్రుఁడు సాక్షేపసానుకంపముగను బతిమాల.

[కల్ప-అయోధ్య-99 పుట]

ఇట్టి నీ వృత్తమును జూచి ఈ నేల వ్రయ్యలు కాలేదే యన్నదే నా కాశ్చర్యముగా నున్నది. వసిష్ఠాదులు చీ ఛీ యని తిట్టిపోసిన తీవ్రమైన మాట లేవియు నిన్ను బాధింపలేదే! అని వాల్మీకము చెప్పఁగా 'ధరణి నిను మ్రింగ నోరుం దెఱవదు' అని 'కల్పము' క్రొత్తభాష్యము వినిపించినది. మూలము చూడనివారికి 'బ్రహ్మర్షి వాక్యదీపిత శిక్షాసరణియు నిన్నంటదు' అన్న వాక్యమర్థమే గాదు. 'ధి గ్వాగ్దండా' :— అన్న భావము కల్పములో లేదు. ముక్కకు ముక్కగా అనువాదము కాకపోయినను మొత్తము మీఁద భావము స్ఫురింపవలెనుగదా! అవల — కైకేయీ దశరథుల నిర్వారను గూర్చి అన్యాపదేశముగా మందలించినట్లున్న 'ఆమ్రం

ఛిత్వా' ఇత్యాది శ్లోకమునకు ఒక విలక్షణమైన పద్యమునే కల్పము మన కిచ్చినది. వాల్మీకములో మనకుఁ జూపినవి రెండు చెట్లు. ఒకటి మామిడి, రెండు వేము. మామిడిని గొడ్డలితో నఱకి వేమును పాలు పోసి పెంచినట్లు సుగుణాభిరాముఁడైన శ్రీరాముని వరములవంకతో అడవులకుఁ బంపి భరతుని రాజుగాఁ జేసెదరా! మధురఫలముల నిచ్చు శ్రీరాముని విడనాడి కైకేయిమాట వినుట నీకు న్యాయము కాదయ్యాయని వృద్ధరాజును మందలించినట్లు అర్థము రావలెను. 'తెచ్చిన వేఁపమొక్కకును దేనియ పోయుము చేఁదు మానునా ?' అన్నది కల్పములోని కవనము. ఈ వేఁపమొక్క ఎవరు? తల్లి కైకేయికి అన్వయించునా? బిడ్డమైన భరతునకే చెందునా? నీ తల్లికథ ఎవ్వఁడెఱుఁగఁడని పూర్వవృత్తాంతము జ్ఞప్తికిఁ దెచ్చుచున్నారుగాన కైకమ్మయే కల్పమునుబట్టి వేఁప మొక్క కావచ్చును. మొక్క గావున భరతునకే అన్వయించుట మంచిది. మూలమందలి సారస్యమును ద్రుంచివైచి ఈ వైలక్షణ్యము చూపుటకా ఈ కల్పవృక్షము మనకు దక్కినది ?

'ఉ. ఎయ్యదియైన......' ఈ పద్యములో అంతరార్థమే మున్నదోగాని అసలు కావలసిన యర్థము సులువుగా స్ఫురించుట లేదు. ఒకటి రెండు పాదములను గలిపి చూచినను రావలసిన యర్థము రాదు. 'పంపకే యయ్యడవుల్ రఘూత్తముని'— రఘురాముని అడవులకుఁ బంపకుమా యని యర్థము కాఁబోలు! అడవులు పంపుట ఒక వింత కారకము. వాఁడు ఊరెళ్ళి, అన్న వ్యావహారికమునకు గ్రాంథికరూపముగా దీనిని సమర్థించుకోవలెను. ఆ వెంటనే 'అతని మాఱుగ రాజు పోవు' అన్న మాటకు, వెనుక విశ్వామిత్రుఁడు వచ్చినపుడు శ్రీరామునిబదులు నేనే వత్తునయ్యా యని దశరథుఁడన్న మాట జ్ఞప్తికి వచ్చినది. కాని, మూలము చూచినప్పుడే ఈ మాట నాకర్థమైనది.

శ్లో॥ రామే హి యావరాజ్యస్థే రాజా దశరథో వనం
ప్రవేక్ష్యతి మహేష్వాసః పూర్వవృత్త మనుస్మరన్.

[అయోధ్య – 628]

పూర్వవృత్త మనఁగా ఇక్ష్వాకుకులక్రమాగత వృత్తమని యర్థము. రాముఁడు యువరాజైనప్పుడు ఆచారమునుబట్టి దశరథుఁడు వనములకుఁ బోవునన్న భావమును ఒక్క చిన్నమాటలో కల్పము సూచించినది. ఇది యనువాదము గాదు; భాష్యమును గాదు. ఇది విలక్షణమో అవలక్షణమో చెప్పలేము.

'ఆ దయ్యములున్ నినుం గని ఎంతయున్ గృతజ్ఞులుగా మను చుందురఁట ఏ దయ్యము లవి? ✓ 'ఆ' యనఁగా ప్రసిద్ధమైనవని యర్థమా? ఇంతకుఁ బూర్వ మీ దయ్యములు ఈ ఘట్టములో వచ్చి నవా? లేదే. అవి కృతజ్ఞులుగా బ్రదుకుట యెందులకో! దీని కొక భాష్యము కావలెను. 'కడకును నందఱుం దెలివి గాంచి సుమం త్రుఁడు...నిడివిగ...బుచ్చి పీడన చేసి...కైకయిం గని...ఇట్లనియె' తెలివి గాంచినవారు రాజు— రాణులు, అంతిపురిలోనివారు. 'పుచ్చి-చేసి-కని' ఈ యసమాపకములకు కర్త సుమంత్రుఁడు. ఇరువురు కర్తలతో ఈ తీరుగ అసమాపకములను నడిపించుట ఈ కల్ప వృక్షములోని ఇంకొక వైలక్షణ్యము. 'కడకును నందఱు'లోని సముచ్చయము, ఈ కవనములోని వెలితిని జెప్పకయే చెప్పును. ఊరుపులు నిడివిగ ననుటలో దంతములు పీడన చేసి యనుటలో అందమే లేదు. పండ్లు పటపట కొఱికి-అనవలసిన ఈ యర్థములో దంతపీడన మనఁగా 'దంతక్షతము' స్ఫురింప వచ్చును. కైకను 'సుకు మార శిల్పినీ'యని బోధించుటలో సారస్య మే మున్నదో?

'ఆ తల్లి బిడ్డ వంగన...' ఈపద్యములోని పదములు చిన్నవే కావచ్చును. అన్వయ సౌరభము మాత్రము. అంగన = ఓ కైకేయి! ఆ తల్లి బిడ్డవు-అంతటి నీచురాలైన తల్లి యొక్క బిడ్డవు నీవు. మహిన్-మాతన్-బడి-పుట్టు నంద్రు, దీని కన్వయము కుదురదు; అర్థము రాదు. అచ్చులో అంగన! యని సంబుద్ధిగాఁ గన్పించును. ఆ గుర్తు లాగివైచి, అంగన-ఆఁడుది, మాతం+బడి-పుట్టు నంద్రు అనవచ్చునుగాని 'బడి' యనఁగానేమో! అసలు, బడికి చదువులబడి యనియు, దిట్టమనియు, క్రమమనియు, వెంబడియనియు నర్థము

లున్నవి. ఇందలి యర్థ మేదియు 'మాతంబడికి'కుదురదాయె. మూల ములో నున్న మాట ఇది :—

శ్లో॥ అభిజాతం హి తే మన్యే యథా మాతు స్తథైవ చ' (625)

నీ తల్లి స్వభావ మెట్టిదో నీ స్వభావము నైతము అట్టిదే యని దీని భావము. కార్యము కారణానుసారి యనుట లౌకిక వాక్యము. ఈ ఘట్టములో 'జనమంచి' వారు,

"నీ జననీస్వభావ మెట్లలఘుజనప్రదూష్యమగునట్లుగ నొప్పెనో నీ స్వభావ మట్లలవడె నంచెఱింగితి' నని తెలుఁగు చేసిరి.

నాది యనువాదము కాదన్నమాత్రాన ఈ దోషము దోషము కాకపోదు. ఒకానొక చిన్నభావమే మంచిపదములలో పొదివి పాఠకులకు వెంటనే స్ఫురించునట్లు వ్రాయలేని కవనము ఒక కవ నమా? పైగా మధురాతిమధురమైన వాల్మీకి కవితను హాయిగా తెలుఁగులోఁ దెచ్చుటకు వీలులేకపోలేదు. ఇట్టి యనువాదకులను జూచియే కాఁబోలు 'అనువాదకర్తలు ద్రోహులు' అని ఇటలీ దేశస్థులలో సామెత పుట్టినదఁట.

'నీడుఁ గరుణపొంపొుఁ జరించున్'— ఇది యేమి స్వామీ! దుగాగమము పిదప నుగాగమము! ఒకవేళ అఱసున్న అచ్చువారి దోసమన్నచో 'గ'కార మెందులకు వచ్చినట్లు? సరే! 'ఈ వ్యాకర ణపు శోకులు' తరువాత మఱొకసారి ప్రత్యేకముగఁ జూడవలసి యున్నది.

(చ)

వనవాసము నిశ్చయము చేసికొని శ్రీరాముఁ డా వార్తను చెప్పుటకయి సీతానివాసమునకుఁ జేరును. పట్టాభిషేక మహోత్సవ మున కెదురుచూచుచున్న వైదేహి, రాముని వదనారవిందమైఖరి గుర్తించి ఏవేవో అడుగఁగా, కైకేయి వరముల మాట ఆతఁడు వినిపించి, అయోధ్యలో నీవు నివసించి పెద్దలను సేవింపుమని బోధిం చును. అన్నియు విన్న వైదేహి కోపించి శ్రీరాముని సుకుమార ముగ నుందలించును.

'ప్రణయాదేవ సంక్రుద్ధా భర్తార మిద మబ్రవీత్' ప్రేమ చేతనే కోపించినదిగాని వైరముచేత — కాదఁట. రామా! నీవు పలికి

నది సారములేని వట్టి తుచ్ఛమైన మాట. ఆ మాట నాకు నవ్వు లాటగాఁ దోఁచుచున్నది. లోకములో స్త్రీలకు తల్లిదండ్రులు — ఆవల భర్తయే గతి. ఆ ధర్మమే నాకును ధర్మమై యుండఁగా నీతో పాటు నేనును అడవులకు ఉత్సాహముగా పోవలసియున్నది. నీతో పాటు కందమూలాదులు తినుచు నిన్నే సేవింపవలసిన విధి నా కున్నది. కావున నేనుగూడ వత్తునన్న సీతకు రాముఁడు మఱికొన్ని కారణములు చెప్పి యామె ప్రయాణ మాఁపఁదలఁచును. వాని కన్నిటికిని సీత చక్కని సమాధాన మిచ్చి,

శ్లో॥ 'ద్యుమత్సేనసుతం వీర సత్యవంత మనువ్రతాం
సావిత్రీ మివ మాం విద్ధి త్వ మాత్మవశవర్తినీమ్' — అని

యొక యుదాహరణము చూపినట్లు వాల్మీకములో నున్నది.

ద్యుమత్సేనుని బిడ్డ సత్యవంతుని సావిత్రి ఎట్లు అనుసరించెనో అట్లే నన్నుఁగూడ భావింపుమని శ్రీరాముని హెచ్చరించెను. ఈ సూచనలోని ఉదాత్తతకు కల్పవృక్షము చెప్పిన భాష్య మిదిగో వినుఁడు :

'మ. తన వేదంబులు పండియున్న మతిచేతన్ దొల్లి సావిత్రి భ
ర్తను వెన్నాడి పరేతరాజును బుగర్ఘస్తోమసంప్రీతుఁ జే
సిన యా పాలితధర్మసంవ్రతము నా చిత్తంబునన్ హత్తి యుం
డెను శ్రీరాఘవ! నే వనంబులకు నేన్ నీ వెంటనే వచ్చెదన్.
(అయో. 74 పు.)

చం. అనినను నవ్వి రాముఁడు మహావనవీథిఁ బరేతరాజు న
న్నునుఁ గొనిపోవ రావలయునున్ జనకాత్మజకూడ నన్నుఁ బ్రో
వనువలె నన్న, సీత రఘుబంధునిఁ జూచిన చూపు వాడిమిన్
జనకతనూజఁ గొంగిలికిఁ జూచి రఘూద్వహుఁ డోర్పు పుచ్చుచున్. (74)

శా. ఈమాత్రంబున కింత కోపపడ నీ కేలాగు కాంతారవీ
థీమార్గంబుల నాదుమాటలకు సాధిం పొందెదో యన్న నో
స్వామీ! దండధరుండు నిన్నుఁ గొనిపోవన్ రానెరావద్దు సా
మీ మాయామతి యేఁడో నన్నె కొనిపోవె వాఁడా! యింకెవ్వఁడో'(74)

ముచ్చటగా నున్న ఈ పద్యముల నడకను జూచి ముమ్మో దట మెచ్చుకోవలెను. అవధానములో నిషిద్ధాక్షరిలో ప్రాశ్నికుఁడు

పెట్టుబాధను అపనయించుకొంచు, అర్థ మున్నను లేకపోయినను ఏవో పదములు అవధాని ఆ వృత్తములో దూర్చినట్టులు – ఈ కల్పములో సైతము ముప్పాతికమువ్వీసము స్వామీ! సామీ! నన్నునుఁ గొనిపోవ – రావలయునునన్ – భర్తృసంవ్రతము'వంటి పడికట్టుపదములు పడక తప్పదాయె. ప్రకృత మనుసరామ :—

'సావిత్రీ మివ మాం విద్ధి'—అన్న మాటకు ఇన్ని పద్యములు ఈ తీరు నడకలో చెప్పినను ఆ సొగసు రానేలేదు. రాముఁడు నవ్వి 'పరేతరాజు నన్నును గొనిపోవ రావలయునునన్' ఇదిమాత్రము నిజముగా కల్పము చూపిన ఉపజ్ఞయే. ఇచ్చట దండధరప్రశంస – ఒక వైలక్షణ్యము కావచ్చును. 'మాయామతి యేఁడో నన్నె కొనిపోసి' ఇది కావ్యార్థసూచన కాఁబోలు! వాఁడో! ఇంకెవ్వఁడో – దీనిలో రావణుఁ డున్నాఁడు.

పతివ్రతయైన సీతామహాదేవి సావిత్రీసతిని సంస్మరించి నీ తోడిదే నా బ్రతుకని నిశ్చయము చేసికొని సవినయముగ శ్రీరాము నకు విన్నవించుకొని, ఆతని యంగీకారము పొందియున్నట్లు వాల్మీకి చెప్పిన దానికి ఈ ఘట్టము ఈ దండధరప్రస్తావము భాష్యము కాఁబోలు! ఒకానొక పెంకెపిల్ల పెనిమిటిని ఎదిరించినట్లే ఈ కల్ప వృక్షములోని సీత, రామునితో గడుసుగ మాటలాడుట మనము గుర్తింపవలెను. పరబ్రహ్మస్వరూపులుగ భావించుకొని ఆరాధింప వలసిన సీతారాముల సంభాషణము కల్పములో ఉన్నట్లే అప్పుడు జరిగియుండునా! క్లిష్టదశలోనే మానవుని గుణశీలములు పదిమంది కర్థమగును. ఏ కష్టములు లేనినాఁడు కావలసినన్ని 'ధర్మపన్నములు' ఏకరువు పెట్టెడివారు లోకములో ఎందఱో యుందురు. కైకేయి కోరిన వరములవార్త విన్నవెంటనే శ్రీరాముని మనస్సు వికారము చెందలేదు. అట్లే యని దాని కంగీకరించి దానిని సమర్థించి అది గాదన్నవారిని సుకుమారముగా మందలించి బోధించి– ఆతఁడు మహా పురుషుఁ డాయెను. అట్టి మహాసత్త్వునకు గంభీరచిత్తునకు రవ్వంతైన లోపము రానీయక అత్తమామల నే మాత్రము ఆడిపోసికొనక పతిమార్గమే తన మార్గమని నిశ్చయము చేసికొన్న పురాణ

పతివ్రత — ఈ వైదేహి. ఈ కథ ఇట్టిదై యుండఁగా విశ్వనాథ వైదేహి, శ్రీరామునితో ఏమన్నదో చిత్తగింతురా!

'గీ. ఆడుబిడ్డల మఱఁదుల యత్తలందు రామ! ప్రోషితపతికి గౌరవము లేదు.
గా. ఈ వృత్తాంత మదెప్పుడో తెలిసి తా నే మూనా మా తండ్రి, నే
నే వారింటికిఁబోయి నా ముఖముగా నేతొల్లి వ్రాసత్తునా!' (74)

భర్త దేశాంతరగతుఁడైనప్పుడు తన్ను ఆడుబిడ్డలు మఱఁదులు - అత్తలు గౌరవముగాఁ జూడరు గావున అయోధ్యలో నే నుండను. మా పుట్టింటికే పోయి మా తండ్రితో ఈ కథ యంతయుఁ జెప్పివై చెద నని ఇరువదవశతాబ్దిలోని మాట ఆమె చెప్పినట్లు 'కల్పము' మనకుఁ జెప్పినది. అత్తమామల సేవయే నీకు ధర్మ మనియు, ఆపదలో నున్న మా తల్లి కౌసల్యను విశేషించి కనిపెట్టు కొని యుండవలెననియు, 'ఆ యిక్ష్వాకుల నాఁటి లక్ష్మయ్య' రామయ్య బోధించుచుండఁగా, వారి యేలుబడిలో నే నుండలేనని ఈమె యను టలో కల్పవృక్షములోని వైలక్షణ్యము కాక మఱేమగును? ఇట్టివి ఈ కావ్యమును గూర్చి క్రొంగ్రొత్తగా మనము గుర్తింపఁదగిన విశేషములు. గౌరవభావమే లేక గడుసుఁదనపుఁబోకడలో సరసముగాని సంభాషణము ఈ సీతాదేవి జరుపుచున్నదనఁగా అంతరార్థము కని పెట్టవలెనా!

పద్యములోని 'ఆడుబిడ్డలన్' - అనఁగా ఆడుబిడ్డలలో అని షష్ఠ్యర్థము కాఁబోలు! లేదా సప్తమ్యర్థమో! కాని, మఱఁదుల యత్తలందు — ఈ ప్రయోగ మేమి! మఱఁదులన్ — అందుమా! 'నత్తలందు' కావలెను. అచ్చులో అది లేదు. మఱఁదుల యత్త లందు — అందుమా! మఱఁదుల యొక్క అత్తలు వత్తురు. ఆడు బిడ్డలలో మఱఁదులలో అత్తలలో గౌరవము లేదన్న ఒక్క చిన్న మాటకు ఈ గీతములో ఈ డొంకతిరుగుడు ప్రయోగముల కక్కుర్తి కావలసివచ్చెనా?

'నేనే వారింటికిఁ బోయి' — ఇక్కడ వారు, ఇంటికిఁ బోయి యనెడి అపార్థము రాకుండుటకై సంధి చేయకుండుట విద్వత్కవుల వైఖరి. 'నేను వారింటికిఁ బోవుచున్నా'నని లోకములో వాడుక

ఉన్నంతమాత్రాన కొన్ని ప్రయోగములు కన్పించినంత మాత్రాన శబ్దశుద్ధిని బాటించు కవీశ్వరుఁ డట్లు వ్రాయఁడు. నాయంతట నేనే వ్రాక్రుత్తునునటకు 'నా ముఖము'గానే యనుటలో 'వాడి మొఖము' అన్నట్లు స్ఫురించును.

(ట)

సీతారామలక్ష్మణులు అడవికి ప్రయాణమగుచుండఁగా వారికి నారబట్టలు తెచ్చి యిచ్చిరి. సీతకు శ్రీరాముఁడే నారచీర కట్టఁ బెట్టుచుండఁగా వశిష్ఠులవారు రాముని చేతిలోని చీరను లాగివైచి ఇట్లన్నాఁడఁట.

'క. ధరియించు నారచీరల నరుంధతి, ధరాత్మజాత కవి కట్టఁగరా
దరయుఁ జెఱిసగముగా నీ దరిద్రతాస్థితి పతివ్రతాలోకములన్ – అని.

వ. అప్పు డరుంధతి యిట్లనియె.

ఆ. తూక మయిగు మళ్లు తొమ్మిది మూరల నారచీరఁ గట్టినావె సీత
కామె మోయలేద యుందు మున్గియుపోవుఁ గాళ్లు కడ్డుపడి కదలలేను.

ఆ. అనుచుఁ బొంగివచ్చునట్టి దుఃఖము క్రింగి కోప మడరఁ బుడమికూఁతు నడవి
కంపువారలను శపింపఁగా దొరకొని మఱల మనసు నెల్ల మార్చికొంచు

గీ. తిరిగి రాముఁడు వచ్చెడువఱకు నేను మీ గడపఁ ద్రొక్కనని చెప్పి యేఁగెనంత'

[అయోధ్య 105]

ఈ ఘట్టములోని అరుంధతీప్రస్తావము వాల్మీకములో లేదు. అందఱిలో వశిష్ఠుఁడే ముందునకు వచ్చి, ఆ నారచీర కట్టుకోవలదని సీతను హెచ్చరించి కైకను దిట్టిపోసి 'అనుష్ఠాస్యతి రామస్య సీతా ప్రకృత మాసనమ్' – అని తీర్పు చెప్పెను. స్త్రీరాజ్యపాలనము మంచిదికాదని ఎవ్వరేని యందురేమో యని సంశయించి 'ఆత్మా హి దారా సర్వేషాం దారసంగ్రహవర్తినాం ఆత్మేయమితి రామస్య పాలయిష్యతి మేదినీమ్' అని పలుకును. 'అర్ధో వా ఏష ఆత్మనో పత్నీ' అన్న శ్రుతిని ప్రమాణముగా సూచించి సీతనే సింహాసన మందు ఎక్కింపవలెనన్నంత తీవ్రత చూపును. ఈ మాట లేవియు వైశ్వనాథవశిష్ఠమహోదయులు పలుకలేదు. వారికి బదులుగాఁ గాఁబోలు వారి ధర్మపత్ని అరంజోతి 'అయిదుమళ్ళ తూకము

తొమ్మిది మూరల పొడవు'గలిగిన నారబట్టల కథ తెచ్చి పెట్టినది. అంతటితో ఆమె యూఁగక 'పుడమికూఁతు నడవి కంపువారలను' శపింప దొరకొన్నదఁట. ఎందఱనో తన బిడ్డలను విశ్వామిత్రుఁడు శపించి చంపినను శాంతము వీడని మహర్షి యని వశిష్ఠునకు పురాణకథలలో పెద్ద పేరున్నది. శాంతిలో దాంతిలో ఆయనను మించినది ఆయన యిల్లాలని అంద అనుకొందురు. అట్టి పరమసాత్త్వికమూర్తులయిన ఆ యాలుమగలు కల్పవృక్షములో విలక్షణవ్యక్తులుగా మాఱిపోయిరి. తిరిగి రాముఁడు వచ్చువఱకు మీ గడప త్రొక్కనన్నంత క్రోధము అరుంధతికి వచ్చెనఁట. అడవికి సీతను బొమ్మన్న దెవరు? అరుంధతి ఎవరిని శపింప దొఁకొన్నది? శ్రీరాముని ప్రయాణవార్త విని తానుగూడ వత్తునని వైదేహి పట్టు పట్టినేగాని కైకేయిగాని దశరథుఁడుగాని ఆమెను అడవికిఁ బొమ్మని చెప్పలేదే. అరుంధతి, ఇఁక నెవరిని శపింపవలెను? కథలో లేని యంశమును ఆరోపించి పాత్రౌచితి భంగపఱిచి గుణశీలములకు వైలక్షణ్యము కల్పించుట కల్పవృక్షము చేసిన అనల్పభాష్యమనవచ్చును.

'ధరియించు నారచీరల' పద్యములో ఉత్తరార్థమున కర్థము ఏమని చెప్పవలెనో? అరయన్ - పతివ్రతాలోకములన్ - ఈ దరిద్రతా స్థితి - చెఱిసగము - కాన్, అనఁగా పతివ్రతాలోకములలో ఈ దారిద్ర్యము చెఱిసగముగా ఉండునని అధ్యాహార్యమా! పిండితార్థ మేమో తెలియదాయె. అంతరార్థ మున్న దేమో! ఇట్టి యన్వయములను ఇట్టి గూఢార్థములను కావ్యదోషములలో పూర్వులు జమకట్టిరి.

సీతకు నారచీర గట్టినది శ్రీరాముఁడైనప్పుడు - అరుంధతి ఆతనితో 'నారచీర కట్టినావె సీతకు' అనుట గ్రాంథికభాష కాదు. కట్టినాఁడ వనియే యుండవలెను.

మీ గడపయేమి స్వామీ! కడపశబ్దము కల్పవృక్షమహాకావ్యకరుణాకటాక్షమునఁ జేసి 'గడప' అయ్యెనా! ఇటునటు కడచుటకు సాధనముగాన కడప, కడప యయ్యెనని పూర్వకాలపు పండి

తుల ధోరణి కల్పమున కెక్కదు కాఁబోలు! నిచ్చలు లోక మను
చున్నదని గ్రాంథికమని పేరు పెట్టుకొన్న కావ్యములలో 'గొబ్బరి
కాయలు – దోవలు – బునాదులు – గాక తేలిన బాకీలు – గడపలు–
గడచిన సంవత్సరములు – గానుగుపుల్లలు' పెట్టుకొనవచ్చునా! ఆ
పదము పరుషాదియో సరళాదియో గుర్తింపక సూరిగారే నిఘంటు
వులో గడప నంగీకరించిరని తమకు కావలసినచోటమాత్ర మాయ
నను ప్రమాణముగాఁ జేసికొనుచు, 'ప్రయోగశరణాః వైయా
కరణాః' అన్న కారికను హవ్యమునకు కవ్యమునకుఁ జూపుట
భావ్యము గాదు. సత్కృత్తును శత్కృత్తుగా పలికినను శ్మశానమును
స్మశానముగా వ్రాసినను శిష్టు లంగీకరింతురా! లేక – ఇదియు కల్ప
వృత్తి వైలక్షణ్యమా!

(౮)

'అనిన సుమంత్రుఁ డన్నియుఁ దనంతన తెచ్చి వసిష్ఠుఁ డాచు రా
జునకును దెల్పి రాము వనిఁ జొచ్చెడువేళకు నెల్ల సిద్ధ్యఁగాన్. [108 పు]

శా. కౌసల్యాసతి ముద్దుకోడలి సీతన్ గాఁగిఁటికిం బట్టి బా
హాసమ్మార్జన మాచరించి మృదుమూర్ధాఘ్రాణముం జేసి త
ల్లీ! సీతా! నను నీవునున్ వదలిపోనే నేను నేకాకినై
నా సీతా! మఱి మీరు వచ్చువఱకైనన్ బ్రాణముల్ నిల్తునే!' [108 పు]

సీతారాములు అయోధ్యలో నున్న ఘట్ట మిది. వనిఁ జొచ్చెడు
వేళ యనఁగా అడవిలో ప్రవేశించు సమయమని అర్థము వచ్చును
గాని, లక్షణయా అడవికి బయలుదేరు సమయమని అనుకొన
వలెనేమో! అప్పుడు అంద సేద్యఁగా, కౌసల్య కోడలిని కౌఁగిటఁ
బట్టి 'బాహాసమ్మార్జన' మాచరించి సీతకు లేవేవో బోధించును.
సమ్మార్జన మనఁగా శోధనమని యర్థము. చీఁపురుకట్టను 'సమ్మా
ర్జని'యందురు. గృహసమ్మార్జన మనఁగా – ఇల్లు ఊడ్చుట. బాహా
సమ్మార్జన మనఁగా భుజములను సవరించి ఏదేదో చేసెనని యర్థము
లాగవలెను. రెండు చరణములలో పునశ్చరణముగాఁ బలికిన 'తల్లీ
సీతా! నా సీతా!' అన్న సంబోధనలు రెండును ఉత్కటమైన
ప్రేమకు చిహ్నములు కాఁబోలు! 'ప్రాణముల్ నిల్తునే' – నిల్తునకు

నిల్పుదునా ! అన్న యర్థము లేదే. అది అంతర్భావిత ప్రేరణ క్రియయుఁ గాదే. నిల్చునే అన్నదాని కిది అచ్చుదోసమా !

'ఉ. లోకమునందుఁ గామినులు లోలుపబుద్ధులు పెన్మిటిన్ వృథా
వ్యాకుల పెట్టుచుందురను నవ్వియుఁ గావలె నివ్వి కావలెన్
నా కనుచున్ సగౌరవమనంబున భర్తను గాంచవేర ! యా
పోకిళులందుఁ బోకువె యభూపతియా పతియుం దశీలవై. (108)

'ధూర్తవు కాక రాఘవునితోడిది ఛాయగ సంచరింపవే'

సీ. వనిలోన నేరి తెచ్చిన కందమూలముల్ చిరుకుమంటలపైనఁ జిముడనీక
ఏదో కావలెనని యెడదను నెఱపి యెప్పుడు వనీదూరముల్ పోవనీక
తరుణివని కాక యాతని తల్లివంచు నూహ పెంచితివేని నా యుక్తు లెల్ల
నాచరించుట కెల్ల సమర్థవగుదు. (109)

ఆ. తల్లి కడుపు చూచుఁ దరుణి వీఁపును జూచు పురుషుఁడైన నింటి కరుగుదేరఁ
దరుణివోలెఁ గాక తల్లిపోలిక నీవు చాన ! యెల్లవేళ సాఁకఁగానుము.'(109)

ఇవి కౌసల్య కోడలికిఁ జెప్పిన బుద్ధులు. లోకములో కామినులు పెన్మిటిని వ్యాకుల పెట్టుచుందురన్న మాట, సపత్నియగు కైకేయికి చెంపపెట్టు కాఁబోలు ! ఏదో కావలెనని వనీదూరముల్ పోవనీక – అన్న నీతిలో 'బంగారులేడి' కథ భావికథగా జరుగవలెఁ గాఁబోలు ! కందమూలములు–చిరుకుమంటలు, చిముడుటలు ఇత్యాదులనుగూర్చి ఇప్పుడు నేర్చుకోవలసిన యువతి కాదు – ఈ సీత. ఈ దశలో అత్త గారు కోడలికి ఈ రీతి నీతులు బోధించె నని కల్పము బోధించుటలో సారస్యము లేదు. తరుణి, వీఁపును జూచుట పూర్వకాలము. నేఁడు జేబులు చూడవలెను. మాట కట్టుకొని వీఁపునఁ బెట్టుకొను ధోరణి కన్న జేబులో ఉంచినదానికోసమే తరుణి చూచుటలో అంద మున్నది. ఈ సామెత ఈ ధోరణిలో నడచియున్నచో ఇది మతి యొక్క వైలక్షణ్యమని సంబరపడవచ్చును. అత్తగారు బోధించిన నీతులకు మించి రెండాకులు హెచ్చుగఁ జదివినట్లు, సీతయు భావ కవితలో దిగి 'నీ కొడుకు సాలభూజంబు నేను లతను – నీ కొడుకు హొన్నవీణియ నేను తీఁగ – నీ కొడుకు వార్షుకాభ్రంబు. నేను మెఱుపు – నీ కొడుకు సూర్యదేవుండు నేను వెలుఁగు' (109 పు.

'అతఁడు కులాలుఁడు – మెత్తని క్షితి మృత్తును నే నతండు చివురాకు సమీహితనై గనిగ్యమును నే నతండు దైవంబు భక్తురాలను నేనున్.'

ఇత్యాదిగ ఒకే వేదాంతపల్లవిని అప్పగించును. ఇది బహుశః ఈ రామాయణకర్త అన్నట్లు అందఱివలె కేవలము రామాయణ కథను మాత్రము వ్రాయక దీక్షగా వ్రాసి లోకమునకుఁ జూపఁదలఁచిన ఒకానొక వైలక్షణ్యమని ఎంచవలెనేమో?

'కామినులు నా కనుచుఁ గాంచలేరు' – ఇట్టి వచనవ్యత్యయములు కల్పవృక్షము పాటింపదు. అనంతకోటి ఉపాయముల కాశ్రయమైన ప్రౌఢవ్యాకరణమువంటివి మన కండఁగా నుండఁగా తక్కువేమి మనకని చెక్కభజనలతో నిక్కెడి వందిమాగధులు లేకపోలేదు.

'అభూపతి – అశీల' విలక్షణమైన శబ్దములు, మంటలపైనన్ – అన్నది గ్రాంథికముగా తప్పు. పైనిన్ –అనవలెను. పెట్టుచుందురును నవ్వియు – పురాణజ్వరమువలె జీర్ణించిపోయిన సముచ్చయసౌరభము. 'పురుషుఁడైన నింటి కరుగుదేర'లో – 'ఐన'కు అర్థమే లేదు.

## విశ్వనాథ - విశ్వామిత్రుఁడు

'పూర్వకావ్యాలలో కొన్నికొన్ని ఘట్టాలలో మాత్రమే అంద రికీ అందుపాటులో ఉన్నాయి. ఈ కావ్యంలో అలా కాదు; ఒక విశిష్టమైన శిల్పమార్గంలో రచన చేస్తున్నాను. మన మనోవృత్తులను బట్టి మన అభిరుచు లుంటవి. నేను వాల్మీకి రామాయణం భాష్యం వ్రాశాను. నా రామాయణం అనువాదం కాదు. పూర్వసంస్కృత సాహితిలో నా కంత ప్రగాఢపరిచయ ముంది కాబట్టి ఆ లోతు పాతులు నాకు తెలుసు':—

ఇవి విశ్వనాథవారు సెలవిచ్చిన బహిరంగసూక్తులు.

పూర్వకావ్యములలో కొన్ని కొన్ని ఘట్టములు మాత్రమే అందుపాటులో నుండఁగా అన్నిఘట్టములు అందుపాటులో నుండునట్లు నే నీ రామాయణకావ్యము వ్రాసితినన్నట్లు విశ్వనాథవారి మాటల కర్థ మగుచున్నది. ఇది తెలుఁగు వచ్చినవాఁడు తెలుఁగు సాహిత్య ములో అభిరుచి గలవాఁడు రామాయణకల్పవృక్షమును చిత్తగిం చినవాఁడు ఎవ్వఁడుగాని యంగీకరింపఁదగిన మాట కాదు. ఈ మాటను మఱొక తీరులో మార్చుకొన్నచో వాటముగా సరిపో వచ్చును. ఏమని? పూర్వకావ్యములలో అన్నిఘట్టములు అందు పాటులో నుండఁగా నా యీ రామాయణముమాత్రము కొన్ని ఘట్టములు మాత్రమే ఒక కొందఱకుమాత్రమే - అందును అంతర్దృష్టి కలవారికిమాత్రమే అందుపాటులో నుండును. ఇది ప్రాచీనమును - ప్రకృతమును బాధముగా గుర్తించు సహృదయులకు స్ఫురించు తీర్పని చెప్పవచ్చును.

కల్పము - అనువాదము కాదు; భాష్యమన్నమాట మధ్య వర్తులు నిర్ణయింపవలసిన బాట. ఆధ్యాత్మికభావములతో - పండఁ బాఱి పరిణతబుద్ధులై రామభక్తులై సర్వవ్యాఖ్యలు సమన్వయించి తత్సారము జీర్ణించుకొని ఇంతకు ముందే రామాయణములు వ్రాసి యిచ్చిన మహామహులు మనకుఁ గలరు. పూర్వసంస్కృత సాహి తిలో నా కంత ప్రగాఢపరిచయ మున్నదని విశ్వనాథవా రనిరి. సంతోషమే. కాని, ఈ మాటవలన పూర్వరామాయణ కర్తలకు

సంస్కృత పరిచయము లేదన్న భావము రాదుగదా కొంప తీసి. కాశీపరీక్షలలో నవద్వీపఘట్టములలో విద్వత్కవిపరిషత్తులలో ఆరి తేరి సర్వశాస్త్రములు క్షుణ్ణముగా ఆకళింతకుఁ దెచ్చుకొని ఉభయ భాషలలో వశ్యవాక్కులయి మహామహులైన తెలుఁగుకవులే పెద్ద పెద్ద రామాయణ సంపుటము లిచ్చిపోయిరి. రచనలో తళుకు బెళుకులు చూచి తీర్పు చెప్పవలసినది పాఠకులుగాని తత్కర్తలు కాదు. స్వోత్కర్షగా వారే చెప్పుకొన్నంతమాత్రాన తత్కావ్య ములు సర్వజనశిరోధార్యములు కావు. మన మనోవృత్తులనుబట్టి మన యభిరుచు లుండునన్నమాటమాత్రము - అక్షరాల నిజము. ఈ కల్పవృక్షములో 'అందు - మఱి' పాత్రములు ముప్పాతిక మువ్వీ సము 'విశ్వనాథ' మనోవృత్తికి సూటిగా సరిపడియున్నమాట మాత్రము వాస్తవమే. తెలుఁగులో 'తిక్కన ద్రౌపది, తిక్కన సీత' ఇత్యాదిగ ప్రత్యేకము పేరుపడ్డ రచనలు చదివితిమి. అట్లే - ఈ వైశ్వనాథములో సైతము ప్రత్యేకముద్ర పడినవి, గ్రంథకర్త అభి రుచిలో పదనుగా మెదపఁబడి సృష్టింపఁబడినవియునగు పాత్రలు బహుళముగాఁ గానవచ్చుచున్నవి. వానిలో విశ్వామిత్రపాత్ర మొకటి. ఈ పాత్ర కల్పములో ఎంత అపాత్రమైనదో కొంత పరి శీలింతము.

బాలురైన శ్రీరామాదులు సర్వవిద్యలలో ప్రవీణులై తల్లి దండ్రుల కానందము గూర్చు తరుణములో విశ్వామిత్రుఁడు దయ చేయును. మర్యాదలు మన్ననలు ముగిసిన వెనుక యాగసంరక్ష ణార్థమై రామచంద్రుని నావెంటఁ బంపవయ్యా యని విశ్వామిత్రుఁడు దశరథుని గోరెను. ఇదే వాల్మీకములో విశ్వామిత్రుఁడు మున్మొ దట కోరిన కోరిక. ఈ కల్పవృక్షములోని కథ - అది గాదు. కోటకు విశ్వామిత్రులు వచ్చిరి. మర్యాదలు జరిగినవి. లేక లేక కలిగిన నీ సంతానమును జూడవలెఁ బిలిపింపవయ్యా యని మహర్షి పలుకఁగా వెంటనే దశరథుఁడు బిడ్డలను రావించి పరిచయము చేసెను. అప్పుడు విశ్వామిత్రుఁడు శ్రీరాముని సాదరముగాఁ జూచి 'ఎవరయ్యా రామ చంద్రులకు అస్త్రవిద్యాగురువులుగా నున్నవారు? నా వద్ద శిష్యత్వ మొప్పిననాఁడే రాముని బాహాపటిమ ప్రశస్తము కాఁగలదు. మహా

స్త్రములు నావద్ద మూల్గుచున్నవి. అవి యెల్ల నిచ్చెదను. మనుజ మహేంద్ర! నీ కుమారుని నావెంటఁ బంపవయ్యా' యని పలికినాఁడఁట. చిత్తము చిత్తమంచునే దశరథుఁడు విషణ్ణచిత్తుఁ డయి ప్రభు! ప్రభు! నా బ్రదుకంత వాచివేచి ఈ బిడ్డలను గన్నది. వీరిని నేను విడువలేను. అని తన పిఱికితనమును వెడలఁగ్రక్కె-నఁట. మునీశ్వరునకు కోపము వచ్చినది. ఈ మార్పులో అందమేమొ తెలియదు. వచ్చినది యాగసంరక్షణార్థమయి యుండఁగా మహాస్త్రములు ప్రసాదింతుననుటలో లంచమేమైన రుచి చూపెనా! ఇది భావ్య ప్రవచనమా! సంస్కృత సాహితీ ప్రగాఢ పరిచయఫలితమం!

వాల్మీకములో ఈ సంభాషణము జరుగునపుడు వశిష్ఠుఁడు జోక్యము తీసికొని శ్రీరామమహిమ వివరించి విశ్వామిత్రుని కోరిక మన్నించి యాగసంరక్షణార్థమయి తప్పక నీ బిడ్డను బంపవలెననియు, ఆ మహర్షి వద్ద విలువగల మహాస్త్రములు సైతమున్నవి. అవి రామునకు లభించును. నీ కేమియు భయపడవలసిన పని లేదు. శ్రీరాముఁడు మహామహుఁడు – అనియుఁ జెప్పఁగా దశరథుఁడు ప్రసన్నచిత్తుఁడయి భాస్వరాంగుఁడయి బిడ్డలను మహర్షి వెంటఁ బంపినట్లు కథను జదివెదము. ఆ కథను ఈ 'పదకము'లో మార్చి నాది యను వాదము కాదు; ఒకానొక భావ్యమని యన్నచో సహృదయులు సమ్మతింతురా! ఈ కల్పములో ఈ ఘట్టములో దశరథ విశ్వామిత్రుల సంభాషణధోరణి విన్నచో ఈ దశరథుఁడు ఇక్ష్వాకులలోని ఆ దశరథుఁడు కాఁడు. ఈ విశ్వామిత్రుఁడు వశిష్ఠులవారినాఁటి విశ్వామిత్రుఁడు కాఁడు. ఇరువదవ శతాబ్దిలో ఎవ్వరో ఇర్వురు మాటపట్టింపు వచ్చి ఏదో యింత రభసగా అసభ్యముగా వాదనలో దిగినట్లే ఈ రచనలో స్ఫురించును. శ్రీరాముని నా వెంటఁ బంపుమని విశ్వామిత్రుఁ డన్న వెంటనే దశరథుఁడు నిర్విణ్ణుఁడయి, రాముఁడు కుఱ్ఱవాఁడు స్వామీ! రాక్షసులతో పోరాడఁగలఁడా! సర్వసైన్యమును దీసికొని ఇదిగో నేనే వత్తును. వచ్చి యా పని నేనే చేసెదను. అని బతిమాలినట్లు భంగపడినట్లు వాల్మీకములో నున్నది. కల్పములో ఏవేవో ఒయ్యారములు ఆకున కందనివి పోకను పొందనివి ఒలకఁ బోసిరి. కొంగ్రొత్త సృష్టియుఁ జేసిరి.

ఉ. 'రాముఁడు నాకు స్నానమగు రాముఁడు నాకు జపంబు ధ్యానమున్
రాముఁడె యెల్లనాబ్రదుకు రాముఁడు నన్నును గన్నతండ్రి యీ
రామువినా నిమేష మవురా మనఁజాలను గాదయేని నీ
రాముని వీడి యీ యఖిల రాజ్యము గాధిసుతా! గ్రహింపవే.'

(బాల 154 పు.)

అస్త్రవిద్యను నేర్పెదను బంపవయ్యా యన్న ధోరణిలో విశ్వామిత్రుఁడు లంచము చూపినట్లే 'కాదయేని ఈ యఖిలరాజ్యము గ్రహింపవయ్యా'యని దశరథుఁడు సైయెత్తు ప్రయోగించుటలో 'అంతర్దృష్టి' యేదో యుండవలెను. రాముఁడు దశరథునకు స్నానమఁట. అఘమర్షణ స్నానమా! అవభృథ స్నానమా! శిరస్స్నానమా! కటిస్నానమా! గంగాస్నానమా! కుల్యాస్నానమా! రాముఁడు జపమేమిటి! ధ్యాన మేమిటి! స్నానము ధ్యానము జపము తపము లేని నాఁడు మనుష్యుఁడు బ్రదుకఁడా! రాముఁడు లేనిచో దశరథుఁడు నిజముగా బ్రదుకఁడు. తుద కాతఁ డడవులకుఁ బోయెనన్న మాట వినియేకదా ఆతఁడు ప్రాణములు విడిచినది. అది మమకారము కావచ్చు. శాపకారణము కావచ్చు. బాహ్యచిహ్నములైన ఏకదేశములైన ఈ స్నానాదులతో లేశలేశ కలిగిన శ్రీరామునకు ఔపమ్యము కూర్చుటలో అందమే గాదు; అర్థమే లేదు. పైగా 'న్యూనోపమ' యనక తప్పదు. రాముఁడు నన్నును గన్నతండ్రియఁట. ఏమి కవనముస్వామీ! సముచ్చయసౌరభము గుబాళించుచున్నది. ఓహో! 'నన్నును' రూపము నన్నయనాఁటిదని విశ్వనాథవంది మాగధులు స్తవము చేయవచ్చును. కాని, దేశకాలపాత్రము లెఱుఁగవలెను. ఈ ధోరణిలో వెలసిన పోలికలే అవతారికలో 'తినుచున్న యన్నమే తినుట - చేసిన సంసారమే సేయుట' ఇత్యాదులలోఁ సైతము కూర్చిరి. సంసారములు - అన్నములు భౌతికములు. రామభక్తి - రామాయణపారాయణము ఆధ్యాత్మికములు. మొదటివి సర్వజీవులకు సామాన్యములు. ఆధ్యాత్మికత్వము అందఱకు అందని ఒకానొక పరమభాగ్యము. ఈ ఘట్టములో ఈ 'న్యూనోపమలు' తగిలించి విశిష్టమైన శిల్పమని బల్ల గ్రుద్దిన లాభము లేదు. లోఁతుపాతులు నాకుఁ దెలియునని అనిదంపూర్వములు అనుచిత

ములు కల్పించినచో సరసులు మెత్తురా! విద్వత్కవు లంగీకరింతురా! పరమార్థము లేని మాట చెప్పి భావ్యమున్నదని బూకరించినంత మాత్రాన లోకము మోసపోదు.

ఇంత తపస్వివిగదా! నీ తపోమహిమచే నీవే ఆ రాక్షసులను జంపి యాగము పూర్తిచేసికొనవచ్చునుగదా! అని తానే ప్రశ్న వేసికొని సమాధానము చెప్పినట్లు, వాల్మీకి విశ్వామిత్రుఁడీ ఘట్టములో అన్నమాటలు వినవలెను.

శ్లో. 'న చ మే క్రోధ ముత్స్రష్టుం బుద్ధిర్భవతి పార్థివ!
తథాభూతా హి సా చర్యా న శాప స్తత్ర ముచ్యతే'

సా చర్యా – ఆ యజ్ఞాచారము, తథాభూతా హి – శాపానర్హా కాలా హి అతః – తత్ర మారీచసుబాహ్వోః – శాపో న ముచ్యతే. యజ్ఞాచారమునుబట్టి ఆ సమయములో శపించుట మంచిది కాదు కావున, నీ బిడ్డను బంపవయ్యా పని జరుగును. అని. దీనికి 'కల్పము':-

కం. 'కాదని శపింతునన్నన్ గాదా జన్నంబు కోపకలుషితమగుటన్
'అమరఁగ నదిగాకయుఁ గోపము వచ్చుటలేదు తొంటివలె నాకు నృపా!
కమలప్రసూతుమారుఁడు ప్రమాణము వశిష్ఠమాని వాక్యనయందున్.'
(బాల. 155 పు.)

ఆ సంస్కృతరచనకు ఈ తెలుఁగుముక్కలు ఎంత చక్కఁగా అతికినవో, వాల్మీకి విశ్వామిత్రునకు వైశ్వనాథవిశ్వామిత్రునకు ప్రకృతిలో ఎంత యంతర మున్నదో ఊహింపవలెను.

యాగసంరక్షణము–రాక్షససంహారము–అస్త్రవిద్యోపదేశము, ఇవి మొదటి విశ్వామిత్రుని కోరికలు. ఆ సంకల్పమును ఈ'కల్పము' వికల్పముచేసి రాజును మోసపెట్టవలెనని భావించుటలో–అది విశిష్టత యగునా! బ్రహ్మాండమైన భావ్య మగునా! బజారులో మనము సంచరించినట్లే ఆ పురాణపురుషులున్నై తము సంచరింతురని యూహించి భావించి, 'పిచ్చి నృపా! మేము నీ కొడుకును దిందుమా! మాకడ చదువు లున్నవి, అవి నేర్పి పంపెదము' ఇత్యాదిగ 'బంగరుబయలుగ' లొల్లిగ కవనము చేసినచో–ఆ పుణ్యపురుషుల మాట ఎట్లున్నను

మన మానసికతత్త్వము మన నిత్యదినచర్య మన ప్రకృతివికృతులు వ్యక్తములు కావచ్చును. ఆ పాత్రలలో కవీశ్వరుఁడే లీనమై, నేఁడు 'ఏకపాత్రాభినయములు' చూపినట్లు తదౌచితి పోషించుచు కావ్యము నడపింపవలసియుండఁగా, తనలోనే ఆ పాత్రలను లీనము చేసి తన యభిరుచులనే వారి కంటఁగట్టి, వారి 'భావచిత్రము'ను లేకిగాఁ జూపించుట సహింపరాని క్షమింపరాని యపచారము.

మూలకథలో ఏ మున్నదో అనువాదములో ఏమి జరిగెనో చూడవలసిన బాధ్యత చూడవలసిన యక్కఱ పాఠకు లందఱకుఁ బట్టదు. ఇదే నిజమైన రామాయణమని కొందఱైన భ్రాంతి పడి, ఈ దశరథవిశ్వామిత్రుల తత్త్వ మింతేగదా యని ఊసడించుటయుఁ గద్దు. నీ పిల్లవానికి విద్య నేర్పుటకే తీసికొని వెళ్లెదనయ్యా! యని మాటిమాటికి ఈ విశ్వామిత్రున కిదే ధోరణి. అక్కడ నా కొక చిన్న పని యున్నదని గౌణవాక్యము. ఈ విశ్వామిత్రుఁడు వట్టి మోసగాఁడుగా మనకు దర్శన మిచ్చును. వాల్మీకి విశ్వామిత్రుని గూర్చి వశిష్ఠుఁ డేమనెనో చిత్తగింపవలెను

శ్లో॥ 'అపూర్వాణాం చ జననే శక్తో భూయ స్స ధర్మవిత్
ఏవం వీర్యో మహాతేజా విశ్వామిత్రో మహాయశాః
న రామగమనే రాజన్ సంశయం కర్తు మర్హసి
తేషాం నిగ్రహణే శక్తః స్వయం చ కుశికాత్మజః
తవ పుత్రహితార్థాయ త్వా ముపేత్యాభియాచతే'ఇత్యాది.
(బాల 264 పు)

మహాతేజస్వి మహాయశస్వియైన కౌశికుఁడు నీ బిడ్డ మేలు కోసమే నీవద్దకు వచ్చి ఈ తీరుగఁ గోరుచున్నాఁడని వశిష్ఠుఁడు చెప్పిన వెంటనే దశరథుఁడు వల్లెయని పిల్లలను సాగనంపెనఁట.

ఈ కల్పములో అది కాదే. ఇది యొక పెద్ద తగాదాలో దిగి 'రగడ' యైనది.

'అవునయ్యా! యవు నిత్తునంటి పొంద శీ యంతంబునం దీయనం
టివి, పోనీ! రఘువంశయోగ్య మగునో నీ చేఁత! నీకున్ సుఖం
బవు నీ బంధులు నీవునున్ సుఖము పెళ్లైయుండుఁ రేఁ బోదు మా
నవనాథా! సుఖమాత నీకును బ్రతిజ్ఞాభంగపుణ్యాబ్ధికిన్' (బాల 158)

ఇదియే ఇచ్చటి సొగసు. ఈ దెప్పిళ్లు దెప్పి ఈ విశ్వామిత్రుఁడు విధురగమనమున నేఁగి ప్రథమకక్ష్యాంతరమునఁ గూర్చుండి, వెనుకగా నెవరైన వత్తురో లేదో యన్న దొంగచూపుతో ఎదురుచూచుచుండ బ్రతిమాలుటకై మంత్రి రానేవచ్చెను. వానిని జూచి వానియు పెడమోమైయుండెనఁట. అచ్చట సభలో దశరథుఁడు ఈ వచ్చిపడిన బెడదకు ఏమిచేయవలెనో స్వామీ! విశ్వామిత్రుఁడు ప్రథమకక్ష్యాంతరము గూడ దాఁటిపోవకుండ దారి చూపవయ్యా యని వశిష్ఠులతో మొత్తుకొనెను. వెంటనే–అన్నమాట తప్పక ఆతనివెంట పిల్లవానిని బంపవయ్యా యని వశిష్ఠులు తీర్పు చెప్పిరి. విశ్వామిత్రుని సమక్షములో పదిమందిలో సభలో వశిష్ఠుఁ డీ మాట చెప్పి, ఆతనికి సంతోషము కలిగించెనని మూలములో నుండఁగా – ఈ క్రొత్తవిశ్వామిత్రునకు ఈ తిప్పలు తెచ్చిపెట్టుటలో ఏదో 'కుంభకోణ' మున్నది. ఈ విశ్వనాథుని విశ్వామిత్రుఁడు – ఒక దొంగసన్యాసి. ఆ చూపులు – ఆ నవ్వులు, ఆ దెప్పిళ్లు– ఆ దాఁగుడుమూఁతలు – ఆ వెకలినవ్వులు రోఁతవేయుచున్నవి. ఇక్కడ – అక్షరాల కవీశ్వరుని తత్త్వమే విశ్వామిత్రపాత్రలోఁ దూరి ఇంతపని చేసెనేమో యని స్ఫురించుచున్నది. ఈ కవీశ్వరునకు 'విధుర' శబ్దముమీఁద అత్యంతప్రీతి యున్నదనవలెను. లేనిచో నూటిమూటికి కదే పాటగా ఈ మాట వాడుకొనునా! ఆయుపంక్తుల వచనములో రెండుసారులు 'విధుర' శబ్దము రావలసిన కర్మ మేమి? అదేమైన అందమైన పదమనియా ? ఆ యర్థములో సంస్కృతాంధ్రములలో ఈ కవిసమ్రాట్టునకు పదమే దొరకలేదా! ధవుఁడు లేనిదానిని 'విధవ' యనియు, కళత్రవియోగము వచ్చినవానిని 'విధురుఁ'డనియు సంస్కృతము రానివారే వాడుకొనుట సంస్కృతసాహిత్య లోఁతుపాతులు తెలిసిన వీరికే తెలియ దందుమా! 'అక్షుద్రుఁడ'వన్నట్లు దీనినిగూడ ప్రేమించి యుండె నందుమా!

రోషపరీతుఁడైన విశ్వామిత్రుఁడు, పలికిన 'మిథ్యాప్రతిజ్ఞః కాకుత్స్థ! సుఖీ భవ సబాంధవః' అను ఒక్క ముక్కలో చక్కఁగ వాల్మీకి వ్యంగ్యోక్తిని సూచించెను. ఈ యనువాదములో 'నీకున్

సుఖం బవు నీ బంధువులు నీవునున్ సుఖము పెల్లెయుండుఁ డేఁ బోదు మానవనాథా! సుఖమాత నీకును బ్రతిజ్ఞాభంగ పుణ్యాబ్ధికిన్.'

'నీకును – నీవులు' ఒక నాలుగును, 'సుఖములు' ఒక మూఁడును ప్రసాదించిరి. నీ బంధువులు నీవునున్ సుఖము పెల్లె యుండుఁ డన్న తరువాత, ఆద్యంతములలోని రెండు సుఖము లెందు లకు స్వామీ! ఆ చెప్పిళ్ళలో సారస్యమును ఈ యామ్రేడితములో ఈ చర్వితచర్వణములో ఈ పిష్టపేషణములో ఈ రూపముగఁ జూపింపఁదలఁచితిరా! రెండు ముక్కల వ్యంగ్యోక్తిని బగ్గముపాడు చేసిన ఈ రామాయణకర్త, వాల్మీకమునకు భాష్యమే వ్రాయునఁట! ఔరా! ఎంతటి ఘటకులు? గోవిందరాజప్రభృతుల వ్యాఖ్యలు 'మణిమంజీర'లు 'తత్త్వదీపికల'వంటివే సుష్ఠుగాఁ జదివి మూలార్థము చెడనీయక విశేషములు తెలుఁగులో వ్రాయనేర్చినవారి రామాయ ణములకే తెలుఁగు భారతమున కున్న పేరుపెంపులు రాలేదని మనము విచారించుచుండ, వికారానువాదములో విలక్షణాధోరణిలో వెలసిన ఈ కల్పవృక్షము 'భవిష్యత్తు' ఎట్లుండునో వేఱుగాఁ జెప్పవలసిన యక్కఱ లేదు. ఉపన్యాసములలో ఉద్వేగముగ ఉట్టిపడు దంభోక్తులు ఆరిపోయిన పెసరట్లవంటివి. మనీషి యగువాని 'సత్తా' నిరూపింపఁ గలవి నాలుగుకాలాలు నిలువఁగలిగినవి కావ్యాలు మాత్రమే. ఆ కావ్యాలలో దాఁచిన 'సరుకు' వేఱొక విధముగా నుండఁగా, మన గంభీరోపన్యాసములు – శిష్యప్రశిష్యసంచారప్రబోధములు ఎన్నా ళ్ళని లోకమును భ్రమింపఁజేయఁగలవు? నిజము నిలుకడమీఁదఁ దెలిసితీరును.

'కల్పము'లో కోపించి లేచిపోయిన కౌశికుఁడు తొలి యేనుఁగు గుమ్మమును దాఁకొనియుండఁగా, ఆ వార్త విని వశిష్ఠులవారి యుప దేశము పొంది దశరథుఁడు వెంటనే బిడ్డలను దీసికొని వచ్చి మానికి సమర్పించెనఁట. వెంటనే ఈ విశ్వామిత్రుఁడు వాండ్రను వెంట వైచు కొని వెనుదిరిగి చూడకయే అదేపోకగాఁ బోయెనఁట. కారణ మేమో మనకుఁ దెలియదు. ఇట్టి ఘట్టములలో 'వెనుకచూపు' లేనివాఁడు ఒక్క దూర్వాసోముని యే కథలలోఁ గానవచ్చును. తేలుకూడ –

చిటుక్కునఁ బొడిచి ఇట్లే పోవునఁట. ఇది వీరి క్రొత్తసృష్టి. ఈ తీరు సృష్టివలన ఈ కావ్యమునకు విశిష్టతమాట యెట్లున్నను, బంగారు వంటి బ్రహ్మర్షి - మహామేధావి - మహాతేజస్వి అయిన విశ్వామిత్రుఁడు, వట్టి భ్రష్టుఁడై వెకలియై టక్కరియై అసభ్యప్రవర్తనముచే నవ్వుల పాలయ్యెనని చెప్పకతప్పదు.

ఈ కాండములోనే విశ్వామిత్రుని రెండవ ఘట్టము చూతము. అహల్యాపుత్త్రుఁడైన శతానందుఁడు, రామలక్ష్మణుల కేవేవో చెప్పి- 'ఈ విశ్వామిత్రుఁ డెవరో యెఱుఁగుదువటవే'యని రామునకు ఈ మహర్షికథ వినిపించును. కథ వినువారు శిశువులైన రామలక్ష్మణులు. వినిపించువాఁడు, అహల్యకు ఇంద్రునకుఁ బుట్టి గౌతమపుత్రుఁ డనిపించుకొని విదేహనరనాథుల యిండ్ల పౌరోహిత్యముతో బ్రదుకు శతానందుఁడు. కథానాయకుఁడుసైతము ఈ కథను వినుచున్నాఁడని గ్రంథకర్త మఱచినను మనము మఱువరాదు.

రాజర్షియైన విశ్వామిత్రుఁ డొకనాఁడు 'మంది మార్బలముతోఁ వశిష్ఠాశ్రమమునకు వెళ్లెను. అతిథిసత్కారసందర్భములో 'ఆతిథ్యశ్రీ' నెఱపుదు నుండుమని వశిష్ఠుఁ డనఁగా 'తానును గాధేయుఁ డిదియు' దగునటవె ప్రభూ!' అని వైశ్వనాథవిశ్వామిత్రుఁ డన్నాఁడఁట. 'చస్తే' ఆతఁ డీతనిని 'ప్రభూ!' యని పిలుచునా! ఏమి ప్రభువు స్వామి! యేసు ప్రభువువోలె. ఒక వేళ ఈ 'ప్రభువును' కవిసమ్రాట్టు అంతవారు వాడిరి కావున 'అంతరార్థ'మేదో యున్నదని ఊహింతుమన్నను వైశ్వనాథవిశ్వామిత్రునకు అంతమాత్రము 'అంతర్దృష్టి' లేకపోయెను. ఆ దృష్టియే ఆతని కున్నచో 'మా సైన్యము పెద్దది. మే మందఱము విందులకు సిద్ధమైనచో నీ యాశ్రమములో ఒక్క పచ్చని యాకుగూడ మిగులదయ్యా' యని సామాన్యమానవునివోలె అనఁగలుగునా! ఈ 'ప్రభువు'లు అర్థము లేని ప్రభువులై కల్పవృక్షమునిండ 'తిష్ఠ' వేసియున్నారనియే తేలుచున్నది. 'తానును గాధేయుఁడఁట' ఈ 'తాను'—ఆపై సముచ్చయము ప్రాసకక్కుర్తికై వచ్చిపడిన సైతాను. దానికిఁ దోడు ఆ ప్రక్కనే 'ఇదియు' మఱొకటి.

ఓయి యోయి విశ్వామిత్ర! యని వశిష్ఠులవారు పిలుచుట గాని, 'ఏమి ప్రభూ' – యని విశ్వామిత్రుఁ డనుటగాని కలలోననైన నవ్వులకైన నూహింపనైన వీలులేని మాట. ఇరువదవశతాబ్దిలోని ఈ గ్రంథకర్త తన సమాజములో తా నూహించుకొన్న మనః ప్రవృత్తి ఈ మహర్షుల కిర్వురకు అంటఁగట్టినాఁడనవలెను.

> 'శబళ శబళ గాదు సద్రత్నమగుఁ గద! రాజు గాని యెందు రత్నహారి
> యొక్క వేయి యాల నొసఁగెదఁ గైకొని ప్రభువ! నా కొసంగవలయు శబళ'
> [బాల - 246]

పద్యము లన్నిటిలో సులువుగా సాగిపోవు నది గీతముగదా! చేయితిరిగిన కవి ఎట్టి భావములనైన గీతములో అలవోకగా నడపించుట మన మెఱుఁగుదుము. 'రత్నహారీ తు పార్థివః' అన్న సూక్తికి ఇందలి రెండవచరణము అనువాదము. సంస్కృతములోని యా సూక్తి వినియుండని తెలుఁగువానికి ఈ చరణము ఎన్ని పునశ్చరణములు చేసినను అర్థము సూటిగాఁ గుదురదు. నాథమాని నవ్వుచునే నృపసంతానమును బూది చేయించెనఁట. 'ప్రభువుల' శ్రేణిలోని మఱొక ఆణిముత్తెమె 'నాథమాని' యన్న మధురపదము. ముని నాథుని యవతారమే ఈ 'నాథమాని'గాఁడు కాఁబోలు!

శబళకోసమై ఇరువురి బలఁగము తారసిల్లినప్పుడు వశిష్ఠుఁడు విశ్వామిత్రుని 'నీవు లేవు కుటిలా! ఉదురుపాటూ! ములుచ! నిల్చినాఁడనుర నీ! కుటిలోద్ధత! క్షత్త్రబంధు!' ఇత్యాదిగ పిలుపు పిలిచి బ్రహ్మబలము చూపినాఁడఁట. అది నిజము కావచ్చు. కాని, ఈ కథ వినిపించునది విశ్వామిత్రునికన్న వేయిమడుంగుల చిన్నవాఁడయిన ఒక పిల్లగున్న శతానందుఁడు. వినువారు శిశువులైన రామ లక్ష్మణులు. ఆపై – ఆ బ్రహ్మర్షి తల యూఁపుచు తాడిచెట్టువోలె తత్కథాశ్రవణములో భాగము పంచుకొంచు నిలిచియున్నాఁడు. వెనుక జరిగినది వినిపించునపుడు కథానాయకుఁ డక్కడనే నిలిచి వినుచున్నప్పుడు ఈ 'కూఁతలలో' కొంచెము సౌమ్యత చూపవలదా!

జరిగిన కథలో పలికిన పలుకులలో అప్పటి కవి తగియున్నను వినిపించు ఘట్టములో పాత్రౌచితినిబట్టి మెలఁకువ చూపుట మహా

కవుల లక్షణము. ఈ యాచితి, సంస్కృతరూపకములలో ఒకరి మాటలు మఱొకరికి మఱొకఁడు వినిపించు సందర్భములో మిక్కిలిగా పాటింతురు.

కులగురువువలన దెబ్బ తిన్న త్రిశంకుఁడు, యజ్ఞము చేయఁ దలఁచి విశ్వామిత్రు నాశ్రయించెను. తప్పక నీచేత యజ్ఞము చేయింతునని బ్రహ్మర్షి విశ్వామిత్రుఁడు—ఆ జేని కభయహస్త మిచ్చెను. యాగము ప్రారంభమాయె. పిలిచినవెంటనే ఋషులును త్రయీవాదనులగు బ్రాహ్మణులును వచ్చిరి. మహోదయులు—వశిష్ఠుల వారు, వారిపుత్త్రులు వందమందియుమాత్రము రాలేదు. ఇక్కడ వశిష్ఠులవారి పాత్ర విశ్వనాథులవారిలోఁ దూరి ఏమి చెప్పెనో చిత్తగింపవలెను.

సీ. 'క్షత్రియయాజకచండాలయజమానక్రతువున భోక్తలం గారు సురలు
ఈ తిండి తినఁబోవు ఋషులు పాంక్తేయులో యీ ఋషులకు స్వర్గమెత్తునడదొ
ధీయించుఁ గోపరంజితనేత్రులై యని రా మహోదయుఁడును నల వశిష్ఠ
పుత్రులు నని నిల్వ—' (బాల. 257 పు.)

ఈ క్రతువున క్షత్త్రియుఁడు యాజకుఁడఁట. చండాలుఁడు యజమానుఁడఁట. కావున సురలు భోక్తలు కారాదఁట. ఈ తిండి తిన్న ఋషులు అపాంక్తేయు లగుదురఁట. చచ్చినను వాండ్రకు స్వర్గము రానేరాదఁట. ఇది మహోదయులయు వశిష్ఠులవారియు సిద్ధాంతమని వైశ్వనాథము మనకు బోధించుచున్నది. 'మా నాయనమ్మ సత్యవతి విశ్వామిత్రుని యప్పగారు క్షత్త్రియ, మా యమ్మ రేణుకయు క్షత్త్రియయే.'

'నేనచ్చముగాఁ బాలుండఁగానుకుమీ క్షత్త్రియరక్తకాండమ్ములు నా
మై నరములఁ బ్రవహించున్' — [బాల - 809 పు]

విశ్వామిత్రుని కుదురు పరశురాముని కోవ ఇదమిత్థ మని ఏ నోటితో ఈ కవీశ్వరుఁడు మనకు వినిపించెనో ఆ నోటితోనే విశ్వామిత్రుఁడు క్షత్త్రియుఁడు కావున ఆతని యాధ్వర్యవములోని యాగము అశాస్త్రీయమన్నట్లు భంగ్యంతరేణ బోధించెను. వీరి వ్రాఁతలలోనే పురాణపురుషుల కులగోత్రముల కథలు వెల్లడియగు చుండఁగా—సంకరజాతులు లేని ఆ రోజులలోని గాథలను మడిగట్టు

కొని వర్ణించుచు నేఁడీ పాపిష్ఠకాలము కలియుగము దాపరించెనని వాపోవుట అత్యంతశోచనీయము.

విశ్వామిత్రుఁడు వేయియేండ్లు ధర్మాత్ముఁడై తపస్సు చేయఁగా దేవతలును బ్రహ్మయు వచ్చి 'ఋషి' వైతివని చెప్పిరఁట. ఇన్నేండ్లు ఈ తపస్సు నేను జేసినది 'ఋషి'ననెడిమాత్రమునకా యని విశ్వామిత్రుఁడు మఱలఁ గన్నులు మూసి తపస్సు ప్రారంభించెనఁట. ఇఁక శృంగార రంగములోనికిఁ బోదము.

అది వసంతఋతువు. మేనక ప్రత్యక్షము. కథను వినువారు శిశువులన్నమాట. కథానాయకుఁడు కట్టెదుట ఉన్నాఁడన్నమాట, శతానందులవారు మఱచినను విశ్వనాథవారు మఱచినను మనము మఱువరాదని మఱొక్కమారు జ్ఞప్తి చేయుచున్నాను. ఇట్టి శృంగార ఘట్టములో కాలిదాసు ఎట్టి ఔచిత్యమును బోషించునో ఒక్కముక్క చూచి మఱి మన కథలోనికి వత్తము.

శకుంతలాజన్మవృత్తాంతము వినవలెనని దుష్యంతుఁడు కుతూహలపడును. భారతములో శకుంతలయే వినిపించిన ఈ కథను కాలిదాసు అనసూయచేఁ జెప్పించును. ఇది యొక రమ్యమైన మార్పు. అందును విందు గూర్చు వ్యంగ్యోక్తిలో:—

'శ్రుణోతు ఆర్యః గౌతమీతీరే పురా కిల తస్య రాజర్షేరుగ్రే తపసి వర్తమానస్య కిమపి జాతశంకైః దేవైః మేనకా నామ అప్సరాః ప్రేషితా నియమవిఘ్నకారిణీ – తతో వసంతోదారసమయే తస్యా ఉన్మాదయితృరూపం ప్రేక్ష్య–' [ఇత్యర్ధోక్తే లజ్జయా విరమతి]

ఈ మాట వినఁగానే దుష్యంతుఁడు, 'పరస్తాత్ జ్ఞాయత ఏవ. సర్వథా అప్సరః సంభవైషా' అనును. ఇది మహాకవుల ధోరణి. కథానాయిక అక్కడనే ఉన్నప్పుడు ఆమె ప్రియసఖి, కథానాయకునితో చెప్పవలసినది 'సభ్యత'గాఁ జెప్పినది.

వాల్మీకములో ఈ కథ నే తొమ్మిది శ్లోకాలతో ముగించెను. మన వైశ్వనాథమో ఈ ఘట్టమును సరిగా ముప్పదిపద్యములకుఁ బెంచినది. ఈ పెంచిన ఈ భాగములోని పద్యములే కొన్ని కొంచెము కొంచెము మార్పు చేసి సీతారాముల శృంగారవర్ణనములో సైతము అప్పు తెచ్చుకొనిరి. అనఁగా తాను వ్రాసెడి కావ్యములలో ఎక్కడ

శృంగారము కావలెనన్నను పెండ్లిపద్యములవోలె కొంచెము పేరులు మార్చి చటుక్కున వీనినే దంపవచ్చునని కాబోలు! ఆ పాత్ర లెవరో! వారి వయఃప్రాభవ మెట్టిదో! వారి సంప్రదాయము లేవో! ఇట్టివి చూడవలసిన పనియే లేదు. హవ్యమునకు కవ్యమునకు ఒకటే మంత్రమాయె. విశ్వామిత్రుని తపస్సును భంగము చేయవలెనని వచ్చిన మేనక శృంగారమిచ్చుట, పరబ్రహ్మస్వరూపులుగ చిత్రించు కొన్న సీతారాముల ప్రణయగాథ అచ్చుట.

తపస్సులో నిశితమైన చూడ్కి నిలుపుచున్న విశ్వామిత్రునకు పుష్కరతీర్థములో స్నానమాడి ఒడ్డున కెక్కిన మేనక కన్పించును. కాంచినదే తడవుగా ఈతఁ 'డమాంతము' దగ్గఱఁ జేరి తన బొమ్మ విఱిచి నిలిచి మీసము గడ్డము పాయలుగా దూసి ఆబిడవంక అదే చూపుగా చూడసాగెను. ఇద్దఱు నవ్వుకొనిరఁట. వెంటనే ఈ తపస్వి 'అయ్యో! నానిపోవుచున్నావే పాపము! వెంట్రుకలు పిడుపుపెట్టు దునా!' అనుచు, చెంగున ఉత్తరీయపుచెంగుతో ఆమె శిరోరుహ ములు పెనవెట్టి చుట్టుచు పిండెనఁట. ఒడలునైతము తుడువనా యని ఆతఁడు తివురఁగా – కాదుకాదని ఆమె వారించి తుడుచుకొనఁ బ్రయత్నించు సమయములో తుదకు ఇరువురకు 'తడికౌఁగిలింతలు' లభించినవఁట. ఎవ్వరు తుడిచిరో తోఁచదుగాని, తుద కాబిడ పొడిచీర దాలిచి వాని యొడిలో శయనించెనఁట.

ఇది శిశువులైన రామలక్ష్మణులు వినుచున్న 'తాత'గారి సరస మైన శృంగారగాథ. ఈ పరమే చక్కఁగా నేర్చుకొని శ్రీరాముఁడు సీతమ్మతో ఇదేరీతిగ కలికికల్లు వైశ్వానాథము చిత్రించినది. మేనక చెక్కిలిపై ఈ మొలాలమూని ఒక్క చిటికను చటుక్కున వేసెనఁట. ఆ దెబ్బతో 'క్రిందట్టు మీఁదట్టు' అయి వారిరువురి కేళీవైభ వము పట్టరానిదైనదఁట. రామా! జగన్మోహనా! విన్నావయ్యా! యని మధ్యలో శతానందులవారి హెచ్చరిక. వీరి 'మోహకథలు' వినిపించుచు 'జగన్మోహనా! రామా' అని ఆ పురోహితులవారి నోట అనిపించుటలో పెద్ద భావ్యమే ఉండియుండవచ్చును. ఎప్పుడో బహిరంగోపన్యాసములలో మనము విననువచ్చును. ఇచ్చట పదైన పర్ణశాల కలదా! ఇద్దఱము వసింతమని ఆతఁ డడుగఁగా 'ఇచ్చట

నీవు నుందువును నేనునునుందునవెన్ లతాంగియున్' అన్నదఁట.
'ఉందువును నేనును' వీనుల విందైన సారస్యపుతునుకలన్నమాట
మఱువవలదుసుమా !

'రాజితమైన మోహము నిరంకుశమై కుశికాత్మజుండు'

[శాల 265]

ఈ పాదమే 'రాజితమైన మోహము నిరంకుశమై రఘురామమూర్తి' అని 367 పుటలో దర్శన మిచ్చును. రాజిత మనఁగా ప్రకాశితము. రాజృ దీప్తౌ. ప్రకాశించు మోహమఁట. లక్షణయా తా ననుకొన్న అర్థము రావలెఁగాఁబోలు! సంస్కృతసాహితిలో నున్న ప్రగాఢపరిచయమే ఇంత వింతలు వింతలగు ప్రయోగములు మనకు ప్రసాదించుచుండును.

ఇక్కడ – 'వెదురు గొట్టాల నింపిన యిప్పపువుకల్లు తెచ్చి యచ్చరకు' మౌని యందించెనఁట.

అక్కడ – 'కనకపాత్రికల నింపిన యిరారసములఁ దెచ్చి' రాముఁడు మైథిలికి అందించెనఁట.

ఇక్కడ – కోకిల కొమ్మలోఁ గూసిన నీవలే నన్నుఁ బిల్చితివంచు' మౌని నవ్వెనఁట.

అక్కడ – 'కోకిల దూరానఁ గూసిన నీవలే నన్నుఁ బిల్చితివంచు' సామి నవ్వెనఁట.

'తనపాద మూమెపాదము జతగాఁ బెట్టి యస్మత్పదంబు మోటని వచిం ను'-ఇచ్చట గురుశిష్యు లొకే త్రోవలోనే నడచిరఁట.

సినిమాలోని జంటలవలె ఈ శ్రీమద్రామాయణకల్పవృక్ష మహాకావ్యములో ఈ రెండు జంటలు ఒకే 'పోజు'లో నడచుట కవి సమ్రాట్టు సుకృత యని అగ్గించుచు 'చెక్కభజన' చేయు ప్రబుద్ధులు లేకపో లేదు.

'తుమ్మెద పొదలోన ఝుమ్మన నిది యేమి మణితమే యని మౌని మేల మాడెనఁట!!

ఔరా! రాచబిడ్డలకు ధనుర్విద్యావిశేషములు నేర్పెదనని చెప్పి తీసికొనివచ్చినది ఈ 'మణితములు' రుచి చూపుటకా! మణి

మనఁగా ఈ రామాయణకర్త భావము రతికాలమందలి గళరవమే గదా! మేనక ప్రక్కగా నిలిచి, నా బుజముదాఁక వచ్చితివే యని మౌని పలుకరించును. అక్కడ రామయ్య సీతమ్మప్రక్కగా నిలిచి యానుకొమ్మని చెప్పి 'నన్ను విడిపోకవే' యనును. 'నన్ను పెండ్లాడవే చెంచీత!' అన్నట్లు ఉన్నది ఈ ప్రణయంపు సొంపు. చెక్కిలి చెక్కిలిఁ జేర్చి గడ్డము గ్రుచ్చుకొన్నదా యని ఈ గాధేయుఁడు గ్రుచ్చిగ్రుచ్చి యడుగును. ఇరువదవశతాబ్దిలో వ్రాయఁదగిన శృంగారమా స్వామీ! ఇది!! తోలుబొమ్మలాటల శృంగారము!! ఈ కథలో ఈ శృంగారము వినిపించుచు హఠాత్తుగా,

> 'శ్రీసతిపుల్లగల్ల పరిచిహ్నితకుంకుమపత్రభంగవి
> న్యాసితరమ్యవక్ష! రఘునాయక బాలక! రామచంద్ర!' (267)

అని మఱొక శృంగారమును ఆవిష్కరించు సంబోధనము, ఈ 'లక్ష్మీనారాయణ' శృంగారములోసైతము కవిసమ్రాట్టుల కభిప్రేతమైన 'గల్ల' శబ్దము పడవలసినదే. రఘునాయక బాలకుఁడఁట. అర్థము లేని 'క' ప్రత్యయములు 'ఇక' ప్రత్యయములు ఈ రచనలో జాస్తిగదా! ప్రపంచకములు-పాత్రికలు-ఫక్కికలు-ఆదికలు-పుత్త్రికలు-వహ్నికలు-బిందుకములు, ఇత్యాదులు ఈ కవీశ్వరునకు హృద్యములైన పదములు.

గుర్విణియైన మేనకను విశ్వామిత్రుఁడు గాంచి అప్పుడు మేల్కొనెనఁట –

'పదియేండ్లా! బళి! మేన తాలిచిన గర్భం బేమి చేయున్ ననున్ బాదుగంజేయునో యాడపక్షివలె! నే మూర్ఖుండ' అనుచు పెద్ద యుపన్యాస మిచ్చును. మూలములో ముచ్చటగా ఇరువురు విడుదలయైన ఈ భాగమునకు 'గర్భములు - పొదుగుటలు - ఆడ పక్షులు' మున్నగునవి తెచ్చి, వట్టి మొఱటుగా లేకిగా కొసరులు గలిపెను. పశ్చాత్తాపముచే దుఃఖితుఁడై విశ్వామిత్రుఁడు, గడగడ లాడు మేనకను జూచి 'మధురైర్వాక్యైః విసృజ్య, ఉత్తరం పర్వతం రామ విశ్వామిత్రో జగామ హ' అని మాత్రమే వాల్మీకములో ఉన్నది. ఈ వైశ్వనాథములో 'నీ గర్భములో నా దోస మున్నది.

దానిని కణ్వుఁడన్నాని వన్యసీమలో విడువుమని మానిని, సలహాలుసైత మిచ్చును. ఇదియు నొక నవ్యసృష్టి, లేదా, ఇది యొక మహా భాష్యము. పతంజలివారిది కాదుసుమా! పదియేండ్లుగా పడుగు పేకలుగా పడియున్న ఆ మేనకను తుదకు ఈ విశ్వనాథవిశ్వామిత్రుఁడు ఏమని పలుకరించెనో ఆ తీరు గమనింపుఁడు :—

**'అంజియా! యెంత క్రిందికి గుంజినావె!'**

ఇది ఈ కవిసమ్రాట్టుల శృంగారభండారము. ఇది విశ్వనాథ విశ్వామిత్రపాత్రచిత్రణము !!

# కల్పములోని కైకేయి

అది శ్రవ్యముగాని దృశ్యముగాని మహాకవుల చేతిలో వెలువడిన కావ్యములలో పాఠకుల యోపికనుబట్టి ఎన్నో విధాల సొగసులు స్ఫురించుచుండును. ఉత్తమకవీశ్వరుఁడు పలికిన పలుకులలో విశ్వశ్రేయమును గూర్చు విశేషాంశము లేవేవో వెలువడుచుండును. ఆ దశనే ఆలంకారికులు ధ్వని యని పిలుతురు. ధ్వనియే కావ్యమునకు జీవగఱ్ఱ. ఆ చెప్పఁదలఁచినది వాచ్యమైననాఁడు సారస్యము జాఱిపోయి కావ్యము తేలిపోవును. మున్ముందు రాఁబోవు పాత్రలలోని గుణవిశేషములను మొట్టమొదట సూచించుటయు మహాకవులు చూపెడి నేర్పులలో ఒక నేర్పు. దానినే కావ్యార్థసూచన యందురు.

కాళిదాసశాకుంతలములోని 'యా సృష్టిః స్రష్టు రాద్యా' అన్న ఆశీరూపమైన శ్లోకములో ఈశ్వరుఁడు రక్షించుఁగాక – అన్న భావమేగాక కావ్యార్థసూచన కావలసినంత గర్భితమై యున్నది. ఈశుఁడనఁగా ఈ కథలో దుష్యంతప్రభువు. యా సృష్టిః – అన్న మాటకు శకుంతల యని యర్థము. 'హోత్రీ' యనఁగా కణ్వుఁడు. 'యే ద్వే' అన్నదానిలో – అనసూయా ప్రియంవద లున్నారు. 'కాలం'– అనఁగా శాపాంతసమయము. 'శ్రుతివిషయగుణా'—అన్న మాటలో గుణత్రయమువలన శార్‌ఙ్గరవ – శారద్వత – గౌతములు స్ఫురింతురు. 'సర్వబీజప్రకృతి'లో చక్రవర్తి భరతుఁ డున్నాఁడు.

ఇట్లే మహాకవి భవభూతిసైతము 'ఇదం కవిభ్యః పూర్వేభ్యః' అన్న చిన్న శ్లోకములో కొండంత కావ్యార్థమును స్ఫురింపఁ జేసెను. 'తాం వాణీం వందేమహి' – అన్న ముక్కలో ఈ కావ్యములోని కథానాయిక ప్రాజ్ఞ యనియు 'ఆత్మనః కలామ్' అనుటచే ఆమె దేవతాంశసంభవ యనియు ఒకానొకనికి ధర్మపత్ని యనియు సూచన కలదు. తెలుఁగుభారతములో నన్నయ్యనోట వచ్చిన 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అన్న మొట్టమొదటి ప్రార్థనలో కవిత్రయమువారి కథ–భారత రచనావృత్తాంతము స్ఫురించుచున్నది. ఇట్టిది మహాకవుల లక్షణము. ఈ ధోరణిలో ఉత్తరరంగములోఁ గావలసిన పాత్రల సృష్టికి పూర్వరంగములో బీజములు నాఁటి అందచందములు తెచ్చిన కవులును

గలరు. ఈ పూర్వాపరములు పరిశీలించుచు ఆ పాత్రలలోని ఔచిత్యము
ఎంతవఱకు పోషింపఁబడినదో మనము గుర్తింపవలసియుండును.

రామాయణములో కైకేయిపాత్ర ముఖ్యపాత్ర. మహో
దయులు వశిష్ఠులు పెట్టిన పట్టాభిషేకసుముహూర్తము శ్రీరాముని
వనవాసమునకు మూలమైనది. కైకేయి ఎన్నఁడో కోరి దాఁచుకొన్న
వరములే ఆమె అగ్గలముగా ప్రేమించియున్న శ్రీరాముని అడవికిఁ
బంపినవి. అరణపుదాసిగ అయోధ్యకు వచ్చి గౌరవముగా బ్రదుకు
చున్న మంథర సంకల్పమే ఇంతవింతలు చేసినది. ఎవ్వఁడో ముని
కుమారుఁడు ప్రమాదముగ మరణించుటయే దశరథునకు ఈ దురవస్థ
తెచ్చిపెట్టినది. రావణునకు భయపడిన దేవతల యక్కఱ తీర్చుటకే
ఈ యవతార మావశ్యకమాయెను. అరణ్యవాసము కలుగుటఁ జేసియే
సీతాపహరణాదికము సంభవించి రావణవధ జరిగినది. ఈ కథ ఇట్లు
గుటవలననే శ్రీరాముఁడు పితృవాక్యపరిపాలనాపరాయణుఁడనియు,
దుష్టశిక్షకుఁడనియు శిష్టరక్షకుఁడనియు మంచి పేరు వచ్చి లోకా
రాధ్యుఁడయ్యెను. శ్రీరాముని జీవితములో రాజ్యపరిపాలనాగాథకన్న
వనవాసాదికగాథయే ముఖ్యముగా మనము భావింతుము. తన్మూల
మున రామావతారప్రసక్తియు సఫలమయ్యెను.

ఇట్టి దశలో వశిష్ఠులు పెట్టిన లగ్నము మంచిది గాదని మన
మెంచవలెనా! కైకమ్మ వట్టి దుష్టురాలని ఈసడింపవలెనా! మాయ
మునికుమారుఁడు దాపరించెనని విచారింపవలెనా! అడవిలో శ్రీరా
ముఁడు అన్ని యిడుమలు పడెనే యని బాధపడవలెనా! దీని కంత
కును మంథరయే మూలమని ఆబిడను దిట్టిపోయవలెనా! ఇది
యంతయు విధివిలాసమని నిశ్చయింపవలెనా! ఈ యంశములు
మనస్సులో ఉంచుకొని పరిశీలింపఁగా రామాయణకల్పవృక్షము
లోని కైకేయికి కావ్యకర్త ఘోరమైన యన్యాయమే చేసినట్లు
స్పష్టము కాఁగలదు.

కైకేయికి జ్ఞాతిదాసియైన మంథర వార్త వాల్మీకములో
అయోధ్యాకాండములో శ్రీరామపట్టాభిషేకఘట్టములోఁ గన్పిం
చును. మంథర చేసిన దుర్బోధవలన, అందాఁక మంచిదనిపించు
కొన్న కైకమ్మ ఇంతపని చేసెనని రామాయణకథ విన్నవా రందఱు

కైకను దిట్టిపోయుట లోకములో ఒక యాచార మాయెను. ఈ సనాతనాచారమునే పాటించి కావ్యార్థసూచనగా భావించి కాఁబోలు విశ్వనాథవారు 'కల్పము'లో బాలకాండములోనే ఆ యిర్వురి 'బండారములు' బయటపెట్టిరి.

కం. 'ఆకృతి నొంటెకుఁ జెల్లెలు కైకేయికి ముసలిదాది కల దొక్క—తె'(బాల 104)

సీ. 'నుదుటఁ గస్తురిబొట్టు చదురుగాఁ దీరిచి ముసలిది వలదన్న మొగము దుడుచు
శ్రీరంగనాథుని సేవింప మడిగట్టి మంధర వలదన్న మానివేయుఁ
గౌసల్యఁ గనఁబోవఁగా బండిఁ బిలిపించి వద్దు కాదన్నచోఁ బంపివేయుఁ
గోర్కె— సింగారించుకొని పతిఁ గలియఁగా దాది కిష్టము లేదొ తగ్గిపోవు
తల్లి సెలుఁగని దోషమ్ము తగిలి కైక కన్నతల్లిఁ జూడని మమకార మెల్లఁ
దన్నుఁ జేతులఁ బెంచిన దాదిమీఁద నొలుకపోయును గుండెలో నులికిపడుచు'

సీ. 'మడి కట్టవలదన్న మంధర మన్నించి నాతి లోలో రంగనాథుఁ గొలుచు
దాది యొత్తిడి మహాధనచేలములు గట్టి కాంత కషాయముల్ కాంతు సేయు
ముసలి రత్నాసనమ్మును పీడనీయమిఁ బాదుకల్ తొడిపోవఁ బడఁతి యెంచు
నడివడ్డ నడుపులు నగ మిచ్చనైనాక యతివ నే నిందుండననుచుఁ బలుకు
నెపుడొ మంధరమాటకు నెదురుతిరుగు నొక్కొక్కప్పుడు మంధర కొదిగియుండు
నెంత గొడ్డమ్ములైన నా యింతి యెడఁదఁ బ్రభువు శ్రీరంగనాథుండు
పాయకుండు'

ఇది యఁట – ఈ యిర్వురి పరస్పరసంబంధము.

'నా తరువాత మళ్లీ కొన్ని వందల యేండ్లకుగాని ఇట్లా వ్రాసే వాడు పుట్టడు. బహుప్రయత్నం చేసి నా జీవితానుభవాలను సర్వస్వాన్ని పిండి రమ్యమైన కల్పనలు చేశాను. అనంతమైన పోకడలు పోయాను' – అని బహిరంగోపన్యాసములలో తన సంకల్పము – 'సత్తా' గూర్చి చెప్పుకొన్న కల్పవృక్షకర్త, కావించిన కల్పనలలో పోయిన పోకడలలో ఇట్టివి హెచ్చుగ నున్నమాట నిజమే. కాని, ఆ కల్పనలను లోక మంగీకరింపవలెను; మెచ్చవలెను.

ప్రసిద్ధమైన ఇతివృత్తమును కవిత్వములో చిత్రించునపుడు ఆధారము లేని కల్పనలు చేసి మన భావములనే ఆ పాత్రల కంటించి రమ్యమైన పోకడలని ఊరించుట న్యాయము కాదు. రంగనాథుని సేవింపవలెనని కైకమ్మ మడిఁగట్టుకొనఁగా ముసలిముండ వలదన్న

మాట వీ రెక్కడ వినిరి? రవ్వంతైన వాల్మీకి యనలేదే. వ్యాఖ్యా
తలు సూచింపలేదే. ఈ మడిగట్టుకొనుటలు త్రేతాయుగములోఁ
గూడ ఉన్నవా స్వామీ! అంతగా శ్రీరంగభర్తను మదిలోఁ
బాయని మహాదశ, కైకేయికి ప్రాప్తించిననాఁడు, ఆ మహాభక్తు
రాలు ముసలిదానిమీఁది మమకారముచే మడిగట్టుకొనుట మాను
కొనునా! అది మహాభక్తియే అయినప్పుడు శ్రీరంగనాథునివలన –
ఆ మంథర కింత మంచిబుద్ధి – అనఁగా మడి గట్టుకొనవలదనకుండు
బుద్ధి కలిగింపరాదో! మొదలు – ఈ కైకేయి ప్రకృతి మంచిదే
సుమా! మంథరమూలమునఁ జెడిపోయినదన్న ఒకానొక భావమును
ఈ ఘట్టములో చిత్రించి, ఆవల మఱొక్క చోట – ఈ కైకేయి
బుద్ధి మొదటినుండియు నిట్టిదే. రాముని ప్రేమించినట్లు నటన చేసి
తుదకీ 'అఘాయిత్యము'నకు కైకేయి దిగెనన్నట్లు ఈ కల్పములో
వేఱొకచోట సిద్ధాంతము చేసిరి. కోపగృహములో నున్న కైకేయి,
తండ్రి యవస్థనుగూర్చి ప్రశ్నించిన శ్రీరామునితో ఈ మాట
అన్నదఁట :—

శా. 'రామా! యిన్ని దినాలు దాఁచితినిరా 'రక్షో'విధంబై సప
త్నీమాత్సర్యము క్రిందు బద్ధలయి పండెన్ గండ్రకోనన్ ధను
శ్శ్రీమత్ప్రాణివి నీవు నొంటరివి........ (అయోధ్య 48 ప)

శా. రక్షోజాతిని నాదుయౌవనదశాప్రాచుర్యముం బోదు వృ
ద్ధక్షోణీపతి నీదుతండ్రికిని జేతఃకామముం జావదౌరా!' (48)

ఇన్నాళ్లుగ దాఁచుకొన్న సపత్నీమాత్సర్యమునకు ప్రతిఫలము
శ్రీరామవనవాసమును గోరుట కని రామునితో స్వయముగాఁ
జెప్పుటలో అంద మేమున్నదో! తాను రాక్షసజాతిదాననని శ్రీరంగ
భర్తకు మహాభక్తురాలైన కైకేయి గుర్తించి నమ్మకముగాఁ
బలుకుట, ఆ వచ్చిన బిడ్డవద్ద ఆ దశలో తన యౌవనదశాప్రాచుర్య
మును వృద్ధక్షోణీపతి కామము చావకుండుటను జెప్పుటలో సారస్య
మున్నదా! ఆ జరిగిన కథనుబట్టి కైకనుగూర్చి లాఁతివారు అనుకొన
వలసిన భావములు కైకయే తన కున్నట్లు బిడ్డతోఁ జెప్పికొన్నట్లు-
ఈ 'కల్ప' కర్త కల్పించుటలో అంతరార్థ ముండునా! ఇది
భావ్యముగా భావింపవలెనా!

పట్టాభిషేకనిర్ణయానంతరము వశిష్ఠులవలన ఉపవాసాది వ్రతములు ఉపదేశ మంది శ్రీరాముఁడు తన నివాసము చేరి ఆ రేయి కొంత గడపి, అపరాత్రములో మెల్లన లేచి కైకేయి గృహామునకు వెళ్లెనఁట. వెళ్లి, అమ్మా యని పిలువఁగా కైకమ్మ 'రా అమ్మా'యని పలికి, అయ్యో! వ్రతస్ఖలన మగునేమో యని భయ పడెనఁట. ఈ భాగము విశ్వనాథ 'కల్పనల'లో ఒకటి కావచ్చును. తల్లీ! సమాధి నిలువక ఇటు వచ్చితిని. నే నేమి చేసెదను? సమాధిలో వేల్పులు వచ్చి రాజ్యము చేయవద్దనినట్లు తోఁచినది. ఏమియుఁ దోఁచక ఇచ్చటికి వచ్చితిని. ఆపై నాకుఁగూడ రాజ్యములో కోర్కె లేదు – అని రాముఁడు వినిపించెను. బాబూ! ఇప్పు డట్లేయగును గాని రేపు అంకస్థయైన జానకిని జూచి సింహాసనసీమ మార్గము చూపును. పొమ్మని కైకేయి అన్నదఁట. తల్లీ! అది కాదమ్మా! నేను రాజ్యము చేయుట వేల్పుల కిష్టము లేదని పలికిన రామచంద్రుని తీక్ష్ణనేత్రములు చూచి కైకేయి లోని కేఁగెను. ఇది యంతయు భావ్యర్థసూచన కాఁబోలు!

అభిషేకవార్త విన్న మంధర, ముచ్చెమటలు పోసి కొంప మునిఁగిపోవునట్లు వచ్చిపడి కైకతో నిట్లనినట్లు 'కల్పము' వర్ణించినది.

గీ. 'అవును దౌర్భాగ్య మాకారమైనదాన! నీకు నిద్దుర యెటు పట్టునే దరిద్రు
రాల! యొకవంక నింటిచూ రంటుకొనిన సొగసుగాఁ జలిఁ గ్రాఁగెదుపగిది తోఁప
'... తా నెఱుంగు, మన్న దిన్న పాముటంచు నిన్ను రాజు'
'... తా వచ్చి పెద్దమ్మ నెత్తిని గూర్చున్నదియే మెం కావలయు' [16]

ఇక్కడ – వాల్మీకి చెప్పిన దిదిగో !—

శ్లో. 'ఉత్తిష్ఠ మూఢే! కిం శేషే భయం త్వా మభివర్తతే
ఉపప్లుత మఘౌఘేన కి మాత్మానం న బుధ్యసే'
శ్లో. అనిష్టే సుభగాకారే! సౌభాగ్యేన వికత్థసే
చలం హి తవ సౌభాగ్యం నద్యాస్స్రోత ఇవోష్ణగే'
(అయోధ్య – 4||9 శ్లో.)

'మూఢే! వికత్థసే' ఇత్యాది సంబోధనలచే ఆది [illegible]ుని మంధర కైకను మందలింపఁగా 'దౌర్భాగ్య మాకార[illegible]నా!

మన్నదిన్న పామా!' అని తెల్పఁగ కవిసమ్రాట్టులుమంథరే, యజమానురాలను దిట్టిపోసినది.

సుభగాకార మింత యున్నదని కులుకుచున్నావు కాంబోలు! మండువేసవిలో నదీప్రవాహమువోలె నీ సౌభాగ్యము మంటఁ గలిసెడి రోజు వచ్చినదిలే - అని శ్లోకములోని భావము. లేదా - ఆ శ్లోకములో 'అనిష్టే - అసుభగాకారే' అనికూడ పదచ్ఛేదము చేయవచ్చును. సుకుమారమైన ఈ మందలింపునకు తెలుఁగులో భాష్యముగా వ్రాసితి ననవచ్చునేమోగాని ఔచిత్యముమాత్రము శూన్యమాయె.

దాదిమాట లెక్కసేయక రాముఁడే రాజ్యము చేయవలెనని కైక వాదించెను. పైగా - ఈ ప్రియవార్త వినిపించినందులకు కైకేయి బహూకృతిగా ఆభరణ మొకటి ఈయఁగా, ఆబిడ ఏడ్చి యేడ్చి పెడబొబ్బలు పెట్టి ఆ నగను విసిరివేసి మఱియు నాలుగు చీవాట్లు వడ్డించెనఁట. 'సవతి శత్రువైన సవతిపుత్త్రుం డేమి యానె తెలివికలుగుదాన! చెపుమ!' -

మ. 'ఒక దాయాదియె నిప్పుతో సమము పైనూహించుమా! నీ కుమా
రకుఁ డాసన్నత గల్గు వారసుఁడు నా రాముం డన్నృకన్ర్వబిం
దుకవైశ్వానరుఁ డింకఁ దోడు గల డా తో డుగ్రధన్వుండు పా
యక సౌమిత్రి తదీదృశంబులు త్వదూహప్రాంతభద్రంబులున్'

(అయో 18)

ఆసన్నత గల్గు వారసుఁడఁట. ఔరసుఁ డన్న సంస్కృత పదమును బజారులో నిత్యము వాడుకొనుచున్నాముగదా! యని 'పూర్వసంస్కృతసాహితితో నా కంత ప్రగాఢ పరిచయమున్నది. కాఁబట్టి' యని తనంతఁదాఁ జెప్పుకొన్న కవిసమ్రాట్టులు 'వారసుఁడు'గా కల్పవృక్షములో నిక్షేపించుటలో నిరంకుశత్వమే కారణము. ఆ పయి, ఇది 'బేవారసు'లోఁ జేరినది కావున దోసము లేదని పిల్లగంతులు వేసెడి చిల్లర శిష్యులకు తఱుగు లేదాయె. అవురా! కవిసమ్రాట్టు ఘనత !!

కుమారకుఁడేమి! [illegible]మేమి!! ప్రాసము కొట్టిన దెబ్బ

కాంబోలు! ఇంక ఆణిముత్తెమువంటిది 'అస్పృశ్సర్వబిందుక వైశ్వానరుఁ'డన్న సమస్తపదము. ఎంత బోధించినను రాముఁడే రాజుగా నుండవలెనని కైక మొరాయించెను. దానికి మంథర పెద్దగా శోకించి చీరయంచు చింపి సన్నని యురి పోసికొనుటకు సిద్ధమయ్యెనఁట. అప్పుడు దానిని వారింపను జేతఁగాక సరే నా మాటనుబట్టి రాముఁ డడవికిఁ బోవచ్చును; నా బిడ్డ రాజ్యము చేయవచ్చును. మహారాజు దీని నెట్లు అంగీకరించునని కైక ప్రశ్నించెను. అప్పుడు మంథర శంబరయుద్ధమునాఁటి వరములు జ్ఞప్తికిఁ దెచ్చి 'పారిఁ బదుమూఁడు వర్షములు పోవలె రాముఁడు వన్యసీమలన్ దిరుగుచు' — అని చెప్పి ఒక వరమును సమన్వయించెనఁట. ఇది విచిత్రమైన వార్త.

'నవ పంచ చ వర్షాణి దండకారణ్య మాశ్రితః
చీరాజిన జటాధార రామో భవతు తాపసః.'

(అయోధ్య 494 పు.)

అని వాల్మీకులు అనుటయే గాదు. ఈ దేశములో రాముని వనవాసము పదునాలుగేండ్లు – అన్న మాట తెలియని ప్రాథమిక విద్యార్థిసైతము లేఁడు. ఒకవేళ 'పారిఁ బదునాల్గు వర్షములు' అన్న దానికి అచ్చుతిప్పలు వచ్చెనేమో యన్నచో 'వన్యాసీమన్ బదుమూఁడు వత్సరము లుండన్ బంపఁగా నొక్కఁడున్' (29 పు) అనియు వ్రాసి 'దా, ననునొకదాన నీవునయినన్ బదునాలుగు వత్సరంబు లేగనువలె వెంబడిం జటివి కానకు, రెండవదానఁ జేసి నా తనుభవుఁ డిప్పుడే సకలధాత్రికి నీవలె రాజు కావలెన్' (48 పు)

'ఈ పదునాలుగేండ్లకే కొంపలు మున్గెనా! తిరిగి కోసల మేఁగెద నింతలోపలన్' – (58 పు)

'తస్వీ పదునాలుగేండ్లనిన నిల్చిరి దంపతులు' (73 పు) ఇత్యాదులలో పదునాలుగేండ్లని దారికి వచ్చిరి కాని, ఒక్క నిమిష మాఁగి ఈ కవనములోని సొగసుగాని పలుకులలోని విలువగాని చూచి పోదము.

'దానను – ఒకదానన్ – నీవునయినన్ – పదునాలుగు వత్సరంబులు'– ఈ పదములలో నీవునయినన్–అన్నదాని కర్థ మున్నదా!

'ఏగనువలెన్ – వెంబడిన్–జటివి – కానకు' – కానకు జటివై వెంటనే వెళ్లవలెనని ఆ ముక్కల కర్థము చెప్పుకొనవలెను. ఈ కవనములో విసిరివేసిన పదములను ఒక వరుసలో పెట్టుకొని వాక్యార్థము చూచుకొనుట మనవంతు. ఈ కావ్యములో ఈ బెడద యుండుటఁ జేసియే సాహిత్యములోసైతము విలాసములు కోరు కుఱ్ఱకాఱు దీనిజోలికే పోవరు. విద్వత్కవులలో, కల్పవృక్షములో పదిపద్యము లైన కమ్మగాఁ జదివి ఆనందించితిమన్నవారు ప్రయత్నించి చూచినను నాకుఁ బదిమందియైన కన్పింపలేదు. ఈ రహస్యము తెలిసియే, వీలు కలిగినవేళలో ఈ కావ్యకర్త ఈ కావ్యమును సభలలోఁ జదువుచు సారస్యము లున్నవని చెప్పవలసివచ్చుచున్నది. వినిపించినపుడు – ఏవేవో కారణాలచే శ్రోతలు తల లూఁపినంత మాత్రాన తన రచనలో దోసములే లేవని ఈ కావ్యకర్త భావించి సమర్థించుకొనఁ జూచును.

'తిరిగి కోసల మేఁగెద నింతలోపలన్'–అన్న మాటలో ఏఁగు ధాతువున కర్థమేమి! కోసలములో నుండి కోసల మేఁగెద నన వచ్చునా ?

తుదకు దారిదప్పిన కైకేయి 'పొట్టిదానికిన్ బుట్టెఁడు బుద్ధు లన్న నుడి పోలును నీ మతివైభవంబు [24 పు] – అని మంధరను మెచ్చుకొనును. ఇక్కడ వాల్మీకములో 'పృథివ్యా మసి కుబ్జానా ముత్తమా బుద్ధినిశ్చయే' [483 పు] అని యున్నది. పృథివిలో నున్న కుబ్జలందఱిలో బుద్ధినిశ్చయవిషయమై నీవు ఉత్తమురాల వన్నమాట ఇప్పుడే గుర్తించితి ననియు లోకములో ప్రాయికముగా కుబ్జలకు బుద్ధి తైక్ష్ణ్యము ఉండుననియు వ్యాఖ్యాతలు సూచించిరి. కుబ్జ యనఁగా మఱుగుజ్జు. మఱుగుజ్జులకు గూనిగాని పొట్టితనముగాని ఉండవలెనని నియమము లేదు. ఈ 'కల్పమే' ఒకచోట 'ఆకృతి నొంటెకుఁ జెల్లెలు కైకేయికి ముసలిదాది కల దొక్కతె'యని మంధరకు ఒంటెవైఖరి చిత్రించి యిచ్చినది. ఒంటె వికారమందే గాక పొడుగులోఁగూడ రోఁతగా నుండునుగదా! ఆబిడ మతి వైభవమును మెచ్చుకొను ఘట్టములో 'పొట్టిదానికి' అనుటలో అందము లేదు. మెచ్చుకొన్న కైక, 'ఒక పదక మ్మొత్తితివా యొక

కొలికికిఁ దేనుగలవ...కుబ్జక చేసినదానికే [24 పు] అని ఇంకొక్క మాట యనును. 'తేనుగలవ'లోని యర్థము లాగఁగలముగాని అందమూ 'తేను'గలమా! కుబ్జక చేసినదఁట. ఎంత ప్రాసకర్కృర్తి యున్నను ముసలిముండకు 'క' ప్రత్యయము వేయు ఘనత కవిసమ్రాట్టునకే చెల్లినది !! మంథర దుర్బోధ తల కెక్కిన కైకేయి 'మందు దిన్న పులి'వోలె లోలోన గుడుసుల్లు పొందినదఁట. కోపగృహమున కాలు పెట్టు సమయములో చెప్పుమడమలు కొట్టుకొని ముదుసలి దశరథుఁడు పడఁబోయెనఁట. ఇదియు నొక కావ్యార్థసూచన.

'చీఁకటి కలవాటు పడిన రాజు శోకాకృతియైన ముద్దు టిల్లాలిం గాంచి' (28 పు)— దశరథమహారాజు చీఁకటి కలవాటు పడెనని వ్రాయుటలో అంతరార్థ మేమున్నదో విచారింపవలెను.

చం. "కరి పినతల్లి నాయెడల శత్రువటన్న వెఱందు నమ్మరా
తెరచని యామెలోఁ బలికితిన్ నను నాయమ చూచినట్లు భా
సురలగుఁదల్లులం దెవరు చూతురు? నేననఁ జచ్చిపోవునే
సరిసరి యామె, యీ విలయసంగతి కాయమరెట్లు హేతువౌ!" [62 పు]

అని రాముఁడు పినతల్లిని శ్లాఘించెను.

ఇక్కడ రామాయణములో పిడుకలవేఁట యన్నట్లు మఱొక్క మాట. భాసురలగు+తల్లులు. మొదటిపదము విశేషణము. రెండవది విశేష్యము. భాసురలైన తల్లులని భావముగదా! ఇట్టి విశేషణములు నన్నయనాఁడు ఎట్లున్నను ద్రుతములు కాకుండుటయే సంప్రదాయము. ఆ పక్షమున 'భాసురలగు తల్లు'లనుటయే న్యాయము. పద్యములో 'అయమ – అయమ'అని రెండుసారులు వినిపించుటవలన, 'ఓయమ! ఓయమ!' అని వాకిట నిలిచి బిట్టుగా అఱచెడి బిచ్చగత్తెలు జ్ఞప్తికి వత్తురు.

మంథర, కైకేయికి జ్ఞాతిదాసియని వాల్మీకము చెప్పినది. జ్ఞాతిదాసియనఁగా బంధుదాసి. ఎక్కడ పుట్టెనో ఎవరి బిడ్డయో ఎవరికిని దెలియదని భావము. దేవతలే తమ కొఱకై కైకేయిబుద్ధి మార్చుటకయి ఈబిడను బంపినట్లును – ఆ దేవరహస్యము బట్టబయలు కాకుండ చేసినట్లును వ్యాఖ్యాతలు వివరించిరి. ఈ స్థితిలో

దేవకార్యార్థమై సృష్టింపఁబడ్డ మంథర, ఎంత కుబ్జయైనను — ఎట్టి వికారాకారము కలదైనను రామావతార ప్రసక్తికి ఒక విధముగా మూలమైనది కావునను, రావణసంహారమునకు దారి చూపినది కావునను, తన్మూలమున దేవతాబృందము కష్టములు తీఱినవి కావునను, భూదేవతల యాగములలో అంతరాయములు అంతరించినవి కావునను ఆబిడను రాముఁడే తిట్టనపుడు మనము తిట్టవలసిన పనియే లేదు. ఇంతగాథ పుట్టియుండఁగా దశరథునకు శాపాదికములు తారసిల్లియుండఁగా కైకహృదయము రాజకీయముగా సపత్నీభావముగా మాఱినంతమాత్రాన ఆబిడ దుర్మార్గురాలుగా నున్నదని మనము భావించి బాధపడవలసిన పనిలేదు. ఇది యంతయు దైవలీల యని గుర్తించినచో-రామావతారతత్త్వము అర్థమైనచో ఆ యిరువురు వ్యక్తుల యెడ ద్వేషము చూపవలసిన యక్కఱయే లేదు. కావుననే వాల్మీకి మహాకవి తానుగా కైకేయిని (కవివాక్యముగా) నిందించినట్లు నాకుఁ గన్పింపలేదు. దశరథుని నోటమాత్రము 'దుష్టచారిత్రే! నృశంసే! పాపసంకల్పే! క్షుద్రే! దుష్కృతకారిణీ' అని మాత్రమే అనిపించెను. దశరథుఁడు అట్లనుటలో అప్పటి యాతని పరిస్థితినిబట్టి తప్పుకాదు. కానక కన్న సంతానమాయె. అందును జ్యేష్ఠుఁడు గుణజ్యేష్ఠుఁడాయె. వెనుక విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులను బంపవలసిన ఘట్టములోనే అంత బాధ పడిన వ్యక్తి, ఇది ఘోరాతిఘోరమని భావించుటలో అబ్బురము లేదు. కాని, ఇతరులు కైకను దూషింపవలసిన పని లేదు. రాముఁడే యామెను సమర్థించియుండఁగా ఇతరుల కామె దూష్య కానేరదు గదా!

పయిగా, కోపగృహములో ఆమె దశరథునితో —

శ్లో. 'పాపం కృత్వేవ కిమిదం మమ సంశ్రుత్య సంశ్రవం
శేషే క్షితితలే సన్నః స్థిత్యాం స్థాతుం త్వమర్హసి
ఆహుస్సత్యం హి పరమం ధర్మం ధర్మవిదో జనాః
సత్య మాశ్రిత్య హి మయా త్వం చ ధర్మం ప్రచోదితః
సత్య మేకపదం బ్రహ్మం సత్యే ధర్మః ప్రతిష్ఠితః
సత్యమే వాక్షయా వేదా స్సత్యేనైవాప్యతే పరం

సత్యం సమనువ ర్తస్వ యది ధర్మే ధృతా మతిః
సఫలః స వరో మేస్తు వరదోఽప్యాసి సత్తమ' – ఇత్యాది
సత్యస్వరూపమును వినిపించెను.

కైకేయి తాను గోరినదానిలో ఎంత స్వార్థ మున్నను సత్య ధర్మములనుగూర్చి ఆమె చెప్పినది కాదనలేముగదా! వెనుక మాట యిచ్చి శైబ్యుఁడు డేగకుఁ దన దేహమే ఇచ్చెనఁట. ఒకానొక బ్రాహ్మణుఁడు వచ్చి యాచింపఁగా అలర్కుఁడనువాఁడు తన కన్నులే తోడి వాని కిచ్చెనఁట. సముద్రుఁడు హద్దులో కట్టువడి యుండెనఁట. ఇట్టి యంశము లేవియు కైకేయినోట 'కల్పవృక్ష ము' చెప్పింపలేదు. వాల్మీకి చెప్పినది యావలకు నెట్టివైచి మన భావములే పాత్రల కంటించి 'హరికథకులు'వోలె 'పౌరాణికుల' భంగి రాగద్వేషములు చూపుట న్యాయము గాదు. వాల్మీకము లోని కోపగృహమందలి ఘట్టమును బరిశీలింపఁగా – ఆలుమగ లిర్వురి వాదోపవాదములును సహేతుకములే కావచ్చునన్నంత కమనీయత స్ఫురించును. ఆ వాదములోని యౌచిత్యముగాని సారస్యముగాని రవ్వంతైన – కల్పవృక్షము గ్రహింపలేక దశరథుని నోట కేవల 'శాపనార్థములు' పోసి కైకేయిని దిట్టించెను. ఆ పద్య ములెత్తి వ్రాసి మఱింత శ్రమను గలిగింపనుగాని బాలకాండము లోని ఒక్క ఘట్టమును మాత్రము వినిపింపక తప్పదు.

ఆ. 'రాని రాము నడుగ రాముఁ డంచును బల్కెఁ
గైక సీత పర్యాగములం బెట్టు
'అడవికోడి' కూసినట్లుగా నవ్వుమ
నైక, సీత తిరిగి రాక కలుగు.'

'మెలఁతను సీతఁ గైక తనమేడలకుం గొనిపోయి మెచ్చుమీ
రలుగ నలంకరించి యల రామునకుం బని యున్నయట్లు వా
ర్త లనిచి రామచంద్రుఁడును రా నొక పన్నకమాడి యిద్దఱన్
గలియఁగఁద్రోచి నవ్వులునుగా గదితల్పులం మూసి తీసెనున్'

(బాల. 845)

సీతారాముల ప్రేమకలాపములలో 'కల్పవృక్షము' కైకేయికి ఈ పదవి కట్టఁబెట్టినది. కైకేయి నవ్వినవవ్వు అడవికోడి కూసిన

ట్లున్నదఁట. ఇది సహింపరాని క్షమింపరాని నీచోపమ. ఈబిడ మొదటనుండియు ఇట్టిదేసుమా! యని పాఠకులకు బోధింపవలెనని కల్పవృక్షము ప్రయత్నించినది. లేనిచో 'పరాయి' బిడ్డలను గది లోనికి నెట్టి విలాసములు చూపుచు సరసాలాడుచు తలుపులు మూయుచుఁ దీయుచు పన్నక మాడవలసిన కర్మము కైకేయి కేల పట్టును?

ఇంకను ఈ తల్లికొడుకుల సంభాషణలోను అడవిలో శ్రీరాముని వద్ద జరిగిన సమావేశములోను 'కల్పవృక్ష'కర్త కైకకుఁ గావించిన అన్యాయ్యము చెప్పఁదరముగాదు.

# అహల్యాపాత్ర

'అహల్యా ద్రౌపదీ సీతా తారా మందోదరీ' – ఇత్యాది శ్లోక మొకటి ఈ దేశములో చిన్నపిల్లలకు సైతము నోటిపాటగాఁ జెప్పెదరు. వీరందఱు పతివ్రతాశిరోమణులని నచ్చఁజెప్పవలెనన్న వీరి కథలలో చిలవలు పలవలుగా చెలరేఁగియున్న తబ్బిబ్బులవలనఁ గొంత ఇబ్బంది లేకపోలేదు. వీరిలో అహల్య గొప్ప పతివ్రతయని చెప్పవలెనన్న వాల్మీకమే కాదు; వైశ్వానాథముకూడ అడ్డుపడు చున్నది. అహల్యాకథకు 'ప్రాతిపదికలు' ఈ దేశములో ఎన్నో పుట్టినవి. ఒకదాని కొకటి 'సంతన–పొంతన' కుదురని ఘట్టములే పెక్కు లున్నవి. ఆ కథలకు వాచ్యముగా ఒక యర్థము స్ఫురింపఁగా – ఆ మాట నోట విప్పిచెప్పిలేని 'అఘాయిత్యము'గా భావించి 'అబ్రహ్మణ్య' ముద్ఘోషించి – దాని కొక వ్యంగ్యమును లాగి భాష్యమును జెప్పి వేదాంతములోని కీడ్చినవారును గలరు.

అహల్య, బ్రహ్మమానసపుత్త్రియఁట. సప్తమహర్షులలో ఒకరయిన గౌతమున కామె ధర్మపత్నియఁట. ఆ దంపతులు పురాణదంపతులే గాక పుణ్యదంపతులనియు పురాణకథలలో ఒక ప్రక్క వినుచుందుము.

అహల్యాగౌతముల వివాహమునాఁడే అహల్య యందచందాలను బసిగట్టి దేవేంద్రుఁడంతవాఁడు గౌతమునివద్ద విద్యాభ్యాసము వంకతోఁ జేరి సమయము చూచి పొంచి గౌతమరూపముతో ఆమెను రమింపఁజేసెనని 'పద్మపురాణము'లో నున్నది. అతఁ డింద్రుఁడని తనకుఁ దెలియదని ఆబిడ మొత్తుకొన్నను 'ససేమిరా'యని గౌతముఁడు మండిపడి

'పరేణాభిగతాసి త్వం అమేధ్యా పాపచారిణీ' అని నిందించి శపించెనఁట.

దేవేంద్రుఁడని తెలిసియే అహల్య ఆ పనికి సిద్ధమైనట్లు బ్రహ్మపురాణము వర్ణించినది.

'మునిరూపమహేంద్రేణ భుక్తాం రహసి' అని 'ఆనందరామాయణ' మన్నది.

'అహల్యాయై జార' - అని 'బృహదారణ్యకము'లో ఒక పిలుపు ఉన్నది. ఆ పిలుపు దేవేంద్రుల వారి కెంతో ప్రీతికరమఁట.

ఇఁక - తెలుఁగులో 'అహల్యాసంక్రందన'మని 'తారాశశాంకము'వోలె కావ్యములే వెలసినవి. అహల్య గుణశీలములనుగూర్చి పురాణకథలలో ఇంకను ఎన్నెన్నో వింతలు వినోదములు కానవచ్చును.

పురాణకథలలో 'దీర్ఘతముఁ'డని ఒక మహర్షి కలఁడు. ఆతఁడు జనుపాంధుఁడు. ఆతఁడు అమ్మకడుపులో నుండఁగా ఆ యింటికి అతిథిగా వచ్చిన బృహస్పతి ఆ యమ్మను గలిసెనఁట. గర్భములో పిండరూపములో నే నుండఁగా అయ్యా! ఈ సంభోగము అక్రమమని గర్భస్థశిశువు హెచ్చరించెనఁట. అవురా! సర్వశాస్త్రవేత్తను నేనే కోరి, పనిపూని దీనికి సిద్ధము కాఁగా గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లు నీవా మా కుపదేశము చేయఁగలవాఁడ వని రోసమున నీసడించి జనుపాంధుఁడవు కమ్మని వెంటనే బృహస్పతుల వారు శపించి తనపని తాను జేసికొని పోయెనఁట. ఆ గర్భస్థ పిండమే ఈ దీర్ఘతమ మహర్షి. ఈతని భార్య 'ఒల్లమాలిన'చండిక. బండెఁడు సంసారము. బిడ్డలను పురికొల్పి ఆ 'దొడ్డయిల్లాలు' ఈ గ్రుడ్డివానిని ఏటిలో పాఱవేయించును. ఈతఁడును సామాన్యుఁడామఱి! ఏటిలో పెట్టెలోఁ గొట్టికొని పోయిపోయి ఒకానొక రేవు పట్టి అక్కడ జలక్రీడలు సలుపుచున్న 'మండుఁడైన' ఒక మహారాజుగారి ప్రార్థన వలన వారి యింటికి దయచేసి ఇంత సంతానము వారికి ప్రసాదించి వారి యిల్లు నిలఁబెట్టును. ఇట్టి మహానుభావుని సొంతబిడ్డలలో మన 'గౌతమమహర్షి' ఒక కొడుకు. ఆతని కీ యహల్య ధర్మపత్ని. ఆపై ఇంద్రుఁడు సూర్యుఁడు ఈమెను ప్రేమించి రమింపఁజేసిన 'ఉపపతులు.'

అహల్యకు గౌతమునివలన 'అంజన'యను కూఁతురు పుట్టెను. ఆబిడ అందాలరాశియే గాక గుణగణములలో మిక్కిలి దొడ్డది. ఆ యింటిలో - తండ్రి లేని తరుణము చూచి ఆ యమ్మ అహల్య, ఇంద్రాదులతో సంచరించువైఖరి ఆ బిడ్డ గుర్తించి, అసహ్యపడి ఆ వార్త తండ్రిచెవిని వేసెను. ఇది 'చాడీలు'గా భావించిన ఆ

యమ్మ మండిపడి కంచెయే చేను మేసినట్లు, 'కోఁతిముండవు – అయ్యెదవుగాక! నీ కొక కోఁతి మగఁడే దొరకునుగాక' యని తిట్టి పోసెనఁట. అదే శాపముగా సిద్ధమై – ఆ కూఁతురు పాపము – 'కేసరి' యన్నవానిని గట్టుకొన్నది; ఆపై వాయుదేవుఁడు మఱొక భర్త అయ్యెనఁట. ఆతనికి అంజనకుఁ గలిగినవాఁడే మన 'ఆంజనేయులు.'

ఇఁక – అహల్యకు దేవేంద్రులవారి వలన ఇద్దఱు బిడ్డలు పుట్టిరి. ఒకఁడు వాలి; వేఱొకఁడు శతానందుఁడు. శతమఖుని యానందమువలన సంభవించినవాఁడు కావుననే ఈతఁడు శతానందుఁడాయె. ఈతఁడే జనకమహారాజు కొలువులో పౌరోహిత్యములోఁ గుదిరి బ్రదుకుచుండెను.

మూఁడవభర్త సూర్యుఁడు. ఈతనివలన అహల్యకు సుగ్రీవుఁడు పుట్టెను. ఈ రోఁతఘట్టములు జరుగుటచే అసలు భర్త గౌతముఁడే ఏవగించుకొని శపింపఁగా 'వాలిసుగ్రీవులు' కోఁతులైరి. సూర్యుఁడు రాహుగ్రస్తుఁడాయెను. ఇంద్రుఁడు 'సహస్రాక్షుఁ' డయ్యెను. హనుమంతునకు గౌతముఁడు మాతామహుఁడు. సుగ్రీవుఁడు వరుసకు మేనమామ. ఆతఁడే తుదకు సీతారాముల భక్తుఁడాయెను. సుగ్రీవుఁడు (శ్రీ)రామునకు మిత్రుఁడయ్యెను. వాలి, (శ్రీ)రామునకు శత్రువయ్యెను. శతానందుఁడు (శ్రీ)రాముని మామగారి పురోహితుఁడాయెను. రాముని పాదస్పర్శముచే అహల్యకు శాపవిమోచన మాయెను. ఇది – ఈ కుటుంబమువారిలో పెనవేసికొన్న పూర్వగాథ.

ఇది పవిత్రమో అపవిత్రమో, అహల్య 'దుష్టచారిణి'యో, 'పాపచారిణి'యో మనముగా నేఁడు నిర్ణయింపవలసిన పని లేదు. ఈ ఘట్టములో వాల్మీకమును గొంత పరిశీలింతము.

శ్లో. 'తస్యాంతరం విదిత్వా తు సహస్రాక్ష శ్శచీపతిః
మునివేషధరోఽహల్యా మిదం వచన మబ్రవీత్.'
(బా. 841)

శ్లో. ఋతుకాలం ప్రతీక్షంతే నార్థిన స్సుసమాహితే
సంగమం త్వ హ మిచ్ఛామి త్వయా సహ సుమధ్యమే!

శ్లో. మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన!
మతిం చకార దుర్మేధా దేవరాజ కుతూహలాత్.' ఇత్యాది.

అహల్యాసంక్రందనుల అన్యోన్యచేష్టలు గుర్తించిన గౌతముఁడు—ఆ యిరువురకు శాపము లిచ్చెను. ఆమె వాయుభక్షయు నిరాహారయు భస్మశాయియు, అదృశ్యయునై ఆ యాశ్రమములోనే పడియుండునట్లును, ఆతఁడు వృషణములు ఊడినవాఁడై వ్యర్థుఁడై పోవునట్లును వాల్మీకము చెప్పినది. ఇక్కడ నింకొక్క చిత్రమున్నది:— గౌతముఁడు గాఢముగా తపస్సు చేయుట ఇంద్రపదవికి దెబ్బయఁట. ఇంద్రున కాపద వచ్చినదనఁగా దేవతల కనిష్టములు సంభవించినట్లే. కావున దేవేంద్రుఁడు—ఆ దేవతలను బిలిచి, 'మీ కోసమై నే నింతశ్రమపడి గౌతమునికిఁ గోపము తెప్పింపవలసియుండి ఆతని భార్యతోఁ గలిసితిని. ఆతఁడేమో నన్నిట్లు శపించినవాఁడాయె. నాకుఁ గలిగిన ఈ యాపదను రూపుమాపుటలో మీ రందఱు ప్రయత్నింపవలెనుసుమా!' అని కోరెనఁట. అప్పుడు వారు అయ్యో! అది నిజమే యని బాధపడి మేషాండమును దెచ్చి ఇంద్రులవారి రొంటి కతికించిరఁట. నాఁడుమొదలు యాగములలో వృషణవిహీన మేషములనే అగ్నికి 'స్వాహా' యనవలె నని ఆచార మొకటి పుట్టినదఁట.

ఆ యహల్యాగౌతములు—అంతంతవారు కాఁగా, ఈ మహేంద్రులవారు ఇంతవారైరి. ఇట్టివారే మనకు శ్రీమద్రామాయణములో పూజ్యులైన ఆదర్శమూర్తులు.

అట్టి యాదర్శమూర్తులను పవిత్రదంపతులను 'శ్రీమద్రామాయణకల్పవృక్షమహాకావ్యము' ఎట్లు చిత్రించి మన కుపదేశ మిచ్చియుండెనో ఇచ్చటఁ గొంత చూడవలసియున్నది:—

ఉ॥ 'అందపుఁగోన యామెయు నహల్యయు గౌతమమౌనియున్ శతా
నందుసుతున్ విదేహవరనాథుల యిండ్ల పురోధసున్ మహా
నందుఁ దపోనిధాను మునినాథుని గాంచిరి వేల్పులాశ్రమా
ళిందములం జరింతు రమలీకృతమానికృపాకలంబులై.' (బాల. 226)

పరమపతివ్రతాతిలకమైన అహల్య కథను విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు ఎఱింగించు ఘట్టమున కిది ఉపోద్ఘాతము. ఆమెయు

నహల్యయు ననఁగా నిద్దఱు కారుసుమా! ఒక్కరే. అందాల రాశియైన ఆ యహల్య యని ఆ మూఁడు ముక్కలకు మనము ఊహింపవలసిన ముఖ్యతాత్పర్యము. అట్టి యహల్యయు గౌతమ మునియు సుతున్ గాంచిరఁట. కాంచు = చూచు; పొందు; బిడ్డను గను. ఆ బిడ్డపేరు శతానందుఁడట. వేల్పులు – ఆశ్రమాళిందము లలో మానికృపావలంబులై చరింతురఁట. మానికృపమాట యేమో గాని, మహేంద్రులవారు అళింద ప్రాంతమున పొంచిపొంచి సంచ రించుట ముందుముందు మనము విందుము.

శతానందుఁడు అహల్యాపుత్త్రుఁ డన్న మాట నిజమేగాని గౌతమపుత్త్రుఁ డెట్లగును? దేవేంద్రుఁ డీ గౌతముని భార్యకు ప్రసా దించిన ముద్దులబిడ్డఁ డీతఁడు. అనఁగా శతానందుఁడు గౌతముని ధర్మపత్నికి కొడుకు గావున గౌతమపుత్త్రుఁడనియే మన పౌరాణికుల ధోరణిలో పురాణసాంకేతికముల దృష్టిలో మనము నమ్మవలసి యున్నది. లేనిచో పాండురాజునకు ధర్మరాజాదులకు సంబంధించినకథ ఏమైపోవును? ఈ రెండింటను గొంత భేదము లేకపోలేదు. అక్కడ పెనిమిటి యనుమతితోనే గొంతి ఆ బిడ్డలను గన్నది. ఇక్కడ అహ ల్యకుఁ గలిగినది దొంగసంతానము. ఈ సంతానమే పురాణమున కెక్కి రామాయణములో మనకు పారాయణమునకుఁ బనికివచ్చినది. ఇక్కడ—ఈ కవిసమ్రాట్టు నోట 'కాంచి'రని మాట వచ్చుటలోఁ గూడ అంతరార్థమున్నది. గౌతమముని ఈ సుతుని గాంచనేగాని కనలేదు; అనఁగా అతని బీజము ఈతఁడు కాఁడు. ఎక్కడనో ఎవరికో తన క్షేత్రమందే పుట్టఁగా ఈ బిడ్డను గౌతముఁడు కాంచి— అనఁగా చూచి, ఇంటికిఁ దెచ్చుకొన్నాఁడని సారస్యము. మానికృప కోసమని పైమాటకు అన్నను వేల్పులు – ఆ ప్రాంతమునఁ జరింతు రనుటకు ముఖ్యకారణము–ఆమె అందపుఁగోన కాఁబట్టియేసుమా! యన్న రహస్యమును ఈ 'కవిసమ్రాట్టు' నిక్షేపించెననవచ్చును.

> 'ఒక సిద్ధిం బడి వేలు వర్షములుగా నున్నన్ దపోమూర్తియై
> యకటా! గౌతముఁ డట్టివేళ నహల్యాబుద్ధియై యింద్రుఁ డా
> యకతోఁ గలిసి దీర్ఘకాలముగ మోహాగ్రస్తుఁడై కోరుచున్
> సకియం జూడఁగఁ బల్కరించఁ దతితోఁ జన్ రాక యున్నాఁడృథన్'
>
> (బాల. 226)

ఈ పద్యములో అన్వయపుసొగసు కొంత పరిశీలింపవలెను. ఏని - ప్రభృతిశబ్దము లేవో కొన్ని తక్కఁ దక్కినపదము లన్నియు తెలుఁగులో నియమసాపేక్షములు కావలెనన్న నియమము లేదు. అనఁగా - అక్కడ నొక ముక్క, ఇక్కడ నొక ముక్క క్రమనిరపేక్షముగా ప్రయోగింపవచ్చునని శబ్దశాస్త్రము శాస్త్రముగా నంగీకరించినది. కాని, నేర్పరులైన కవీశ్వరులు, వచనమును నడపించినట్లే పద్యమును సైతము అన్వయక్రమముగా నడపించుట తెలుఁగులోనే కాదు; కాళిదాసాది మహాకవుల కవిత్వములోఁగూడఁ గలదు. నేర్పు చాలనివారే ఈ మూల నొక పదము, ఆ ప్రాంతమం దొకమాట విసిరివేసి, మొత్తముగా పఱిగ ఏఱుకొని పదార్థమును గ్రహింపవలసిన భారమును పాఠకుల నెత్తిని ఉంచెదరు. ఇది యొక నేర్పుగా - ప్రగల్భతగా - ప్రౌఢిగా చిత్రించుట న్యాయము కాదు.

ఈ పద్యములో ఖండాన్వయ మిది —

'గౌతముఁడు - ఒక సిద్ధిం బడి - వేలు వర్షములుగా - తపోమూర్తియై - ఉన్నన్ - అట్టివేళను - అకటా - ఇంద్రుఁడు - అహల్యాబుద్ధియై - ఆయకతో - మోహగ్రస్తుఁడై - దీర్ఘకాలముగ - కేళిని - కోరుచున్ - సకియన్ - చూడఁగన్ - పల్కరించన్ - తతి తోఁచన్ - రాక - ఎన్నాళ్ళకున్' - ఇది పదముల వరుస. ఈ వరుస ఈ కవనములో చిద్విలాసముగ నడచినది. పద్యములోని పదముల వరుసనుబట్టి 'అకటా! గౌతముఁ డట్టివేళను నహల్యాబుద్ధియై' - అనఁగానే ఆపాతతః, అయ్యో కర్మమా! అట్టివేళలో అనఁగా తపోమూర్తిగా ఉండఁదగిన వేళలో గౌతముఁడు అహల్యాబుద్ధి అయినాఁడే యని మనము బాధపడవలసివచ్చునేమో గాని వట్టివేళలోనే గౌతమున కా బుద్ధి లేదనియు, 'బుద్ధియై'యున్న వెంటనే ఆమెను గనిపెట్టుకొని యున్న ఇంద్రుఁడు ఉన్నాఁడనియు, కావున అహల్యాబుద్ధియైనవాఁడు ఇంద్రుఁడేగాని పాపమా! మహానుభావుఁడు గౌతముఁడు కాదనియు పరిష్కారము చేసికొనవచ్చును. అసలు - ఇట్టి తికమక అన్వయములు ఈ కవిసమ్రాట్టునకు వెన్నతోఁబెట్టిన విద్యయేగదా!

అమలీకృతమాని కృపావలంబులై వేల్పులా ప్రాంతమున చరింతురని చెప్పిన వెంటనే - ఇంద్రుఁడు అహల్యాబుద్ధియై ఆశతో కేళిని దీర్ఘముగా సలుపవలెనని పొంచి కనుగలిగి యున్నాఁడనుటలో గౌతముని మహామహిమ మెచ్చుకొనవలెనా? అహల్యాసౌందర్యమును అభినందింపవలెనా! మహేంద్రుని నీతిని శ్లాఘింపవలెనా! 'కల్పవృక్ష' కవిత్వమును భూషింపవలెనా!

> 'మునితపము సందుఁ గని పెట్టి మునియవోలె
> వేషమును గట్టి యాశ్రమవీధి కేగి
> యోసి యోసీ యహల్య! యిట్లొక్క సారి
> రావె! యనఁగ నహల్య; పురందరుండు' (బా॰ అ॰ 226)

తపము సందుఁ గని పెట్టి ఇంద్రుఁడు మునివేషము వేసెనఁట. వేసి, ఓసి! యోసి! యహల్య! ఇట్లొక్కసారి రావె! అని పిలిచెనఁట. ఇది 'బజారులేమను' పిలువఁదగిన పిలుపు. దేవేంద్రుఁడంతవాఁడు - అందమున కాసించి ఈ సుందరాంగి పొందు గోరి తమకపడి వచ్చి - ఈ తీరుగ సంబోధించె నందుమా! అందు ఔచిత్యము లేదు. వచ్చినది ఉచితమైన మహాకార్యమునకుఁ గాకపోయినను సభ్యత చూపవలెఁగదా! మునివేషధారి కావున గౌతముఁడే పిలిచిన 'పోజు'లో ఈతఁడు పిలిచెనందుమా! ఆ మహాత్ముల వారి దాంపత్యసౌభాగ్యము స్పష్టమగును. కావయ్యా! వారిరువురు కాదు; కల్పవృక్షకవికే ఇట్టి 'పిలుపులు' ఇంపితముగా నుండునని యందురా! అవునవును! ఈ వాదమునకే ఈ గ్రంథములో కావలసినంత సాక్ష్యమున్నది. ఏది యెట్లున్నను ఓసి యోసి! యన్నది మైత్రిలోఁ గన్న నీచామంత్రణమందే ముల్లు సూపుచున్నది. ఆపై- 'ఇట్లొక్కసారి రావె!' - ఈ కూఁతయు దాని కూఁతయే. ఇట్టి 'బజారులేమల'తో 'బజారుకూఁతల'తో పోషించుకొన్న పాత్రలతో నిండియున్న ఈ కల్పవృక్షమును మనము పారాయణము చేసికొని ఏ మహాపుణ్యమును గూడఁబెట్టుకొనవలెనో!

దేవేంద్రుని పోకిళ్లు గుర్తించి తనకుఁగూడ నిండారఁ దమకమున్నను 'ఇదిగో ఋతుకాలము కాదు కా'దని అహల్య యన్నదఁట. ఈ మూఁడు ముక్కలలో ఇంకొక తికమక. ఋతుకాలము కాదు

గాదయ్యా! సరియైన తరుణమేలా! అని ఒక యర్థమ్ము రావచ్చును. కాని కవి కభిప్రేత మది గాదు. ఇప్పుడు ఋతుకాలమయ్యా; వీలు కాదు; మఱొకసారి చూతము – అని వెంటనే జరిగిన ఆ జంట సంభాషణము వినవలెను.

ఇంద్రుఁడు :— కాముకులకు ఋతు వగుటయుఁ
గామి యగుట కలదె యోసి కామిని!...

అహల్య :— పో! ముని చూచిన నీకును
స్వామీ! నాకును మఱింత ప్రాణాంతకమా
(బాల. 226)

అహల్యకు పతియైన గౌతముఁడు పట్టి మునిగా లెక్క; ఉపపతి – స్వామిగా పరిగణన. ఇప్పుడీ ప్రయత్నము ప్రాణాంతకము కావున పొమ్మని అహల్య యనఁగా – 'ఇంద్రుం డెఱింగిన దెఱిఁగనే యెఱిఁగెనని విడివడినాఁ'డఁట.

ఈ హేతువులు – ఈ సమాధానములు – ఈ తెగఁబడుటలు పరిశీలింపఁగా, విశ్వనాథవారు సృష్టించిన 'అహల్యాపురందరులు' ఒక 'వ్యభిచారకూటము'లో ఆరితేఱిన పట్టభద్రులువోలె భాసింతురు.

మ. 'ఇది నీకై యది యెన్నియేండ్లు దిగులయ్యెన్ నా కహల్యా! యనన్
మది హేలార్థముగాఁ గుసుళ్ళయిన యా మంజూషికారత్నమా
సదనా యయ్యది? కోడి కూసెనె! యనన్ నాకేశుఁ డానందమున్
గదురన్ నవ్వుచుఁ బోయె నంతటన చీఁక ట్లెగుదెంచెన్ వడిన్' (బాల 227)

నీ కోసమై ఎన్నేండ్లనుండియో వాచి వేచియున్నాను. అంత లావు దిగులుతోఁ బొగులుచున్నానన్న భావములో 'ఇది – అదు'ల కవిత్వపుసొంపు ఈ ఘట్టములో గుబాళించుచున్నది. పరమపవిత్రమైన శ్రీమద్రామాయణముగానీ సత్పురుషుల కుటుంబ వ్యవహారముగానీ – ఇట్టి శృంగారఘట్టములు వచ్చినచో ఈ కవిసమ్రాట్టునకు ఒక 'సరదా' పుట్టుకొని వచ్చును. ఆ, రసములో తానే లీనమైనట్టు 'మింట్ స్త్రీలు' పోకిళ్లు పోవుచు రకరకాల 'పోజులు' చూపుటయే ఈ 'కల్పకర్త' వాలకముగాఁ దేలుచున్నది. 'విశ్వనాథ పంచశతి'* అని వీరి చేతిలో నడచిన ఒకానొక గ్రంథములోని

*దీని విమర్శనకై నేను వ్రాసి ప్రకటించిన (1968) పంచశతీ పరీక్ష–అనెడి గ్రంథము.

సింగారమువంటి సింగారము — ఈ కల్పవృక్షములో సైతము బాహాటముగాఁ గానవచ్చుచున్నదనుటకు బండెఁడు సాక్ష్య మున్నది. తన వ్రాఁతలో మాత్రము ఈ కవీశ్వరుఁడు 'బ్రాహ్మీమయమూర్తి-పరమభక్తాగ్రగణ్యుఁడు - మనస్సన్న్యాసి'యన్న బిరుదములు వ్రాసికొనును.

కం. 'తనర సురాపానార్థము చనుచున్ బీతాంబరంబు సవరించినటుల్
నను గూర్చి యేలఁ గట్టితివిని వేసము దుష్టధీనివిష్టాఘా' (బాల. 227)

సురాపానముకోసమై పోవుచు పట్టుబట్టలు కట్టినట్టు ఈ పనికోసము నా వేషము ఎందులకు వేసితివిరా! అని గౌతముఁ డింద్రునితో అన్నమాట. ఈ వ్యభిచారఘట్టము సురాపానమువంటిదనియు ఈ మునివేషము పీతాంబరమువంటిదనియు, ఈ పద్యములోని సారము. పాపిష్ఠకలియుగమని కూపస్థమండూకములు ఈసడించు ఈ యుగములోనే 'వ్యభిచారము - సురాపానము' పెద్ద దోషములుగా భావింతుముగాని, వెనుకటి యుగములలో విశిష్య ఇంద్రాదులకు మహాత్ములకు ఈ రెండు పనులు దోషములుగాఁ గన్పించు నని ఈ కల్పవృక్షకర్తకు ఎవరు చెప్పిరి? సుర పుచ్చుకొనువారు 'సురలు' సుర పుచ్చుకొననివారు 'అసురులు' అనికదా నిర్వచనము. ఈ గ్రంథమందే ఒకచోట వీరు చెప్పినమాట యుదాహరింతును :

'అంత వమ్మహోదధినుండి నన్నెవరు గ్రహింతు రెవరు గ్రహింతు రని వారుణీదేవి యావిర్భవించె; నామెను దైత్యులు మాకు వలదనిరి; దేవతలు గ్రహించిరి; అద్దాన దైతేయులు నాఁటినుండి యసురులును దేవతలు సురలు నైరి.' (బాల. 216)

వారుణి యనఁగా సారాయి. అదే దేవతలకు ప్రాణప్రదము. అది రాక్షసులకు ప్రాణగోష్ఠము. త్రాగుఁబోతులు దేవత లైరి. త్రాగనివారు రాక్షసు లైరి. ఆ యుగములలో మాంసము తిననివాఁడు కల్లు త్రావనివాఁడు దేవతలలోనే కాదు భూదేవతలలో సైతము లేరని చెప్పవచ్చును. మాంసాహార మనఁగా ఆ నాఁడు వైదికాహారమన్నమాట. సురాపాన మనఁగా దేవతలు పుచ్చు

కొను మంచి పానీయమన్నమాట. ఈ ధోరణి ఇట్టిదై యుండఁగా- దేవతలలో మొనగాఁడైన దేవేంద్రుఁడంతవానితో, సప్తర్షులలో మొనగాఁడైన గౌతముఁడంతవాఁడు యుగధర్మమునకు విరుద్ధముగా శాస్త్రమునకు అపచారముగా సంప్రదాయమునకు భంగముగా సురాపానము తప్పు - అన్నట్లు సంభాషించుట ఒప్పగునా! ఇరువదవ శతాబ్దిలో వ్రాసిన ఈ కావ్యములో ఈ నాఁటి ధర్మములను ఆ నాఁటిపాత్రలకు అంటఁగట్టి అది యుపమాలంకారమనియో లోకోక్తి యనియో కులుకుట కుదురునా! పైగా ఈ కవి వ్రాసిన వ్రాఁతల పూర్వాపరములను బట్టి చూడఁగా పూర్వయుగధర్మములకన్న వర్తమానయుగధర్మమే వరిష్ఠమన్నట్లు తేలుచున్నది.

'ననుఁగూర్చి యేలఁ గట్టితివిని వేసము'

అందాలు ఒలుకఁబోయు ఈ పలుకుల కూర్పును జిత్తగింపవలెను. నా వేషము ఎందులకు వేసితివనుటకు ఈ పద్యము మనకు ప్రసాదించిరి. ననుఁగూర్చి - యనఁగా 'నన్నుద్దేశించి' యని అందఱము అనుకొను నర్థము. ఇక్కడ - అంతర్దృష్టి యుండవలెను. 'కల్పము'లో 'కూర్చుటలు నన్నులు' - అని ఏవేవో వ్యాకరణములతో గోకర్ణములతోఁ గూర్చుండరాదు. ననుఁగూర్చి = నా యాకారమును దెచ్చుకొని, ఏలన్ = ఎందులకు, వేసము = వేషమును, కట్టితి విని = కట్టితివికూడ. ఈ సముచ్చయముల గొడవ కవిసమ్రాట్టు కవితకు జీవగఱ్ఱగదా! ఏల - ను ద్రుతము చేసితిరేల యని యందుమా! శిష్యప్రశిష్యులచే ప్రౌఢవ్యాకరణాదులు తెఱపించి వెదకించి నా వ్రాఁతయే మీకు 'గీత' యన్నంత 'అహంకార సంభారదోహలత్వము' ప్రపంచమునకుఁ జాటవచ్చును.

దుష్ట - ధీ - నివిష్ట - అఘ + ఊహా, ఇది యొక సమస్తపదము. చచ్చిచెడి యర్థము లాగవచ్చునుగాని ఈ కూర్పులో అందచందము లెట్లు ఊహింపగలము? అఘోహా! అన్న సంబుద్ధి శ్రవణకఠోరమై 'అఘోరించి'నట్లే యున్నది.

శా. 'ఏరా! నీ విటు వచ్చినావు సరి యా యిల్లాలు పౌలోమి నీ
కై రాపిల్లగ వేచియుండెడునుగాదా! యామెనుంగూర్చి యే

ప్రారంభించిన మాటయే కలుషమౌ నాత్మీయులౌ దారులుం
గారా! యొక్కటియైన కోర్కెఁ బది సంకల్పింతు మిథ్యామతీ!"
(శ్లో. 227)

ఏరా! మాట యెట్లున్నను నీవు వచ్చినావని నేనుకటి తెలుఁగు కవిత్వములో ప్రసిద్ధు లెవరును అనలేదు. వచ్చినాఁ వెవ్వ- అననలెను. ఈ పద్యములోని సంభాషణము మన మాటలలోఁ జెప్పుకొని వినవలెను.

మునివేషధారియైన సహస్రాక్షుని గౌతముఁడు చూచి, ఓయీ! దుర్మతీ! నా రూపములో ఈ యకర్తవ్యమును జేసితివి కావున, విఫలుఁడవే కాఁగలవని రోషముతో పలుకఁగా వాని వృషణములు వెంటనే ఊడి, నేలమీఁదఁ బడిపోయెనఁట. ఈ ఘట్టములో వాల్మీక ములో ఉన్న ఇతివృత్త మింతే. ఇఁక మన 'కల్పము' లోని కథ చూతము.

'ఏరా! ఇటు వచ్చినావు? పాపము నీ యిల్లాలు పౌలోమి నీకోసము వేచియుండదటరా! ఆమెనుగూర్చి మేము ప్రారంభించిన మాట కలుషమగును. ఇది యొక వొంకతిరుగుడు పదముల కూర్పు. బహుశః — 'అనార్యః ఖలు పరదారవ్యవహారః' అన్న కాలిదాస సూక్తికి ఇది 'నకలు' కావచ్చును. సరే, ఆ నోటనే 'ఆత్మీయులౌ దారలుంగారా!' అన్న రెండుముక్కలకు సూటిగా అర్థము మనకు రాదు. లెక్కలలో అంకెలువోలె అక్కడక్కడ పదములు విసిరి వేసినంతమాత్రాన వాక్యార్థము వచ్చునా! చచ్చునా! పోయిన పొడుగున 'భాజాభజంత్రీల' మేళతాళములు కూర్చుకొని [illegible]గ్గులను బొగ్గులను ధూళిలను దుమ్ములను లెంకలుగాఁ జేసికొని బ్రదికి నన్నాళ్లు 'ఈ పదమును ఈ పదములోఁ గలిపి మెలిపి [illegible] భావము గ్రహింపవలె'నని ఉపన్యాసము లువ్వెత్తుగ దంచినంతమాత్రాన ఆ కావ్యమునకు స్థిరత్వము వచ్చునా! ఆ కవి ఒక కవిగా [illegible]న్నికకు నిలుచునా!

'ఒక్కటియైన కోర్కెఁ బది సంకల్పింతు'— ఈ వాక్యము పై వాక్యమున కన్న యొా తమ్ముఁడో కావచ్చును.

'పశువులఁ గాంచితివైనఁ గనవా! ఋతుసంగతి యేకకామినీ
వశముఁ గపోతరాజుఁ గనవా! త్రిదశేశ్వరతానియోధి యా
పశువును పక్షికన్నఁ జెడఁబట్టెద వింద్రత శాశ్వతంబు రా!
ప్రశమితవాంఛయైన యొకపాటి వెఱుంగు నెఱుంగ వింతకున్.'

(బాల. 228)

ఇది యొక చిత్రవిచిత్రమైన హేతువాదము. ఋతువిషయమై కామియైన దేవేంద్రునకు గౌతమమహర్షి ఉపదేశించినట్లు ఈ 'కల్పము' మనకు బోధించుచున్నది. శాస్త్రీయమో అశాస్త్రీయమో దైవ మెఱుఁగును; తుచ్ఛభోగము లాసించినవానికి ఋతువులతో గితువులతో నీతులతో గీతులతో పని లేదన్నమాట ఎఱుఁగని వెంగళప్ప ఎవఁ డుండును? ఎదిగిన కోడెదూడ తల్లిమీఁదికే ఎగఁ బ్రాఁకెడి ధర్మము పశువుల కున్నది. ఆ పశువు—ఈ నరపశువులకన్న మేలన్నమాట ఎక్కడిది? ఋతుకాలమని ఒక నిర్ణయము పశు పక్ష్యాదులకే ప్రత్యేకముగా సృష్టిలో ఉన్నది కావున వానిపోకడ అట్లున్నది. ధర్మశాస్త్రములు పఠించి నీతిసూత్రములు వల్లించి ఆ జీవులు ఆ తీరుగ సంచరించుచున్నవని కాదు దాని భావము.

'ఏకకామినీవశముఁ గపోతరాజుఁ గనవా!'—అని ముదుసలి వశాని నోటిమాట. ఆ 'వైధవ' పక్షి 'అస్పృశ్యపక్షి'యై అట్లున్నదని ఈ త్రిలోకసార్వభౌములు దేవేంద్రులవారు సైతము ఉండవలెనని విశ్వనాథులవారి యాజ్ఞయా! ఆచారమా! పెండ్లము పోయిన వెంటనే రెండవ పెండ్లమును గట్టుకొను మనము కపోతరాజువలె 'ఆపసోపాల'తో ఏడ్చుచుఁ గూర్చుండవలెనని విశ్వనాథకవి చూపెడి పరోపదేశపాండిత్యమా! అదియునుగాక, ఈ కపోతరాజు కథ ఈ ఘట్టమున కతుకదు. ఆ పిట్టలలో ఒకటి జంటఁ బాసినప్పుడు రెండవదానితో నేస్తము గట్టదని పెద్దలు చెప్పెదరు. ఇక్కడ దేవేంద్రులవారికి ఆ తిప్పలు రాలేదే. 'రత్నహారీ తు *పార్థివః' అన్నమాట, భూలోకరాజులకే ఉన్నప్పుడు సర్వలోకరాజయిన దేవ రాజునకు ఈ కాంక్ష ఉండవచ్చునేమో! శచీదేవి యుండఁగా కపోత రాజువలె ఉండవలెఁగాని ఈ 'యెంగిలిమంగల' మెందులకని ఋషి భావమో కవిభావమో గాని నిజము చూడఁగా లోకాచారమునకు

ఇది విరుద్ధమనవలెను. వెనుకటికి – అందమైన భార్య ఇంటిలో ఉండఁగా 'పరాయి' ఇల్లాలికోసము నీ కీ తిప్పలు – తెగులు ఎందులకు రా! యని ఒకఁడు ఒకనిని ప్రశ్నించెనఁట. ఊరిచెరువులో నీరు ఒడ్డులొరసి యుండఁగా కాకి వచ్చి కడవలోని నీటికోసమే కనిపెట్టుకొని యుండదా! యని సమాధానము వచ్చెనఁట. అట్లని వ్యభిచారము పోషింపవలెనని కాదు; జీవుల ప్రకృతి ఇట్టిదని చూపించుటయే ఇందలి భావము.

ఈ గౌతములవారి తండ్రియైన దీర్ఘతముని వృత్తాంత మింతకు ముందే వినియుంటిమి. అతిథిని నారాయణునిగా భావించెడి సత్య కాలముకావున శాస్త్రకర్తయైన బృహస్పతియే తన కంటి కింపైన కాంతనే విశిష్య–గర్భవతినే కలియఁగా ఆయన శిష్యశిఖామణి దేవేంద్రుఁడు ఈ యందాలరాశి యహల్యకోసమై ఇన్ని పాట్లు పడుటలో ఆ కాలమునుబట్టి ఆ సంప్రదాయములనుబట్టి ఆ కథలను బట్టి ఆశ్చర్యపడవలసిన పనియే లేదు. ఆయన సామాన్యుఁడా! పవిత్రమైన యాగములలో సైతము 'అహల్యాయై జార' అనిపించు కొనుటలో సంబరమున్నవాఁడాయె. ఆ దేవతయే ఈ యాగాలవారి కధిష్ఠానదేవతగా నున్నప్పుడు – ఆ మహామహునకుఁ గావలసినది ఎవ్వతెయైన రావలసినదే.

బృహస్పతి – దీర్ఘతముఁడు–గౌతముఁడు, వీరి కుటుంబభండార మిది యని తేలినది. వీరి శాస్త్రమర్యాదలు – ఆచారసంపదలు ఇయ్యవి. ఈ రంకులతో బొంకులతో నిండియుండు దేవలోకము నేలు దేవరాజుతో – ఈ సంప్రదాయములో పెరిఁగిన గౌతములవారు పశువులని పక్షులని కథలు చెప్పి బోధించినది నిజమా! అది వట్టిది. అసలు, వాండ్రకు ఇట్టివి దోషములా! అవి దోషము లనుట సనాతన సంప్రదాయమును గాదనుటయే. ఏవో నేఁడు మనము మన సమాజములో అనుకొను భావములు మూటగట్టి హేతువాదములతో ఈ పురాణకథలను వర్ణించినచో అవి కృత్రిమములుగానే కన్పించును. వాల్మీకములో లేని ఈ 'బోధను' విశ్వనాథము క్రొత్తగాఁ దెచ్చి పెట్టినది.

అక్కడ – ఇంద్రునకు మేషాండము నంటింపఁగా ఇక్కడ –

ఇంద్రునకు 'పల్లికలు' సృష్టించిరి. అహల్యాసంభోగమువలన ఇంద్రునకు సహస్రాక్షుఁడని క్రొత్తగా నామకరణ మయ్యెననియు, వేలకొలఁది యోనుల స్వరూపము ఆతని కంటికిమాత్రమే అనుక్షణము కన్పించునట్లు – ఆ శాపము చేసినదనియు ఒక గాథ వినఁబడుచుండఁగా కల్పవృక్ష మింకొక్క క్రొత్త త్రోవ త్రొక్కినది. పల్లెవాని యొంటిమీఁద వల పతిచినట్లు, ఇంద్రుని యొంటిమీఁద పల్లికలు పల్లికలుగా మేహపుపొడలు పొడచూపినట్లు విశ్వనాథవారు క్రొత్త సృష్టి చేసిరి. ఇట్టి సృష్టివైచిత్రి చూపఁగలిగినవాఁడే రామాయణ కథను మఱల వ్రాయవలసి యుండునని ఈ కవిసమ్రాట్టు సభలలో పలుకుచుండును.

ఆవల – అహల్యను బిలిచి గౌతముఁడు, ఆ పోవుచున్న ఇంద్రుని జూపించి పలికిన మాటలలో 'ఉదాత్తత' బొత్తిగాఁ గానరాదు. వాయుభక్షువు – నిరాహారవు – భస్మశాయినివి, అయి పడి యుండుమని అహల్యను శపించి గౌతముఁడు రివ్వున తపస్సునకుఁ బోయినట్లు వాల్మీకి వర్ణించెను. ఈ కల్పములోఁ గొంత 'భూలోక వాసన' తగిలినది.

> ఉ. 'నా తప మట్టులుంచు మది నాదు దరిద్రత చాలు నాకు నా
> యీ తనయష్టిలోన మఱి యేడగులోకము లేలువానిలో
> నే తమకమ్ము కల్గునదియే యది వేయి మడుంగు లెక్కువై
> నీతియు న్యాయమై వెలుఁగు నే సురరాజును కాలిగోటికా' [228]

ఓసీ! నా తపస్సుమాట అట్లుంచుము. నా దారిద్ర్యము నా కున్నదనుకో! ఏడగులోకము లేలువానిలోనే తమకమ్ము కలుగఁగా అది వేయిమడుంగు లెక్కువై నీతియు న్యాయము నిలుచునటే! ఏమి సొగసుపద్యము స్వామీ! ఏడగులోకము లేలువాఁడంట! ఏడు లోకము లేలువాఁడనుటకు వచ్చిన కవిత్వపు–తిప్పలు. ఎవ్వరయ్యా వీరికి 'కవిసమ్రాట్టు' బిరుద మిచ్చినది? అహో! ఆంధ్రభాషామతల్లీ! నీ బిడ్డలలో ఎట్టి 'కవిసమ్రాట్టులు' పుట్టుకొనివచ్చిరమ్మా!

ఈ పద్యమందే తుదిని 'సురరాజును కాలిగోటికా' అని రెండు ముక్క లున్నవి. వాఁడు సురరాజే కానిమ్ము. నేను దరిద్రుఁడనే కానిమ్ము. వాఁడు నా కాలిగోటికిఁ జాలఁడని–ఆ ముక్కలకు వ్ది

పురాణముగా భావము చెప్పుకొని సరిపెట్టుకొనవలెను గాఁబోలు!

ఉ. 'పేదతనంబులోనఁ గల పెక్కువ సక్కువలందుఁ గల్గు మ
ర్యాదయు నీ వెఱుంగవవురా! యొక తాతివి గమ్మటన్న' [229]

అహల్యకు ఆ పెక్కువ–ఈ మర్యాద తెలియదఁట. కావున తాతివి గమ్మని 'విశ్వనాథ' గౌతముఁడు, 'విశ్వనాథ' యహల్యను శపించెను. మహాత్ములకు పేదతన మేమి! సక్కువ మేమి! కుల గోత్రములు భాగ్యభోగ్యములు ఈ యుగములో మనకుఁగాని ఆ యుగాలలోనివారికి ఈ బెడద లెక్కడివి స్వామీ! వశిష్ఠులవారు ఎవరికన్న పేదవారు? హరిశ్చంద్రమహారాజుగాని దశరథమహారాజు గాని ఆయనకన్న భాగ్యవంతులైనట్లును – దానివలన ఆయనకు న్యూనత వచ్చినట్లును ఏ కథలు మనము చదివితిమి? వశిష్ఠులవారు గొప్ప యింటిలోఁ బుట్టిరనికాని వశిష్ఠులవారి యిల్లాలు పెద్దింటివారి పిల్లయనికాని – ఆ కులగోత్రములతో వారిని గొలిచినవారు లేరే! ఈ కథలన్నియు మనవి. చెట్టు ఉడిగిన పిదప కుక్కమూతిపిందెలు పుట్టినట్లు ఆర్షమై వెలిఁగిన ఈ దేశము అనార్షమైపోయిన ఈ నాఁడు పెక్కువలు తక్కువలు మర్యాదలు మన్ననలు పుస్తకాలలో మాత్రము వ్రాసికొనుచున్నాము.

శాపమునకు భీతి నొంది యహల్య, క్షమింపవే యని వేఁడి గౌతమునితో ఇట్లన్నదఁట:—

మ. 'పృశనాహాహుఁడు శేయి రేఁడులుగ స్వామీ నన్నుఁ గాఢించెడుక
మతి నిస్సార్లును బిగ్గపట్టితి నిలింపస్వామి పాయాంతిన
మ్మతిగుప్తాకృతి వచ్చి నన్నడిగె నే నా వేళ మోహంబు నొం
దితి నీ మోహము తీరఁగావలయు గానీ తాలి కెట్లౌదునో!' [229]

సెబాష్! ఏమి భార్య! ఎంతటి భర్త! ఏమి కవనము!

దోషము వెల్లడియైనపిదప – శాపము అంటిన వెనుక ఈ సంజాయిషీ, అహల్యదా! పరోక్షముగా కవీశ్వరునిదా? నోరు మూసికొని చెంపలు వేసికొని చచ్చినట్లు పడియుండవలసిన అహల్య ఆగ్రహోదగ్రుఁడైన ఆ మహర్షి సమ్ముఖమ్మున వెనుక జరిగిన ప్రేమకలాపములు తిరుగఁదోడి సంజాయిషీ చెప్పుకొను సందర్భమా

ఇది ? వేయి సంవత్సరాలనుండియు వాఁ డెవ్వఁడో నన్నుఁ బ్రేమించి యున్నాఁడు; ఇన్నాళ్లు మనస్సు బిగ్గపట్టితిని. సాయంకాలము వచ్చి నన్నడిగినాఁడు. అప్పుడు నాకు మోహము పుట్టినది. జాతివిగాఁ గమ్మని శపించితివే ? స్వామీ ! ఆ మోహము నే నెట్లు తీర్చు కొందును ? - అని ఎదురు 'కేసు' పెట్టినట్లు పెనిమిటిని ప్రశ్నించినది. పూర్వభారతనారీమణుల తత్త్వ మిట్టిదని మనము కథలలో చదివి తిమా! మన 'రంగులే' వారి కంటించుట న్యాయమా! బిగ్గపట్టుట - నన్నడుగుట - మోహము తీరుట - ఇవి బజారుమాటలు. ఈ కవి సమ్రాట్టుచేతిలో ఈ పురాణదంపతులు లుకాలుక లై బజారురక మై చెడిపోయిరి. అసలు - ఈ దంపతుల 'తరహా' ఇట్టిదే యగుట నిజ మైననాఁడు, ఇట్టి యపాత్రులైన పాత్రలకు పాత్రమైన ఈ కల్పము జోలికి పోవుటయే మహాపాతకము !!

## ప్రస్థానఖండము

'చినచెంబుతో నీళ్లు సీకాయయుదకంబు
అల్లంబు బెల్లంబు-అరఁటిపండు
తేనెతో మాగిన తియ్యమామిడిపండు
అచ్చన్న ! ఉటుంగ్రాళ్లు బుచ్చికేశవులు'

ఎవరు వ్రాసిరోగాని 'అపౌరుషేయమైన' ఈ చిన్ని పద్యమును చిన్నపిల్లలకు మనము వినిపించుచుందుము. ఎవరు ఎవరితో అన్నది- కర్తలు కర్మలు క్రియలు-ఇందలి నాలుగుపాదములలోఁ గానరావు. ఒక పదమునకు మఱొక్క పదమును 'అధ్యాహార్యము' చేసికొని పిండితార్థమును పిండుకొనవలెను. యశోదమ్మ బాలకృష్ణమ్మతో అన్నమాట లివి :—

నీళ్లు పోసెదను రా నాయనా !
నా కక్కఱ లేదు లే!
నీ చిన్ని చెంబుతో పోసెదను రావయ్యా నా తండ్రీ !
నేను రాను పో !
ఇదిగో సీకాయ ఉదకమే సుమా !
ఉహూ !
అల్ల మిదిగో ! రా ! ఏఛీ !!
బెల్లము రా ! వద్దు లే !
అరఁటిపండు రా ! నాకు వద్దుగా !
తేనెతో మాగిన తియ్యని మామిడిపండ్లు నీ కిత్తునురా బాబూ!

తల్లి ఇన్ని పలుకులు పలికి ఎంతగా ఊరించినను ససేమిరా యన్న ఆ బిడ్డను ఏమి చేయవలె? ఓహోయి అచ్చన్నా ! అని నౌకరిని పిలిచినది. బుచ్చికేశవులు నా మాట వినఁడాయె; ఉటుంగ్రాళ్లు తీసికొని రా ! యని తుదకు బెదరు పెట్టినదఁట.

ఈ నడకలో నడచిన పద్యములు కల్పవృక్షములో కావలసి నన్ని కలవు. సాదృశ్యము ఒక్క 'అధ్యాహార్యము' నందేసుమా ! పదముల కూర్పులోఁ గాదు; లాలిత్యములోఁ గాదు. ఇదిగో మచ్చున కొక్కటి :—

ఉ. 'తా నొకనాఁడు పిన్న పినతల్లి వరంబులు కోరె రెండు, భూ
జానియు వాని నప్పుడు నొసంగఁడు నామెయుఁ బుచ్చుకోదు తా
నేనయి యౌవరాజ్యపద మెక్కెడువేళకు రెండు కోరికల్
కానకు నేను బోవలయుఁ గావలె నా భరతుండు రాజుగా' (అయోధ్య-72)

కైకేయి కోరిన వరములనుబట్టి తన వనవాసవృత్తాంతము వినిపింపను శ్రీరాముఁడు సీతానివాసమునకు వచ్చిన ఘట్ట మిది – ఈ పద్యమును వచనసరణిలోఁ జూతము :—

పిన్న పినతల్లి తాను ఒకనాఁడు రెండు వరంబులు కోరెను. భూజానియు అప్పుడున్ వానిన్ ఒసంగఁడున్. ఆమెయుఁ బుచ్చుకోదు. తాన్ నేనయి యౌవరాజ్యపదము ఎక్కెడువేళకు రెండు కోరికల్. నేను కానకున్ పోవలయుఁగావలెన్. ఆ భరతుండు రాజుగా. ఇంతే.

ఇఁక ఈ ముక్కలను మనము ఒండొంటిని అతికించి అధ్యాహార్యములు తెచ్చిపెట్టికొని కవితాసారస్యమును గ్రహింపవలెను. ఇందు పై తానులవంటి రెండు 'తాను'లు వట్టి గణములకోసమే 'తిష్ఠ' వైచినవి. అప్పుడున్ – ఒసంగఁడున్ లోని నకారములు 'వినఁడును గానఁడున్ బిదప'వంటి విశేషార్థద్యోతకములో నిరర్థక సూచకములో ఈ రచననుబట్టి గుర్తింపవచ్చును. 'నేనయి పద మెక్కెడువేళలో' నేనయి అన్నమాట కేవలము ప్రాసకోసమే వచ్చి పడినది. రెండు కోరికల్ – అన్న విశేష్యమునకు పద్యములో క్రియ లేదు. 'పురాణము'గా మనము చెప్పుకోవలెను. నేను బోవలయుఁ గావలె – అనఁగా నేను బోవలసియున్నది కాఁబోలు! అను ఒకానొక నైరాశ్యము స్ఫురించుచున్నది. ఆ భరతుండు రాజుగా – దీనికి అధ్యాహార్యక్రియయే గతి. నా భరతుఁడందుమా అర్థము లేదు. ఆ భరతుఁడందుమా! 'ఆ' యన్న సర్వనామమునకు ఈ ప్రకరణములో (ఖండము) ఆధారము లేదు. కోరిక కోరినది పిన్నపినతల్లి కావున ఆమె బిడ్డ భరతుఁడన్నమాట మనము తెలిసికొని 'ఆ' అన్న దానికి 'ఆ ప్రసిద్ధుఁడైన' అని యర్థము చేసికొనవలసియుండు నేమో!

చిన్న చెంబులో - అన్న చాటుపద్యములో చిన్నిపిల్లల మనస్సులను ఆఁకట్టు చమత్కారమున్నది. ఈ రచనలో చమత్కారముమాట దేవుఁ డెఱుఁగు; అసలు - పదములు చేతికి లొంగక గణములు కుదురక భావములు ఇముడక ఏదో యింత కక్కుర్తిలోఁ బడి పైకి - పద్యమనిపించుకొన్న పద్యములే ఇందు బండ్లకొలఁది అచ్చుపడియున్నవి.

ఇఁక అసలు గాథలోనికిఁ బోదము :—

ఇది ప్రస్థానఖండము. ప్రస్థానమనఁగా - ప్రయాణము. వనవాసమునకు ప్రయాణమై శ్రీరాముఁడు సీతాదేవి గుమ్మములో అడుగు పెట్టెనో లేదో ఆతని మొగమున దైన్యము ఉన్నట్లు ఆమె గుర్తించి పకాలున నవ్వెసదఁట. రాఘవా! మొదటినుండియు నేను అనుకొన్నది అనుకొన్నట్టులే జరుగుచున్నది. నా యెదలో ఉన్న అనుమానము నిజమే యైసది. కారణము మాత్రము చెప్పవా! అని రాముని ప్రశ్నించెసఁట. అంతట రాముఁడు దైన్యమును అణచి పెట్టుకొని నువ్వుగింజంత నవ్వి మొగమును బిగించుకొని, నీ కున్న అనుమానమేమి! అది యెట్లు జరిగినది? ఆ మాత్రపుటనుమానము ఏమాత్రము నాకు జెప్పవేలా యని ఎదురుప్రశ్న వైచెనట. [illegible]! స్వామీ మీతో అన్నియుఁ జక్కలే, ప్రమాదములే యని వైదేహి భయపడి వల్లభుని కాళ్ళకు మ్రొక్కఁగా రామచంద్రుని మనస్సులో ప్రేమ పుట్టెసదఁట. పుట్టి ఆతఁడు చెప్పినమాట లివి :— 'వధూమణీ! నీవుదక్క ఎవరైన చానలు ఈ పాటికి విస్మయపడి యుందురు. నాకుఁ బట్టమనునట్టిది నేఁటి కేమయినదో చూచితివా! ఒకనాఁడు పిన్నపినతల్లి రెండు వరములు కోరినది. భూజానియు అప్పుడు నొసంగఁడు. నేను రాజ్యపద మెక్క[illegible] నేను కానకుఁ బోవలయునని ఆ భరతుఁడు రాజు గావలెనని రెండు కోర్కలు వచ్చినవి.' అని.

అది విని సీత యేదో అనఁబోయి తా మెదలక యుండఁగా చెప్పవచ్చినట్టిదియును జెప్పుము. ఏనును ఘటింపను వీలగునేమో చూచెద నని రాముఁడు బలవంతపెట్టెనఁట. మీకునైనను వచి

యించునట్టిదయినను కోపము వచ్చును. మఱి యేమియు లేదని ధరాత్మజ యనఁగా-ఉండెనయిన లేదటందువు. ప్రకటింపుము. నాకు కోపము రాదు. అటంచని రాముఁడు కోర్కి పడినట్లుగ పదిసార్లు ఆడిన వెంట నాడెనఁట. అప్పుడు వైశ్వనాథ-సీతామహా సాధ్వి పలికిన బంగారు పలుకుతునుకలివి :—

శా. 'ఈ యన్యాయము నింత చేసినను భూమీశుండు మీ రేల యి
ట్లే యున్నారలు లక్ష్మణుండయినను లేఁడా ! భవచ్చాపశౌ
ర్యౌదార్యంబులఁ జెల్ల ధాత్రి గెలువంగా లేరొ ? యూహింపలే
దా యా రీతిఁ ? జెట్టు లోర్వఁగలరో ! యాశ్చర్య మేపారెడిన్'

(అయో-72)

పయి వచనపునడక - ఈ పద్యములోని సీతాసాధ్వీత్వము కేవలము 'రామాయణకల్పవృక్ష'ము సర్వస్వామ్యములోనివి. 'రామ రామ' యని 'కూజించిన' ఆదికవి వాల్మీకి కోకిలముగాని భాస్కర-గోపీనాథ ప్రభృతి రామాయణకర్తలుగాని ఊహింపలేని భావింప లేని సీతాసాధ్వి శీలమును కల్పవృక్షకర్త ఈ తీరుగఁ జిత్రింపఁగలిగెను. అందులకే కాఁబోలు కల్పవృక్షకర్త లొకచోట 'రామకథ అందరికీ తెలుసు. ఎవరూ వ్రాయ నక్కర లేదు. ఒకవేళ వ్రాస్తే ఏదో ఒక వైలక్షణ్యాన్ని చూపగలిగితేనే వ్రాయాలి. అందుకే నేను వ్రాశాను' అని బహిరంగోపన్యాసములోఁ జెప్పఁగలిగిరి. వైలక్షణ్యమును చూపఁగలిగి యుండవలయుననియు - అది తమకు 'జన్మ-హక్కుగా' సిద్ధించి యున్నదనియు దానివలననే దీని నిట్లు వ్రాయఁ గలిగితి ననియు, ఇఁక మున్ముందు ఎవ్వరుగాని ఈ శక్తి లేనివారు రామాయణరచనజోలికి పోరాదనియు వారి యుపన్యాసమునకు సారాంశముగా నాకుఁ దోఁచినది. ఈ సీతమ్మ చెప్పిన మాటలను మన మర్థము చేసికొన్నచో కల్పవృక్షకర్త కవితావైలక్షణ్యము సైతము మన కర్థమగును. ఈమె శీలముతోపాటు గ్రంథకర్త శీలముసైతము గుర్తింపవచ్చును.

రాముఁ డవతారపురుషుఁడని రామాయణకావ్యకర్త లందఱు హృదయపూర్వకముగా నమ్మెదరు. ఆయనకుఁ దగ దొడ్డ యిల్లాలనియే, కావ్యములలో అందఱును సీతాదేవిని జిత్రించి యుండిరి.

ఈ వనవాసవృత్తాంతము రాముఁడు తనకు వినిపించిన వెంటనే సీతా సాధ్వి యేమన్నదో వాల్మీకమును జూడవలెను :—

"శ్లో॥ ఏవ ముక్తా తు వైదేహీ ప్రియార్హా ప్రియవాదినీ,
ప్రణయాదేవ సంక్రుద్ధా భర్తార మిద మబ్రవీత్.
కి మిదం భాషసే రామ! వాక్యం లఘుతయా ధ్రువం,
త్వయా యదపహాస్యం మే శ్రుత్వా నరవరాత్మజ!
భర్తు ర్భాగ్యంతు భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ !,
అత శ్చైవాహ మాదిష్టా వనే వ స్తవ్య మిత్యపి.
న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః
ఇహ ప్రేత్యచ నారీణాం పతి రేకో గతిస్సదా,
యది త్వం ప్రస్థితో దుర్గం వన మద్యైవ రాఘవ!
అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్,
సుఖం వనే నివత్స్యామి యథైవ భవనే పితుః,
అచింతయ న్తి త్రీన్ లోకాన్ చింతయ న్తీ పతివ్రతమ్.
సహ త్వయా గమిష్యామి వన మద్య న సంశయః
నాహం శక్యా మహాభాగ! నివర్తయితు ముద్యతా.
వనే నివత్స్యామి యథా పితుర్గృహే తవైవ
పాదా వుపగృహ్య సంయతా'—ఇత్యాది.
(వాల్మీకము అయోధ్య-587)

ఈ కవనములోనైతము జానకి కోపించినమాట నిజమే. ఈ కోప మెందులకు వచ్చినట్లు! పట్టాభిషేకము లేదన్న దుర్వార్త రాముఁడు వినిపించినందులకా! కాదు కాదు. ఆ వార్త రాముఁడు వినిపించి, ఏవేవో నీతులు బోధించి 'అహం గమిష్యామి మహావనం ప్రియే త్వయా హి వ స్తవ్య మిహైవ భామిని! యథా వ్యలీకం కురుషే న కస్యచి త్తథా త్వయా కార్య మిదం వచో మమ (అయోధ్య-587) అన్నందులకు.

ఇంతవఱ కెన్నఁడు నీవు నా కప్రియము చేయవుగావున నీవు నా మాట విని అయోధ్యలో నుండుము. అడవికి నేను బోయి వచ్చెదను. ఇదియే ఆ సాధ్వికి కోపమునకు హేతు వాయెను. ఆ

కోపమునైతము 'ప్రణయాదేవ సంక్రుద్ధా' అనఁగా ప్రణయ మూలకమైన కోపమేసుమా!

'లోకములో నారీమణులకు గతి ఒక్క పతియే; తల్లి గాదు-తండ్రి కాదు. బిడ్డలు కాదు. ముండ్లు గిండ్లు త్రొక్కికొని నేనే నీకు ముందుగా నడచి నీతోపాటు అడవిలో నుందును. నీ పాదారవిందములు సేవించుచు నా తండ్రియింట ఉన్నట్లే నీ సన్నిధానమున అడవిలో నివసింతును. న న్నాఁపవలదు స్వామీ!'—ఈ ధోరణిలో వాల్మీకిసీత వనవాసమునకు సిద్ధమాయెను.

కల్పవృక్షము ప్రసాదించిన సీత, యే మన్నదో పరిశీలింపవలెను:— ఈ యన్యాయము నింత చేసినను మీ రేల యిట్లే యున్నారలు ? అన్నది మొదటి ప్రశ్న. అన్వయమునుబట్టి ముందు ఉండవలసిన 'భూమీశుండు' 'యతీశ్వరుల' కోసమై దూరమైనాఁడు. 'అన్యాయ్యమ'న్న మేలైన పదమును 'అన్యాయముగా' అచ్చు వేయించిరి. భూమీశుఁడు ఇంత అన్యాయ్యము చేయఁగా స్వామీ! మీ రేల ఉపేక్షించితిరి! పోనీ నీవు కాకపోయినను లక్ష్మణుండయి ననున్ లేఁడా! ఎందులకో! తండ్రి బుద్ధి 'రామకీర్తన' పాడుటకుఁ గాఁబోలు! మీ రిద్దఱు ధనుర్విద్యలు నేర్చితిరే! సమయమున కక్కఱకు రాని ఆ చదువు లేల స్వామి! ఆ చదువుల విలువచే ఈ ధాత్రి యంతయు అలవోకగా గెలిచియుందురే! అసలు—ఈ యూహాలే మీ బుద్ధులకు తట్టలేదా! ఇట్టి యవమానము నెట్లు లోర్చియుందు రయ్యా! అవురా! ఎంత ఆశ్చర్యము!! ఇట్టిది—ఈమె పోకడ.

ఆపైని కొంతసేపటికి 'ఈవృత్తాంత మదెప్పుడో తెలిసి తా నేమానో మా తండ్రి నేనే వారింటికిఁ బోయి నా ముఖముగానే యెల్ల వ్రాక్రుత్తునా!' [అయో—74] అని యింకొక్క యడుగు ముందునకు వైచును. ఇది యంతయు విశ్వనాథవారి వైలక్షణ్యము కాక మఱేమి! ఆ శ్రీరామునకు ఇట్టి యిల్లాలే ఉన్నచో అతఁడును ఆ యిల్లాలికిఁ దగ్గ భర్తయే యైనచో ఈ దేశములో రామాలయములతో పనిగాని రామాయణకావ్యపారాయణములలో శ్రద్ధగాని నిలిచియుండెడివే కావు.

మనకే కాదు; జానకి అన్న మాటలకు కల్పవృక్షమందలి రామునకుఁ గూడ కోపము వచ్చినదఁట. వచ్చి, 'నేనైనను జిన్న తల్లి నిటులాడు మటంచును జెప్పినట్లు, తానైనను దల్లియో యడిగి నట్టును నీదగునూహాయా!' అని ఆ రామచంద్రప్రభువు పలికెరఁట. ఆ పలుకుల కులికిపడి ఈ సీత 'చాలు నిట్టివి నిజంబుగఁ బెట్టకుస్వామి! నా పయిన్ కోపము రాదులే చెప్పుమనఁగా మాట-వొప్పన కొండొక చెప్పితిని. కోపము చూపరాదు. అడవి కోనల నిల్చుట యెన్ని యేండ్లు' అని యింకొక్క ప్రశ్న వైచెనఁట. ముత్యాలవంటి ఆ పద్యాలలోని పలుకులే మీకు వినిపించుచున్నాను. పదునాలు గేండ్లని లెక్క చెప్పఁగా దంపతు లట్లె చూచుకొంచు నిలిచి యొకయంతకు నిద్దఱు నవ్వుకొన్నారఁట. మీ తలంపులు గట్టివ అని జనకాత్మజ అనఁగా నీ తలంపులు గట్టివయని రామచంద్రుడుఁదున్ బలికి 'ఇది కాని నిజంబుగ నేను సేయలేదు - ఒట్టని తల్లివద్ద సెల వొంది యిదే చనుదెంచుచుంటినే సీతో సైతము చెప్పిపోవుటకుఁగానీ వచ్చితిన్' - అన్నాఁడఁట. ఈ ముక్కలకు భాష్య మక్కఱలేదు. ఈ దంపతుల సంభాషణలోని చాతుర్యముగాని సౌచిత్యముగాని ఏమని వర్ణింపను? ఇఁక - ఈ కవితలోని పలుకుబడి ఎంతటి 'పలుకు బడి' కలదో వేఱే చెప్పవలెనా! ఇదే చనుదెంచుచుంటినే - ఇది తెలుఁగు పిల్లలకు బాలశిక్షలో అచ్చువేసి చదివింపవలసిన బాగాగు పలుకు. చనుదెంచుచుంటిని వర్తమానకాలముకాఁబోలు! చుంటినే 'ఏమే! ఒసే!' అన్న శ్రేణిలో చేరఁదగిన ఆణిముత్తెము.

సీతో సైతము చెప్పిపోవుటకుఁగానీ వచ్చితిననె వాల్మీకి పల్కెనఁట. ఇందలి 'కానీ,' తెలుఁగుఁదనమునకు 'కూనీ' వంటిది. 'అపుడు నాతోఁ జెప్పఁగ నేల! నా స్వామి! నే నెవరితో చెప్పన్వలెన్? స్వామీ! మీ తల్లిం గని మీరు చెప్పితిరి. నాకు లే దాధయంబు.' ఆ ధయ మేమో - ఈ భావ మేమో మన మాలోచింపవలెను. తుద కామె అన్న మాట ఇది:- 'ఏ తీర్థంబులు నే వనంబులును గా వెంచేని నా తల్లియే!' ఎంత ఆలోచించినను ప్రకరణార్థమునుబట్టి ప్రయత్నించి

నను ఇందు వాక్యార్థము స్ఫురింపదు. తరువాతి పద్యమునుబట్టి నేను గూడ వత్తునని ఆ సీత అన్నట్లు మనము అర్థము చేసికోవలసియున్నది. వెంటనే 'ఛీ ఛీ' నీ చనుదెంచుట కొప్పుకోను జానకీ!' అని ఆ ప్రభువు ఛీత్కారములతో మందలించును. ఆ మందలింపునకు కల్పవృక్షకర్త చెప్పిన ప్రధానకారణము 'నీవును వచ్చినచోఁ దల్లిని జూచువారెవ' రన్నది. ఈ కల్పములోని సీతమ్మమాత్రము సామాన్యురాలా! 'ఏమేమి! తల్లిసేవకై నేనును నిల్వఁగావలయునే! ఆమె నన్నుఁ జూచిన నోర్చు పొందునా! సుమిత్రాదేవి యుండంగ తల్లింగూర్చి భయం బదేటికి నేనేలా తదారాధనన్? అదియును గాక పతి, ప్రవాసగతుండైననాఁడు పడతి యొక్క-నీతిఁ బుట్టింటియందైన నిలువ వచ్చు, రామ! ప్రోషితపతికి ఆడుబిడ్డల మఱఁదుల యత్తలందు గౌరవము లేదు.' ఇది కల్పవృక్షములోని సతీహితమైన హేతువాదము. ఈ వాదము వాల్మీకములో రవ్వంతైన కానరాదు. ఇట్టిదే కల్పవృక్షములోని వైలక్షణ్యము కాఁబోలు! 'శ్లో. ప్రాసాదాగ్రైర్విమానైర్వా వైహాయసగతేన వా, సర్వావస్థా గతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే, అనుశిష్టాస్మి మాత్రా చ పిత్రా చ వివిధాశ్రయం, నాస్మి సంప్రతి వక్తవ్యా వర్తితవ్యం యథా మయా. అహం దుర్గం గమిష్యామి.' ఇది ఆదికావ్యములోని సీతాదేవి ప్రకృతి.

సార్వభౌములకు నివాసమైన మేడలు మిద్దెలలో కాపుర ముండనీ స్వర్లోకాదిస్థితవిమానసంచారములు దొరకనీ–అణిమాద్యష్టైశ్వర్యసంసిద్ధికి అనువైన రాకపోకలు లభింపనీ సర్వావస్థలు సంభవింపనీ భర్తృపాదారవిందసంసేవయే సతీహితమని నా నమ్మకము. ఇదియే మా–అమ్మ అయ్య నాకుఁ జక్కఁగా నేర్పిన చదువు. ఇప్పుడు నేను నేర్చుకోవలసిన దేదియు లేదు. నా బ్రతుకంతయు నీతోడిదే కావున నీతోపాటు అడవులకు వచ్చుటయే నా నిశ్చితార్థము. అని వాల్మీకముభావమై యుండఁగా – ఈ క్రొత్త సృష్టివలన ఈ సీతమ్మ పాత్ర సాధించిన ఘనకార్య మేమో సహృదయులు గుర్తింతురుగాక!

'అడవులలో ఎన్నో యిడుములు గుడువవలసివచ్చును. వలదొస్సి

వైదేహీ! వలదు వలదు. నీ కాంతారాగతి కైకకు మూఁడు వరము
లిచ్చినయట్లే' అని పౌనఃపున్యమున ఈ రాముఁడు జానకిని వారించె
నఁట. ఇదియు నవ్యసృష్టియే. 'శ్రీరామవనవాసము – భరతుని
పట్టాభిషేకము' ఇవిమాత్రమే కైకమ్మ వరములుగాఁ గోరఁగా నీ
ప్రయాణము మూఁడవ వరముగా సిద్ధమగునుగదా! అన్నదానిలో
కైకనుగూర్చి ఉపాలంభము లేకపోలేదు. ఇట్టివి రామచరిత్రకు
కళంకాపాదకములు. దశరథుఁడు 'అయోమయా'వస్థలో నున్న
సమయాన రప్పింపఁబడిన శ్రీరాముఁడు కైకేయివలన వరముల
మాట విన్నవెంటనే అన్నమాట ఇది: — అమ్మా! మే మిద్దఱము
నీ బిడ్డలమేగదా! ఆపై భరతుఁడు నాకన్న పిన్నవాఁడే. పిన్నవాని
భుజస్కంధములపై ఈ భూభారము పెట్టి వానిని బాధించి నన్ను
గనికరించితివే! ఇత్యాదిగ సంస్కృతకవులు శ్రీరాముని పాత్రను
చిత్రించి యుండిరిగాని, అడుగడుగున ఉపాలంభములతో కైకమ్మను
దూషించినట్లు రాముని చరిత్రలో మనము వినము. ఇట్టి ఔచితీ
భంగములకు ఈ కల్పవృక్షము పెట్టినదిపేరు. ఇవి యన్నియు
వైలక్షణ్యములుగా భావించి ఈ రచనను ప్రేమించినవారుగానీ ఈ
పాత్రల శీలము ఇట్టిదే అయిననాఁడు ఈ రామాయణముబోలి మన
కేలరా యని ఈసడించినవారుగానీ ఉండవచ్చు; నిజము నిలుకడ
మీఁద గుర్తింపనువచ్చు.

## 2

పాత్రౌచితిమాట దైవ మెఱుఁగు. ఈ చిన్నిపాత్ర మొక
దానిని చిత్తగింపవలె:— సీతారామలక్ష్మణులు అడవికి పయనమైరి.
ఆ సమయమున పేదలు సాదులు యాచకులు ఎగఁబడఁగా కోశాధ్య
క్షుని బిలిపించి సొమ్ము తెప్పించి కోకొల్లలుగ ఎల్లవారికి త్రుమ్మరించి
రఁట. వారిలో నొకఁడు ముందునకుఁ ద్రోసికొని వచ్చి, 'కం. కని
నీవేనా రాముఁడ వనదను బహుపుత్త్రికుండనయ్యా! యుంఛంబునఁ
బిల్లల తృప్తారదు ననుఁదోలెను నాదుభార్య నను నీకడకున్, ననుఁ
గాంచుము' అన్నాఁడఁట. అతని భార్య అతనిని బోవయ్యాస్వామి!
యని తోలినదఁట. తోలుటగానీ త్రోలుటగాని పశుపక్ష్యాదులకే

చెందును. ఈ కల్పములో అచ్చటచ్చట మనుష్యులను సైతము త్రోలుట చూచి వింతపడరాదుసుమా! ఏమనఁగా, ఇందు–ఒకానొక సారస్యము లాగవచ్చును. పేదతనము పెరిఁగిపోయిన కొంపలో భరింపవలసిన భర్త, భరింపఁదగిన భార్యనుగాని ఆబిడ బిడ్డలనుగాని భరింపక పోషింపఁజాలక ఉన్ననాఁడు ఆ భార్య ఆ భర్తను ఎక్కడనైన సొమ్ము పుట్టునేమో పట్టుకొని రావయ్యా యని త్రోలక తీరికగా పంపునాయేమి! ఆ ధోరణిలో తోలఁబడిన బడుగుబాఁపనిని ఈ శ్రీరాముఁడు గాంచి నవ్వి ఆలమంద లిచ్చి వానితోపాటు ఈలనిని ఇంటికి తోలెనఁట. ఇఁక నీ కవితలో శబ్దశుద్ధినిగూర్చి గొంగడిలో వెంట్రుక లేఱినట్లేగదా! నీవు + ఏ + ఆ – నీవా – ఇట్టి అవధారణార్థకములో 'నీవేనా' అన్న ద్రుతాంతము వాడుకలో ప్రసిద్ధమేగాని వ్యాకరణములో అశుద్ధము. ఇట్టి యశుద్ధములకు ఈ 'కల్పము' నిజముగా అనల్పమైన కల్పమే. ఒకే పాదములో రెండు'నను'లు. దాని కేదో అంతరార్థముండవలె.

### 3

అడవులకుఁ బోయిన సీతారామలక్ష్మణులు గంగానదిని దాఁటవలసివచ్చినది. పడవ నడిమిపాయఁ జేరఁగా సీత అంజలించి గంగమ్మ తల్లికి ఇట్లని మ్రొక్కుకొన్నదఁట :—

'ఇంటికిం జేరదమేని మ్రొక్కెదను జేరలఁ బాయస మిత్తు నీకు హా
లారసు మిత్తు నీకుఁ బలలంబు నొసంగెద నీకు వాహినీ!
వెయ్యావుల్ ధరణీసురావళికి నర్పింతున్ గటాక్షింపవే
నెయ్యింబప్పును బైడియన్నమును దిన్పింతున్ దయం జూడవే
మాయ్యేరా! భవదీయతీరనివసత్పుణ్యాశ్రమస్థుల్ ఋషుల్
దయ్యంబుల్ నశలంబువారలకు సంధానింతుఁ బ్రేయోబలుల్'

ఈ మ్రొక్కుబడిలో హాలారసము – పలలముసైత మున్నవి. ధరణీసురులచే నెయ్యింబప్పును బైడియన్నమును దిన్పించునఁట. గంగానమ్మకు ఇంత సారాయి పోయించి ఇంత నంజుడు వడ్డింపించునఁట. గంగానదికి ఈ యారాధనము సనాతనమనియే చెప్పవలెను. త్రేతాయుగములోనివారు–లక్ష్మీనారాయణుల అపరావతారమూర్తు

కల్పవృక్షకర్త కోపమే మెండయినది. ఈ కవి దృష్టిలో మంధర 'పంకపరిదర్పిత సూకరమూర్తి' 'గుడ్డలు చుట్టిన మద్దిమొద్దు' 'పెద్ద రోలు' 'పాపపుశకునపక్షి' 'తోఁకచుక్క-గుంటనక్క-జ్వలితాగ్నిని మాడిన పెంకుముక్క' 'ఎనుఁబోతైన చీడ, పతంగి' ఇత్యాది. అప్పుడు

'శా. ఆ శత్రుఘ్నుఁడు రక్తనేత్రములఁ గాంతాపాళి వీక్షింప నా
క్రోశం బొప్పఁగ వారు మాఱు గతి లేరో యెవ్వరీ కోటలో
రాశీభూతకృపాత్మ కోసలసుతా ప్రాలంబముం గాంచు మం
చాశంసుల్ చని రంతఁ గోపవివశుండై తాను శత్రుఘ్నుఁడున్'

[అయో. 245]

శత్రుఘ్నుని ధార్ష్ట్యము చూచి కుబ్జాసఖులు కకావికలై కౌసల్యనే శరణు చొచ్చెద మని వెళ్లిరఁట. నగలు-నుసియగునట్లు చీర-చిరుగునట్లు సిగలోని వెండ్రుక లూడివచ్చునట్లు ఒడలినుండి చెమటలు కాలువలు కట్టునట్లు నురుగులు క్రక్కునట్లు మంధరకుఁ జేయవలసిన 'మర్దన' మంతయు శత్రుఘ్నుఁడు చేసెనఁట. ఆ దెబ్బకు ఆ దాసిముండ అడలి, కైకేయి యెదుటనే క్రిందఁ బడి చేష్టలు దక్కినదఁట. ఆ దశలో సూర్యవంశరత్నము-రామానుజుని యనుజుఁడు సుమిత్రాపుత్రుఁడు శత్రుఘ్నుఁడు, పెరికిన వాలు చేతం గైకొని ఇట్లన్నాఁడఁట:—

'బమ్మెర పోతయ వేల! చూడు నీ
దురితపుటల్లికన్ మొదటఁ దోఁచినదారపుటుండ గొంతుక
త్తెర యిదెదన్ మఱొడ్డముగఁ దెమ్మెరలో కనుగొందు నిచ్చటన్'

గీ. పాలు త్రాగెదవా? లేక ప్రత్తివిత్తులం దిసెదవా యటన్న శాంతిం దగి ప్రతి
దానికిఁ దలూచు రాముఁడఁ గాను నేను సాగరామాజ్ఞఁ గట్టు లక్ష్మణుఁడ గాను.

చం. భరతుఁడఁ గాను ధీసహజబంధుర శాంతిసమేతుఁడన్ మిమున్
దరిగదఁ గత్తివాదర నుదారమనస్సకలాఢ్యు రాముని౦
దిరిగి యయోధ్యవీధులకుఁ దెమ్ము; సుఖంబుగఁ గూరుచుండి యు
ర్వర సకలంబు భోజనపరంపర చేయఁగ నెంచుచుంటివో

కం. తిన్నది క్రక్కించెద దుష్ట న్నిన్నును గుబ్జ నేను పాశ్చాత్యుఁడన్
నన్నెఱుఁగరు మసకపుఁ ద్రాచు న్నిసి యూహ లెల్లఁ జూడింతుఁ జామీ!'

[అయో. 245]

ఇది కల్పములోని శత్రుఘ్నుఁడు చేసిన అట్టహాసము. ఇఁక, వాల్మీకి శత్రుఘ్నుని వైఖరి ఎట్టిదో రవ్వంత చూతము.

శ్లో. 'తీవ్ర ముత్పాదితం దుఃఖం భ్రాతౄణాం మే తథా పితుః
యయా సేయం నృశంసస్య కర్మణః ఫల మశ్నుతామ్.'
[అయో. 812]

మా యింటిల్లిపాదికి ఇక్కట్లు తెచ్చిపెట్టిన దీని కథ చూడవలెనన్నట్లు శత్రుఘ్నుఁడు బిట్టుగ చెలరేఁగి ఆబిడ జుట్టు పట్టుకొని లాగి క్రిందఁ బడవైచెనఁట. కాని, భరతుఁ డా దృశ్యమును జూచి వెంటనే జోక్యము తీసికొని ఆతనితో నిట్లు వచించును :—

శ్లో. 'అవధ్యా సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతా మితి,
హన్యా మహ మిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీం,
యది మాం ధార్మికో రామో నాసూయే న్మాతృఘాతుకమ్,
ఇమా మపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః
త్వాం చ మాం చ హి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్.'
[అయో. 818]

మధురమైన పదములతో కుదురుగా పొదివిన ఈ యుదాత్త భావమును 'కల్ప' మెట్లు అనువదించెనో చూడవలయును.

'శా. ఓయీ! దానిని జంపు టెంత పని? కాదో తల్లినిం జంపెదో
యే యే దుర్గుణముల్ కలట్టిదియొ కానీ! తల్లియే యాఁగదా!
చేయంజాలక యూరకుంటిఁ బొ! రాజీవాక్షుఁడౌ రామచం
ద్రాయత్తంబగు భావ మేర్పడదు భద్రా! చూడు మీ యింతయున్.
కం. కానగోటి మీఁదిపని రాముని కియ్యది తలంచుకొన్న మొగిఁ దూష్ణింభా
వనిభృతుఁడై చను నా గతి వసిధరిత్రి కే తపః ప్రభాకృతమతియో!
కం. ఈ కుర్కటి చెలు లందఱు ప్రామించుకొనంగఁ జనిరి పట్టమహిషికై
యా మాత యేమియనునో ప్రేమం చెదుఁదల్లి శత్రువిరతుల మైనన్.
కం. రా పోదమని ... వే పోయి ...'
[అయోధ్య. 246]

మూలములో లేనివి తెచ్చిపెట్టి వికారముగ చిత్రించి ఇది నా యుపజ్ఞ యనుటకన్న అక్కడ ఉన్నదానిని జక్కఁగ మన పలుకులలో విప్పి చెప్పఁగలుగుటలోనే విలువ యున్నది. 'సర్వభూతానాం ప్రమదాః అవధ్యా' ఈ భావ మేమైపోయినది ఈ

తెలుఁగుసేఁతలో? నాది కేవల మనువాదము కాదన్నమాత్రాన సరిపోవదు. స్త్రీల జోలికి మనము పోరాదు; ఇది మొదటి ముక్క. ఆపైని, ఎదుటివాని కథ ముందు ఎత్తక తనకథనే ఉదాహరించుచు 'పాపాత్మురాలైన ఈ కైకేయిని నేనేగనుక చంపితినేని ఆ ధర్మాత్ముఁడు శ్రీరామచంద్రుఁడు నా మొగము చూచునా!' అని పలికి రెండవ యుదాహరణముగా మంథర వార్త ఎత్తుకొనును. అందును- చంపఁబోవునది శత్రుఘ్నుఁడైనను – ఆ హత్యాదోషము తనకు సైత మంటించుకొని 'రాఘవః త్వాం చ మాం చ నాభిభాష్యతే' అనఁగలిగెను. స్త్రీహత్య చేసిన మనతో ఆ ధర్మాత్ముఁడు మాటాడనే మాటాడఁడన్న – ఈ మంచిభావము 'రాజీవాక్షుఁడౌ రామచంద్రాయత్తంబగు భావ మేర్పడదు. భద్రాలో వచ్చినదా! వచ్చినదా! రామచంద్రాయత్త మను సమస్తపదములో ఏకదేశాన్వయముగా చేరఁబడ్డ 'రాజీవాక్షుఁడు' మాత్రము రాఁగలిగినాఁడు. ఆపైని, 'కాన గోటిమీఁదిపని రాముని కియ్యది తలఁచుకొన్న' – ఈ మాట కర్థ మేమో ప్రకరణమునుబట్టి లాగవలెను. కైకేయి కోరిన వరముల మాట విన్నవెనుక తాను అడవులకుఁ బోవలసిన కర్మము తప్పదని తెలిసినదప – రాముఁడే తలఁచుకొన్నచో మంథర బుఱ్ఱను ఒక్క దెబ్బకు ఎగురఁగొట్టి యుండెడివాఁడు. చిటికలో కైకను పుటమాఁపెడివాఁడు. [illegible] యని తూష్ణీంభావము వహించి ఆ తీరుగ అడవికి వెళ్లెను గాని, ఇది రాముని గూర్చి శత్రుఘ్నునితో భరతుఁడు చెప్పినట్లు కల్పవృక్షకర్త మనకుఁ జెప్పినాఁడు. అవురా! రామునిపాలిట ఇది యొక కల్పవృక్షము గాదు; కంటకావృతమైన పట్టి తుమ్మచెట్టు. ఆ కుటుంబములోని నలుగురన్నదమ్ములు భారతీయుల కాదర్శపురుషులని సర్వవాఙ్మయములో స్థిరమై పోయినది. నలువురకు ముగ్గురు తల్లులైనను పుత్రకామేష్టినాఁటి పాయసము పంపకమునుబట్టి రెండు భాగములుగా చీలిరి. కౌసల్య పంచియిచ్చిన పాయసమునుబట్టి సుమిత్రాపుత్రుఁడైన లక్ష్మణుఁడు రామానుజుఁడుగా వ్యవహారమునకు వచ్చి రామునితోడినీడవలె బ్రదుకన్నట్లు మాఱిపోయెను. కైక యొసఁగిన పాయసభాగము ప్రభావమువలన సుమిత్రాపుత్రుఁడు శత్రుఘ్నుఁడు

చిన్ననాఁటినుండి భరతుని చెలిమిలో లీనమయి జంటగా ఉండవలసి వచ్చెను. ఈ సంబంధమువలననే శాంతకు లొంగిన భూకాంతుని మాట మనము వినవలెనా! 'అహం హనిష్యే పితరం వృద్ధం కామ వశంగతం, స్త్రియా యుక్తం చ నిర్లజ్జం ధర్మాయుక్తం నృపం యథా'అన్నంతవఱకు క్రోవ తొలఁగి 'అమ్మను దిట్టెదవేమిరా!...' అన్నట్లు రామానుజుఁడు రామునితోనే పలికెను. అదే ధోరణిలో రామవనవాసవృత్తాంతమునకు ప్రధానకారణమైన మంథరను శత్రుఘ్నుఁడు చిత్రవధ చేయఁబోయెను. కాని, ఈ ఘట్టములో ఇది మాత్రము 'కల్పము' కల్పించిన క్రొత్త సృష్టి:—

'పాలు త్రాగెదవా! లేక—' ఇత్యాది. ప్రత్తివిత్తుల బసవన్న వోలె ప్రసాదానికి రాముఁడు తలూచునఁట; ప్రతిదానికి లక్ష్మణుఁడు రామాజ్ఞఁ గప్పనడునఁట. ఆపై — 'భరతుఁడేఁగాను, ధీసహజ బంధుర శాంతి సమేతుఁడన్' – ఈ ధోరణినిబట్టి 'ధీసహజబంధుర శాంతితోఁ' గూడినవాఁడు భరతుఁడనియు అతనివంటివాఁడను నేను గాదనియు శత్రుఘ్నుని మాటకు అర్థము చెప్పవలె. కాని 'శాంతి సమేతుఁడన్ ' అన్న దళము తనకే (శత్రుఘ్నునకు) అన్వయించుకొను నట్లు ప్రయోగమునుబట్టి తబ్బిబ్బు స్ఫురించుచున్నది. ఇట్టి తబ్బిబ్బులు ఈ రచనలో క్రొత్తవి కావు. అందే, కతివాదరచే మిముం దరిగాద నని, రాముని౦ దిరిగి యయోధ్యవీధులకుఁ దెమ్మా ... ఎంచుచుంటివో అన్న ఏకవచనప్రయోగములు చూపుట కల్పమునకు సనాతనాచారము. 'మిము' అన్న బహువచనమునకు కష్టా సఖులందఱు వత్తురు కాఁబోలు! రాముని మఱలఁ దెమ్ము అనుటకు 'మంథర' మాత్రమే అన్వయించును గాఁబోలు! ఇక్కడ మంథరా! నిన్ను నఱకివైచెదను. రాముని మఱల మీరందఱు తీసికొని రానిచో – అని యుండవలసినది. శ్రీరాముని గంగిరెద్దుగా చిత్రించుట – ఒక పాత్రముఖముగానే కావచ్చు న్యాయసుమాత్రము కాదు. తిన్నది క్రక్కించెద దుష్ట న్నిన్నును గుబ్బ! నిన్నును అన్న పదముచే తిన్నది క్రక్కింపఁబడెడివారు శత్రుఘ్నుని దృష్టిలో ఇంకను ఎవ్వరో కలరని కల్పము రచనలో మనము భ్రాంతి పడరాదు. కల్ప

వృక్షము, కని–పెంచి ప్రపంచమున కిచ్చిన నిరర్థక 'సముచ్చయ' సమూహసౌరభము సుమా యని యెంచవలెను. ఇట్టి 'సముచ్చయములకు' తమ్ముఁడైన తాను శా. తా శత్రుఘ్నుఁడు...[245 పేజి] పద్యములో రెండు సారులు ప్రత్యక్షమైనది. శత్రుఘ్నుఁడు 'మన కపుఁ ద్రాఁచు' నని తనకుఁ దానే చెప్పుకొన్నట్లు కల్పము మనకుఁ జెప్పినది. ఈ యాపద్యములోని రోఁతను విద్వజ్జనులు పరిశీలింప వలెను. త్రాఁచున్ + ఈ + మీ ఊహలు–ఎల్లన్ = త్రాఁచున్నీ మీ యూహలెల్లన్ అన్న దానిలో 'త్రాఁచున్నీ'లవంటి ప్రయోగము నకు 'సర్వమున్నతనిదివ్యకళామయ మన్న ప్రయోగము 'మాతృక' లేదా యనవచ్చునేమోగాని అట్టి సకృత్ ప్రయోగములమీఁద బ్రదికిన కవిత ప్రథమ శ్రేణిలో ఎన్నికకు రాదని మనము గుర్తింప వలెను.

## 6

అయోధ్యకు శ్రీరాముని మఱలఁ దెత్తునని పట్టు పట్టి భరతుఁడు సపరివారముగ అడవికిఁ బోయి రాముని దర్శించెను. తండ్రి గతించినవార్త విని శ్రీరాముఁడు చేయవలసిన 'కర్మకాండ' చేసినపిదప భరతుఁడు తాను వచ్చినపనిని దెలియఁజేసెను. పితృ వాక్యమునుబట్టి నేను అడవులకు వచ్చితిని, పితృవాక్యమునుబట్టియే నీవు ధరణిని పాలింపుము. జనకుని మాట ఉభయులము కాదన రాదు. ఇదియే రాఘవవంశనీతి. అని శ్రీరాముఁడు తమ్ముని నిరుత్తరుని జేసెనఁట. ఆ రేయి గడిచి మఱునాఁడు మఱల 'అన్నా! నీ వయోధ్యకు రావలె. నా తల్లి నాకిచ్చిన ధాత్రిని నీకు నే నొసంగితిని. అన్నదమ్ములలో భేద మేముండును? ఇప్పుడు నీవు వచ్చినచో తండ్రిని నీవు కాదన్నది లేదు; నామీఁద నీవు దయచూపిన ట్లవును' అని భరతుఁడు బతిమాలి వెంచియు నిట్లనును :—

'ఉ. రాముఁడు రాజ యీ నడిమిరాచరికంబని లెక్కసేయు కీ
భూమిప్రజాళి నేల వువుబోఁడియు వాడియు నర్తలయ్యెడున్
శ్రీమహితాత్మ! తా వ్యభిచరించును నాయెడ ధాత్రి త్వద్గత
ప్రేమ మనోజ్ఞభావపదవీనదవీయసి కొండ్లికూఁతునై. [అయో. 308]

ఉ. నీవును దండ్రిమాటపయి నిల్తునటంచుఁ బ్రతిజ్ఞఁ బట్టెదేన్
భూవిభుఁ డన్నమాట మతిపోయినమాట వయస్సు దాఁటి కా
మావిలచిత్తతన్ దెలియ కాడినమాట మహాత్ముఁడయ్యు ధా
త్రీవిభుచంద్రచూడుని మతిన్ బొరక్రమ్మిన దప్పు డో ప్రభూ!

గీ. తండ్రి నోర్విప్పి చెప్పెనా! తల్లిమాట కులక మానంబు పూనెనా! యుర్వినేత
మనసు తా నంటి యుండెనా మాటవెనుక తండ్రివాక్పాలనమున నర్థమ్ము లేదు.

క. మతి చెడి పలికిన పలుకున కతికి చరించుటయ బద్ధమా వర్తన మా
మతి సుస్థులైనయప్పటిగతి తెలిసి చరించుట బుజాగతి సర్వజ్ఞా!' [308]

ఇట్టిది కల్పములోని భరతుని హేతువాదము. దీనికి అన్నగారి సమాధాన మిది:—

'కం. నీ తప్పాడు లేవును బృథ్వీవిభునాఁటి స్థితి నీవు విన్నది నేనో
భావమునఁ గనులఁ గన్నది నీ వెవరో యన్నమాట నే యూఁదెదవా!

చం. వర మడిగెన్ భవజ్జనని పార్థివుఁ డిత్తునటన్న దిచ్చె నా
వరమును నీవు నేను బరిపాలన చేసినఁ దండ్రి యిచ్చిన
ట్లిరుదెసలన్ వరమ్ము ఫలియించినయట్టులు రెండుచోట్లఁ గ
ల్లరియగుఁ గాలమైనదె ఖలత్వము తండ్రికిఁగూడఁ గట్టిగన్' [అయో. 308]

ఈ రాముని సమాధానములో విశేష మేమియు లేదు. ఈ ఘట్టములో వాల్మీకి చెప్పిన 'మంచి ముక్క' కల్పవృక్షకర్తలు మఱచిరో విడిచిరో కారణము తెలియదు. అది యిది:—

శ్లో. 'పురా భ్రాతః పితా నస్స మాతరం తే సముద్వహన్,
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్,
దైవాసురే చ సంగ్రామే జనన్యై తవ పార్థివః,
సంప్రహృష్టో దదౌ రాజా వర మారాధితః ప్రభుః
తతః సా సంప్రతి శ్రావ్య తవ మాతా యశస్వినీ
అయాచత నరశ్రేష్ఠం ద్వౌ వరౌ వరవర్ణినీ,
తవ రాజ్యం నరవ్యాఘ్ర మమ ప్రవ్రాజనం తథా' ఇత్యాది.
[అయో-930]

కామమోహితుఁడైన తండ్రి, కావించినది గ్రహింపరాదని తండ్రిని నిందించు భరతునకు శ్రీరాముఁడు చెప్పిన మఱొక హేతు విది.

'బాబూ! కేవల మిది మోహహేతుప్రసక్తిమాత్రమే కాదు. నీ బిడ్డకుఁ గలుగు బిడ్డకే నా సర్వరాజ్య మిత్తునని ఆ నాఁడు మన తండ్రి, మీ తాతయ్యవద్ద ప్రతిజ్ఞ చేసియున్నాఁడు. ఆ ప్రతిజ్ఞవలననే కైకేయి తన బిడ్డకు రాజ్యము రావలసియుండుటే నిశ్చయమైన నాఁడు—ఇప్పుడు వరములవంకతో ఈ కోరిక కోరనేల యని సందేహ పడరాదు. అది, బాల్యవృత్తాంత మగుటచేతను—అది జరిగి చాలఁ గాలమగుటచేతను ఇటీవల జరిగిన వరప్రదానమునుబట్టియే అమ్మ ఈ కోరిక కోరవచ్చును. ఇదికూడ ఆమెకు జ్ఞప్తి లేదుసుమా మంథర చెప్పినదాఁక. అయితే, పెండ్లినాఁడు మన తండ్రి కైకేయీ పుత్త్రునకే రాజ్య మిత్తునని మాట యిచ్చి, మొన్న పెద్దబిడ్డకే రాజ్యము కట్టఁబెట్టవలె నని పట్టాభిషేకమున కెందుల కుద్యుక్తుఁ డయ్యెనని వాదింపరాదు. దానికి శాస్త్ర మున్నది. శ్లో॥ 'ఉద్వాహ కాలే రతిసంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే, విప్రస్యచార్థే హ్యనృతం వదేయుః పంచానృతాన్యాహు రపాతకాని' అనెడి న్యాయముచే తప్పు లేదులే యని మనస్సులో అనుకొని దశరథ మహారాజు ఆ పని చేసెను. పోనీ, వెనుకటి పెండ్లినాఁటి ప్రతిజ్ఞను బట్టి కేకయమహారాజైనను తన దౌహిత్రునకే రాజ్యము రావలెనని యాచింపలేదేమని ప్రశ్నింపవచ్చు. నే నేదో యుంచినాఁడ ననుకొని (రాముని) నామీఁది మమకారముచే మీ తాతయ్యకూడ ఈ మాట యెత్తకపోవచ్చు.'

శ్రీరామునకీ రహస్యము సుమంత్రాదులవలనఁ దెలిసియుండు నని వ్యాఖ్యాతలు చక్కఁగా వివరించిరి. ఈ రహస్య మెఱిఁగినవాఁడు కావుననే శ్రీరాముఁడు భరతునితో—శ్లో॥ 'భవానపి తథేత్యేవ పితరం సత్యవాదినం, కర్తు మర్హతి రాజేంద్ర' క్షిప్ర మేవాభిషేచనాత్ ఋణా న్మోచయ రాజానం మత్కృతే భరత! ప్రభుం, పితరం చాపి ధర్మజ్ఞం మాతరం చాభినందయ'—ఇత్యాదిగ బోధించెను.

[అయో. 931]

తమ్ముఁడూ! నాకోసమైనను మన యమ్మఋణము మనతండ్రి తీర్చుకొనునట్లు చేయవయ్యా! ధర్మజ్ఞుఁడైన తండ్రిని—తల్లిని అభినందింపవయ్యా—అని శ్రీరామునినోట వచ్చిన ఈ మంచిమాటలు

కల్పవృక్షములో మందునకైన లేవే! కారణ మేమి! ఉపదేష్టయయిన శ్రీవశిష్ఠులకే క్రొత్తయనిపించెడి ధర్మవేదాంతోపన్యాసంబు శ్రీరాముఁడు చేయఁగలవాఁడని వ్రాసికొన్న [313 పుట] ఈ కల్పవృక్ష కర్త, శ్రీరాముఁడు చెప్పిన ఈ మంచిమాటలు సైతము తెలుఁగులో వ్రాయఁగలిగి యున్నచో శ్రీరామపాత్రలో విశిష్టత తెలుఁగువారికి మఱెంతగాఁ దెలిసియుండెడిదికదా! ఇట్టి మంచి యంశములు విడిచి పెట్టి 'లోకాభిరామాయణముగా' నాలుగు హేతువు లల్లి అచ్చముగా కైకేయినే తిట్టిపోయుచు కొంకిబికి మాటలతో దూరాన్వయములతో బండి సాగించుటయే ఒక వైలక్షణ్యముగా మనము భావింపవలసి యున్నదేమో!

ఉండవలసిన ఈ యంశమును దీసివైచి అక్కఱలేనిది అసహ్యమైనది ఒకానొక ఘట్టమును కల్పవృక్షము మనకుఁ జూపినది. ఆ యన్నదమ్ము లిరువురి సంభాషణలో 'భగతుఁడు తల్లి కనుఁగొనఁ బడి చూడఁగా నా యమ మనోజ్ఞమృదూజ్జ్వలమందహాసపంకిలసిత గండభాగవినికృత్తసమావృతదైన్యరేఖయై రఘూత్తముని గాఁటచి పలికెనఁట.' ఏమని :— [అయో. 316. పే]

'వ. ఓయి! నాయన! మీ రఘువంశరాజుల ధర్మపరిషత్స్థలం దంతఃపురస్త్రీలు పలుకవచ్చునో యెఱుంగను గాని నా ప్రసక్తి యిందుఁ గొంత కలదుగానఁ జెప్పెద. [అయో. 316].

'కం. ఏ ప్రాణము రక్షింతురో యా ప్రాణముఁ గొనఁగనైన నడుగుదురే తా
మా ప్రాణరక్ష చేయుటయే ప్రియమది దాని నిచ్చు టేపాటిదయా?

సీ. ఇచ్చినది తీసికొనిరేని నిచ్చిరన్న సంతసం బేల తత్కృతజ్ఞతయు నేల
నీ వొసంగినదానిని నీవ తీసికొనుమనుటకంటెఁ దొలిఁ బుచ్చికొనమి మేలె!

గీ. అన్ని నడిగెడి వరము సీతారిపౌమ్యు గానినడిగెదునని నీవు కదలరాము
వరము లీ రీతి నడిగెడివార లెవరో తలిలి యిచ్చెడివారు రాఘవులుగాని

కం. ఇది వరమడుగుట కాదును నిది యిచ్చుటకాదు నిచ్చియిచ్చుటకాదున్
మది సుడియఁ దమ్ముఁ డడిగిన పాదలిక మాత్రమ్ము త్రోసిపుచ్చుట యాఁజా!

వ. అనిన శ్రీ వసిష్ఠు లిట్లనిరి.

ఆ. పట్టు విడువు లేని పడతి! యా వరయుగ్మ మేను గోరనంచు నేల యనవు
నూఁగి రెండువరము లుపసంహరించుకొన్నానటంచు చెప్పినావుకావు.

ఎందుల కీ సోది ? ఈ 'కల్పన' వలన 'కల్పమునకు' వచ్చిన లాభ మేమి? ఇందు తన జోక్యమున్నదని ముందునకు వచ్చి కైకేయి యిచ్చిన ఈ యుపన్యాసములోని సారాంశమేమో ఈ పద్యములు సరిగాఁ జెప్పినవా ? ఇందలి మొదటి పద్యమునకును మూఁడవ పద్యమునకును ఏదైన భావ మన్నది యున్నచో అది కల్పవృక్షకర్త ముఖముగానే ఏ బహిరంగోపన్యాసములోనో మనము వినవలసి యుండును. పదములు పెద్దవికావు; సమాసములు లేవు. కాని యుండ వలసిన పదముల యొద్దిక మందునకైన ఇందున్నదా ? పొత్తు పొసఁగని పదములు నాలుగు తెచ్చి అతికించి ఏదో భావమును మదిలో ఊహించి పద్యమని పేరుపెట్టి అచ్చువేయించినంతమాత్రాన అది కావ్యముగా ఎన్నిక కెక్కునా !

'తమ్ముఁ డడిగిన పొదలికమాత్రమ్ము త్రోసిపుచ్చుట యాఁజా'– ఈ వాక్యమునకు సూటిగా వచ్చు భావ మేమి! పొదలిక యనఁగా–పెంపు, వర్ధనము అని యర్థమఁట. ఆ వెంటనే శ్రీ వసిష్ఠుల వారి మాటలలో ఆ రెండువరములు నేను గోరనని యనవేమి! ఆ రెండింటిని ఉపసంహరించుకొన్నానని చెప్పవేమి! పట్టు విడుపులు లేని పడతీ! అని మఱల పదిమందిలో ఆబిడ కింత ధిక్కారము ఈ కల్పము క్రొత్తగఁ గల్పించి యిచ్చినది. అవురా! కైకేయిపాత్ర కల్పవృక్షకర్త చేతిలో ఎంతగా చితికి చివికిపోయెనో విజ్ఞులు పరిశీలింపవలెను.

## 7

భరతాదు లయోధ్యకు వెళ్లినపిదప సీతారామలక్ష్మణులు నివాసమును మార్చుకొని చిత్రకూటగిరిప్రాంతములో మకాము పెట్టి దరు. అడవిలోని వన్నెచిన్నెలు సరస్సులలోని వింతలు విశేషములు సీతకు శ్రీరాముఁడు చూపించుచు వినిపించుచు కొంత వినోదముగా కాలక్షేపము చేయుచుండును. ఒకచోట పర్ణకుటీరము కట్టుకొనిరి. అందు వసించుచుండఁగా సౌమిత్రి హరిణమాంసములు కొల్లలుగా తెచ్చుచు నిచ్చుచుండునఁట.

ఒక్కనాఁడు జానకి హరిణమాంసంబులు యజ్ఞపరిశేషంబులు నెండఁబెట్టుచుఁ జేత నొక పుల్లను గొని పక్షుల నదలించుచునున్న

సమయంబున శ్రీరామచంద్రుండు సీత తొడపైఁ దల చేర్చి నిద్రించు చుండె. అప్పుడు ఇంద్రుని కొడుకు కాకము వచ్చి,

'గీ. ఎండఁ బెట్టిన యామిషఖండములకుఁ జొఱదు సీతాపయోధరశోణితంబు
రుచి మఱిగినట్టు లెడద యెఱిచి గ్రహింప ముక్కు చాచుక తల్లిపై పొంచ నెదూఁకి

శా. తా నట్టిట్టులఁ దూఁగినన్ బతికి నిద్రాభంగమౌ, హస్తకా
స్థానం బాయదు కాకి, భూమిసుత వక్షఃస్థానమున్ ముక్కునన్
దానై జీరను బాసిపోవు ఖగ మా ధాత్రీసుతోరస్స్థ ర
క్తానన్ వాఁకలు కట్టె దుష్టబలిభుక్చంచూపరిమ్లానమై' [అయో. 349]

ఈ తీరుగ చేసి మేల్కొన్న శ్రీరాముఁడు 'ఉష్షని' యదలించి నను లెక్క సేయక సీతాదేవి బొమ్మున వ్రాలి 'చిఱుకండ' యొకటి తీసెనఁట. అప్పుడు రాముఁడు కోపించి గడ్డిపోఁచను అభిమంత్రించి వేయఁగా అది ఆ మాయకాకికి బ్రహ్మాండమైన బాణమై బాధ కలిగించెనఁట. ఆ బాధ కోర్వక ఆ కాకి తిరుగవలసినచోట్ల కెల్లఁ దిరిగి తిరిగి దిక్కు గానక శ్రీరామునే శరణు చొచ్చెనఁట. శ్రీరాముని బాణము వ్యర్థము కాదుకావున ఆ దెబ్బకు కాకి కన్నొకటి ఊడిపోయెనఁట. అప్పు డా కాకి అమ్మవారితో ఇట్లన్నదఁట:

'ఆ. తల్లి చన్ను గుడుచు దర్పంబు నాయందె యొకనియందె యుండె నుర్విమీఁదఁ
దప్పులేదు తల్లి! దంతాల నొక్కిన శిశువు బుగ్గమీఁదఁ జిటిక పడదె'

మాయవేషముతో వచ్చి చేయరాని పని చేసిన ఈ కాకము అమ్మవారితో తుది కీ చమత్కారములో దిగినట్లు వ్రాయుటలో చమత్కారముగాని ఉదాత్తతగానీ కానరాదు. ఈ ఘట్టములో ఈ 'కాకమ్మకథ' వాల్మీకములోనే కాదు ప్రసిద్ధములైన తెలుఁగు రామాయణములలోఁగూడ కనిపింపలేదు. ఋషీశ్వరులు శ్రీరాముని గలియుట రాక్షసోపద్రవకథలు చెప్పుకొనుట – అత్రిమునీశ్వరాశ్రమ ప్రవేశము – పాతివ్రత్యధర్మోపదేశము – దండకారణ్య ప్రవేశము, వీనితో వాల్మీకములోని అయోధ్యకాండము ముగియఁగా కల్ప వృక్షము మన 'కీ కాకమ్మ కథను' ఈ కాండముతుదిని వినిపించుట అకాండతాండవమే యగును. నిన్న మొన్న మాయమ్మ మున్నగు వారు వచ్చి వగచిన ఈ చోటు విడువవలెనని శ్రీరాముఁడు భావించి 'చెంబు తప్పెలలు బుజాన వేసికొని ధనుర్బాణంబులు పూని పదిబండ్ల నిండ భరతుఁడు తెచ్చి వదలిపోయిన బాణాల మోపులు కుటీరము

భద్రమ్ము చేసి తరువాత నాటవికులచేతఁ దెప్పించుకొనవచ్చునని బయలుదేరి మువ్వురు నడచిపోయి కొంత దవ్వున నత్రిమునిరాజు నాశ్రమంబుఁ జేరి' [అయో. 358]

ఈ చెంబు తప్పెలల ఘుట్టమంతయు కల్పవృక్షము గడించుకొన్న సొంత యాస్తి. ఋషీశ్వరుఁడైన వాల్మీకికవీశ్వరుఁడు 'తస్మాదన్యత్ర గచ్ఛామ ఇతి సంచిత్య రాఘవః, ప్రాతిష్ఠత స వైదేహ్యా లక్ష్మణేన చ సంగతః సోఽత్రే రాశ్రమ మాసాద్య తం వవందే మహాయశాః, తం చాపి భగవా నత్రిః పుత్రవత్ప్రత్యపద్యత' అని సంగ్రహముగా సున్నితముగా సీతారాముల ప్రయాణమును జెప్పఁగా, ఈ తెలుఁగుకవీశ్వరుఁడు సూర్యవంశపుత్త్రులచేత ఇన్ని చెంబులు ఇన్ని తప్పెలలు బుజాన మోయించి కొంగ్రొత్తసారస్యమును మనకు ప్రసాదించెను.

ఏ కథ వ్రాసినను ఏ యితివృత్తమును గైకొన్నను ఆ కవిగాని ఆ రచయితగాని ఆ వ్రాఁతలో ప్రతిబింబించునన్నమాట అక్షరాల సత్యము. ఇంతవఱకు నడచిన ఈ రెండుకాండములలోనే విశ్వనాథ వారి విచిత్రప్రవృత్తి వివిధమార్గములలో బోధపడియుండవచ్చును. 'రామాయణకల్పవృక్ష'కర్త చేసిన ఈ రచనలో ఇతివృత్తవైచిత్రియే గాదు; కవితావైఖరిలోని అపభ్రంశములు – కృత్రిమకల్పనలు – లాక్షణికదోషములు పందలు గాదు వేలు గాదు లక్షలుగా ప్రత్యక్షమగుచున్నవి. ఈ దృష్టితో నా కావ్యము చదువవలెనని చదువరులకు ముందుగా 'షరతు' లందించిన కవీశ్వరుఁడు ఏ వాఙ్మయములోను గానరాఁడు. అతనికిఁ దోఁచినది అతఁడు వ్రాయఁగా దాని గుణమును బట్టి లోకము దాని నాదరించును. బెత్తి. ఊడిపోవుచున్న గోడను పైపయి పూఁతలతో నిలువఁబెట్టినట్లు సారము లేని నేలలో 'సూపరు' వేసి పాడిపంటలు ప్రోదిచేసికొన్నట్లు మనము కావించు రచనలు 'మందిమార్బలము' చేతిలోఁ బెట్టి వందిమాగధులను సృష్టించుకొని 'భజగోవిందము' పాడించుకొన్నంతమాత్రాన మంచి బ్రదుకు బ్రదుకలేవు.

'అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః
యస్త్వశక్తికృత స్తస్య ఝుగిత్యే వావభాసతే.'

# దశవర్షఖండము

రామాయణభారతములలో మనము విన్నవి ప్రాచీనులు చెప్పినవి 'ఆరణ్యకాండములు - ఆరణ్యపర్వములు' అని యుండఁగా, అక్కఱలేని యన్నింటికి తద్ధితరూపములు తగిలించు వైశ్వనాథములో 'అరణ్యకాండ'మని యే అచ్చువేయించిరి. 'హరిఃఓమ్మని' ఈ యరణ్యకాండములోని దశవర్షఖండము పరిశీలింపవలెనని ప్రారంభింపఁగా 'శోభనాద్రికృతప్రతిష్ఠావిభవుఁడు శ్రీవిశ్వేశుఁడు' ప్రత్యక్షమైనాఁడు. జన్మమునకు శివరాత్రి యన్నట్టు ఆ కందములోని నాలుగుపాదములు లోకములోని కవితతోపాటు హాయిగా నడచి అనుకొన్న పదార్థమును మన కందించుచున్నవి. కాని మచ్చ లేకుండుట ఈ కవిత్వమునకు నచ్చదు కాఁబోలు! సమస్తమైన 'కృతప్రతిష్ఠ'లో 'త' కారమును హ్రస్వము చేయవలసినంత కష్టము ఈ కవికి ఎందులకు పట్టవలెను? ఏదో ఒక వైలక్షణ్యము తొంగిచూడని నాఁడు - అది విశ్వనాథకవిత్వమే కాదని మన మూహింపవలసి యున్నది. మందయాన లనఁగా స్త్రీలని మన మందఱము తెక్కున పుస్తకాలలో విందుము. 'మదదంతావళ మందయానునకు రామస్వామికిన్ బాధ యా' [అరణ్య - 3 పే] అని కల్పవృక్ష మన్నది. కావున 'కవిసమయముల'లో ఇఁకనుండి పురుషపుంగవులను సైతము మత్తేభయానులుగా-మందయానులుగా పేర్కొనవలసియుండునేమో! మన యిష్టము వచ్చినట్టు 'కవిసమయములు' మాఱిపోవునా! సమయ మనఁగా సంప్రదాయము. అదే - ఆచారము. దేశాచారమువలె ఈ యాచారముకూడ ఒకప్పు డేర్పడియుండును. సంఘముతో సంబంధ మున్నంతవఱకు దేశాచారములను మనము పాటించితీఱవలెను. అట్లే ఔచిత్యము కావలసియున్నంతవఱకు కవీశ్వరులుకూడ కవిసమయములను పాటింపకతప్పదు. ఇక్కడ ఇంతగా ఈ మాట చెప్పవలసివచ్చుట ఎందుల కనఁగా-కల్పవృక్షకవితలో అనేక ఘట్టములలో స్వైరవిహారముగ ఇట్టి యాచారములను నెట్టివైచుచు క్రొంగ్రొత్తవి తెచ్చిపెట్టుచు, ఇవియే భావికవులకు ఉపాదేయము లన్నట్టు ఉపన్యాసములుసైతము వినవచ్చుట చేత.

ఈ ధోరణిలోనే ఈ రచయిత 'తద్భామలుచీనివస్త్రములును౦గన్గొంచు మున్నాడఁగా' [అర. 4 పే.] అని వ్రాసెను. 'చీనాంశుకమివ కేతోః' అని కొన్ని ప్రయోగములలో 'చీన' పదమును విన్నాము. చీన మనఁగా, నూలు-వస్త్రవిశేషము-దేశవిశేషము, ఇత్యాదిగ అర్థము లున్నవి. దుష్యంతుని కథలో చీనాంశుకప్రసక్తి ఉచితమా! అని కాలిదాసునే సంశయింపఁగా, కాలిదాసమహాకవినాఁటికే ఈ దేశములో చైనా దేశపు వలువలు సున్నితముగా ఉండునన్న వాడుక ఉన్నది కావున 'చీనాంశుకమివ' అనుటలో ఆక్షేపము లేదని తేల్చిరి. ఇక్కడ అది కాదు. జనకాత్మజాత ధరించిన భూమలు కట్టిన చీనివస్త్రములు మునిపత్నులు కాంచిరఁట. త్రేతాయుగములోని సీతమ్మకు, కైకమ్మ నారబట్టలు కట్టఁబెట్టి అడవులకు సాగనంపఁగా ఈ యరణ్యములో అవి మార్పించి ఈ కావ్యకర్త, మునిపత్నులు చూతురన్న భావముతోఁ గాఁబోలు 'చీనివస్త్రములను' దెచ్చి యిచ్చెను. సూర్యవంశపురాజులైన అయోధ్యాధీశులుకూడ త్రేతా యుగములో చైనాదేశమునుండి జిలుగువలువలు తెప్పించుకొని ధరింతురన్న ఒకానొక చారిత్రిక రహస్య మేమైన ఉన్నదేమో! ఆస్తాం తావత్!!

అడవిలో ఆ ముగ్వురును నడచుచున్నారు. లక్ష్మణుఁడు, చేతిలోఁ గత్తి పట్టి అడ్డమైన కొమ్మలు రెమ్మలు చెలగుచు దారి చేయుచుండఁగా మార్గాయాసము అనుభవించుచున్న జానకి ఇట్లన్నదఁట :—

"గీ. చెలువునొడ్డున విశ్రమించెదమ కాద యనిన జానకి శ్రీరాముఁ డనె నయోధ్య
వదలి విశ్రాంతికోఱకయి వచ్చినావె యనిన జానకి యటఁ గలదా యటంచు.

చం. అవున యయోధ్యలోఁ దెఱపి యంతని యింతని చెప్పనా! ధరా
ధవుఁడు సున్నమైకజీవి చనె దైవతలోకము బిడ్డయైన రా
ఘవుని వనంబుపోక కథ కట్టి నిరంతము స్రుక్కు తల్లి యు
న్న వదలినట్టి చెప్పులయినన్ బినతమ్ముఁడు కొల్వఁ డప్పుడిన్.

వ. అనిన తరువాత ముగ్వురును మాటాడకుండఁ గొంతదవ్వు పోయిన స్వామికిఁ గోపము వచ్చెనేమో యేదో తానే మాటాడవలయునని జానకి,

కం. మనము మరులు తీఁగను త్రొక్కినజాడఁ గానిపించుఁ గేవల మిది త్రో
వన వీలు లేదు చెఱు వనుకొనినది కన్పించ దడవికోనయె కాకన్.

శా. నా రాముం డనె నెంతయున్ మరులు కొన్నంగాదటే ఘోరకాం
తారంబున్ బతితోడ వచ్చుటనినన్ ధాత్రీజ ధర్మంపుబు
ద్ధ్యా రాజ్ఞైనది భర్తపై మరులు లేదన్నన్ రఘూత్తంసకుం
డారంభించు శిరఃప్రకంపముగ ముందై యేఁగె మార్గంబునన్.

కం. బొమముడి విస్ఫుటకోపాభిమానహృదయుఁడు రఘుప్రవీరుఁడు నడచెన్
శ్రమమునఁ గించిద్దుఃఖాభిమానహృదయాబ్జ యేఁగెఁ బృథ్వీసుతయున్'
(అరణ్య 7 పే.)

పదములకూర్పులో వచనము వేఱు - పద్యము వేఱు - కావచ్చును. అర్థమునుబట్టి పదములు వరుసగా నడువవలెనన్న నియమము పద్యములో లేకపోవచ్చునుగాని చేయి తిరిగిన రచయిత దానిని పాటించి చదువరులకు హాయి గలిగించును. ఏ పదము వెంట ఏ పదము గూర్చిన సొగసు గలుగునో సందేహము లుండవో మహాకవి ముఖ్యముగా గమనించును. అదియే ఒక విధముగా 'శయ్యగా' లాక్షణికులు పాటింతురు. 'విశ్రమించెదమకాదె యనిన జానకి' అన్న వాక్యములో 'జానకి యనిన శ్రీరాముఁ డనె' అన్న ధోరణిలో వాక్యమున్నచో అందముండును. కాని యిట్టివి ఈ కల్పవృక్షరచనలో బొత్తిగా పాటింపని కవితాధర్మము లన్నమాట మనము మఱువరాదు.

అసూర్యంపశ్యయైన జానకి నడువలేక నడువలేక ఏదో మాట వెంబడి 'చెఱువునొడ్డున విశ్రమించెదమ కాదె' అనఁగా విశ్రాంతికై అయోధ్య వదలి వచ్చినావా! యని ఆ భర్త అన్నాఁడఁట. 'అవును లే! అయోధ్యలో ఉన్న విశ్రాంతి యేమని చెప్పవలెను; స్నుషైక జీవియైన ధరాధవుఁడు పోయినాఁడు; దైవతలోకము బిడ్డయైన రాఘవుఁడు వనముపోక కథ కట్టి తల్లి నిరంతము స్రుక్కను. ఆ పురిలో, పినతమ్ముఁడు అన్న వదలిన చెప్పులయినను కొల్వఁడు అని జానకి యెదురు పల్కెనఁట! ఇంకేమున్నది? స్వామికిఁ గోపమురానే వచ్చెను. వచ్చెనని జానకి పసికట్టి తానే మాటాడించుకొనవలెనని తలఁచి 'ఈ యడవిలో మనము మరులుతీఁగను ద్రొక్కినట్లున్నాము.

డున్నాఁడో అచ్చట. ఆతఁడు (తానే) మునీశ్వరుల పాలిటి యముఁడు అనుటకు 'ఆయుః - దక్షిణదిక్ - మహేశ్వరుఁడు - సంహార - అద్భుతుఁడు' ఇంత 'సరంజామ్మ' ఈ కవికి కావలసివచ్చెను. మౌనులకు యమునివంటి వాఁ డన్నచో సరిపోవునట్టి ఈ ఘట్టములో 'ఆయుస్సులు' దేనికి! 'ప్రాస'కోసము. 'దిక్పాలక' ధోరణిలో 'దిఙ్మహేశ్వరుఁడు' దిగినాఁడు. ఆపైని పద్యము పూర్తి యగుటకు 'సంహారాద్భుతుఁడు' ఉద్భవించినాఁడు.

'శా. నామూపుం బడి యున్నయీటె యిది కన్నారే! మిముం గ్రుచ్చఁగా నే మూలా!' నా బుజాన ఉన్న యినుపగుదియ చూచితిరా అనుటకు మూపుంబడి వంటి ముచ్చట గూర్చు ప్రయోగము!! ఈ 'బడి' అడుగడుగునకు 'విశ్వనాథ' వెంబడిఁ బడి, తత్కవితావైలక్షణ్యమును నేర్చుకొనుటకు ఒక 'బడి'గా మనకు ఏర్పడి కన్పడును గాఁబోలు! మిమ్ములను గ్రుచ్చుటకు ఈ యీటె ఏ మూల - అవు!=దీని భావ మేమి తిరుమలేశ? అల్పాల్పులైన మీరు దీని కొక మూలకుఁ జాలరనియా! లేక - ఇప్పటికే దీనిలో నాల్గు పెద్ద పులులు మూఁడు సింహములు - రెండు తోడేళ్లు - పది లేళ్లు గ్రుచ్చఁబడి వ్రేలుచున్నవి; మీ కిఁక చోటు దొరకదనియా! ఏమి రచన స్వామీ! శబ్దములు మీ చెప్పినట్లు విననప్పుడు ఇది యొక కవిత్వ మని ప్రచార మెందులకు?

'తా నీ మందాక్షదృశాంత కావలయు నా కిల్లాలుగా' ఇది మఱొక రమ్యమైన పలుకు. 'ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి' అన్నదానికి ఈ తెలుఁగు ఎంతగా అందగించి యున్నదో విద్వత్కవులకే తెలియును. 'చరామి సాయుధో నిత్య మృషిమాంసాని భక్షయన్' అని వాల్మీకులు చెప్పిన ఒక్కముక్కకు 'విశ్వనాథ'వారు ఎంత భాష్య మిచ్చిరో సావధానముగా చిత్తగింపవలె.

'ఉ. ఈ నడుమన్ దపస్విజన మెవ్వరు రారిట పూటపూట బ్రా
చీనము నేస్తు పచ్చియొలచిన్ దినఁజాలక మొత్తిపోయె నో
హో! నరమాంసఖాది పులియున్ రుచి యచ్ఛమనుష్యమాంస మెం
తైన రుచో వచింపనగునా! మఱి స్నానము చేసి రండిఁకన్'

(అర. 9 పే.)

ప్రాసలో వేయవలసివచ్చిన 'ప్రాచీన' పదమునకు 'చలిది' యని అర్థము చెప్పుకోవలెనేమో! ఈ చలిది-ఏనుఁగు పచ్చిమాంసము పూటపూట తినఁజాలక విరాధుఁడు చచ్చిపోవుచున్నాఁడఁట. 'మనుష్యమాంస మెంతైన రుచో' - కమ్మని రుచి గల కవిత్వమ్ము సుమా! ఏమట్లోయి! మీ రిద్దఱు స్నానము చేసిరావలె! ఇది రక్షస్స్వామి ఆజ్ఞ. ఎవ రా స్నానము చేయవలసినది? భక్షకుఁడా! భక్ష్యములా! భక్ష్యములు కాఁబోవు ఇక్ష్వాకుల ఈ లక్ష్మయ్యాలే స్నానము చేయవలెనఁట. మడి గట్టుకొని కాఫీ త్రావినవారిని జూచితిమిగాని, ఆవుపేఁడవగ్గెరాలతో శుద్ధిపఱిచి కాఫీ త్రావినవారిని జూడలేదు. ఇంత స్నానతతంగ మెందులకనఁగా-సనాతనమ్మన్యులైన ఈ కల్పవృక్షకర్తలు కేవలము మడిగట్టుకొని 'నందమూరు శ్వేత లింగము' సాక్షిగా తెలుఁగువారికి ప్రేమతో ప్రసాదించిన ఈ 'వర్ణాశ్రమధర్మశాస్త్ర' సూక్తులను భక్తిప్రపత్తులతో మనము విని ఆచరించి తరించుటకు.

పతియు మఱఁదియుఁ జేతఁగానివారై అట్లె చూచుచుండఁగా వారివంక బిక్క-మొగముతోఁ జూచుచు పెనగులాడుచున్న సీత నదలించి 'కల్పవృక్ష' విరాధుఁ డిట్లన్నాఁడు:-

> శా. 'మీ దే దేశము మీరలున్ ద్విజులెకా! మీ నామధేయంబు లె
> ట్లై దీపించును! శూద్రమాంసమును వాడన్ నేను మీ రిట్టిరం
> చాదిం జెప్పఁ దెలుంగ రానిదగు నే యన్నంబు నే ముట్ట శూ
> ద్రాదుల్ శూద్రజనుల్ భుజింతు రటవీపర్యంత మేదైననున్'
>
> [ఆర. 9 పే]

'నిత్యం ఋషిమాంసాని భక్షయన్' అని చెప్పుకొన్న వాల్మీకి విరాధునకును-విశ్వనాథ విరాధునకును వాల్మీకి - విశ్వనాథుల కున్నంత భేద మున్నది. ఆతఁడు కేవలము ఋషిమాంసమే నాకుఁ జాలు నన్నాఁడు. 'పాపిష్ఠ' కలియుగములో ఇరువదవశతాబ్దిలో ఉద్భవించిన ఈ కల్పములోని విరాధుఁడు సామాన్యుఁడు కాఁడు; నిత్యము 'వైదిక' భోజన మారగించు సనాతనాచారనిష్ఠాగరిష్ఠుఁడు. అసలు - ఈతఁడు పాపము శూద్రమాంసమును వాడనేవాడఁడఁట. పులినైన

భక్షింపవచ్చునుగాని క్షుద్రుఁడైన ఆ 'వెధవ' శూద్రుని మాంసమును భక్షింపరాదని విశ్వనాథులవారు సెలవిచ్చిరి. పోనీ! ఈ తీరుగనైన వీరి రాజ్యములో 'శూద్రులు' బ్రదికిపోయెదరు!! 'ఫలానా' అని ఎఱుంగరానిదగు అన్నమును ఈతఁడు ముట్టనేముట్టఁడఁట! అడవిలో ఏదైననున్ భుజించువారు క్షుద్రజనులఁట. ఇట్టి 'నిష్ఠాగరిష్ఠత్వమును' నిత్యము త్రికరణశుద్ధిగ పాటించువారు కాఁబట్టియే కాఁబోలు ఈ కల్పవృక్షకర్తలు, విరాధునిచేత రామలక్ష్మణులను 'మీరలున్ ద్విజులె కా' అని ప్రశ్నింపఁజేసిరి. ఔరా! దురవగాహములైన ఎంతటి ధర్మసూక్ష్మములను కాంతాసమ్మితమైన ఈ కల్పవృక్షమహా కావ్యము మనకు బోధింప నేర్చినది?

మీరు దొంగ 'వెధవల'వలె నున్నారు. ఇద్దఱు పురుషులకు ఒక్క ఆఁడుదిమాత్రమే ఉన్నది కావునను మునివేషముతో మోసము చేయుచున్నారరు కావునను మీరు వట్టి పాపాత్ములరు – అని ఇంతకు ముందు వేవగించుకొని ఈ విరాధుఁడు ఇప్పుడు 'మీ నామధేయంబులు ఎట్లె దీపించును' అనుటలో అందచందములుగాని ఔచిత్యవైఖరిగాని కల్పవృక్ష కవిత్వమునకే తగియున్నవి.

వ. అంత జానకీదేవి శ్రీరామచంద్రునితో నిట్లన్నదఁట:–

శా. 'నాకున్ దూరము పోతి దగ్గఱయి యున్నన్ వీఁడు నన్ముట్టునా
నీ కత్తిం జెయి రెండుముక్క లగుఁగానీ! నవ్వులాట్మాటలన్
డీకల్ చేసెదు మాటమాటకును బట్టింపైన నీ కానలో
నే కోనం బడి యేమి యే మగుదునో యిప్డిట్లు లైతింగదా!

గీ. ప్రభువ! నీదుపెడఁద భార్యయంచుండు నా తల్లి లేదు నీకుఁ దండ్రిలేఁడు
పరమదైవమంచుఁ బ్రార్థించుచుంటిని నను క్షమింపుమయ్య! నాథనాథ!'

ఒక యిల్లాలు మగనితో 'నాకున్ దూరము పోతి' వనుటలో ఎంత సొగసు ఉన్నదో విచారింపవలెను. లోకములో సామాన్యముగా మనము చూచు 'మామూలు' కొంపలలోని ఆలుమగల నడుమ నవ్వులాట్మాటలలో మాటపట్టింపులు వచ్చుట – బిఱ్ఱబిగియుట–మూతి ముడుచుకొనుటవంటివి ఈ సీతారామచంద్రమూర్తుల లోను ఉన్నవన్న క్రొంగ్రొత్త వార్త వినిపించుటకా ఈ కల్పవృక్షము

భూలోకమునకు అవతరించినది! ఇట్టి మాటపట్టింపులే పెట్టుకొని ఈ కానలో నన్నేమి చేసెదవని ఆ'మహాతల్లి' ఈ రామచంద్రప్రభువును యాచింపవలసివచ్చెనా! అట్టి దురవస్థయే కలిగించువాఁడుగా అన్నాళ్లు - అన్నేండ్లు దాంపత్యమందలి అనుభవముచే గుర్తించి యున్నచో ఈ తీరుగ వెంటఁబడి రాక అయోధ్యలో అత్తలపొత్తు ననే ఆమె కాలక్షేపము చేసెడిదికాదా! వాల్మీకి వర్ణించి మన కిచ్చిన ఆదర్శదంపతులగు సీతారామచంద్రుల శీల మిట్టిదనియు 'తగాదా'లిట్టివనియు వీని ఫలిత మిట్టిదనియు మనకు బోధింప నవత రించిన ఈ 'కల్పము' నిజముగా ఈ దంపతులను నిలువునఁ గోసివేసి హత్య చేసినట్లే ఎంచవలెను. వాల్మీకి మనకు రామాయణము మూలమున 'స్వర్ణమయ' పాత్రల నిచ్చి ఆరాధింపవలెనని బోధింపఁగా ఆ పాత్రలకే ఇంత చిలుము పట్టించి నా 'శిల్ప'ములో వైలక్షణ్య మిది యని ఊరించి మురిపించి, తీర-లోఁతులు తడవి చూడఁగా ఆ పాత్రలు వట్టి 'అపాత్రులు'గా తయారు చేసిపెట్టిన కల్పవృక్ష కవిత్వమును తెలుఁగు వారెట్లు మన్నింతురు?

'ప్రభువ! నీదు నెడఁద భార్య యంచుండు'— ఈ ముక్కకు 'సరాసరి' అన్వయము తీయలేము. ప్రభువ! అనఁగానే ఎవ్వఁడో ఒకానొక 'నౌకరి'స్ఫురించును. 'నా తల్లి లేదు; నీకుఁ దండ్రి లేఁడు'— ఈ ధోరణి 'చల్ మోహనరంగా' పల్లవిలోఁ జేరఁదగినది. 'పరమ దైవమంచుఁ బ్రార్థించుచుంటిని'— ఎప్పుడు? వెనుక ఎప్పుడో! ఇప్పుడు కాదా ఏమి! వర్తమానము అయినచో ఉంటినని భూత మెందులకు వచ్చిపడినది! ఈ భూతమును వర్తమానములోఁ గలిపి మనకుఁ జూపుట కల్పవృక్ష కవిత్వరీతి కాఁబట్టి. 'నాథనాథ!' అనఁగా నాథులకు నాథుఁడా! నాథునకు ఆమ్రేడితమా! 'నాథమాని' సహ పంక్తిలో ఉండఁదగిన మధురమైన పదము మఱొక్కటి విశ్వనాథుల వారి ఈ'నాథనాథ'.

జానకీ పరమ దీనాలాపములు విన్న శ్రీరాముఁడు తమ్మునితో ఇట్లన్నాఁడఁట!!

'మ. వలదన్నన్ వినెనా! ధరాతనయ నావంకం బరిభ్రాంతయై
బలవంతంబుగ వచ్చె నివ్విధముగాఁ బంచెన్ గటా! యొల్లమే

ధిలు లే ఱందురు పుచ్చుని ల్వెంచి వైదేహీసమారక్షణ
స్ఖలితుం డా రఘురాముఁడే తగును నాఁగాఁ బ్రయ్యాగాఁ బల్కరే.'
(10 పేజి)

ఇంతకుమున్ను ఇరువదిమూఁడవ పద్యములో మరులుకొని నావెంటఁ బడితివని మగఁడైన శ్రీరాముఁ డన్నట్లును - కాదుకాదు ధర్మంపుబుద్ధ్యా వచ్చితినేగాని భర్తపై మరులు లేదని ఆ యిల్లాలు సీతమ్మ అన్నట్లును వ్రాసిన కల్పవృక్షకర్త, ఆ చేతితోనే 'ధరా తనయ నావంకం బరిభ్రాంతయై బలవంతంబుగ వచ్చెనుగదా! తమ్ముఁడూ' అని వ్రాయుటలో అంతరార్థ ముండునని తచ్ఛిష్య మండలి ప్రచారము చేయవచ్చును. నాకు ఈ భర్తమీఁద మరులు లేదని ఖండితముగా ఆ సాధ్వి చెప్పినట్లు వ్రాయుట, నాయందలి 'భ్రాంతి' చేతనే ఆమె అడవికి వచ్చినదని ఆ మహాపురుషుఁ డన్నట్లు మనకు విన్పించుట క్షమింపరాని మహాపరాధమనియే నా భావము. అపై, ఆమె బలవంతముగా వచ్చుటఁజేసి 'ఇవ్విధముగాఁ బండెనఁట' ఆ పండినవి యేవి? పాపములా! పున్నెములా! ఆ మహాసాధ్వి నోఁచిన నోములా? ఈ కథను విన్న ఎల్ల మైథిలులు ఏమందురో యని రామయ్య సందేహమఁట. మిథిలయనఁగా జనకుని పట్టణము. మైథిలి యనఁగా మిథిలానగరాధీశుని బిడ్డయగు సీత. ఇక్కడ - ఈ మైథిలులకు మిథిలావాసులని అర్థమా! మిథిలానగరాధీశుని తక్కిన తనయలని భావమా!

'గీ. పితృవియోగాదు లవి దుఃఖవెట్టు బెట్టుగాని జానకి దుఃఖము కరణిఁ గావు తల్లివరములు జానకిఁ దగులవలెనె నిన్నుఁ దగిలినయది చాలదన్నయట్లు' (10 పే.)

ఇందును గొంత 'కల్పవృక్ష' సృష్టి చూడవచ్చును.

'శ్లో. పరస్పర్యాత్తు వైదేహ్యాః న దుఃఖతర మస్తి మే, పితు ర్వియోగాత్సౌమిత్రే! స్వరాజ్యహరణా త్తథా' — ఈ మాటకు పయిమాట తెలుఁగు. 'ఈ వైదేహిని లాఁతివాఁ డెవఁడో అంటు కొన్నాఁడనఁగా కల్గిన దుఃఖము వంటిది తండ్రి పోయిననాఁడుగాని నా రాజ్యము నాకు దక్కనినాఁడుగాని నాకుఁ గలుగలేదు

తమ్ముఁడా !' అన్న దానికి తల్లి పరిహాసలు ఇత్యాద్యుత్సన్నా, 'కల్పము' కలిపినది. ఈ యన్న, యన్నమాటలకు సౌమిత్రి అన్నమాట ఇది.

> 'శా. అన్నా ! నీవనినట్టి మాటలవి నా కర్థంబు కాలేదు వీ
> ఁడన్నన్ నీకన నేకబాణరుధిరవ్యాసక్త మృత్పిండమా
> నెన్నన్ దల్లికి నంత చేద్వదెదు నీవేలా ధరాజాత యం
> దున్నన్ నిల్వక దూరమేగితివి నీవున్నావటం చెంచితిన్.' (11 పే.)

పై మాటలు సౌమిత్రి కర్థము కాలేదఁట, మన కర్థమైన ఆ పైమాటలు సౌమిత్రి కర్థము కాలేదుగాని, సౌమిత్రి యన్న మాటలలో రెండవ చరణము బొత్తిగా నా కర్థము కాలేదు. ఏదో దూరాన్వయముగా లాగవచ్చునుగాని అది దురన్వయము కాక తప్పదు. నీ మాటలు నా కర్థము కాలేదన్నది 'వ్యవహారధోరణి' కావచ్చును. నీయంతవాఁడు ఈ రీతిగా విచారపడుట న్యాయము గాదు–ఇత్యాదిగ లౌకికధోరణి యని సారస్యము లాగవలెను. 'వీఁడన్నన్'లో అరసున్న ఉన్నదిగదా యని అరసున్నతో చరణము ప్రారంభించుట [ఁడన్నన్] వ్యాకరణపుపోకులలో అపూర్వమైన పోకు. ఈ ఒక్క–చోట అచ్చుతప్పుగదా అని సరిపెట్టుకొందుమన్న అక్కడక్కడ మఱికొన్ని ఈ యవతారములే కానవచ్చుచున్నవి. పూర్ణానుస్వారముతో పంక్తి ప్రారంభించి బడిలోనిపిల్లలు వ్రాఁతలు వ్రాయఁగా హేతు వడిగినప్పుడు పైపంక్తిలో ఆ యక్షరము (౦) 'పట్టలేదండి' అనెడి మాటలు జ్ఞప్తికి వచ్చుచున్నవి. దీని కాధారముగ ఈ కల్పవృక్షకర్తకు–వ 'లింగయ్య' వ్యాకరణ మున్నదో! లేదా నా మాటయే 'అనుశాసన' మందురో! చూడవలెను.

పిట్టపిడుగువోలె ఆకస్మికముగ వచ్చిపడిన ఈ యాపదఁ గడవఁబెట్టునుపాయము మాట చూడక, ఏమయ్యా! ధరాజాత అందుండఁగా నీవు నిల్వక దూరమేగితి వెందులకు? నేనేమో నీవున్నా వుగదా యని యెంచితినే యని రామానుజుఁడు రాముని నిందింపఁ బూనినట్లు కల్పవృక్షము వ్రాయుటలో అర్థము లేదు; అందములేదు. 'జగదేకధన్వి' అని ముద్దు వచ్చెడి మంచిపదము, ఈ రచనలో 'ధరణి సర్వావలయధానుష్కరత్నము'గా అవతార మెత్తినది. 'అటవిన్ తిరిపపుందిండికి మఱగి–ఈ యటవి త్రోవ చెఱిచెద'వని విరాధునితో

లక్ష్మణుఁ డనును. విరాధుఁడు భిక్ష మెత్తుకొనువాఁడుగాని 'సీతా రామాభ్యాం నమః' బాపతుగాని కాఁడే. తిరిపపుఁదిండి ఎట్లగును? శిక్షావిరహీ! అని విరాధుని బిలుచుటలోని 'విరహీ' శబ్దమును మెచ్చుకోవలెను.

చం॥ 'అనిన విరాధుఁ డంత వికటాట్టముగా నగి మీర లెవ్వ రెం
దునకును బోవుచుంటిరని తొల్లను నే నడుగంగ మీరు చె
ప్పినయది లేదు నన్నడుగఁ బేర్చితి మామకముష్టిక్షిప్తజీ
వనులకు నింతగాఁ దగదు బాణచయంబు మదప్రయుక్తమా.

మ॥ అనినన్ స్వామి విరాధుతో ననియె నీ వన్నట్లు మేమే వచిం
పనునా మున్నుగ రామలక్ష్మణులమున్ వైదేహి యా దేవి యా
మెను నే దొంగిలలేదు మైథిలసభామేధ్యోర్విఁ గంకాలభృ
ద్ధనువున్ వంచి గ్రహించితిన్ బితృవచస్తాత్పర్య మీ రాకకున్

కం॥ తనకోప మభినయింగాని తన యాదర మవనిజీవితనయ యెఱుంగం
గను స్వామి పలుక లక్ష్మణుఁ డనుకొనె మర్యాద యేల నంచు దితిజుతో

వ॥ అంత దైత్యుం డిట్లనియె'.

[అర. 11 పేజి]

మీ రెవ్వరు! ఎక్కడికిఁ బోవుచున్నారని నుంగే నే నడుగఁగా సమాధానము చెప్పరైతిరని విరాధుఁడు 'నన్నడుగఁ బేర్చితి' యనును. పేర్చుధాతువునకు అతిశయించు, విజృంభించు – అని యర్థము చెప్పవలెను. నన్నడుగఁ బేర్చితివి – అని అన్వయింపఁగా 'మీరు చెప్పినయది లేదు; నన్నడుగఁ బేర్చితివి' అని వింతవాక్యము సిద్ధమగును. ఈ కవనములో 'వచన' వ్యత్యాసములకుఁగాని 'పురుష' భేదములకుఁగాని 'కాల' వ్యత్యయములకుఁగాని పట్టింపు లేదుగావున ఇట్టివి సరిపెట్టుకోవలసియుండును. పద్యముతుదిని పాదపూరణార్థమై అవతరించిన 'మదప్రయుక్తము'నకు అర్థము విచారింపవలసిన అక్కఱ యే లేదు. 'అనినన్ స్వామి' పద్యములోని 'రామలక్ష్మణులమున్' సముచ్చయము గణమున కక్కఱకు వచ్చిపడిన పడికట్టుఱాయి. మైథిలసభామేధ్యోర్విలో కంకాలభృద్ధనువును నేను వంచి ఆ దేవి వైదేహిని నేను గ్రహించితిని; ఈ రాకకున్ పితృవచస్తాత్పర్యము

(హేతువని అధ్యాహార్యము చేసికోవలెను గాఁబోలు!) అని అన్వయము. మధురాతి మధురములైన గీర్వాణాంధ్రపదము లిన్ని మన చేతిలోనుండఁగా అమేధ్యమును స్ఫురింపఁజేయు సభా 'మేధ్యో' ర్వి 'కంకాల' భృద్ధనువులే ఈ కవిసమ్రాట్టునకు దొరకె ననఁగా వీరి పాండితీప్రకర్షమునుగూర్చి కవితాఘనతనుగూర్చి మన మేమనుకొన వలెను? మేధ్యమనఁగా - పవిత్రము; కంకాలమనఁగా - చర్మమాంస రహితమైన యొడలి యెముకలగూడు, డొక్క అని యర్థము. కంకాలభృత్తు - పరమేశ్వరుఁడు కాఁబోలు. ఆయన ధనుస్సు అనఁగా 'శివధనుస్సు'నకు వచ్చిన తిప్పలు. మహేశ్వరుని 'కపాలి' యని 'కపాలమాలి' యని 'పునుకతాలుపు' అని పిలుచుట వింటిమి గాని 'కపాలభృత్తు'ను వినుట - ఇదంప్రథమము. భాషలో ఈ పదము లేదని కాదు; రచనలో దీనికి సొగసు లేదని. పితృవాక్య పరిపాలనార్థమై ఈ యడవికి మేము వచ్చితిమన్న అర్థము 'పితృ వచస్తాత్పర్య మీూ రాకకున్'లో గర్భితమై యున్నదనవలెను. విరా ధునితో శ్రీరాముఁడు చెప్పిన ఈ మాటలనుబట్టి, అంతకు మున్ను సీతయెడ తాను జూపిన కోపము వట్టి అభినయ మనియు, అవనిదేవి తనయయందు తన కెంతో ఆదర మున్నదని ఆమె యిప్పుడు గ్రహించిన దనియు కల్పవృక్షకర్త వ్యక్తపఱచెను. ఈ 'కల్పము'లోని కార్య కారణ సంబంధములకు 'కొబ్బరిచెట్టు - దూడమేఁత'కు సంబంధము చక్కఁగాఁ గుదురుచుండును. 'మేము రామలక్ష్మణులము - ఆమె వైదేహి; ఆమెను నేను దొంగిలింపలేదు; మైథిలసభలో శివధనుస్సు వంచి గ్రహించితిని. తండ్రిమాటనుబట్టి మేము అడవులకు వచ్చితిమి. ఇది గదా విరాధునితో శ్రీరాముఁడు చేసిన సంభాషణము. దీనిలో, వెనుక చూపిన కోపము వట్టి అభినయమన్నమాట ఎక్కడిది? లేదా - తాను అంతకుమున్ను ఆమెను గోపించితి ననియు అది వట్టి 'తమాషా' అనియు, ఆమె యనఁగా నా కెంతో మక్కువ యనియు 'ఎఱుంగను స్వామి వలుక'లో అధ్యాహార్యముగా మనము ఊహింప వలెనేమో! తన కోప మభినయమని విరాధ సంభాషణములో చెప్పినంతమాత్రాన శ్రీరామునకుఁ గలిగిన ప్రయోజనమేమి! ఈ యాలుమగల నడుమ కొంగ్రొత్తగా తెచ్చిపెట్టిన ఈ కలహము

నకు ఈ ఘట్టమువలన ఈ కవి సాధించిన లాభ మేమి! 'పరాయి' వాఁడెవ్వఁడో పట్టపగలు అన్నదమ్ముల కట్టెదుట బిట్టుగ విజృంభించి ఈ తీరుగ పట్టపురాణిని జేపట్టి ఎత్తుకొనిపోవుచుండఁగా - 'అలో లక్ష్మణా!' యని ఆమె అఱచుచుండఁగా, వాఁ డడిగెనుగదా యని తీరికగ మేము 'ఫలానా' యని పేరుపేరున ఊరిపేరులు ఆ యన్నదమ్ములు చెప్పుకొందురేగాని ఆ దుర్మార్గుని ఎట్లు చంపవలెనో ఆమె నెట్లు విడిపింపవలెనో వెంటనే ఉద్యుక్తులైనట్లు మనకీ 'కల్పము' చెప్పదు. జానకీపరమదీనాలాపములు విన్న వెంటనే, 'అయ్యో! సీతను గోపించితిని. అది కోపము గాదు. అభినయము' అని రాముని నోట అనిపించియున్నను కొంత మేలు కలుగవచ్చు. అట్టి యౌచిత్యములు ఈ కల్పమునకు నచ్చవు. అక్కఱ లేని ఆధారము లేని 'వింత కల్పనలు' కల్పించి 'పప్పులోఁ గాలు వేయుట' కల్పవృక్షకర్తకు పరిపాటియైపోయినది. రామస్వామి పలికిన వెంటనే లక్ష్మణస్వామి 'దితిజుతో మర్యాద యేలనంచు అనుకొనె'నఁట. దితిజునితో అనుకొనుటయేమో అర్థము కాలేదు. అనుకొనునది ఎవ్వఁడైనను దనలోఁగాని ఇతరులతోఁ గాదుగదా. లేదా - దితిజునితో మర్యాద యెందులకని లక్ష్మణుఁ డనుకొనెనని అర్థముచేసి మన మనుకొనవలెను. విసిరివేసినట్లు ప్రయోగించిన పదములవలన ఇట్టి అన్వయముల బెడద ఈ కావ్యములో అడుగడుగునకు ఎదురగుచుండును. ఏలనంచు లో 'ఏల' ద్రుతమయ్యో నేల! యనుట గొంగడిలో వెంట్రుక లేరనట్లే.

'వ. అనిన విరాధుఁడు నవ్వి మీరు నన్నుఁ జంపెద మంటిరిగదా? సీత వదలిన నేటికిఁ జంపెదరన్న రాముండు కుపితుండై యిట్లనియె.' [అర. 12] 'వదసార' మిది రెండుబంతుల వచనపుముక్క. సీత వదలిన-అనఁగా సీతను వదలిన యని యర్థమా! సీతయే మిమ్ములను వదలిన యని భావమా! పిండితార్థము తాను ఆమెను విడిచెదననియా! విడువననియా! ఎందులకీ ద్వైధీభావము! శంకాస్ఫూర్తి! ఇట్టి సందేహములు స్ఫురింపకుండ ఒక్క పదిపంక్తులు తుదకు వచనమైన వ్రాయలేనివారి సాహిత్యభండారమున కింత పటాటోప మెందులకో! 'శా. సృష్ట్యాదిన్ దితిసంతునన్ మొదటివాఁడే నీవు. [12 పేజి]

మొదటివాఁడే నీవు' – ఇది మధ్యమపురుషము. ప్రథమాంతమగు యుష్మద్విశేషణమునకు ఏకత్వమున 'వు' వర్ణము వచ్చి 'మొదటివాఁడవే'అని కావలయునని వైయాకరణులు చెప్పి 'ఆర్తిహరుఁడగు నినుఁ గొల్తు'వంటి ప్రసిద్ధప్రయోగములను మనస్సులోఁ బెట్టుకొని ఇట్టి యాగమములకు ప్రాయికత్వమును విధించిరి. అనఁగా యుష్మదస్మద్విశేషణములకు ఏకత్వబహుత్వములలో 'వు – ను – రు – ము'లు అంతాగమములుగా వచ్చుటయే ముఖ్యమని వారి సిద్ధాంతము. ఎవ్వరైన నూటికిఁగోటికి 'గర్వగరిష్ఠుండగు నన్ను – మీరలు పెద్దలు' వంటి ప్రయోగములు ప్రసిద్ధమైనవి ప్రయోగించినచో గ్రహింపవచ్చునని అన్నంత మాత్రాన అట్టి ప్రయోగములే నాకు శరణ్యమనుట ఉత్తమ కవిత్వలక్షణము గాదు.

ఈ కల్పవృక్షములో ఇట్టి కకుర్తి ప్రయోగములకు లెక్కలేదు. ఇట్టివి మచ్చునకుఁ గొన్ని యిచ్చెదను:—

1. పరమభక్తాగ్రగణ్యుఁడైన పుత్రుఁడ నేను బాల 4 పేజి
2. మీరలు శ్రుతధర్ములు లోకారాధ్యులు నార్తధర్ములు ,, 27
3. నేను నింతటఁ బ్రసన్నేంద్రియ మానసుండై మహోగ్ర తపంబు నాచరింతు ,, 253
4. క్రీడా మత్సరుఁడైన నేను ,, 303
5. ఏ వైదేశికుఁడై చరించెదవో [అయో 55
6. నీ యలసటఁ దీర్చుకొనుము నిద్రాగతుఁడై ,, 136
7. చనుచుంటి నేను దారిపొడుగునం...దుఃఖనిహన్యమానుఁడై ,, 190
8. వారిలోన నుజ్జ్వల తరుఁడేను ,, 247
9. తెలియనాడఁగ నామె కుమారుఁడీవు ,, 328

వంతునకు గంతు వేసినట్లు, ఇట్టివి తెలిసియే ప్రయోగించితిననవచ్చునుగాని వీని 'కకుర్తితనము' కొట్టవచ్చినట్లు ముందే కన్పించితీరును.

'రాముఁడు నాలుగమ్ములన్ 59 పద్య. ఉ. నాలుగు ముక్కలై

నరకినన్ జెడి ముక్కలు నాల్గు (60 ప) [అర......12] రాముఁడు నాలుగమ్ములను ప్రయోగించి విరాధుని శూలమును నాలుగు ముక్కలుగా నఱకెనని కల్పవృక్షకర్తృవివక్షితము. తద్బాణ ప్రయోగము-తత్ఫలితముమాట యెట్లున్నను ఏతత్ప్రయోగమువలన ఈ యర్థము సూటిగా వచ్చునని చెప్పవచ్చునా!

'ఇరుబాసలదిట్టయై రసజ్ఞమౌళియై సన్మతిధురీణకవిత్వకళోగ్ర కార్తికేయుండగు' వేంకటేశ్వరుల పరీక్షలోఁ బడి, సంకుసఁ బోసిన తీర్థమై చనిన ఈ కల్పవృక్షములో అచ్చువేసి యిచ్చిన ఈ పద్యమును - దీని 'పోజును' ఒకసారి చిత్తగింపవలెను.

'కం. బెరసి విరాధుఁ డగమ్యవు
ఁదెరువునఁ గొనిపోవుచుండె ధీశరథుల' [అర 14]

అగమ్యవుఁదెరువంట - ఆపైని 'ఁదెరువు' - అని పంక్తి ప్రారంభమఁట!! ఏమి కవనము స్వామీ! ఏమి తెలుఁగు వ్యాకరణము బాబూ! ఆడలేక మద్దెల ఓడు అన్నట్లు, ఉన్న వ్యాకరణమును పాటించి ఒద్దికగా నాలుగు ముక్కలు వ్రాయలేక తెలుఁగునకు వెలుఁగు గూర్చు వ్యాకరణమే లేదనియు చాలిచాలని ఈ దీపము మన కెందులకనియు' బోధించువారి వ్రాఁత లిట్లే యుండును.

శా. 'నన్నన్నన్ బరిరక్ష చేసెడుఁ బ్రతిజ్ఞాబుద్ధి సౌమిత్రి వ
చ్చె న్నేఁడాతనికైన నిష్క్రియత వచ్చెన్ ఘోరశైలాభుఁడై
త్వ న్నిల్పోవఁగ లేకపోయెదరు నేనో! క్రూరజంత్వాస్యమం
దన్నం బైతిని నీ వరంబుల ఫలం బైనాము శ్వశ్రూ! యిదే' [అర 147]

సీత అనుచున్న మాట. నన్నున్ + అన్నన్ = నన్ను నన్నన్ - నన్ను - ఆపైని అన్నగారిని అన్న భావము. ఈ భావము సూటిగా రావలెనన్న నన్ను నన్ననుగానీ, 'సర్వమున్నతని'వోలె 'నన్నున్నన్నను'గాని ప్రయోగింపవలెను. 'స్థితస్య గతిశ్చింతనీయా' ధోరణిలో చూతుమన్న 'నన్ను - అన్నన్ = అనఁగా' అని కూడ అనిష్టార్థము రావచ్చు. అక్కఱలేని పట్టులలోనే అహంపూర్వికతో వచ్చిపడెడి బండ్లకొలఁది సముచ్చయముల పొదిలోనుండి

ఒక్క సముచ్చయము ఇక్కడికి వచ్చి దర్శన మిచ్చియున్నచో ఎంతో ముచ్చటగా నుండునే. సరే! నన్నును అన్నగారిని రక్షింప వలెనని ప్రతిజ్ఞ పట్టి సౌమిత్రి మాతోపాటు వచ్చెను. కాని, నేడు ఆతనికైన నిష్క్రియత వచ్చెన్ – దీని భావమేమి! నిష్క్రియత యనఁగా నిష్కృతి యనవచ్చునా! అప్పు డా పదమునకు 'చేయమి' అని అర్థము లాగి, మొత్తముగా 'ఆతనికి నేఁడు చేయమి వచ్చెనని' చెప్పవలెనేమో! అనఁగా రక్ష చేయఁబూని వచ్చిన లక్ష్మణుఁడు నేఁడు ఈ రాక్షసునినుండి మమ్ము రక్షింపలేఁడయ్యెనని భావింప వచ్చును. ఈ భావములో 'ఆతనికైన' అన్న పలుకుబడిలో సార స్యమే లేదు. గణముకోసమై పాదముకోసమై 'ఐన' కానీ 'చెప్పి రిను' 'ఏనియు' 'బడి' 'మఱి' 'అంచునున్' 'ఇంకనున్' – 'లేదు నున్' – ఇత్యాదులు వేసికొని కాలక్షేపము కావించు కవిత్వము లోని 'పస' బట్టబయలు కాకపోవునా! 'దైత్యున్ నిల్పఁగ లేకపోయెదరు' – ఈ నిల్పఁగలేకపోయినవా రెవ్వరో ముందు వెనుకలలో కానరారే! ఆపదలో నున్న సీతకు రక్షణకర్తలు కానరానట్లే ఆ పదములలో మనకు అసలు 'కర్తలు' కానరావయ్యె. ఆపైని, కల్పములోని మహాసాధ్వి సీతామహాదేవి అత్తగారి మీఁద విసిరిన విసు రిదిగో! — 'నీ వరంబుల ఫలంబైనాము'! ఈ విసురు వంటి విసురు ఒక్కటైనను వాల్మీకి ఈ ఘట్టములో సీతచే విసిరింప లేకపోయెను. ఇట్టిదేసుమా కల్పవృక్ష కవిత్వ వైలక్షణ్య మనఁగా!

'ఇద్దఱు, దైత్యుబాహువులను గత్తివాదరచే బ్రద్దలు చేసి దైత్యుని లేవకుండఁగ యట్టిటు వహించిరి.' [అర. 14 పే.] బాహువు లను – త్రుంచెదరు; లేదా నఱికెదరు. ఇక్కడి 'బ్రద్దలు' ప్రాస కోసము వచ్చిపడినవి. 'వహించు' ధాతువునకు 'తాల్చు – మోయు' అని యర్థములు. యతికిఁ గలిగిన దుర్గతినిబట్టి 'అదిమిపట్టి'రన్న యర్థ ములో 'వహించి'రన్న ధాతువును ఆశ్రయింపవలసివచ్చెను. 'ధాతు పుష్టి'లేని వ్యక్తుల భండార మిట్లే మిణకరించుచుండును.

'మఱిన్ వీని కంఠావిద్ధంబుగఁ గాలితోఁ గదలకుండన్ నొక్క దన్ నేనునున్' మఱియున్ – అన్నదానికి 'మఱిన్' వంటివి

ఈ కవిత్వములో గణములకు ప్రాణములు పోయు అవతారములు. వీని కంఠావిద్ధముగ - అని సమస్తపదముగా ఊహింపవలెనన్నచో ఈ కవిత్వమున కూఁతగట్టిదైన ఏకదేశాన్వయ దోషము రాకమానదు. 'వీనిన్ నేనునున్ నొక్కెదన్' అని అన్వయింపవలెన్న 'వీనిఁగంఠా' అని అచ్చులో నుండవలెను. ఆపైని 'ఆవిద్ధ' మఁట. ఏ పద్ధతిలోఁ జూచినను దీని కర్థమే కుదురదాయె. ఆవిద్ధ మనఁగా చక్కఁగా తొలువఁబడినది; పంకరయినది, అని నిఘంటువు. ఇదియు ప్రాసలో దాపరించిన యమపాశమే. అర్థమునుబట్టి అందమునుబట్టి ఉండఁదగిన 'నేను' కల్పవృక్ష సనాతనాచారమును బట్టియు గణపూరణమునుబట్టియు 'నేనునున్'గా సిద్ధమైనది.

'వీనిని మారణముఁ జేయు త్రోవ మసలదు నాఁగన్ దా రాక్షసుండు నిట్లనె — [15 పే.] వీథిపురాణవైఖరిలో వ్రాసిన ఈ వాక్యములో మసలదనఁగా అసలు కావలసిన అర్థము పొసగదు. త్రోవ, 'కుదురదు - కన్పింపదు' ఇత్యాదిగ ఏదో అర్థము కావలసియున్న ఈ వాక్యములో యతికోసమై మసలదనఁగానే కవిత్వములోఁ జేరునా! 'వాచ మర్థోనుధావతి'లోఁ జేరిన ఆర్షకవులవోలె వేషములు వేసినంతమాత్రాన ఆటలు సాగునా? తా రాక్షసుండఁట - ఈ తానులు ఈ కల్పములోఁ దప్పవుగదా!

విరాధుని గోతిలోఁ బెట్టినఁగాని చావఁడేమో యని రాముఁడన్నమాట విని విరాధుఁ డీ విధముగాఁ బలికెను. —

శ్లో॥ 'హతోఽస్మి పురుషవ్యాఘ్ర! శక్రతుల్యబలేన వై,
మయా తు పూర్వం త్వం మోహా న్నజ్ఞాతః పురుషర్షభః,
కౌసల్యాసుప్రజా రామ! తాత త్వం విదితో మయా,
వైదేహీ చ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః,
అపి శాపా దహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుం,
తుంబురు ర్నామ గంధర్వ శ్శప్తో వైశ్రవణేన హ,
ప్రసాద్యమానశ్చ మయా సోఽబ్రవీ న్మాం మహాయశాః,
యదా దాశరథీ రామ స్త్వాం వధిష్యతి సంయుగే,
తదా ప్రకృతి మాపన్నో భవాన్ స్వర్గం గమిష్యతి,

ఇతి వైశ్రవణో రాజా రంభాసక్తం పురానఘ,
అనుపస్థీయమానో మాం సంక్రుద్ధో వ్యాజహార హ,
తవ ప్రసాదాన్ముక్తోఽహ మభిశాపాత్సుదారుణాత్,
భువనం స్వం గమిష్యామి స్వస్తి వోఽస్తు పరంతప!
అవటే చాపి మాం రామ ప్రక్షిప్య కుశలీ వ్రజ,
రక్షసాం గత సత్త్వానా మేష ధర్మ స్సనాతనః,
అవటే యే నిధీయంతే తేషాం లోకా స్సనాతనాః'

[వాల్మీకము అరణ్య - 989 పేజి]

రామా ! సచ్చిదానందజగన్మోహనమూర్తివగు నిన్ను స్పృశించుటకు మున్ను మదీయశాపవిమోచనమునకై నీవు ఆవిర్భ వించితివన్న రహస్యము అజ్ఞానమువలన గుర్తింపనైతిని. ఇప్పుడు గదా మీ మూవు రిట్టివారని గుర్తించితిని. తుంబురుఁడను గంధర్వుఁ డను నేను వైశ్రవణునివలన శపింపఁబడితిని. వెండియు నాతఁడనుగ్ర హించి దాశరథిచేతిలో చచ్చి స్వర్గమునకుఁ బోదువని పలికెను. అట్లే నేను నీ చేతిలోఁ బడితిని. గుంట త్రవ్వించి దానిలో నన్నుఁ బెట్టి నీ దారిని నీవు పొమ్ము. చచ్చిపోయిన రాక్షసుల కిదియే సనా తనధర్మము - అని విరాధుఁడు తన మరణమున కుపాయమును సైతము చెప్పినాఁడఁట. దీనికి వ్యాఖ్యానమో భాష్యమో అను వాదమో అపరావతారమో కావించిన కల్పవృక్షములోని కథను గొంత చూడవలసియున్నది.

'శ్రీరామా ! మంచి యూహ చేసితివయ్యా !

శా. మున్నే యెందఱొ రాక్షసుల్ మడిసి రంభోజాక్ష ! నీ చేతిలో
నెన్నన్ భావిని జత్తు రేమయినఁగానీ! స్వామి! నిన్గాగిలిం
పన్నేనైతిని దుంబురుం డనఁగ నే వర్తింతు గంధర్వుఁడన్
నన్నున్ వైశ్రవణుండు తిట్టినదిగా నర్తించితిన్ దైత్యుఁడై.

కం. తన కొడుకు నదుపులోనిది గనుకను రంభకును నేస్తగాఁడై యున్నన్,
నను శపియించెఁ గుబేరుఁడు ననుఁ దుదిఁ గైకొనియెఁ బ్రార్థనామృదువగుచున్.

శా. అంపంగాఁ బినతల్లి స్వామియు వనీయాత్రాగతిన్ వచ్చి నిన్
జంపున్ ఆ సహజంపురూపము గడించంజాలు దంచుం బ్రసా

దింపన్ నీకయి వేచియుంటిఁ బ్రభువా! దీవ్యద్భుజాశ్రీఘను
శ్యాంపానీరదమూర్తి! నిన్ను గులుతింపంజాల కెట్లయ్యెడున్.

కం. నీ మార్గణం బపూతవు నా మేనునఁ బడకమున్న నాథా! వైదే
హీమహితతనూ స్పర్శవ్యామిశ్రము గాఁగఁ బూతపఱచితిఁ దండ్రీ!

కం. అవునో కాదో యనియొడి లవ మనుమానంబు రామలక్ష్మణులమ నా
థవ! చెప్పినంతఁ దీరిన దవలఁ బ్రభూ! యెంత తగ్గియాడితిఁ గంటే!

మ. ఘను లీత్రోవనుబట్టి మీరు చనఁగాఁ గన్పించు నధ్యర్ధయో
జనమందున్ శరభంగు నాశ్రమము నా సన్మౌని మీ కెల్లశో
భనముల్ గూర్చెడు స్వామి! నా సుకృతముల్ పండెంజుమీ నీవు చే
యని దా తండ్రికి నాకుఁ జేతు పరకర్మారంభముల్, బిడ్డవై

శా. శ్వభ్రంబందున నన్నుఁ బూడ్చవె రఘుస్వామీ! [అర - 16 పేజి]

విరాధుఁడు రాక్షసజన్మ మెత్తియు రఘురాముని గుర్తించిన పిదప చూపిన వినయవిధేయతలు తా నుగ్గడించిన స్వీయచరిత్రాదికములు వాల్మీకములో ముచ్చట గొలుపుచున్నవి. 'మయా తు పూర్వం త్వం మోహాత్ న జ్ఞాతః' అన్న వాల్మీకి పలుకునకు 'నిన్నాగిలింప న్నెనైతిని' అన్నది 'కల్పము' చూపఁదలఁచిన భావము కాఁబోలు! 'నన్నున్ వైశ్రవణుండు తిట్టినదిగా దైత్యుఁడై నర్తించితిన్' — ఏమి సొగసైన ప్రయోగము స్వామీ! తిట్టినదిగా — అనఁగా తిట్టిన పిదప అని అర్థము తెచ్చిపెట్టుకొనవలెనా! 'శప్తో వైశ్రవణేన' అన్న ముక్కకు వైశ్రవణుండు తిట్టెనదిగా అన్నది తెలుఁగు సేఁత కాఁబోలు! దైత్యుఁడనై అనవలసినచోట సనాతనమై అనుస్యూతమగు 'కకుర్తిచేత దైత్యుఁడై' అనవలసి వచ్చెను. దైత్యుఁడై నర్తించెనఁట. నర్తించు — అనఁగా నర్తనము చేయుట; నర్తన మనఁగా — నాట్యము, కపటప్రవర్తనము. ఈ తీరుగ దూరముగా లాగి అన్వయించుకొనవలెను. 'వైశ్రవణో రాజా రంభాసక్తం పురానఘ, అనుపస్థీయమానో మాం సంక్రుద్ధా వ్యాజహార హ' = రంభాసక్తుఁడనైన నేను అవసరములో నా స్వామిని సేవింపకపోవుటచే కోపించి అతఁడు శపించెనన్నమాటకు 'తన కొడుకు నడుపులోనిది...' ఇత్యాదిగ తెలుఁగులో తెచ్చిన సొగసు మనము

పరిశీలింపవలెను. 'రంభకును నేస్తగాఁడై యున్నన్' – ఎవఁడా నేస్తగాఁడు? ఎవఁడో కాదు; తానే. దేనినిబట్టి! వెంటనే 'నను శపియించె' అన్న దానినిబట్టి. ప్రసాద్యమానశ్చ – అన్న దానికి 'ననుఁ దుదిఁగైకొనియెఁ బ్రార్థనామృదువగుచున్' అని కమ్మని తెలుఁగు సేఁత. కుబేరుఁడు ప్రార్థనామృదువై ఆతనితో 'పినతల్లి అంపంగా స్వామియు వసీయాత్రాగతిన్ వచ్చి నిన్ జంపున్' అని చెప్పినాఁడని కల్పము మనకుఁ జెప్పినది. ఇది కొంగ్రొత్త భావ్యమేసుమా! దశరథరాముని చేతిలో చత్తువనియే మూల మందుండఁగా పినతల్లి అంపుటలు – ఈ స్వామి వచ్చుటలు నవ్యసృష్టి. అసలు వ్యాఖ్యాతలు సైతము చూపలేని సారస్యమును కల్పవృక్షము మనకుఁ జూపనేర్చినది గదా!

ప్రభువా! ప్రభూ! నాథా! ధవ! ఇవి విరాధుఁడు శ్రీరామునికిఁ జేసిన సంబోధనములు. అపవిత్రమైన తన మేనున రాముని బాణము పడుటకు మున్నె వైదేహీమహితతనూస్పర్శ కావించుకొని ఆ మేను – పవిత్రమగునట్లు విరాధుఁడు కావించుకొన్నాఁడని కల్పము కల్పన. ఆ మేను పవిత్రమైనపుడు మహానుభావుఁడా శ్రీరామచంద్రమూర్తి ఆ మాత్రము గ్రహించి ఆ పవిత్రమైన మేను గలవానిని క్షమించి విడువఁగూడదా! 'అవునో కాదో యనియెడి అనుమానము లవము, రామలక్ష్మణులము నా చెప్పినంతఁ దీరినది.' ఇది విరాధుని మాట. తన శాపవిమోచనమునకు కారణమైన రామలక్ష్మణులు వీరగుదురా కారా! అన్న సందేహము విరాధున కిప్పటికిఁ దీరినదఁట. ఎందువలన! రామలక్ష్మణులము నా చెప్పినంత= రామలక్ష్మణులము అని చెప్పుటచేత. నాన్–అనఁగా. లేక, నా ధవ= నా ప్రభువా! రామలక్ష్మణులము = రామలక్ష్మణులమని, చెప్పినంత – అని అన్వయింపవలెనా! నోటికి వచ్చినట్లు పలికిన పలుకులలో తా ననుకొన్నట్టి భావము లుట్టిపడునా! ఊరూర వాడవాడఁ దిరిగి తిరిగి ఈ పలుకుల కిది యర్థమని భావమని ఒకవేళ ప్రచారముగా వినిపించినను – అవి విననివారికి కేవలము ఉన్న పలుకులే చదివినవారికి ఉద్భవింపఁగల సందేహము లెట్లు తీరును?

పని మేలన్నట్లుగా నున్నదయ్యో! పూడ్చిపెట్టినామే! హరి!'
ఇత్యాదిగ శ్రీరాముఁడు విచారపడెనని చెప్పటలో అర్థము లేదు.
ఏవో రెండు పద్యము లల్లి ఇతివృత్తమును పెంచినామన్న సంతృప్తి
తప్ప. అవియు అందమైన పద్యములైనచో ఆనందింపవచ్చును.
కత్తులఁగ్రుమ్ము పేషణము ప్రాణోత్క్రాంతి. విరాధుని మాట ఎట్లు
న్నను చదువరుల పాలిట ఈ కవితలోని ఈ పద్యములు కత్తుల
పేషణముగా - ప్రాణోత్క్రాంతిగా పరిణమింపవచ్చును. రామలక్ష్మ
ణులు విరాధుని కత్తులతోఁ గ్రుమ్మిరఁట; నూఁకిరఁట.

'తినుచునుండె ఋషీంద్రుల దైత్యుఁ డాతఁడై' ఆ గంధ
ర్వుఁడు శప్తుఁ డగుటవలన దైత్యుఁడై ఋషులను దినుచుండెనా?
దైత్యుఁ డాతఁడై - అనఁగా గంధర్వుఁడై తినుచుండెనా! ఎందుల
కీ తికమకలు! సూటిగా భావము వచ్చునట్లు రచన చేయఁజాలని-చో
ఎందులకీ కల్పములు! వృక్షములు! వేయి పడగలు! పేడ పిడ
కలు! మెలికలు గిలకలు తిరిగెడి మాటలు బాటలు చూపి వాని
భావము తెలియవలెనన్న ఎంతో పరిజ్ఞాన ముండవలెనన్నట్లు ఉప
న్యాసములలో లోకులకు హెచ్చరికలు చేసినంతమాత్రాన అది
మహాకావ్యమని విద్వజ్జనులు మన్నింతురా!

ప్రత్యయములలో 'కృత్తులు-తద్ధితలు' అని రెండు తెగలున్నవి.
విపులమైన యర్థమును లఘుమార్గములో తెలుపుటకు భాషలో
ఈ ప్రత్యయము లక్కఱకు వచ్చును. అర్థమునుబట్టి సందర్భమును
బట్టి అందగించునట్లు ఈ ప్రత్యయములను పదములలోఁ జూపవలెనన్న
భాషాపాండిత్య మెంతో కావలసియుండును. కృత్ప్రత్యయములు
కొన్ని నిందావ్యంజకములుగా విశేషార్థకములుగా స్ఫురించును.
తద్ధితప్రత్యయములలో 'క' ప్రత్యయము వంటివి 'అల్పార్థమును'
'అతికోమలార్థమును' వ్యక్తపఱచుచుండును. నేర్పు గల కవీశ్వ
రులు తమ కవిత్వములో ఇట్టి ప్రత్యయములను గనుగలిగి, వాడు
కొందురు. కల్పవృక్షము - ఈ నియమమును శబ్దశాస్త్రసంప్రదా
యమును పాటించినట్లు కన్పింపదు. ప్రాసకోసము - అర్థ మున్నను
లేకపోయినను 'క' ప్రత్యయము తెచ్చి వాడుకొనుటయే కల్పవృక్ష
కర్త కభ్యాసమైపోయినది. అక్కఱ లేకపోయినను అనర్థకమైన

అర్థాంతరము స్ఫురించుచున్నను ఏదో విశిష్టత చూపినట్లుగా ఈ కవి పెక్కు-చోట్ల తద్ధితరూపములు వాడుకొనును. స్వర్గలోక ప్రభుత్వార్థము గల 'స్వారాజ్య' శబ్దమును స్వ, రాజ్యార్థములో తెలిసియో తెలియకయో వాడుట ఈ రచయితకు సరదా. (బాలురు బాలకులగుట) (శిశుశబ్దము శిశుకమగుట) (వహ్ని, వహ్నికమగుట) ఈ రచయిత కభిప్రేతము. ఈ ధోరణిలో, 'ఒక తెలిమబ్బులో' - అని పద్యపాద ముపక్రమించి 'క' ప్రాసము కోసమై 'భేదకము - మూర్తికము - చిత్రకము' అని మూఁడు 'క' ప్రత్యయములను గుదిగ్రుచ్చి ముచ్చటగా వాడుకొనెను. [అరణ్య - 17 పేజి]. ఈ మూఁడింట - అల్పార్థముగాని విశేషార్థముగాని వ్యక్తమే కాదు. కేవలము ప్రాసపూరణార్థమై అక్కఱకు వచ్చు పడికట్టుఱాలలో ఈ రచయిత 'క' ప్రత్యయములనుగూడఁ జేర్చుకొనెను.

శరభంగాశ్రమ సమీప దేశములో, రథ మెక్కి వచ్చియున్న దేవేంద్రుని శ్రీరాముఁడు గుర్తించి తమ్మునితో నిట్లనును.

'శా. చిన్నప్డీదృశలక్షణోపహితులం జెప్పంగ స్వర్వాసులన్
విన్నా మాపయి గ్రంథముల్ చదివినన్ వేల్పుల్ మఱీలాటివే
సన్నల్ గల్గినవారు గాఁ దెలియు నా స్వామిత్వమర్యాదతో
నున్నాఁ డాయన వేల్పుఱేఁడయని నే నూహించెదన్ దమ్ముఁడా! [19 పే]

ఉ. మర్శతమైన యెట్టి శుభమంజులవేళను లేచినారమో
కశ్మతమైన యీ వనవిగాహితకాలమునందు దేవతా
దర్శనమయ్యె సర్వఋషిదర్శన భాగ్యము తోడిపాటుగా
దర్శము ద్వాదశిం గలసి దాపునఁ జేరినయట్టులయ్యెడిన్.

ఉ. ఏఁ జని చూచివచ్చెదన యిచ్చట నుండుఁడు మీర లిద్దఱున్ అంచు దంతి
లీలాజయయానమంథర విలాసమునన్ జనె స్వామి నమ్రుఁడై' [19 పే]

మనవలెనే, అవతారపురుషుఁడైన శ్రీరామచంద్రుఁడు సైతము చిన్నప్పుడు స్వర్వాసులు ఇట్టిలక్షణములు గలవారని చెప్పంగ విన్నాఁడనియు, ఆ పయి గ్రంథములు చదువఁగా వేల్పులు మఱీలాటి సన్నలే గలిగినవారని తెలిసికొన్నాఁడనియు మనకు 'కాకమ్మ కథలుగా' కల్పము బోధింపసాగినది. కథాశ్రవణమును బట్టియు గ్రంథ

పఠనమును బట్టియు ఇంద్రుఁడు శ్రీరామునకు గుర్తు వచ్చెనఁట. ఆ స్వామిత్వమర్యాదతో నున్నాఁడఁట! ఏ స్వామిత్వమర్యాద స్వామీ! 'ఆ' శబ్దమున కర్థ మున్నదా? మర్శితమైన శుభమంజుల వేళను సీతారామలక్ష్మణులు లేచినారఁట. వనవిగాహితకాలమా! కర్శితమైనదఁట? ఈ మర్శితములకు మంజులములకు విగాహితములకు కర్శితములకు వ్యంగ్యార్థము లేమున్నవో బహిరంగోపన్యాసములలో వినవచ్చునుగాని వాచ్యార్థములు మాత్రము ఎంతో రోఁత వేయు చున్నవి. దర్శమనఁగా అమావాస్యగదా! దర్శముతో ద్వాదశి కలిసి దగ్గఱకు వచ్చినట్టులు సర్వఋషిదర్శనముతోపాటు దేవతా దర్శన మయ్యెనఁట. దర్శద్వాదశులు కలియుట సంభవమా! అమా వాస్యకు పూర్వ మున్న ద్వాదశిలో దేవతాదర్శనమువంటి మహిమ ఏమైన ఉన్నదా? సనాతనాచార సంప్రదాయములు సాంగోపాంగ ముగ సమీక్షించినఁగాని మఱీలాంటి రహస్యములు మనకు బుఱ్ఱ కెక్కవు. ఇంకొకసారి మనరామస్వామి 'దంతిలీలాజయయానమంథర విలాసముతో' చనెనఁట. అనఁగా ఈ కల్పములో రామయ్య, మనకు మందయానుఁడయ్యెను. 'రామం సత్యపరాక్రమమ్'అని శ్రీరామున కీ విశేషణము వేసి వర్ణించుటలో వాల్మీకి మహర్షికి మిక్కిలి సరదా. పురుషులకు - పురుషోత్తములకు మందయాన విలాసములవంటి దశ ములు వేయుటలో మన తెలుఁగుకవికి మిక్కిలి మోజు.

శరభంగాశ్రమములో కనిపించిన దేవేంద్రుఁడు శ్రీరాము నితో సంభాషింపకయే తిరిగివెళ్లినట్లు వాల్మీకము చెప్పినది. ఆ సంభా షింపకుండుటకుఁ గల కారణమును కల్పవృక్షము ఏమని చెప్పెనో ముందు చూచి ఆవల - వాల్మీకమును జూతము.

'కం. నీ వతిథివిగా వచ్చెదు దేవాలయ మిప్పుడరుగఁదీరదు నాకం
చే వెలలిచినాఁడను దండ్రీ! విబుధేశ్వరుని నిప్పుడే కను మదిగో!

కం. సురపతితో నంటిని నీ దరిసెనముం జేయుమంచుఁ దండ్రీ! యనినన్
సురపతి చేయుటయా నా దరిసెనమా యంచు స్వామి తల్లడపడియెన్.

శా. అయ్యా! రాఘవ! నీవు చేసినవి ధర్మారంభముల్ పున్నెపుం
దయ్యాంబుల్ తలఁ దాల్పఁదగ్గయవి! సుత్రాముండు నిన్ గాంచఁగా

నయ్యారే! యది యెప్పుడోనట భవిష్యద్దివ్యకర్మాంతమం
దయ్యాగామిశుభంబువేళ వని తా నాకాశవీధిం జనెన్' [20 పేజీ]

ఇవి శరభంగులవారు శ్రీరాములవారికిఁ జెప్పినట్లు విశ్వనాథులవారు మనకుఁ జెప్పిన మాటలు. 'రామయ్యా! నీ విప్పుడు మా యింటికి అతిథిగా వచ్చినమాట నిజమే. నే నిప్పుడు దేవాలయ మరుగఁదీరదు. అందులకే ఇంద్రుని వెలలిచినాఁడ. నీ దర్శనము చేయుమని ఇంద్రునితో నే నంటిని. సుత్రాముండు నిన్ గాంచఁగా అయ్యారే అది యెప్పుడోనట! భవిష్యద్దివ్యకర్మాంతమందఁట! ఆగామిశుభంబువేళలోనఁట' అని శరభంగమహర్షి సూత్రప్రాయముగా సూచించినట్లు తెలుఁగులో మనకుఁ గన్పించుచున్నది. మహర్షులు దేవాలయమునకు వెళ్ళెదరు కాఁబోలు! అని ముమ్మొదట చదువరులకు భ్రాంతి కలుగవచ్చును. నిత్యము మన మనుకొను దేవాలయము కాదు - ఈ కల్పములో మనకుఁ గనిపించిన ఈ దేవాలయము. దేవ + ఆలయము - దేవతల ఆలయము, అనఁగా స్వర్గలోకము. శరభంగమహర్షి ఇంకఁ గొంతసేపటికి అగ్నిసంధానము చేసి దేహము విడువవలసియున్నది. అది రాముని సమక్షమందే జరుగును. పున్నెపుదయ్యములు తలఁ దాల్పఁదగిన ధర్మారంభములు రాముఁడు చేసెనఁట. సుత్రాముఁ డాతనిని ఎప్పుడో కాంచునఁట! ఇప్పుడు కాదఁట - ఈ ఘట్టములో భావ్యముమాట దేవుఁ డెఱుఁగును; ఇక్కడ కొంచెము వివరించి వ్రాయవలసిన మంచి యంశము లున్నవి. అవి విడిచి, 'సురపతి చేయుటయా! నా దరిసెనమా!' ఇత్యాది విశేషములను మాత్రము కల్పము మనకు ప్రసాదించును. 'శ్లో. ఇహోపయాత్యసౌ రామో యావన్మాం నాభిభాషతే, నిష్ఠాం నయతు తావత్తు తతో మాం ద్రష్టు మర్హతి. జితవంతం కృతార్థంచ ద్రష్టాహ మచిరా దిమం, కర్మహ్యనేన కర్తవ్యం మహదన్యై స్సుదుష్కరం, నిష్పాదయిత్వా తత్కర్మ తతో మాం ద్రష్టు మర్హతి. ఇతి వజ్రీ త మామంత్ర్య మానయిత్వా చ తాపసం, రథేన హరి యుక్తేన యయౌ దివ మరిందమః.' [అర. 994]

'ఇదిగో! రాముఁ డిటే వచ్చుచున్నాఁడు. ఆతని నిష్ఠ అనఁగా

ఆతని ప్రతిజ్ఞ నెఱవేరునందాఁక ఆతనితో నేను మాటాడరాదు. నేనేగనుక ఆతనితో సంభాషణలో దిగితినా ఆతనికి దేవత్వము వచ్చినట్లగును. స్వప్రతిజ్ఞానిష్ఠానయనానంతరము ఆతఁడు నన్నుఁ జూడ వచ్చును. 'జితవంతం – కృతార్థంచ' అన్న పలుకులలో కొండంత అర్థమున్నది. రావణుని జయింపవలె. అప్పుడు కృతార్థుఁడు కావలెను. కృతార్థుఁడనఁగా దేవతల ప్రయోజనము నెఱవేర్చిన వాఁడని భావము. దర్శనసంభాషణములచే దేవత్వప్రకటన మయినంతమాత్రాన వచ్చిన లోప మేమి యని సందేహము రావచ్చును. ఇతరులకు దుష్కరమైన రావణవధాదికమైన కర్మమును మానుష వేషముచేతనే పూర్తి చేయవలసియున్నది.' అని దేవేంద్రుఁడు, రావణవధకర్మము ముగియునందాఁక మాటాడ నని చెప్పియు – ఆ తాపసవేషమును గౌరవించెనఁట. ఇట్టి మంచిభావము లీ ఘట్టములో కన్పించుచుండఁగా–పోనీ! గోవిందరాజులవారి 'రత్న మేఖల'గాని మహేశ్వరతీర్థులవారి 'తత్త్వదీపిక' గాని చక్కఁగాఁ జదువుకొని అక్కఱయైనంతవట్టు తెలుఁగులో పెట్టినచో కొంతవఱకైన సంతోషింతురే!

మానుష వేషముచేతనే ఈ మంచిపనులు జరిపింపవలెనన్న భావముతో వాల్మీకి, 'తస్య పాదౌ చ సంగృహ్య రామస్సీతా చ లక్ష్మణః' అని శ్రీరామునిచే శరభంగుని పాదములను పట్టించెను. శ్రీరామునిలో ఈశ్వరావతార మున్నను క్షత్త్రియరూపములో ఆతఁడవతరించుటఁజేసి క్షత్త్రియమర్యాదనే ఆతఁడు చూపినట్లు వాల్మీకి చిత్రించెను.

ఇఁక మనము 'కల్పము'లోఁ జదివి నేర్చుకోవలసినది 'దేవాలయము'తోపాటు 'పున్నెపుదయ్యములు – ఎప్పుడోనట'లు. ప్రాసకోసము వచ్చిపడ్డ ఈ కవిత్వములోని ఈ దయ్యములకు బెదరక పున్నెపుదయ్యము లనఁగా – పుణ్యాత్ములైన వేలుపులని చెప్పుకొని స్తిమితపడవలెను. ఎప్పుడు+ఓ+అఁట–ఎప్పుడోయఁట, కావలెనని బడిపిల్లలవ్రాఁతలు మనము దిద్దెదము. 'ఎప్పుడోనట' యని కల్పమన్నది కావున – అది తప్పుకాదని తచ్ఛిష్యు లందురేమో!

'మొండిగునో ర్బండశిష్యః'!!

'శా. రామా! మిక్కిలి సంతసించును వనీరమ్యైక దేశంబునం
దా మౌనీంద్రుఁడు మిమ్ము నిల్పును సుఖంబౌఁగాననావాసముల్
స్వామీ! యించుక నిల్చిపోఁగదె త్యజించం గోరెదన్ మేను నీ
సామీప్యంబున నీవునైయుఱుగుఁడెంచం గోరి యే నుండితిన్' [21 పే]

ఇది శరభంగుని మాట. సుతీక్ష్ణమహర్షి యాశ్రమమునకు మీరు వెళ్లినచో 'తా మౌనీంద్రుఁడు సుఖంబౌఁగాననావాసముల్ నిల్పు'నఁట. అర్థము లేని 'తాను'కు 'సుఖంబౌఁగాననము' తోడైనది. ఆపైని ఈ సొగసునకు 'కాననావాసములు నిలుపు'నన్న కారకము సహకారమైనది. ఈ రచనలో నడచిన అపభ్రంశములు కొన్నిటిని మాటిమాటికిఁ జూడఁగాఁజూడఁగా నల్లమేఁక కథ జ్ఞప్తికి వచ్చి అసలు వ్యాకరణము గోకర్ణముగా మాఱిపోవు దురవస్థ పట్టవచ్చు ననిపించును. శబ్దశాస్త్రముతో పని లేదన్న రచనలో ఈ గొడవ యెత్తరాదు, సర్వశాస్త్రములను పాటించినట్లు నటించుచున్నది కావుననే కల్పవృక్షములో ఈ గొడవ చూడవలసివచ్చినది. బాల వ్యాకరణములు - ప్రౌఢవ్యాకరణములు చింతామణులు - కారికలు, నా రచనకు మానదండములా! అన్న అహంభావ ముండవచ్చునేమో గాని తెలుఁగురచన కట్టివి అండదండలన్నమాట విద్వత్కవులు కాదనలేరు. 'చేయు' అన్న విశేషణమునకు 'అతఁడు' అన్నశబ్దము పరముకాఁగా నుగాగమము వచ్చి 'చేయునతఁడు' అగునయ్యా యని చిన్నపిల్లలకు మనము చెప్పవలసియున్నది ఇట్టిచోట్ల - అచ్చు పరమైనప్పుడే నుగాగమము వచ్చునని ప్రయోగములు - వ్యాకరణములు చెప్పుచుండఁగా ఈ రామాయణమునిండ 'సుఖమవుఁగాననము' వంటివి పుట్టకొక్కులవలె పుట్టియున్నవి. 'అగు'నకు రూపాంతరమైన 'అవు' రూపమే 'ఔ' గా మాఱి, 'సుఖమౌ'అని యగును. సుఖమౌ+కాననము - సుఖమౌ కాననమే గాని, ఈ కల్పము కల్పించినట్లు 'సుఖమౌఁగాననము' కాదుగదా! ఇది తప్పు - అని కల్పవృక్షకర్తకుఁ దెలియకపోయినను - 'పండిత కీర్తనీయుఁడయి' 'ఇరుబాసల దిట్టయైన' 'కార్తికేయుఁడు' వేంక

ఈశ్వరులయిన అహో! గుర్తింపవలదా! ఆయన పరీక్షలోఁ బడి సంకుసనఁ బోసిన తీర్థమువోలె ఇన్నేండ్లుగ బండి నడచిన బడిపిల్లల వ్యాసాలరాశివోలె-ఈ శ్రీమద్రామాయణ కల్పవృక్ష మహాకావ్యము సైతము ఈ తీరుగ మనపాలిట తీర్థమై వెలయఁగలదన్న విశ్వాసము-ఆ యన్నగారి కున్నదనవలెను. ఆపైని, 'నీవునై యరుగుదెంచం గోరియే నుండితిన్' అన్నది మేలిమి బంగారుపలుకు. 'నీవునై' యనఁగా నీయంతట నీవే రావలెనుగాని నేనుగాఁ బిలువనని సారస్యము కాఁబోలు! ఉండుధాతువునకుండెడిభూతరూపమును వర్తమానములోఁ గలుపుట కల్పవృక్షకర్త కుగ్గుఁబాలతో రంగరించి నేర్చుకొన్న విద్య.

శరభంగుఁడు బ్రహ్మలోకమున కరిగినపిదప సర్వమునిసంఘములు శ్రీరాముని సందర్శించి తమతమ కష్టములనుగూర్చి చెప్పుకొందురు. ఆ ఘట్టములో వారన్నమాట లివి.

'కం. మమ్ముఁ బరాక్రమరేఖను నిమ్మగు ధర్మాభిరతిని నిప్పటిదాఁకన్
నమ్మించి తసురదంష్ట్రిలఁ గ్రుమ్మింపకు మిపుడు నమ్మికొనఁ జెఱపకువే.

మ. అనినన్ స్వామి దయార్ద్రమూర్తి దరహాసాంకూర మేపార ని
ట్లనె నమ్మించితినా మిమున్ దొసఁగు నాయందయ్యె మన్నింపుఁ డే
మన నమ్మించినదానికిన్ ఫలము దైత్యశ్రేణి మీకోసమై
ధనురంతమ్మున బ్రుగ్గఁజేసెదను మీ తాత్పర్య మిట్లేగదా!

చ. కలిగినతండ్రి యూహఁ బడి కానకు వచ్చితి మీరు దానిలో
పల బహుశాస్త్రసంగ్రహణబంధురధీకులు మీకు నంతగాఁ
దెలిసిన నేల కాదనుట తీర్థము సార్థము కూడివచ్చినన్
వలదన నేల మీకు వశవర్తినిగా నడతున్ బ్రియంబునన్' [అర-24 పే]

మమ్ము - ఇప్పటిదాఁక నమ్మించితివనియు అసురదంష్ట్రిలచే మమ్ముఁ గ్రుమ్మింపకుమనియు నమ్మకొన్నవారిని చెఱపకుమనియు మానులు మొఱపెట్టినట్లులు కల్పవృక్షము వ్రాసిన ఈ వ్రాఁతకు దీనికి ముందుఁగానీ వెనుకఁగానీ వాల్మీకములోఁ గానీ సూచనగానీ ఆధారముగానీ కానరాదు. ఇంతకు మున్ను వారి కెన్నఁడు శ్రీరాముఁ డభయ మిచ్చినట్లే లేదు. 'నమ్మించితినా మిమున్'-అని రెండవపద్యములో ఉన్నదానినిబట్టి శ్రీరామునకే సందేహము

గలిగినది. ఒకవేళ నమ్మించితినేని మీ యిష్టము నిచ్చినట్లే దైత్య శ్రేణిని బ్రుగ్గఁజేసెదనని ఆతఁడిప్పుడు గట్టిగా అభయమిచ్చును. తండ్రికి ఊహ కలిగినదఁట. ఆ యూహనుబట్టి శ్రీరాముఁడు కానకు వచ్చెనఁట. దానిలోపల - అనఁగా ఆ యూహలో అని కాఁబోలు! ఎన్నో అర్థము లున్నవనియు ఆ యర్థము లన్నియు గ్రహించుటలో మౌనులు గొప్ప విద్వాంసులనియు వారి కిన్ని యర్థములు తెలిసి యుండఁగా నే నేల కాదందునని రాముఁ డన్నట్లును ఆతనికి మౌనుల భావము తీర్థము స్వార్థముగా కూడివచ్చినట్లును ఇది మొదలు వారి కతఁడు (వశవర్తిగా) నడచుకొనునట్లును - ఈ రచనలోని సారము తేలుచున్నది.

'శ్లో. పరిపాలయ న స్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ! ఏతచ్ఛ్రుత్వా తు కాకుత్‌స్థ స్తాపసానాం తపస్వినాం, ఇదం ప్రోవాచ ధర్మాత్మా సర్వానేవ తపస్వినః. 'నైవ మర్హథ మాం వక్తు మాజ్ఞప్తోఽహం తపస్వినాం, కేవలే నాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయా వనం, విప్రకార మపాక్రష్టుం రాక్షసై ర్భవతా మిమం. పితుస్తు నిర్దేశకరః ప్రవిష్టోఽహ మిదం వనం, భవతా మర్థసిద్ధ్యర్థ మాగతోఽహం యదృచ్ఛయా తస్య మేఽయం వనే వాసో భవిష్యతి మహాఫలః'. [ఆర. 1002 పే.]

పితృవాక్యపరిపాలనావ్యాజముచే భవదర్థసిద్ధ్యర్థమే అడవులకు వచ్చితినని రామునిచే వాల్మీకి యనిపించును. యదృచ్ఛయా - అనఁగా దైవగతిచేతనని భావము. పరిపాలయ - అని మీరు అనరాదు; నన్ను ఆజ్ఞాపింపవలెనని రాముఁ డడఁకువ చూపును. సుమారు పదునైదు శ్లోకములలో నున్న ఈ శ్రీరామమునీశ్వర సంభాషణమును కల్పవృక్షము ఇరువది పద్యములకు పైగా పెంచి ఏ వేవో ధర్మోపన్యాసములు లెస్సగా చేసినది. వానిలో కల్పవృక్ష కర్త నిజముగా ప్రతిబింబించును. అట్టి విశిష్టతకోసమే ఈ తెలుఁగు రామాయణము పుట్టినట్టు మనము గ్రహింపవలెనని ఈ గ్రంథకర్త సంకల్పము. ఈ ధర్మోపన్యాసములో నడుమ నడుమ భాషాచమత్కారములను సైతము మనము గ్రహింపవలెను. 'నమ్మకొనఁ జెఱపకునే' అని అచ్చులో నున్నదికాని 'చెఱపకువే' అని దిద్దుకొన

వలెనేమో! 'దానిలోపల బహుళార్థ సంగ్రహణ బంధురధీకులు.
ఇది ఈ కవికి అభ్యస్తపూర్వ విద్యయైన ఏకదేశాన్వయ దోషబంధుర ప్రయోగము. 'తీర్థము సార్థము' అని అచ్చులో నున్నది. వ్యవహార మందున్న 'స్వార్థమే' - ఇక్కడ అన్వర్థము.

'చం. అలఘులు రాత్రులే మునుల యాశ్రమపాళినో నిద్రవోయి రే
పుల మునికాంతలం గలసిపోయిన భూతనుజాత యన్నద
మ్ముల విడి వల్కలా లుదికి పాల్పుగఁ దెచ్చున... [అర. 26]

రాత్రులకు అలఘులు విశేషణము కాఁబోలు! జానకి ఉదయమే లేచి మునికాంతలతోఁ గలసి రేవులకుఁ బోయి అన్నదమ్ముల దోవతులు ఉదికి తెచ్చునఁట. మఱంది వల్కలములుగూడ ఉదికినట్లు దినచర్యగా వర్ణించిన ఈ ఘట్టము రామానుజునకు దెబ్బ కొట్టినట్టు కావచ్చును. ఇట్టి యనౌచిత్యములకు - ఈ రచన పెట్టినదిపేరు.

అడవిలో ముందు లక్ష్మణుఁడు నడుమ సీత వెనుక శ్రీరాముఁడు నడచుచున్నారు. నడకలోనే రంగురంగుల పూవులు చిదిమి చీర దారాన వింతవింతలగు మాలలు గ్రుచ్చి శ్రీరాముని మెడలో జానకి వేసి అలంకరింపఁజేయునఁట. అప్పు డా దంపతుల శృంగార చేష్ట లివిగో చూడవలెను :—

గీ. 'మఱంది విను నేమి మాటలు మానుఁడంచు బ్రహ్మచర్యవ్రతంబు నీపాటిదంచు
హేలగానైన విదలుపు లెసకమెసఁగ వెనుక నడచెదుఁబతితోడఁ బృథ్విజాత'
[౨౦ పే]

ఈ ముప్వురి వెనుకటి నడకనుబట్టి శ్రీరాముఁడు - ఆ యిర్వురకు వెనుకనే కాపుదలగా నడచుచుండెనని చెప్పవలెను. ఇక్కడ కల్పవృక్షకర్త నేర్చిన తెలుఁగువ్యాకరణమువలన కొంచెము 'పేచీ' లేకపోలేదు. పద్యములో అచ్చువేసిన ధోరణినిబట్టి 'నడచెదున్' అని సమాపకము అన్నచో సీత, వెనుకపడును. ఇరువురకు వెనుకనే రాముని నడపింపవలెనన్న 'నడచెదుపతితోడ' అనియే ఉండవలెను. ఇంతకు శ్రీరాముఁడన్న సరసపుమాట లేవో మనచెవిని బడకుండ కొంతవఱకు ఔచితిని గాపాడినట్లే చెప్పవలెను. 'మఱంది, వినఁడా యేమి' ఆ మాటలేమిటి! ఇట్టిదా మీ బ్రహ్మచర్యవ్రతము!' అని

విలాసముగా జానకి విదిలింపులు విదిలింపవలసినట్లు - ఆ పెద్ద 'మనిసి' శృంగారములు పల్కెనఁట.

మునుల పోడుము లెల్లను మెచ్చుకొనుచు రాముఁడు తన రాజ్యములోని ప్రజలనుగూర్చి ఇట్లనుకొనును :—

'కం. తమ రాజుకొడుకు కాంతారము లేఁగునటన్న ప్రేమరాజిలువా రు
త్తములౌదు రిట్టి యచ్చవు విమలఁపుసౌహార్ద మచట వెలయదు చూడన్.'

(౬౧ పే.)

సూటిగా ఇందలి పదార్థమును మనము గ్రహింపలేము. తమ రాజుయొక్క కొడుకు కాంతారములకు ఏగుచున్నాఁడనఁగా ప్రేమతో రాజిలువారు ఉత్తములగుదురఁట! ఈతఁడడవులకు వెళ్లుట అనఁగా వారలకు సంబరమని అపార్థము రాదా! ఒకవేళ, అదియే కవి వివక్షయా! అడవులకు నేను రావలసివచ్చినపుడు ప్రేమలు ఒలుకఁబోసిన ఆ ప్రజలు ఉత్తములేకాని ఈ మునిజనములో ఉన్న సౌహార్దము వారిలో లేదుసుమా! ఇట్లని కవితాత్పర్యమా! ఏమో మతి!! ఈ 'అంగుష్ఠప్రమాణ' వృత్తములో పదముల చిద్విలాసములు ఒకరెండు. ఇట్టి 'యచ్చవు' 'విమలపు'-అని రెండు ముక్కలు అచ్చువడినవి. 'అచ్చవు'న కర్థము లేదు; 'అచ్చపు' అని యుండవలెనేమో! 'విమలఁపు' ఇది యొక విచిత్రము. కర్మధారయములో మువర్ణకమునకు 'పు' వర్ణముగాని పూర్ణబిందుపూర్వకపువర్ణముగాని వచ్చునన్నమాట చిన్నపిల్లల క్లాసులోనే నిత్యము పాటపాడెదము. ఆ ధోరణిలో 'విమలపు సౌహార్దము - విమలంపు సౌహార్దము' అను రెండు రూపము లుండునుగదా! ఈ అర్ధబిందుపూర్వకపువర్ణము ఎక్కడినుండి వచ్చునో అంతుపట్టదు. ఇట్టిరూపములు తాటాకులవ్రాఁతలలో ఒకప్పుడు ఉండెడివనిమాత్రము విందుము. ఇట్లే 'అన్నిఁటి' 'మొదలిఁటి' వంటి అపభ్రంశస్వరూపము లెన్నో ఈ కల్పములోఁ గాంచవచ్చును.

మునిజన ప్రార్థనముచే రాక్షసవధ ప్రతిజ్ఞను గావించిన శ్రీరామునకు వైదేహి, 'అహింసా పరమో ధర్మ'యన్న న్యాయమును మనస్సులో నుంచుకొని కొంత ధర్మోపన్యాసము చేయును. [ఆరణ్య - వాల్మీ 1008 పేజి] దానిసారమిది:-

'లోకములో మానవులకు రాగకృతములై వెంటఁబడు వ్యసనములు మూఁడింటిలో 'మిథ్యావాక్యము' మున్మొదటిది. దానిని మించినవి మఱిరెండు. ఒకటి పరదారవ్యవహారము; రెండు వైరము లేని రౌద్రము. మొదటిరెండు వ్యసనములు రామచంద్రా! కలలోఁగాని ఇలలోఁగాని ఏ కోశమున నీలో లేవన్నమాట నాకుఁ దెలియును. కాఁగా మూఁడవదానిని గూర్చియే ఇప్పుడు నేను కొంత ముచ్చటింపవలసియున్నది. బాణశరాసనములనుబట్టి ఇప్పుడు దండకారణ్యమునకు నీవు తమ్మునితోపాటు పయనమగుచున్నావు. ఇదే నాకు మనస్సులో నున్న చింత. వనచరులలో ఎవ్వరిమీఁద ఈ శరములు విడువవలసివచ్చునో? అని అగ్నిహోత్రమున కింధనములు తేజోబలమును పెంచునట్టులు క్షత్త్రియుని చేతిలో నున్న ధనుస్సు ఆతనికి జవసత్త్వములు గూర్చుట సహజమేగదా! వెనుక ఒకప్పుడు ఒకానొక మహర్షి ఘోరారణ్యములో తపస్సునకుఁ గూరుచుండెనఁట. ఆతని తపస్సునకు విఘ్న మాచరింపవలెనని దేవేంద్రుడు తలఁచి, కత్తి చేతఁబట్టి రాజకుమారుని వేషముతో ఆతని సమీపించి, అయ్యా! దీనిని గొన్నాళ్లు మీవద్ద ఉంచెదను. పని గలిగినప్పుడు వచ్చి తీసికొందునని పలికి దాని నిచ్చి తనదారిని దాను బోయెను. ఆవల మహర్షి ఆ కత్తి చేతఁబట్టి ఏవేవో చెట్లు చేమలు నఱుక సాగెను. కొన్నాళ్లకాతని కది ఒక వ్యసనమై క్రూరబుద్ధి యేర్పడి జీవహింసాపరాయణుఁడై భ్రష్టుఁడై నరకమునకుఁ బోయెను. రాజా! ఇది నేను మున్ను విన్న కథ. అగ్నిసంయోగమువంటిదే శస్త్ర సంయోగముకూడ. మొదటిది వస్తువునకు వికారము కలిగించును. రెండవది శస్త్రికి వికారము పుట్టించును. నీమీఁద నాకున్న గౌరవమునుబట్టియు నామీఁద నీకున్న ప్రేమను గుర్తించియు ఈ విషయము జ్ఞప్తికిఁ దెచ్చితినిగాని క్రొత్తగా నీకుపదేశము చేయవలెనని కాదు. ధనుర్ధారివై నీవు 'దండక'లోని రాక్షసులను వైర మేమియు లేకయే చంపదొరకొనుట నాకు రుచింపదు. అడవులకు వచ్చియు తపస్సులో నుండక కత్తులు కటారులతో కాలక్షేపము చేయవచ్చునా! శస్త్రాస్త్రములను సేవించినకొలఁది కలుషబుద్ధియే పెరుఁగుచుండును. ఇది క్షత్త్రియధర్మముగదా! యని భ్రాంతి పడరాదు. నీవు సామ్రాజ్య

మును విడిచి వచ్చినందులకు హింసనుగూడ విడనాడి మునివృత్తిలో ఉందువా మా యత్తమామల కెంతో సంతోషము గలుగవచ్చును. అన్నింటను ధర్మమే ప్రధానము; ధర్మమువలన సుఖ మున్నది; మోక్షము నైతము ధర్మమువలననే లభించును. త్రైలోక్యమైన ధర్మము సర్వము నీకుఁ దెలియనిది కాదు. స్త్రీజనచాపలమువలన ఏదో తోఁచిన దంటిని. తమ్మునితో ఆలోచించి నీకుఁ దోఁచినదే చేయవచ్చును" అని.

ఈ ధర్మోపన్యాసమును తెలుఁగులో కల్పవృక్షము పదు నేడు పద్యములలో దించినది. భాస్కరాదులు వ్రాసిన అనువాద ధోరణిలో మూలములోని భాగము చక్కఁగా అర్థమగుచున్నది. నాది కేవలానువాదము గాదు; భాష్యమన్నంతదాఁక ప్రవచించిన ఈ కల్పవృక్షకర్తచేతిలో ఈ భాగము బగ్గము పాడాయెను. తార్కాణగా వైదేహి చెప్పిన పూర్వమునీశ్వరకథను కల్పము సరిగా మూఁడు పద్యములలో కుదించినది. ఆ పద్యములలో చెప్పినది ఉన్నది ఉన్నట్లుగ చదివి ఎంత ఊహించినను కావలసిన అసలుకథ సూటిగా వెలుపలికిరాదు. బీజాక్షరములో తారకమంత్రములో అనుకొని ఆ మూఁడింటిని అధ్యయనము చేసి ఏదో గంభీరార్థమో అంతరార్థమో వ్యంగ్యమో ధ్వనియో ఉండవచ్చునని ఊహించుకొనవలెను. ఇవిగో ఆ రమ్యమైన పలుకులు మీరుగా వినవలెను.

'కం. ఆయుధసంపర్క నిమిత్తాయత్తవఫలాభిధాన మర్థము కలదొం
డేయెడ శుచియును ఋతవాక్యై యొసఁగెదు నొక తపస్వి యడవి వసింపన్.

మ. నిలుగై యెప్పటి కప్పుడే సురజగచ్ఛ్రీలోభి యింద్రుండు కా
వలెనం చా ముని యున్నచో విడిచిపోవన్ ఖడ్గ మొక్కండు కా
వల రక్షించుచు న్యాసబుద్ధి ముని యంతన్ దాని నాపైని దుం
పలు ఛేదింపఁగఁ గ్రైమృగంబుల వధింపన్ బై నిఁకే మున్నదో.

కం. తొలి శుచితయు ఋతవాక్త్వము తలఁగి చన నిషాదబుద్ధి దైవతలోకం
బులకుం జెడియె నటందురు సలలితశమదమవిధాన సంచరణజ్ఞుల్.' [33 పే.]

దీనికి మూలముకూడ వినవలెను.

'శ్లో. పురా కిల మహాబాహో! తపస్వీ సత్యవాక్ఛుచిః, కస్మింశ్చి దభవత్పుణ్యే వనే రతమృగద్విజే. తస్యైవ తపసో విఘ్నం

కర్తు మింద్ర శ్శచీపతిః, ఖడ్గపాణి రథాగచ్ఛ దాశ్రమం భటరూప ధృత్. తస్మిం స్తదాశ్రమ పదే నిశితః ఖడ్గ ఉత్తమః, సన్న్యాస విధినా దత్తః పుణ్యే తపసి తిష్ఠతః. స తచ్ఛస్త్ర మనుప్రాప్య న్న్యాస రక్షణతత్పరః, వనే తం విచరత్యేవ రక్షన్ ప్రత్యయ మాత్మనః. యత్ర గచ్ఛత్యుపాదాతుం మూలాని చ ఫలాని చ, న వినా యాతి తం ఖడ్గం న్న్యాసరక్షణతత్పరః. నిత్యం శస్త్రం పరివహన్ క్రమేణ స తపోధనః, చకార రౌద్రీం స్వాం బుద్ధిం త్యక్త్వా తపసి నిశ్చయం. తత స్స రౌద్రేఽభిరతః ప్రమత్తో ధర్మకర్శితః, తస్య శస్త్రస్య సంవాసా జ్జగామ నరకం మునిః.'

[వాల్మీ. ఆర. 1012 పేజి.]

ఈ కథ, భాస్కరరామాయణములో ఒకే ఒక సీసపద్యములో ఇమిడి హాయిగా నడచినది. మూలము చదివి సీసపద్యము చూచి కల్పవృక్షములో నున్న ఈ సొగసును బరిశీలించినపుడు కథ ఒక లీలగా స్ఫురించినది. మూలమే సులభమై అనువాదములే దురవగాహములగు ఘట్టములు తెలుఁగులో ఎన్నో ఉన్నవన్నమాట నిజమేగాని ఇట్టి కొంకిబికి రచనలు మాత్రము నాకుఁ గనిపింపలేదు. ఆ ముని యున్నచో = ఆ ముని యున్నచోట, ఒక్కండు ఖడ్గము విడిచిపోవన్ కానల న్న్యాసబుద్ధిన్ ముని రక్షించుచు...వధింపన్ — ఇఁకే మున్నదో! ఇది యొక పద్యమా! ముందుగా కథను జెప్పించుకొని వెళ్ళి, ఈ పద్యములలో విసిరివేసియున్న పదములను అన్వయములో పెట్టుకొని మనము విన్న కథకు అనుకూలముగా ఈ భావము నూహింపవలెనుగాఁబోలు! సామాన్యమైన కథా భాగమునే సరళమైన త్రోవలో నడపించుటచేతఁగాని ఈ కవనములో ఏవో భాష్యము లున్నవన్న భ్రాంతి పరప్రత్యయనేయబుద్ధుల కుండవచ్చుఁగాక!

సులువుగా ఈ కథనే చెప్పలేక, వైదేహి చెప్పిన మంచి మాటలు మనకు వినిపింపలేక, వాల్మీకములో లేనివి తన 'భాష్యముగా' భ్రాంతి పడినవి ఈ యూహలు 'కల్పము' కల్పించినది.

చం. 'అడిగిన యత్తెఱఁగా వరము లర్థము నీకయినట్లు కాదు చొ
    ప్పడు ననుకొన్న మీ యవిన పద్ధతియే ధరణీమహేశ్వరుం
    డడవికిఁ బొమ్మటన్న విలునమ్ములు తాలిచి పోయి క్రూరముల్
    కడుకొని చేయుమంచ నెనొ కార్యము లచ్చపుశాంతి నెంచెనో

మ. అవుఁబో తండ్రి మనోర్థ మిం దెఱుఁగరాదో నాయె వ్యాఖ్యానల
బ్ధవిశేషప్రతిపత్తి యన్నయెడ నా వ్యాఖ్యాన మీ లేనిపో
నిని శీర్షమ్మున కెత్తికో నవుటయా నే యింతకున్ సాయుధుం
డవు కాంతారము వచ్చుటైనయది దుష్టంబైన సంసర్గమై

శా. లీలన్ గానక నచ్చమా మునుల పోల్కిన్ వచ్చినామేని దై
త్యాలిన్ మాకును జంపిపెట్టుమని యేరైనం బ్రసంగింతురా!
క్రాలన్ గత్తులు విండ్లు నమ్ములు కనంగానైనవా రడ్డగా
నోలిన్ మీకును జేసిపెట్టు తలపై యొప్పంగ నిట్లయ్యెడిన్

కం. పిత్రీయమైన రాజ్యము శత్రువశంబైన బాహుశౌర్యము కలిమిన్
ధాత్రి వెఱచోటు గెలుచు ధరిత్రీపాలనమతియుఁ జరించదు దీనన్

శా. చెందున్ జెందదు క్ష్మాచతుర్దశసమల్ చెల్లంగ నన్నర్థపున్
సందిగ్ధత్వము లేదు కోసలములన్ స్వామిత్వమున్ భద్రమై
యొందెన్ దమ్ములలోన నొక్కనికి లేదుర్వ్యాశ యింకే స్పృహో,
సందోహమ్ములచేఁ జలించి యిది యీ జ్యావల్లి సంధించుటల్

[అర-34 పే]

కనరాదో నాయె – అడ్డగా – క్రాలన్ – ఓలిన్ – వచ్చుటైన యది వంటి పలుకులతో పలుకుబళ్ళతో పాదువాటిన ఈ క్రొత్త కల్పనలను – ఊహాలను ఇంకను వ్యాఖ్యానము చేసి విసిగింపను. ఈ కల్పవృక్షకర్త వినిపించెడి బహిరంగోపన్యాసములలో తప్పనిసరిగా వినవలసివచ్చు పద్యములను దప్ప, తెలుఁగునేలలో కావలెనని పట్టుపట్టి ఆప్యాయముగా ఈ కల్పవృక్ష మహాకావ్యమును అధ్యయనము చేయువారు – సమగ్రముగాఁ జేసినవారు నూటి కొకరో ఇద్దరో ఉందురన్న వదంతి యున్నందువలన ఈ రూపముగానైన ఈ రచనలోని సొగసును గ్రహింతురన్న ఆశతో నడుమనడుమ హెచ్చుగా ఈ పద్యములు తెచ్చి యిచ్చుట పూజింపవలసి వచ్చుచున్నది.

ఇఁక సీతకు శ్రీరామచంద్రులిచ్చిన సమాధానము:– 'సకియా! నీవు లేని సమయములో మహర్షులు వచ్చి రాక్షసులు చేయు నుపద్రవములు వర్ణించిరి. అది విని అభయ మిచ్చితి'నన్నట్లు – ఈ కల్పవృక్షము క్రొత్తగా కల్పించినది. మూలములో, మూవురి యెదుట నే ఈ మునీశ్వరుల ప్రస్తావము రాఁగా 'తపస్వినాం రణే శత్రూన్

హంతు మిచ్ఛామి రాక్షసాన్...దత్వా భయంచాపి తపోధనానాం ధర్మే ధృతాత్మా సహ లక్ష్మణేన తపోధనైశ్చాపి సభాజ్యవృత్త స్సుతీక్ష్ణ మే వాభిజగామ వీరః' అని శ్రీరాముఁడు వారి కభయ మిచ్చినట్లు కన్పించును. మునీశ్వరులు శ్రీరాముని 'రాఘవవంశ బాలకుఁడ!' అని పిలిచిరఁట! ఇట్టిపట్టుల అల్పార్థము చెప్పెడి 'క' ప్రత్యయము 'కల్పము' దృష్టిలో 'స్వార్థ'మైనది. 'మాఁదు జీవనము' లోని దుగాగమము ఉత్తమ వ్యాకరణ సంప్రదాయ నిర్దిష్టము కాదు. ఆపైని ఇంకొక క్రొత్త కల్పన:-

'శా. నైనన్ మీ సకలాస్త్రవైభవము విశ్వామిత్రదత్తంబు తా
నైనన్ గాధిజుఁ డన్న మా ఋషియ నీ కస్మద్వ్యథద్రోహిసం
తానం బూడ్చుట తప్పదన్న, బలవంతంబైన నేమందు వా
గ్దానం బిచ్చితి నట్లె చేతు నని సత్యం బేమి చేయన్ వలెన్' [35 పే]

నీకు దక్కిన అస్త్రవైభవము సర్వము మా విశ్వామిత్రుని వలనఁగాదా! ఆతఁడేమో మా ఋషీశ్వరుఁడే. కావున శ్రీరామా! మా విరోధులను నీవు తప్పక ఊడ్చివేయవలెనని మునీశ్వరులు బలవంతపెట్టినట్లు తాను వాగ్దానము చేసినట్లు - ఇంక నేనేమి చేతునని శ్రీరాముఁడు తెల్లమొగము వైచినట్లు కల్పవృక్షము వర్ణించినది. ఇది యొక అభూతకల్పన. ఇట్టివే వాల్మీకమునకు వీరు వ్రాయఁ బూనిన-వ్రాసితిమనుకొన్న క్రొంగ్రొత్త భాష్యములు. శరణాగత పరిత్రాణము నా ధర్మము; ఆర్తులైన మునీశ్వరుల ప్రార్థనము వింటిని, మహానుభావులైన విప్రులు వచ్చి 'అస్మాన్ అభ్యవపద్య' అనఁగా మమ్ములను గాపాడుమని నోరు విడిచి అడుగఁగా నాకు సిగ్గైనది. అన్న ధోరణిలో వాల్మీకము చెప్పఁగా-కల్పములో ఒకానొక కారణమును సృష్టించి వారెవ్వరో బలవంతపెట్టినట్టు ధార్ష్ట్యము చూపినట్టు చిత్రించెను.

'శ్లో. అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణాం,
నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః'
[వాల్మీ 1016 పే]

ఇట్టిది వాల్మీకి కవితలోని విలువ; వాల్మీకి రామునిలోని

మహిమ. ఋషులకోసమై శపథము చేసిన శ్రీరాముఁడు అవసర మైనచో తన జీవితమునైన విడిచివైచునఁట. తన జీవితమునే గాదు-అక్కఱయైనచో తన అర్ధాంగినిసైతము; తన అర్ధాంగినే కాదు; తుదకుఁ దన తమ్మునిగూడ. వాల్మీకి ఒక వరుసలో ఈ త్యాగమునకు విలువలు కట్టెను.

'ఆత్మానం సర్వదా రక్షే ద్దారై రపి ధనై రపి—అర్థో వా ఏష ఆత్మనః యత్పత్నీ - భ్రాతా స్వా మూర్తి రాత్మనః' ఇత్యాది సూక్తులవలన ఈ త్యాగములోని విలువను మనము గ్రహింపవలెను. ఈ మూఁడింటికన్నను ప్రతిజ్ఞాపరిపాలనమే మిన్నయని శ్రీరాముని ధర్మమును వాల్మీకి పోషించెను. ఈ ఛాయనే గ్రహించికాఁబోలు భవభూతిసైతము 'ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా' అని శ్రీరామునిచేఁ జెప్పించెను. ఇంత మంచిభావమును కల్పవృక్షము తెలుఁగులో ఎట్లు దించెనో విందురా!

'కం. వలసిన నిను వదలెదనో వలసిన సౌమిత్రిఁగూడ వదలెదనో మై
థిలి! తన చేయుఁబ్రతిజ్ఞాస్ఖలనము ప్రాణంబుతోడఁ గానీకుండన్' [36 పే]

'అప్యహం జీవిత'మిత్యాదిశ్లోకమున కిది అనువాదమా! లేక భాష్యమా! ఇందు 'జీవితం జహ్యా'మన్న దళము ఏమైపోయినదో అంతు లేదు. 'తనచేయుఁబ్రతిజ్ఞాస్ఖలనమన్న' పాదములో ఎన్ని స్ఖలనము లున్నవో పండితులు గుర్తించియుందురు. 'తన చేయు' విశేషణము ప్రతిజ్ఞకా! స్ఖలనమునకా! చేయువంటి విశేషణమునకు పాల్లు పరముకాఁగా నుగాగమము తెచ్చిపెట్టుట 'కల్పవృక్ష' వర ప్రసాదములలో ఒకటి. వాల్మీకి చెప్పిన 'జీవమానః ప్రతిశ్రవం అన్యథా కర్తుం న శక్ష్యామి' అన్న వాక్యమునకుఁ గాఁబోలు 'ప్రాణంబుతోడఁగానీకుండన్' అన్న మేలిమిపలుకు! నీరసమైన పొడిపొడి మాటలు అతుకులు పెట్టి ఏదో ఒక భావమును వక్రింపఁ జేసెడి ఈ పద్యములను ఒక చేతిలోను, వాల్మీకమును ఒక చేతిలోను బెట్టికొని తూచుకొని చూచుకొనఁగా వాల్మీకమునకీ కవిసమ్రాట్పద వాచ్యుఁ డెంత 'మారణహోమము'చేసెనో తెలుఁగున కెంత ద్రోహము చేసెనో తేటతెల్లము కాఁగలదు.

'[illegible] పరిచ్యుతుఁడ నిచట

వ. అంత జానకి పతిచేతిలోని ఖడ్గము తాను తీసికొని నడచుచుం బోఁగా [86]

ఈ ధర్మశుద్ధిలో పరిచ్యుతుఁడను నే నయ్యెదనటే అని శ్రీరామ చంద్రప్రభువు అనఁగా-జానకి, ఆతని చేతిలోనిఖడ్గము తీసికొన్నదఁట. తీసికొనుట ఎందులకో! ఏదో అంతరార్థ ముండవలెను. తన వాగ్దానము ప్రకారము శ్రీరాముఁ డెవ్వరినైన హత్య చేయవచ్చునని సీతాదేవి భ్రాంతిపడి ఆ కత్తి లాగివైచెనా! లేక, నేను గాదన్న రాక్షసవధ ఏ తీరుగఁ జేసెదవో చూచెదఁగాక అనియా! ఏమోమఱి! ఈ కత్తి మార్పుల వార్త వాల్మీకి యెత్తుకొనఁడాయె. ప్రత్యేకించి ఈ క్రొత్త వార్త కల్పవృక్ష మెత్తుకొని ఒక వచనములో దించినదనఁగా ఏదో ఉండితీఱవలెను. ఈ వెంటనే ఇంకొక విచిత్రము.

'కం. మును లక్ష్మణుండు జానకి వెనుకను మఱి యామె వెనుక వీరుఁడు
రాముండును గాఁగఁ బోవుచున్ రాముని కను లామెకచభారముననే యుండెన్
[36]

అడవిలో ముప్వురును నడచుచున్నారఁట. చూడఁగానే ఈ పద్యములో మన కర్థముకాఁగల అంశమిది: — ఆ వరుసలో, ముందు లక్ష్మణుఁడు నడచుచున్నాఁడు. ఆతని వెనుక జానకి, ఆమె వెనుక శ్రీరాముఁడు. పోవుచున్ - అన్న అసమాపకక్రియకు కర్తలు మూఁడు కలవుగాని సమాపకక్రియ కానరాదు. 'ఉండెను' అన్న సమాపకమునకు రామునికనులు కర్త. ఈ యవకతవక ఇట్లుండఁగా అసలు విషయమునకు వత్తము ఇక్కడ వాల్మీకి అన్నమాట ఇది:-

'శ్లో. అగ్రతః ప్రయయౌ రామస్సీతా మధ్యే సుమధ్యమా,
పృష్ఠతస్తు ధనుష్పాణి ర్లక్ష్మణోఽనుజగామ హ'
[అర-1017]

ఈ నడక చూడుఁడు. ముందు శ్రీరాముఁడు; మధ్యభాగములో సీత, వెనుకవైపున లక్ష్మణుఁడు. ఈ వరుస ఉంచుటలో ఆధ్యాత్మికముగ పెద్ద అర్థ మున్నదని వ్యాఖ్యాతలు నిరూపించిరి. అగ్రతఃలోని అవర్ణప్రాథమికత్వమునుబట్టి శ్రీరాముని రక్షకత్వాదికము స్ఫురించు ననియు సీతామధ్యవర్తిత్వముచే రమాసంబంధిత్వము - ధనుష్పాణిః-లక్ష్మణః. అన్న దళములచే నిరంతరకైంకర్యవత్త్వము, అనుజగామ - అన్న క్రియచే అహంకారమమకారవిరహితమైన అనుసరణము వ్యక్త

మగుననియు – ఈ శ్లోకముచే ప్రణవార్థము ప్రకాశితమైనదనియు పెద్దలు విశేషార్థముచే ప్రస్తుతించిన ఈ భాగమును 'కల్పము' మార్చుటకుఁ గారణ మేముండును? ఏదో భాష్యము చెప్పఁగలవాఁడే వాల్మీకమును తెలుఁగులో పెట్టవలెనని కల్పవృక్షకర్త ఉపన్యాసము నిచ్చును. దానినిబట్టి కల్పవృక్షకర్త రామాయణమునకు 'పెద్ద భాష్యకర్త' అను భ్రాంతి 'ప్రచారకాండ'లో ఉద్భవింపవచ్చును. ఇట్టి సారస్యమునే చట్టుబండలు చేసి తనకుఁ దోఁచినదే పాటగా బాటగాఁ జేసి భాషాశుద్ధి లేని కవితలో దించినంతమాత్రాన భాష్యకర్త యగునా! తుదకు రామాయణరచయిత అనిపించు కొనునా! పైగా శ్రీరాముని చూపు ఆమె కచభారముం దే ఉన్నదఁట. కచభారము చూచుటకోసమై జానకికి వెనుకగా శ్రీరాముని నిలువఁ బెట్టి నడపించెనేగాని సారస్యము జారిపోయెనన్నమాట కల్పవృక్ష కర్త ఎఱుఁగఁడాయెను.

మాండకర్ణి యాశ్రమప్రాంతమునకు సీతారామలక్ష్మణులు వెళ్ళిరి. 'సీ. ఇట్టి యద్భుతంబులు గంచు వించుఁ జరించు సీతా రామ లక్ష్మణ చరణయోగ్యంబైన యయ్యాశ్రమమండలంబు' [అర–౬౭పు]

సీతారామలక్ష్మణులు కన్నవి విన్నవి యెట్లున్నను కల్పవృక్ష కర్త తెలుఁగులో నేర్చుకొన్నవి తచ్ఛిష్యులు వినిపించుకొన్నవి యద్భుతములు మనము గుర్తింపవలసిన వెన్నో ఉన్నవి. పై వాక్య ములో 'కంచు – వించు' చరించిన దెవరు? సీతారామలక్ష్మణులు. వారి చరణములకు యోగ్యమైనది ఆశ్రమమండలము. వ్యాకరణ సంప్రదాయము పాటించినచో ఈ చిన్నవచనపుముక్క ఇట్లుండ వలెను:– 'కంచు వించుఁ జరించు సీతారామలక్ష్మణుల చరణ యోగ్యంబైన యయ్యాశ్రమమండలంబు' ఈ ప్రయోగమునకు అక్కసెల్లెండ్రు ఇవిగో చూడుఁడు:–

'ఆ ప్రభువే నగస్త్యముని [అక్కఱలేని ద్రుతము]

[అర. 41 పుట]

'వైదేహికి ధీగతి యెఱుఁగుదురుగాదె [తురకషష్ఠి] ,,

'సాహస కృత త్రిజగద్రక్షా

('త'కారమునకు లఘుత్వము) ,,

'నీవుగఁ దెచ్చినావు (తెచ్చినాఁడవు) ,,
'సగానికిఁబైన (వ్యావహారికము) ,,
'నిలచియుండి [నిలుచు – నిలిచి] [ 44 ]

'గదయిత్నుశిరోమణి! [41 పుట] సుతీక్ష్ణమహర్షి రాముని బిలిచిన పిలుపు.

గదయిత్నువు = వాచాలుఁడు; వదరుఁబోతు; కాముకుఁడు; కాముఁడు – అని నిఘంటువు. శ్రీరాముని ఇట్టి సంబుద్ధికి లక్ష్యము చేయుటలో కల్పవృక్షము సంకల్పము ఏమై యుండును?

ప్రసంగసాధువై యొప్పు అగస్త్యమానికథను వృద్ధగార్గేయి ఎట్లుగాఁ జెప్పెనో చిక్కని యా కథ యస్లై చెప్పెద నని కల్పవృక్షములో సీత యన్నది. అది యిప్డు నే వినఁజాలనని స్వామి యన్నాఁడఁట. జానకి, మీరు వినకున్న వినును సౌమిత్రి యంచు కథను సమారంభముం జేసెనఁట. కల్పవృక్షములో సృష్టించిన చిత్రములలో ఇది యొక విచిత్రము.

'శ్లో॥ ఇహైకదా కిల క్రూరో వాతాపిరపి చేల్వలః......
ఏవం కథయమానస్య తస్య సౌమిత్రిణా సహ రామస్యాస్తం
గతస్సూర్య స్సంధ్యాకాలోఽభ్యవర్తత' [వాల్మీ 1024]
'రామచంద్రుండు సౌమిత్రిం గనుంగొని యిట్లనియె.

సీ॥ ఇవ్వనంబునఁ దొల్లి యిల్వలవాతాపు లను నుగ్రరాక్షసు
లధికపాపులు... [భాస్కర 146 పుట]

ఇత్యాదిగ వాల్మీకములో భాస్కరములో అగస్త్యుని కథను తమ్మునకు ధర్మపత్నికి శ్రీరాముఁడు చెప్పినట్లు ఉండఁగా దానిని ఈ కల్పము మార్చి జానకి నోటఁ జెప్పించుటలో ఏదో సారస్యమో అంతరార్థమో ఉండునేమో! లేకపోవు టెట్లు! 'వృద్ధగార్గేయి దీక్షాకపర్ది నామె చెప్పెను చెప్పుదునా యటన్న.

ఉ. చెప్పుదునా యటన్న మఱి చెప్పెదునద్ది యెదో యెఱుంగఁగా నొప్పదటన్న స్వామి, సతి ఊఁ! అటులౌనె ప్రసంగసాధువై యొప్పు నగస్త్యమాని కథ.........'ఇత్యాదిగ ఈ యాలుమగల సంభాషణములోని 'చిక్కదనమును' కల్పవృక్షము మన కెంతగా

ప్రసాదించెనో గ్రహింపవలెను.

కథ నడచుచుండఁగా నడుమ 'ఆ యింటికిఁ బోవువారె మఱి యచ్చోనుండి విచ్చేయువారని కన్పింపరె యో రఘూత్తముని భార్యారత్నమా!' యనియు, 'మునిపుంగవుఁ డసురం జట్టించి తద్ధన మొకటొకట్లు మునుల కిచ్చె జనకుగన్నకుమారీ!' అనియు సంబోధనములు కానవచ్చి శ్రీరాముఁడే ఆమె కీ కథను వినిపించుచున్నాఁడా! అన్న సందేహము కలుగవచ్చును. 'ఆమె యెట్లుగాఁ జెప్పెనో యట్లె చెప్పెదను' (256 పద్య) అన్న పద్యములోని ధోరణిని మనస్సులోఁ బెట్టుకొని వృద్ధగార్గేయి సీతను సంబోధించినట్లు సమన్వయించుకొనవలెను. 'జనకుగన్నకుమారీ!' ఇది యొక విచిత్రప్రయోగము. 'వాఁడు తిన్న విస్తరి' వంటిది కాఁబోలు! వాఁడు విస్తరిని దినఁడు, తిన్నది విస్తరిలోని వస్తువును. జనకుని గన్న కుమారి కాదు; జనకుఁడే కన్నట్టి కుమారి. 'గన్న'ను - 'కన్న' చేసినచో ఆర్థికముగాఁ గొంత మేలు కలిగెడిది. 'క్షిత్యాదితేయులు - ప్రతినిత్యము - పరమవైష్ణవుండవు నగస్య - ఉంచుక - నేనునున్ - పోనువలయు - రెండు సంగతులు -' ఇట్టి పదముల సౌరభ్యము సైతము మనము గ్రహింపవలసియున్నది.

అదితికి బిడ్డలుగావున దేవతలకు ఆదితేయులని పేరు వచ్చినది. క్షితికి కొందఱు ఆదితేయులుగా నుందురఁట. అనఁగా వారు భూదేవతలుసుమా! వారినే మనము బ్రాహ్మణులని పిలుచుకొనుచున్నాము. కల్పవృక్షము, మన భాషలో బ్రాహ్మణులకు ఎంత మంచిపేరు మఱియొకటి కల్పించి యిచ్చినదో విద్వత్కవులు గుర్తించి తమతమ రచనలలో వాడుకొనవలసియుండును. ఇఁకనుండి మనము 'హస్తినాపురికి' 'ఏనుఁగుపురి - అనేకపపురి' ఇత్యాదిగ పేరులు పెట్టుకొనుటకు ఆక్షేపము లుండవేమో! ఇట్టివానిని ఒక శ్రేణిలోఁ జేర్చి 'క్లిష్ట'మని పేరుపెట్టి ఆలంకారికులు పదదోషములలో లెక్కకట్టి భయపెట్టినంతమాత్రాన అండగా మనకీ 'కవిసమ్రాట్టు' ఉండఁగా తక్కువేమి మనకు! నిత్యమనఁగా ఎల్లప్పుడని మనము నిత్యము గుర్తించు మాటకు 'ప్రతినిత్యమని' వాడుకలో నున్న

దానిని కల్పము, గ్రాంథికము చేసి యిచ్చినది. నిత్యమనఁగా 'దినము' అనియు, ప్రతినిత్యమనఁగా ప్రతిదినమనియు కల్పములోని సంకేతమనవలెను.

'చం. నలిఁబ్రతినిత్యమున్ వ్రతము నా కిది గుండియయందు మిక్కిలిం
బలిసిన గొఱ్ఱెపోతు రుచివంటకమున్ భోనరించిఁ....' [అర 45 పు]

ఇది నాకు నిత్యము వ్రతమైయున్న దనుటకు అక్కఱలేని నలి - ప్రతి' ముక్కలు రెండింటిని అంటింపవలసివచ్చెను. ఈ వాతాపి కథలో వాల్మీకముగాని భాస్కరాదులుగాని 'మేషరూపిణం - కపటమేషాకృతిఁ గైకొనంగ' ఇత్యాదిగఁ జెప్పియుండఁగా కల్ప వృక్షము మనకు 'గుండియయందు మిక్కిలిం బలిసిన గొఱ్ఱెపోతు వంటకము రుచి'యని వంటలోని క్రొత్త యంశమును బోధించినది. అంచతేని నడకల్గా వచ్చుఁ గుంభోద్భవుని ఇల్వలుఁడు కనినాఁ డఁట [46] 'హంసయానల' శ్రేణిలో శ్రీరామునితోపాటు అగస్త్యుల వారినిసైతము కల్పము చేర్చినదహో! అందును వచ్చుఁగుఁభోద్భవు లఁట! తద్ధర్మవిశేషణమునకు నుగాగమము. 'భక్షితి సర్వమైన తరువాతనుసైతము' — [46 పుట] సర్వము భక్షించినపిదప అన్న దానికి ఇది యెంత మంచిప్రయోగమో అధునాతనకవీశ్వరులందఱు గుర్తించి దీని నిఁక సనాతనముగా మన్నించుకొందురుగాక!

గార్గేయి చెప్పిన కథ జానకి వినిపించి ఈ కథ బాగులేదా! యని తుదికి భర్తను ప్రశ్నించినదఁట. దానికి 'స్వామి' చెప్పిన సమాధానము :-

'నాకా బాగేమో తెలియదుగాని తెలిసినవి రెండు సంగతులు. మొదటిది నీవు రాముని భార్యవని రెండవది జనకుగన్నకుమారి వని'. ఆ మాటకు సీత, 'కాదు కాదు. రఘూత్తముని భార్యారత్నమ వని' అన్నదఁట.

ఈ సరసములు ఈ సారస్యములు ఈ సంగతులు కొంగ్రొత్తగా మనకు సృష్టించి కల్పము ప్రసాదించిన మహాభాగ్యముక్రింద జమ కట్టుకొనవలసియుండునేమో!

'చం. బలితలమీఁదఁ జిన్ని హరిపాదపుగుర్తులు వింధ్యపర్వతో
పలశిఖరాన నీదుమునిపాదపుగుర్తులు రెండునుం జగ
త్త్రివిశయనివారకాభయ నిదాన నికేతన మోహనాంకులై
వెలిగెడు సాధుసారపదవీనదవీయసమైన సత్కృపన్' [అర-46]

ఇది యగస్త్యులవారి వర్ణనము. బలిచక్రవర్తితలమీఁద హరి పాదపుగుర్తు లున్నట్లే వింధ్యపర్వతశిఖరాన మునిపాదపుగుర్తు లున్నవఁట. బలిశిరమున హరి ఉంచినది ఒక పాదముకావున ఒకవిధముగ పాదపుగుర్తులు సరిపెట్టుకోవచ్చునుగాని పర్వతముమీఁద పాదపు గుర్తు లనుటలో అర్థ మేమున్నది! ఆ పర్వతము తల వంపఁగా దాని మీఁద అగస్త్యుఁడు నడచిపోయెను. అప్పుడు ఆయన రెండుపాదాల గుర్తులు పడవచ్చునుగదా! ఆ పక్షములో 'మునిపాదముల గుర్తు'లని యుండవలెను. పర్వతశిఖరాన పాదపుగుర్తు లన్నచో సరిపోవుదానికి నడుమ 'ఉపలములు' వచ్చిపడినవి. ఉపలమనఁగా ఱాయి. పర్వత మందలి ఱాలతోఁగూడిన శిఖరమని యేదోరీతిగ సరిపెట్టుకొని యతి ప్రాసలు కాపాడుకోవలసిన దుర్గతి పట్టిన ఈ పద్యములో 'పదవీ నదవీయసమైన' అని మధురమైన పదమొకటి అతికింపవలసివచ్చెను. ఆ మొత్తము సమాసమున కర్థమేమున్నదో దైవమెఱుఁగును గాని కల్పవృక్షకర్త నోటి కెల్లిదమైన శ్రీనాథకవిసార్వభౌముని కవితావీధిలోని 'పదవీనదవీయస' వస్తువే అరువు తెచ్చుకొనవలసి వచ్చినది. ఈ కంకరఱాళ్ల గుట్టలో ఈ 'రత్నమాణిక్యము'ను బెట్టి కాకిముక్కునకు దొండపండు తగిలించినట్లాయెను. నీదుమునిపాదపు గుర్తులఁట! మునివైన నీయొక్క పాదముల గుర్తులని అన్వయమా! పాదములలోఁగూడ మునీశ్వరుల పాదములని కవీశ్వరుల పాదములని వేఱువేఱుగా నుండునా!

గీ. ఎంతకామరూపులేని వింధ్యాచల
మంత పేరుగలేరురా దురాత్మ! [అర-47 పు]

ఎంత కామరూపులైనను వింధ్యాచలమంత పేరు గలిగి లేరురా — అని భావము. అందమైన అన్వయముకొరకు కల్పములో వెదకుట కుందేటికొమ్మునకై వెదకుటవంటిదే. 'అంత పేరుగ లేరురా' అన్న వాక్యమున కన్నగారిడిగో! మఱొక రున్నారు:—

'ఇద్దె యగస్త్య సోదరుండుగ వసియించు పల్లియ' [అర-48]

'ఇదే అగస్త్యులవారి సోదరుఁడు వసియించుపల్లె' అనుటకు నడుమ దూఱిన గకారములో అంతరార్థ మున్నది. అదే ప్రాస కోసము పడినపాటు. మొగదల - అన్నది, పద్యము మొగదల నున్న పదమాయె.

లోకములో 'వాఁడు వట్టి అగస్త్యభ్రాతరా'అని ఒక వాడుక కలదు. ఆతఁడే ఇతఁడు. అగస్త్యునిలోని విశిష్టత ఈతనిలో లేదనియు తుద కీతని పేరైన 'ఇది'యని వ్యవహారములో లేదనియు కథలలోఁ జెప్పెదరు. 'శ్లో. యవీయా నేష మే భ్రాతా సుదర్శన ఇతి స్మృతః-' అని సనత్కుమారసంహితలో నున్న శ్లోకమునుబట్టి అగస్త్య సోదరుని పేరు సుదర్శనుఁడని గుర్తింపవలెను. 'ఆమంత్రయే త్వాం గచ్ఛామి గురుం తే ద్రష్టు మగ్రజమ్' [వాల్మీ 1024 పుట] ఇది శ్రీరాముఁడు అగస్త్యభ్రాతతో అన్నమాట. అయ్యా! మీ యన్నగారి దర్శనార్థమై వెళ్లుచున్నానని రాముఁడు సెలవు గైకొనును. దీనినిబట్టి అగస్త్యులవారు అన్నగారనియు సుదర్శనుఁడు తమ్ముఁడనియు తెలియుచుండఁగా 'అల మున్ వింటివి గాదె యిల్వలకథా హంకార నిర్వాపణోజ్జ్వలు నా తమ్ముని' [అర. 51 పు] అని అగస్త్య భ్రాతచే ఈ మాట కల్పవృక్షము చెప్పించుటలో అంతరార్థ మేమి! ఉజ్జాయింపుగ ఊహించి వ్రాసిన వ్రాఁత యెల్ల కవితలోఁ జేరునా!

సీతారామలక్ష్మణులు అగస్త్యసోదరునింటికిఁ బోయి మేము 'ఫలానా' అని చెప్పుకొనఁగా ఆయన మర్యాదలు చేసి పయనపు బడలికలు పోవుటకయి జలము లున్నవి కావున స్నానములు చేయుఁడని చెప్పి, అంతలో

'గీ. నేను బ్రహ్మచారి నెట్టులా! తల్లి వచ్చెడునటంచు నేను నేగి పొందఁ
బొరుగు గాలవుఁడను మునిభార్య నాకంటె తొందరించి తాను తోడువచ్చె' [49]

వ. అన్నియు సిద్ధముగా నున్నవని స్నానభోజనాదులు నెఱపుచుండ నగస్త్యసోదరుఁ డరుదెంచి వింధ్యపర్వతవృత్తాంతము వినిపించును. ఈ ఘట్టములో 'అన్నగారేకద దక్షిణాశ సృజియించె'

అని భ్రాతచేత చెప్పించి ఆపైని కొంతసేపటికి 'నిర్వాపణోజ్జ్వలు
నాతమ్ముని' అనిపించుటలో కల్పము తబ్బిబ్బు గమనింపవలెను. సరే-
ఆతఁడు బ్రహ్మచారియఁట. వచ్చినది సీతమ్మతల్లియఁట! మర్యాద
మన్నన లెట్లు జరుపవలెనో అని ఆ బ్రహ్మచారి బిడియపడుచుండఁగా
ప్రక్కయింటి గాలవమహర్షి భార్య తోడువచ్చినదఁట. ఇది
యంతయు కల్పము సొంతకవిత్వము. గాలవముని భార్య ఈ బ్రహ్మ
చారి యింటికి వచ్చుటలో అభ్యంతరము లేదు కాఁబోలు! ఈ లౌకిక
ములు వానప్రస్థుల కంటఁగట్టి మనవంటివారే మునీశ్వరులు సైత
మన్న భావమును ప్రోదిసేయుట సనాతనధర్మమా! ఆ యింటిలో
అన్నింటిని సిద్ధము చేసి 'స్నానభోజనాదులు నెఱపుచుండ-' అగస్త్య
సోదరుఁ డరుదెంచెనఁట! భోజనాదులు నెఱపుటకు కర్తలు రామా
దులని ఆ మాత్రము మనము ఊహింపలేమా యని కాఁబోలు ఆ
వచనపుముక్కలో ఆ కర్తల ప్రమేయమే కల్పము పెట్టుకొనలేదు.
స్నానము - భోజనము - ఆదులనఁగా = తాంబూల చర్వణము,
ధూమపానమువంటివా యేమి! ఆ యింటి యాసామి 'అరుదెంచె'
నఁట. ఎక్కడికి! ఎప్పుడు వెళ్లియుండెను? అతిథులు ఇంటిలో
నుండఁగా ఆ పెద్ద 'మనిసి' కల్పవృక్ష కర్తకైన ఇదిగో వెళ్లివత్తునని
చెప్పకయె వెళ్లుట-అంతలో అరుదెంచుట సభ్యప్రవర్తనమా!

ఈ వింజమ్మ కథలో అచ్చుదోసములో అసలుదోసములో
ఇవిగో కొన్ని చూడవచ్చును:-

1. గుర్రాలు 2. గగనమ్మనుకొనియె (గగనమ్మానుకొనియె
కాఁబోలు) 3. అసలవుఁగాలంబు 4. పృథులంబౌనభిషేకభావ పరమ
ప్రీతాత్ముఁడై (రెండుసొబగులు) 5. పెగల్చెన్ (సరగన్ - ల్చెన్ -
యతి, పట్టుకొన్నది) 6. కొమ్మన్నలా! (ఈ సంబుద్ధి కర్థ మేమో!)
7. ఆయెక్కడో పెట్టినావు నస్మదీయాలాపసరణి 8. అబ్బె! మునిలోక
భర్తుఁడై వర్ధిలుమీ! (భర్తుఁడవై) 9. దక్షిణాది (దక్షిణాపథము
నకు) [అర. 50-51 పుటలు] ఇక్కడ ఒక్క చక్కని వచనపు
ముక్క 'కల్పము' ప్రసాదించినది. దీనిని పూర్వయుగమునకు
ప్రబంధయుగమునకు ఆధునికయుగమునకు మచ్చుగాఁ దీసికొని

ఎంతగా మనము సంబరపడవచ్చునో ఊహింపవచ్చును:-

'వ. మాకు దక్షిణాదిం బనిపట్టినది. యజ్ఞాకృతియైన సౌపర్ణి వలె రెండు కడళ్లు మోసి పరుచుకొన్న నీవు మమ్మును బోనిచ్చి పోనిచ్చుటయేకాదు. మరల మేము వచ్చుట యచ్చటి మా పనిని బట్టి. అప్పటి కెంత పెరుగుదువో, పిలుపందునో, అందదో. మా తిరిగివచ్చువఱ కిట్లే యుండుదువు. మ మ్మెఱుంగు దెఱిగినపని యని యిట్లు చెప్పుట యని. [అర - 52 పు]

ఈ తుంపులకు - పలుకుల ముక్కలకు - బీజాక్షరములకు వలె మంత్రాక్షరములకు మాడ్కి అంతరార్థములు చెప్పి శైలిలో జాతీయ మని ఒక పేరు పెట్టి పిలిచి పెద్దగా కైవారము చేసెడి భక్తబృందము కొంత లేకపోలేదు.

ఈ వింజము కథ చెప్పిచెప్పి 'హఠాత్తుగా నమ్ముని వెడలి పోయె' నంట. అప్పుడు శ్రీరామచంద్రుడు అయ్యగస్త్యభ్రాత యందలి యాత్మమనోధర్మముల విస్పష్ట వైవిధ్యంబునకు అచ్చెరు పడెనంట.' వీరికిం జెప్పకయే అమ్ముని హఠాత్తుగా ఎందులకుం బోయెనో ! ఆ పోవుటలోనే 'ఆత్మ మనోధర్మముల విస్పష్ట వైవిధ్య' మున్నదా యేమి ? ఈ ముక్కలకుంగూడ కల్పవృక్షకర్తగాని, తచ్ఛిష్యబృందముగాని మఱొక భాష్యము వ్రాసి అచ్చువేయించి నచో అప్పుడైన మనము గుర్తించి తఱంపవచ్చును. అంతగా అతిథి సపర్యలు కావించిన ఆ మహర్షి, వారిని సాగనంపవలదా! అంతటి అగస్త్యభ్రాతవద్ద ఆతిథ్యము పొందిన ఈ యన్నదమ్ములు సెలవు గైకొనవలసిన పని లేదా! 'ఆత్మ మనోధర్మముల విస్పష్ట వైవిధ్య ములు' స్పష్టపడుటకై ఈ ఘట్టములో ఈ కల్పవృక్షకర్త సేకరించి మన కిచ్చిన పరికరములు పరమసాధనములు ఏ మున్నవో పరిశోధింప వలసి యున్నది. అసలు మూలములో ఈ గొడవయే తడవ లేదు. మూడు నాలుగు శ్లోకాలతో అగస్త్యభ్రాత కథ ముగిసినది. సుతీక్ష్ణమహర్షి చెప్పిన గుర్తులనుబట్టి శ్రీరామాదులు అగస్త్యభ్రాత ఆశ్రమమునకు వత్తురు. వారికి ఆ మహర్షి స్వాగతము చెప్పి ఆతిథ్యము నెఱపును. ఆ మువ్వురా రాత్రి అక్కడం గడపి వేకువజామున లేచి అనుష్ఠానములు ముగించుకొని ఆయనతో వెళ్లివత్తుమని పలికెదరు.

అట్లే అన్నగారిని జూచిరండని అగస్త్యభ్రాతయు వారిని సాగ నంపును. దీనినే బ్రహ్మాండముగా 'కల్పము' సాగఁదీసి సీతమ్మ నోట వాతాపికథ చెప్పించినట్లుగ అగస్త్యభ్రాతచేత ఇంతలావు కథ చెప్పించినది. ఈ కథలో సూర్యుని గుఱ్ఱాలు పెడపెడగాఁ దిరిగి పోవుట – ఇరుసు కట్టుమని ఱీసికొనుట – సూర్యభగవానున కొక్కసారి 'కుదిలింపు' పుట్టి, వెనుకటి వీరభద్రుఁడు పెట్టిన చెంపపెట్టు జ్ఞప్తికి వచ్చుట – అరదముపోలు పేడిచ్చి సీల చెదరి అడ్డకట్టూడి ఆకులు రాలి గుఱ్ఱాల టంగు తెగి పిచ్చుకకుంటు కేలు నేల కానుకొనుట – అగస్త్యులవారి ఔద్ధత్యము – వింధ్యము చాపచట్టుగాఁ బడి నమస్కార మాచరించుట – ఆ కొండమీఁద ఆ మహర్షులవారి హాౕన్ను పావకోళ్ల గుర్తులు పడుట, ఇంత 'భాగవతము' అదనముగా వచ్చి పడినది. ఈ భాగవతమును వినిపించి అంతలో 'హఠాత్తుగ' ఆ 'భ్రాత' సైతము వెడలిపోవలసివచ్చెను. ఆ వెంటనే సీతారామ లక్ష్మణులు దారిని బడి అడవిలో దృశ్యములు చూచుచు అగస్త్య మహర్షి ఆశ్రమప్రాంతమునకు పోయెదరు. ఈ ప్రయాణములోనే తమ్మునితో రామచంద్రుఁడు అగస్త్యమహర్షి మహిమ వర్ణించి వింధ్యపర్వతకథ వినిపించినట్లు వాల్మీకములోను భాస్కరాదులలోను ఉన్నది. కల్పములో ఈ కథ ఈ విధముగా ఇంకొకరి నోట విని పించుటలో ఏదో అంతరార్థ మున్నదని ఏదో ఒకానొక పెద్ద బహిరంగోపన్యాసములో మనము వినవచ్చును; విని తరింపవచ్చును.

మూవురు అగస్త్యాశ్రమము చేరిరి. ముందుగా లక్ష్మణుఁడు లోనికిఁ బోయి అగస్త్యశిష్యుని జూచి తమ వృత్తాంతము వినిపించి అగస్త్యులవారిని దర్శింపను వచ్చితిమని విన్నవించెను. ఇచ్చటఁగూడ 'కల్పము'లో కొంత కల్పన కలదు.

'లక్ష్మణునకు వర్షీయాంసుఁడు ఒకఁడు కన్పించెనఁట. వర్షీ యాంసుఁడనఁగా ఏండ్లు మీఱినవాఁడుకాఁబోలు! ఆతని కనుబొమలు తెల్లనై పొదరువోలె గుబురుగా నుండునఁట. వానికి యజ్ఞోపవీత మున్నదఁట. వానితో లక్ష్మణుఁడు,

'ఉ. ఈయన ప్రొద్దువంగడము హీరము పంక్తిరథాత్మజుండు తా
నీ యటవుల్ చరించెడుఁ బిత్రుప్రియకార్యచణుండు వింజపున్

మాయుకసింహమైన మునిమండను పాదనమస్క్రియా సప
ర్యాయుతమైన యూహా పెనుపై చనుదెంచెను బ్రాహ్మణోత్తమా!

గీ. 'అవసరంబైన దర్శన మాచరింతు'మనిన —
వృద్ధుండు తల యెత్తి హస్త మడ్డమిడి సితాంభోద విద్యుత్ప్రమీల
దృష్టి పరపి రఘుమూర్తిపై లోని కరిగె లేచి [అర-55 పు]

సూర్యవంశరత్నమునకు 'ప్రొద్దు వంగడము హీరము' ముద్దైన తెలుఁగు కాంభోలు! తాను - ఈ యటవుల్ చరించెడునఁట. ఎందులకు! పితృప్రియకార్యచణుండు అయినందులకు. ఆ సమాసములో 'ప్రియ'ను దొలఁగించినచో పితృకార్యములలో శ్రీరాముఁడు మొనగాఁడని తెలును. 'పితృశాసనాత్ వయం ఉగ్రం వనం ప్రవిష్టాః' అన్న వాల్మీకిమాటకు తెలుఁగులో పితృప్రియకార్యచణుండని దిగుమతి యయినది. వృద్ధుఁడు హస్త మడ్డమిడి యని ఒక చెడ్డమాట. ఇట్టివే అశ్లీలములని ఆలంకారికులు నిరసించిరి. 'కృకాటిక'లో 'కాటి' ఉన్నందులకే అది రోఁతగా భావించిరి. ఇట్లే 'గుద్దలి-సీచుల్లిపాయ - మోమడ్డంబు గదల్చె' వంటివి వ్రీడాకరములు కావున త్యాజ్యములని పెద్ద లందురు. దృష్టి పరపి రఘుమూర్తిపై - రఘుమూర్తిపై దృష్టి పరపి అనియు, 'లోని కరిగె లేచి' - లేచి, లోని కరిగె ననియు అన్వయము. శాస్త్రీయముగాఁ జెల్లవచ్చునని ఈ పదము లీ తీరుగ ముందువెనుకలలో వాడుట నేర్పు కాదు. లేచి, లోని కరిగెనని ఈ మూఁడుముక్కలు గీతములో అల్లలేని కవిత్వము ఒక కవిత్వమా!

ఆ వృద్ధుఁ డీ వార్త అగస్త్యులవారితో చెప్పిన ధోరణి చూతము :-

'సీ. ఆకాశమునుండి యవతరించిన నవాషాఢనీలాంభోదసదృశమూర్తి
దశరథరాజు పుత్త్రుఁడఁట సంజ కెంజాయ క్రమ్మిన సితజలదమూర్తి
యొక్కఁడు, నిలుచున్న యుర్విలోనుండి బంగరుబొమ్మ లేచినకరణి నొప్పు
నొక పసిచాన, మదుజ్జ్వలభ్రూదీప్తిపీచి, యవసరంబు వేచి యుండి
రనినఁ గుంభోద్భవుండు పేర్కొనరయేమి! యాత్మనామంబులనిన
వృద్ధావనిసురుఁ
డెపుడు వారి నామంబుల నేను చెప్పితినిగదా యన నవ్వి రమ్మనియె మౌని.

వ. అంత నా వృద్ధుండు వెలికి వచ్చి యిట్లనె

కం. ఎవరయ్యా యిట రాముఁడు
రవివంశ్యుండఁట దశరథ రాజు కొడుకఁటే
తవిలి కనన్ రమ్మనె మాని
వింధ్యశా త్రస్వరాగ్రనిహితాంఘ్రి వెసన్' [అర-56]

ఈ సంభాషణములోని సొగసునకుఁ దగినట్లే ఉన్నది ఈ పద్యములలోని నడకసైతము. పద్యము లీ తీరునడకలో నడపించు నేర్పు గల ఈ కల్పవృక్షకర్త, కవిసార్వభౌముని సీసాల నడకను ఆక్షేపించుటలో ఎంత అర్థమున్నదో పండితులు గుర్తించియే యుందురు. ఆకాశముననుండి యవతరించిన దేది! నీలాంభోదము. సమాసములో ఇఱికియున్న నీలాంభోదమునకు 'అవతరించిన' పద మెట్లు విశేషణము కాఁగలదు! దశరథరాజు పుత్త్రికుఁడఁట! గణము కోసమైె అనర్థకమైన 'క' ప్రత్యయమా! సీతమ్మ - ఈ వృద్ధ బ్రాహ్మణ దృష్టిలో 'పసిచాన'. వీరు అవసరంబు వేచి యుండిరఁట. ఉన్నారుకాదు కాఁబోలు! భూతమే వీరి కభిప్రేతమా! వేచియుండి రని వృద్ధుఁ డనఁగానే ఆత్మనామంబులు పేర్కొనరయేమి! యని అగస్త్యులవారు ప్రశ్నించిరి. వారి నామంబుల నేను చెప్పితినిగదా యని వృద్ధుఁడన్నాఁడఁట. ఎప్పుడు! ఎక్కడ! ఈ పద్యములో ఆ చెప్పినదిలేదే! దశరథరాజుపుత్త్రికుఁ డనఁగా అది పేరగునాయేమి! సరే యని ఆ'ముసలాయన' వెలికి వచ్చి, కోట్టముంగల జవాను పిలిచి నట్లు 'ఎవరయ్యా! ఇందులో రాముఁడఁట! రవివంశ్యుఁడఁట! దశ రథరాజు కొడుకఁట! మాని, తవిలి కనన్ వెసన్ రమ్మనెన్' అని అఱచెనఁట. అచ్చట ఉన్నదే మూవురు. వారిలో 'ఈయన ప్రొద్దు వంగడముహీరము - పంక్తిరథాత్మజుండు' అని పరిచయము చేసి కొని తానుగా మఱల అగస్త్యులవారితో వారు 'ఫలానా' అన్న వృద్ధుఁడు వెలికి వచ్చి ఈ పిలుపులు పిలుచుటలో చమత్కారము కలదుకాఁబోలు! మూలములో రామః ప్రాప్తో మునిం ద్రష్టుం భార్యయాసహ సీతయా లక్ష్మణో నామ తస్యాహం భ్రాతా' ఇత్యాదిగ అగస్త్యశిష్యునకు మువ్వురి పేరులు సంప్రదాయముప్రకారము విని

పించినట్లే ఉన్నది. కల్పములో ఈ ముసలిబాఁపనివద్ద ఈ పేరులు - పేర్కొనుటలు రాలేదు. రాకపోయినను - పద్యములో లేకపోయినను 'నేను చెప్పితినిగదా యని' వృద్ధబ్రాహ్మణుని బూకరింపులు - ఆపైని, పేరెట్లు తెలిసెనోయేమో! ఎవరయ్యా 'రాముఁడఁట' రావయ్యా స్వామీ! అని పిలుచుటలు - ఇట్టి వన్నియు కల్పవృక్షము కనిపెట్టిన భాష్యములు. ఇర్వురు మూవురు కలిసినపుడు వారి సంభాషణ మెట్లు సాగవలెనో తిక్కనాదులవోలె 'నాటకీయతలు' రవ్వంతైన చేతకాకపోయినను ఔచిత్యమును బోషించుట గానీ, తుదకు కర్తృకర్మక్రియలు స్పష్టముగా ఉంచి సరళముగా భావము స్ఫురించునట్లుగాఁగానీ ఈ కల్పవృక్షకర్త చేయనే చేయలేఁడు. 'అగస్త్యశిష్య మాసాద్య' అన్న మూలమును మార్చి, ఈ ఘట్టములో ఈ 'వర్షీయాంసుని వృద్ధబ్రాహ్మణుని' కల్పము ప్రవేశపెట్టుటలో సారస్య మేమో వినవలెను. చెప్పనిదానిని చెప్పితిననుటలు - నవ్వుటలు, ఇట్టివి ఆ సారస్యమునకు 'చిలువలు పలువలు' కాఁబోలు! ఒకప్పుడా మహర్షికి విష్ణుమూర్తి దివ్యధనుస్సును-బ్రహ్మదేవుఁడు శరములను - దేవేంద్రుఁడు తూణీరములను కరవాలమును ఇచ్చిరనియు వానినే శ్రీరామునకా మహర్షి యిచ్చి పంపెననియు వాల్మీకములో నున్నది. ఈ వార్త, కల్పములో ఎంత వెదకినను కంటికిఁ గానరాదు. రామాదులకు ఫలమూలము లిచ్చిరఁట. 'అవి యారగించిన యనంతరమందున వారు మువ్వురున్' [అర-57]. ఇది యొక పద్యపాదముసుమా! వారు మువ్వురు అవి ఆరగించిన యనంతరమున - అని అన్వయించుకొని తరువాతి కథావిధాన మెట్టిదయా! యనవలెను. 'ముని నునుమెత్తవెన్నెలల మొత్తమునోలిన పిన్న నవ్వులన్ - ఇటు లనెనఁట :—

'......కోసలావనిమహేశ్వర! దానవసంప్రహారదు
ర్ఘటమగు మున్నొకప్పుడు సురప్రకరావనదీక్షఁ గేశవుం
డఁట నొక విల్లునుం దఱుగనట్టివి యమ్ములు గల్గుగూళ్లునుం
జటులతరాసి యొక్కఁడును సంగతపింగలహేమకోశమున్

చం. పరమతపోఽభిలబ్ధములఁబట్టి సురారుల మూఁక గొట్టి ని
ర్భరమగు దైత్యలక్ష్మిని బరాజితముం బొనరించెఁ దద్దను

శ్శరకరవాలముల్ మఘవుసంగతపెట్టిన విందు మద్గృహాం
తరమున నున్న నీవు సముదారత వానిఁ బరిగ్రహింపుమా!

కం. 'నీకోస మట్టిపెట్టితి గైకొమ్మా!' ఇదియే 'కల్పము' చెప్పిన కథ. కత్తులు కటారుల మాట యున్నది కాని ఎవ రెవ రిచ్చినది 'ఆరా' దీనిలో స్పష్టముగాఁ గానరాదు. 'దుర్ఘటమగు మున్నొకప్పుడు' — ఇది యొక వింత పలుకుబడి. మున్ను ఒకప్పుడు దుర్ఘటమైన దశలో — అని అన్వయము. అప్పుడు 'సురప్రకరావన దీక్షచే కేశవుండఁట నొక విల్లునుం దఱుగనట్టివి యమ్ములు గల్గు గూళ్లనుం జటులతరాసి యొక్కఁడును — అది సంగతకోశమఁట — వీనిని కేశవుండఁట — ఏమి చేసెను? ఈ పద్యములో ఆయన చేసిన దేమియు లేదు. రెండవపద్యములో నున్న 'పట్టి'ని పట్టుకొని, ఆ కేశవుఁడే వచ్చి మూఁక గొట్టి లక్ష్మిని బరాజితముం బొనరించెనని అన్వయించుకొనవలెను. 'లక్ష్మి' మహతీవాచకమని పండితులు భ్రాంతిలో నుందురేమో! మహానుభావులు కల్పవృక్షకర్తలు 'లక్ష్మిదేవిని' మహతీతరముగాఁ జేసి తద్విశేషణములకు క్లీబత్వము అనుగ్రహించిరి. కానిచో నిర్భరయగు దైత్యలక్ష్మిని బరాజితగాఁ బొనరించె' అని యుండునేగదా! ఆహా!! తెలుఁగు వ్యాకరణపు సొంపు!! 'తద్ధనుశ్శరకరవాలముల్ మఘవుసంగతపెట్టిన'వఁట! దీని భావ మేమి తిరుపతేశ! ధనువు శరములు కరవాలము మఘవుఁడు సంగతపెట్టినాఁడేమి! సంగతపెట్టు — సమకూర్చు, అని లక్షణయా లాగి చూతమన్నచో, వాల్మీకములో ఏతద్వస్తుప్రదాతలు వేఱు వేఱుగాఁ గానవత్తురే! పైగా, ఇక్కడ నింకొక్క చమత్కారము. కేశవుఁడఁట (ఇచ్చినది) 'ఒకవిల్లును, తరుగనట్టివి యమ్ములు గల్గు గూళ్లనుం, జటులతరాసి యొక్కఁడును' ఇది, కల్పము చూపిన అసలు సరకు. ఈ పక్షములో విల్లు — గూళ్లు — అసిమాత్రమేసుమా! అమ్ముల విషయమో! అవి ఇచ్చినట్లు పద్యము చెప్పదు. తరుగని యమ్ములు గల్గు గూళ్లు — ఇచ్చిరని కాని విడిగా అమ్ము నిచ్చిరని 'కల్ప' మనలేదుగా! 'బ్రహ్మదత్త శ్శరోత్తమః' అని వాల్మీక మన్నంతమాత్రాన కల్పవృక్షమంతదానికి అది ప్రమాణమాయేమి!

ఎవరి యిష్టమువారిది! 'నిరంకుశాః కవయః,' అని ఉండనేయున్నది గదా! 'గూఁడు'నకు బహువచనము 'గూళ్లు' కాఁబోలు! గూఁడనఁగా - పక్షిగృహమని, దీప ముంచు (గోడలోని) చోటని, చిలుకలు లోనగునవి యుండు పంజరమని, ఆకుగుడిసెయనిమాత్రమే 'రత్నాకరా'దులు వ్రాసికొన్నవి. 'కల్పము' తరువాత వెలసిన నిఘంటువులలో గూఁడనఁగా - అమ్మల పొదియనియు తప్పనిసరిగాఁ జేర్చుకోవలసియుండునేమో! 'ప్రయోగశరణాః వైయాకరణాః' అన్న సూక్తి ఉన్నదాయె. ఈ వస్తువులు పుచ్చుకొని రాఘవుఁడు నమస్కరించెనఁట. అప్పుడు అగస్త్యులవారు 'ప్రీతమనస్కుఁడై పెద్దవి చేసినకన్నులచే, ధరిత్రీతనయా మనోహరా! తృతీయ జగత్పరిపాలనాచణా! అని రెండు పిలుపులు పిలిచి, ఇఁక రక్షోజాతిని మండింతువు లే యని ఆశీర్వదించెనఁట! పెద్దవిచేసిన కన్నులఁట!! ఎంత మంచి ప్రయోగము!! యతికోసమో గణముకోసమో అనరానిది అని అందులో అంతరార్థ మున్నది. అది జాతీయమైన పలుకుబడి సుమా! అని బూకరించినచో పప్పు లుడుకవు. యతికోసము పడిన తిప్పలు కానిచో 'జగదేకధనుర్ధారియైన' శ్రీరాముని అవతారపురుషుఁడైన రామచంద్ర ప్రభువును 'సర్వజగత్పరిపాలనాచణా' అని అర్థము వచ్చునట్లు పిలిచినచో అగస్త్యులవారి సొమ్ము ఏమిపోవును! ఒకవేళ అంతిదనుక అంత శక్తి రామయ్యకు లేకపోయినను - ఈ ధనుస్సులు ఆశీస్సులు అనుగ్రహించిన యనంతరమైన ఆ ప్రభువులు అంతవారు కావచ్చునుగదా! కొంప మునిఁచి తృతీయకు - మూఁడు అని లక్షణయా అర్థము చెప్పరుగదా! అయినను లోకములు మూఁడేమికర్మము! ఏడు + ఏడు - పదునాలుగు లోకములనిగదా మనము పాడెడి పాటలు.

ఆశీర్వదించినపిదప అగస్త్యుఁడు ఆ యాలుమగలతో ఇట్లన్నాఁడఁట!

చ. 'వెలయఁగఁ దండ్రిమాటయని వేనికిఁ గావలె భర్తయంచు నే
పొలతికి వెంటఁ గానఁబడిఁ బోవుట కావలె మీరు లేక ...' [౩౪-58]

ఇది ఏ భాష స్వామీ! ఎక్కడిది ఈ వాక్యప్రయోగము

బాబూ! లోకములో తండ్రిమాట వినువాఁ డెవఁడు! భర్త వెంటఁ బడి అడవులకుఁ బోవు ఆఁడుది ఎవ్వతె! మీరు లేక మీ యిర్వురు తప్ప. పోవుట కావలె = పోవలసిన పని. కల్పములోని ఈ తెలుఁగు మాటకన్న వాల్మీకులు చెప్పిన 'ఏషా హి సుకుమారీ చ...వనం ప్రాప్తా భర్తృస్నేహ ప్రచోదితా' అన్న శ్లోకపాదమే తెలుఁగువారికి విన్నట్లుగా తెలిసినట్లుగా నుండును. అగస్త్యుఁడు సీతారాములను మెచ్చుకొని లోకములోని స్త్రీలవైఖరి చక్కఁగా వివరించి చెప్పును. ఇక్కడ వాల్మీకి పలికిన బంగారుపలుకులు విని 'కల్పము' జోలికిఁ బోదము :—

శ్లో. "ఏషా హి ప్రకృతిః స్త్రీణా మాసృష్టే రఘునందన! సమస్థ మనురంజంతి విషమస్థం త్యజంతి చ శతహ్రదానాం లోలత్వం శస్త్రాణాం తీక్ష్ణతాం తథా, గరుడానిలయో శ్శైఘ్ర్య మనుగచ్ఛన్తి యోషితః ఇయం తు భవతో భార్యా దోషై రేతై ర్వివర్జితా, శ్లాఘ్యా చ వ్యపదేశ్యా చ యథా దేవీ హ్యరుంధతీ' [అర- 1031]

రామయ్యా! లోకములో స్త్రీల స్వభావ మెట్లుండునో విన్నావయ్యా! పెనిమిటి మంచిస్థితిలో ఉన్నంతదాఁక భార్య అనురాగము చూపించును. ఆతనికి విషమస్థితి వచ్చినదా 'హరోహరః.' ఆబిడ ఆతని సన్నిధిలో ఉండనేయుండదు. స్త్రీల చిత్తము మెఱుపువోలె చంచలము. శస్త్రములవోలె నిశితము. గరుడవేగమువోలె వాయువేగముభంగి తీవ్రము. కాని ఈ దోషము లేవియు నీ భార్యలో లేవుసుమా! అచ్చముగా ఈమె అరుంధతికి ప్రతీక. ఈమె పతివ్రతా శిరోమణి—

ఇట్టి సూత్రప్రాయములవంటి నీతులను 'తవిలి' యన్న [అర-59 పు] పద్యముతో తవులుకొని, జానకి 'ఆత్మస్తుతివిముఖ' యైనంతదాఁక పట్టువిడువక ఆఱు పద్యములలో 'కల్పము' సాఁతము కొంత కల్పించి ఉపన్యసించును. ఎత్తుగడలోనే

చం. 'తవిలి నృపాలకన్యకల దారియుఁ జిత్రము' [illegible] రాజకాంతల 'ప్రకృతి' వర్ణన మెత్తుకొనును. ప్రకరణమును బట్టి సీత రాజకాంత కావున ఈ కవిసమ్రాట్టు ఈ క్రొత్తత్రోవ [illegible]నని తచ్ఛిష్యపరమాణువులు తలంప[illegible]ను; సమర్థింపవచ్చునని [illegible]దున

'కన్యకలఁట! వారి దారియు చిత్రమఁట! వారి కేమి తక్కువ! వారి పితలు పదియాళ్లు లిచ్చిరనుకొమ్ము. తనుయాత్ర దాఁటి పెక్కువ యుగ (హెచ్చుగ) లౌకికంబు సుఖకోటి భజింపనువచ్చు. ఇఁక, భర్తయన్, 'నవవనబుద్ధి నిల్పిన సనాతనభావశిఖల్ జ్వలించుటల్' ఈ నాలవపాదమునకు సూటిగా భావము చెప్పవలెనన్న నా తరము గాదు; బ్రహ్మతరమును గాదు; కల్పవృక్ష కవిబ్రహ్మయే దిగిరా వలెను. భర్త, అడవికి మనము వెళ్ళవలసియుండు ననఁగా రాజ కాంత ఇట్లనునఁట :—

'కం. నే నంత రాజుకూఁతుర గానకు నేనేఁగునంత గరు శేమి యనున్
దానది విద్యాధర్మస్థానంబుల గర్వ మెంత ధార్ష్ట్యము చేయున్'

మహామహిమ గల ఒకానొక మహర్షి, అవతారపురుషుని సన్నిధిలో మహాసాధ్వియైన సీతాదేవి ప్రకృతిని జిత్రించు ఘట్టములో స్త్రీల ప్రకృతి యిట్టిదని ఈ'స్థాయి'లోఁ జెప్పుటలో ఔచిత్యము లేదు. బజారురకమును మనస్సులోఁ బెట్టుకొని ఇరువదవశతాబ్దిలోని 'కాలేజీగరల్స్' కథలు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, ఇట్టి ప్రబోధము అగస్త్యుఁడు చేసెనని మనకు వినిపించుటకా ఈ 'కల్పము' ఈ దేశములో దిగినది! 'మనస్సు - అధోదిశ - దేహము - ఊర్ధ్వదిక్కు - ఆత్మ - గమ్యము - దేహావాంఛ' - ఇట్టి పారిభాషికముల 'సరంజామా'తో మూఁడు పద్యములు నడపించి ఒక్కపద్యములో మాత్రము 'అరుంధతి' మాట యెత్తి 'నిన్నుఁ బొందిన జనకాత్మజామనసు నీ పతి 'భావత్రికాలనిష్ఠమై' అని కల్పము పలుకును. నిన్నుఁబొంది యున్న పదముల దాంపత్యము నీ 'బొందను' స్ఫురింపఁజేయఁగలదు. 'భావత్రికాలము'లోని 'వ' కారము కల్పవృక్ష సనాతనాచారసంప్రదాయములనుబట్టి లఘువన్నమాట మఱువరాదన్నమాట.

స్త్రీజనప్రకృతినిగూర్చి అగస్త్యుఁడు చేసిన యుపదేశమును విని సీతారామలక్ష్మణులు పదింబదిగ ఆయనను స్తుతించి పంచవటికి ప్రయాణమయినట్లు మూలములో నున్నది. 'కల్పము' వారి మువ్వురను ఆ రేయి అగస్త్యాశ్రమములో పరుండఁబెట్టినది. దాని ఫలితము మనము గుర్తింపవలెనుసుమా! ఆ రేయి ఆలుమగ లిద్దరకు కలలు

వచ్చినవఁట ! ఏమని !! ఇదిగో వినవలెను:—

'గీ. నాథ నిజముగ నెపుడు స్వప్నములు రావు రాత్రి యొక్కటే స్వప్నముల్ రామచంద్ర !
కడుఁ బసిడిమేనుపోడలు మాఘువతమణులు కనులు పచ్చలు మిన్నేగఁ గలుగు శేళ్లు [61]

ఇది సీతమ్మకల.

మ. అనినన్ శ్రీరఘుమూర్తి యిట్లనియెఁ గాంతా ! నాకునట్లే యగ
స్త్యుని యా పెంపుడుదుప్పి వెంటి విరహాన్యూతాక్షిశోకాగ్నియెం
దున నే నుందునో యల్లఁ దా మగిడి యందున్ వచ్చి తోఁచున్ సుధా
నన ! యే మున్నది భావలగ్నములు స్వప్నంబుల్ విడంబించెడున్.

[అర - 61 పుట]

వ. అంత వారితో నగస్త్యుం డిట్లనియె.'

ఉషోవేళలో, ఒకరికొకరు తమతమ స్వప్నము లిట్టివని చెప్పు కొను ఘట్టములో 'అంత - వారితో నగస్త్యుఁడు' ఏదో చెప్పఁ బోవుటలో అంద మేమున్నదో ఊహింపవలెను. ఇంతకు రామయ్యకు వచ్చిన కలను మనము వినవలెనుగదా! అది యిది:— అగస్త్యులవారి కొక పెంపుడుజింక ఉన్నదఁట ! దాని వెంటి గతించిన దఁట ! ఆదిలో సీతారామ లక్ష్మణుల కాతిథ్య మిచ్చు సమయము లోనే ఆ మహానుభావుఁ డగస్త్యులవారు మఱచిపోకుండ దీనిని రామయ్యకు పరిచయము చేయించినాఁడు. ఏమని !

'చ. కృసర మొసంగినట్టి రురువియ్యది వెంటిని బాసి మిక్కిలిన్
వ్యసనమునంది నా దెసకు నైనది దీనినిగూడ నగ్నితో
డ సరిగఁ జూచెదన్ .... ప్రియభార్య వియోగము పుక్కిలింతలై' [57]

కృసరమనఁగా - పులగము; లేదా శ్రాద్ధమున నిమంత్రితులకు అభ్యంజనకాలమందు కలిపి యిచ్చెడు నువ్వులు, బెల్లము. ఇందు నేదైనఁగాని, ఒసంగినట్టి రురువఁట— ఇచ్చునట్టి మృగమా ! ఇచ్చునది మృగమా! ఆశ్రమవాసులా! మేము ఆ పదార్థమును ఏ మృగమునకు ఒసంగితిమో ఒసంగు - అని తద్ధర్మముకూడ కాదు - ఆ మృగమని ఆ మాత్రము ఇంత కల్పము చదివి అన్వయించుకొనలేరా ! యని కల్పవృక్షకర్త ధీమా కావచ్చు! సరే - ఆ రురువే ఇదిగో రామయ్యా!

పాపము! వ్యసనములో నున్నది. వియోగము పుక్కిలింతలై యున్నది. నా దెసకున్నైనది. ఇట్టి ప్రాణిని నేను అగ్నితోడ సరిగ - అనఁగా సమానముగాఁ గాఁచోలు, చూచెద నని మహర్షులవారు సెలవిచ్చిరి. అసలు మూలములో మహర్షులవారి ఆశ్రమములో లేళ్లు ఉన్నవి కాని ఈ వ్యసనములు - పుక్కిలింతలు మనకు దొరకవు. వెనుకటికి - పురాణకథలలో ఆకస్మికముగ బిడ్డను నీళ్లలో వేసి తల్లి చచ్చిపోఁగా, ఆ లేడి పిల్లను పెంచినందులకే యోగవిఘ్న మేదో జరిగి జడభరతోపాఖ్యానమైన దని వింటిమి. మఱి - ఈ వియోగములు ఈ వ్యసనములు - ఈ పుక్కిలింతలు కల్పవృక్షకర్తకు అభిప్రేతములు కావచ్చునుగాని ఆశ్రమవాసులకు అక్కఱ తీర్చునా! పశుపక్ష్యాదుల వ్యసనములే పరిశీలించి భద్రపఱుచువారి ఆశ్రమములు పుణ్యాశ్రమములలోఁ జేరునా! పెంపుడుదుప్పి అనఁగా పెంపుడుజింక, పెంటి విరహాస్యాతాక్షికోణాగ్ని - పెంటియొక్క విరహముచేత ఏదో అయినదఁట. దుప్పికి - ఈ పెద్దమాట విశేషణము. ఈ విశేషణములో మొదటి, విరహములో, 'రుక్మిణి కుక్కర్'పాత్రలువలె పెంటి యను తెలుఁగుపదము తూరినది. అహా! విచిత్రమైన సమాసము!! ఇంతకు ఈ దంపతులకు వచ్చిన మహాస్వప్నముల ఫలము కల్పవృక్షపాఠకు లూహించియే యుందురు. ముందు తొందరలో బంగారు లేడి రానున్నది. దానికి పిదప రావణబ్రహ్మ దయచేయును. ఆ పిదప సీతాపహరణము. తత్ఫలితమే భార్యావిరహము. ఇదియే కావ్యార్థ సూచన మందురు. ఇంత 'కథ' అంతరాత్మలో నిక్షేపించుకొని వాల్మీకి చెప్పనంతమాత్రాన ఉపేక్షింపక, కల్పవృక్షకర్త ఈ సారస్యమును సంపాదింపఁగలిగెను. కూర్చుండి లేవలేని ప్రతికవియు ఏది చేసినను జేయకపోయినను అర్థాంతరన్యాసమును జక్కఁగా పోషించుట తెలుఁగుసాహిత్యములో మనము చూతుము. రామ రామ! ఇంత లావు కల్పములో ఇన్ని వందల పద్యాలలో పట్టుమని గట్టివి నిర్దుష్టమైనవి రెండైనను అర్థాంతరన్యాసములను జూడ నోఁచితిమా! 'ఏ మున్నది భావలగ్నములు స్వప్నంబుల్ విడంబించెదున్'వంటివి తప్ప.

నాయనా! రామచంద్రా! మీ రిక్కడనే ఉండవచ్చునని

మనసులో అనుకొన్నానుగాని నీ యభిప్రాయము తెలిసినది కావున పంచవటికిఁ బోయి ఆ ప్రాంతములో హాయిగా నుండుఁడని అగస్త్యుఁ డన్నట్లు వాల్మీకము చెప్పినది. కల్పములో చిన్న తమాషా; —

అనిన రాముండు.

శా. ఇచ్చోఁ నిష్టము లేక కాదు ప్రభు! మీ కిబ్బంది. పైనిన్ ధరా
భృచ్చంద్రోదిత వాక్యపాలనము నేనే యూరనో యిల్లుగాఁ
బుచ్చం గాలము చేసినట్లగునె నీ పుణ్యాశ్రమం బెట్టులో
ఆచ్చోఁ బంక్తిరథేశు గేహములు నష్టైయున్కి. నం తేమనన్' [61]

ఇంతకు ముందు నడచిన కథనుబట్టి మాను లందఱు తమ తమ పరగణాలలో శ్రీరాముడు లుండవలెనని కోరిరి. 'ఇష్టము లేక కాదు – మీ కిబ్బంది' అను – కల్పములోని ఈ జవాబు, కేవలము మన యూళ్లలోని మన నోళ్లలోనిది. ఆపైని, ధరాభృత్ + చంద్ర – రాజచంద్రునివలన – ఉదిత – వాక్యపాలనము – మాట నిలఁబెట్టుట – పితృవాక్యపరిపాలనమునకు వచ్చిన 'తిప్పలు'. ఆ మీఁద – నేను ఏ యూరనో ఇల్లుగా పుచ్చన్ 'కాలముచేసినట్లు' అగునె ! ఇదేమి స్వామి! ఇంతసాహసము చేసితిరి! కాలము చేసిరనఁగా చచ్చిపోయిరని తెలియని తెలుఁగువాఁ డీ తెలుఁగు లోకములో ఉన్నాఁడా! కాలక్షేపము చేసి – అనుటకు కాలము చేయుట అనుటలో 'అశ్లీలము'న్నదని మీకు స్ఫురింపలేదా! లేక అంతరార్థమేమైన వ్యాఖ్యానింపఁగలమన్న ధైర్య మున్నదా!

స్వామీ! దశరథమహారాజు గృహములవంటివే మీ పుణ్యాశ్రమములుకూడ మాకు అభ్యంతర మేముండును! అని శ్రీరాముఁడు చెప్పఁదలఁచిన భావము, పద్యములో తాఱుమాఱైనది. నీ పుణ్యాశ్రమం బెట్టులో అచ్చోఁ బంక్తిరథేశు గేహములు నష్టైయున్కి – యఁట. ఇక్కడ ప్రకృతాంశము – పుణ్యాశ్రమములు – అప్రకృతము పంక్తిరథేశు గేహములుగదా! పంక్తిరథేశుఁ డన్నది కల్పము మన కిచ్చిన వింతమాట. పంక్తిరథుఁడు – అని దశరథున కొక పేరుగదా! సంజ్ఞావాచకముపై – ఈశుఁడఁట. ధాత్రీశుఁడు – భూమీశుఁడువంటి ధోరణిలో ఈ పదము సృష్టింపఁబడెనా! లేక,

మనము మెచ్చుకోవలసియున్నది.

ఆ మహర్షితో శ్రీరాముఁడు, గుమ్ములు కట్టి భూరుహనికుంజములు మున్నగునవి యున్నచోట ఇల్లు గట్టవలెనని యున్నది. అక్కడ జలపాతము – వారిఝురము – నగము – కాంతారము – తరుచ్ఛాయాప్రశాంతభూమి ఉండవలెను. అట్టి ప్రదేశ మెక్కడ ఉండునో! చెప్పవే! యని కోరెనఁట. [అర-64 పుట]

'భూరుహనికుంజములు గుమ్ములుకట్టి'-అని కల్ప మనుచున్నది. గుమి (ఏక) – గుములు (బహు) = గుంపు, సమూహము. గుమ్మ – పిడికిడితో పొడుచు, వాసన కొట్టుటయందగు ధ్వన్యనుకరణము. ఈ రెండింట దేనిని మనము ఈ ప్రయోగములో గ్రహింపవలెను? గుబురులు – సమూహమన్న అర్థమే కవివివక్షలో ఉండవచ్చును. కాని, గుములు అన్నరూపము మన కవిత్వముకోసమై 'గుమ్ములు' కాదుగదా! నేను గట్టఁబోవు ఇంటి పరగణాలో 'మా మఱందికి విహారామందసంతోషదాయిమంజులము కాంతార మొకఁడు కావలెనని రాముఁడనును. రామునకు మఱంది యెవరు స్వామి! తన భార్యకు మఱందియైన లక్ష్మణునకని చమత్కారమా! ఇందులకే కాఁబోలు – ఈ మాట విన్నవెంటనే 'సుదతి జానకి చుఱచుఱ చూచెఁ బతిని' అని 'కల్పము' చెప్పినది. ఆమె చూచిన చూపు గ్రహించికాఁబోలు మఱఁది సౌమిత్రి 'మదిలో నమస్కరించె వదినగారికి,' అని సారస్యము మనము గ్రహింపవలసియున్నదేమో!

ఇఁక నీ ఖండములోని చిట్టచివరి ప్రయోగవిశేషముల నొక్కసారి స్మరింతము:— దివానిశలు (నిశము) ఏమోనయ్యా – నిలచి – కాననమునయుత్తరంబు, వాచామాత్రమాఁబ్రే – సమర్థించని – అందుకు, ఇత్యాదులు, ఈ రచనకు క్రొత్తవి కావు. ఇంకొక్క విశేషము.— 'మీ కైక, వనికి తా నే యూహన్ నినుఁ బంచెనో నీకే యూహ లో నుండెనో యా యూహాఖిలసర్వసిద్ధి యగుచోటాలోచనం జేసితిన్' ఇది మహర్షులవారి మాట. [65 పుట]

కైకమ్మ ఊహించిన ఊహకు రామున కున్న ఊహకు ఫలిత మిచ్చునట్టి ప్రదేశమఁట. ఆ యూహలు రెండింటెని 'ఆ యూహాఖిల

సర్వసిద్ధి'యను సమాసములో అన్వయించి చూచుకొనవలెనని కల్ప వృక్షకర్త భావము కావచ్చు. ఇట్టి యన్వయములు కల్పించుట కల్పమునకు క్రొత్తకాదు; మనము వినుటలో వింతకాదు.

కా, 'ననమునయుత్తరంబు చనఁగాఁ బెనుమట్టికి నాభిముఖ్యమై'
[66-పు]

దీనిలోని 'యతీశ్వరుఁడు; మహర్షి అగస్త్యులవారితో పాటు మాయమైపోయినాఁడు.

## పంచవటీ ఖండము

'పంచవటీఖండ' ప్రారంభములో పరమేశ్వరునిగూర్చి ప్రధానమైనవి రెండు సంబోధనము లున్నవి. ఒకటి - శ్రీరజతాచల శేఖర హారిగుహావాసి లేలిహాన! అనియు రెండు - 'హారీకృత దివ్య లేలిహాన' అనియు. [అర - 69 పుట]

లేలిహానమనఁగా సర్పము. వెండికొండయొక్క మనోహరమైన గుహలో మకాము పెట్టిన సర్పమా! అని మొదటి సంబోధనమున కర్థమగుచున్నది. పాము, పుట్టలో నుండుట ప్రసిద్ధిగాని, గుహలో నుండుట క్రొత్తవార్త. దివ్యసర్పములను దండగా ధరించినవాఁడా అన్న పిలుపులోను 'లేలిహాన' మున్నది. నాలుగు పాదములలో రెండు 'లేలిహానము'లుండుటలో సారస్యము కన్పింపదు.

దశవర్ష ఖండముతుదిని 'మఱునాఁడు వారు పంచవటీ ప్రయాణంబు సాగించుటయు' - అని మనకుఁ జెప్పిన కల్పవృక్షము 'నాయనా! రఘుపతి! యని పంచవటీ ఖండమును ప్రారంభించినది. ఏదో కథనుపక్రమించుచు 'నాయనా!'అని పిలిచిన వ్యక్తి 'ఆఱవ వచనములో' 'నా పేరు జటాయు'వని మనకు ప్రత్యక్షమగును. దారిలో జటాయువు రామాదులను గలసినట్లుగాని పరస్పరము సంభాషణము ప్రారంభమాయెననిగాని కల్పవృక్షము మన కేమియుఁ జెప్పక మూఁడు పుటలు సాగిన ఉపన్యాసము తుదిని జటాయువుపేరు వినిపించుటలో సనాతన మార్గమూ కానరాదు; ఔచిత్య సౌభాగ్యమూ అంతకన్నను లేదు. పంచవటికిఁ బోవునప్పుడు దారిలో ఒక పెద్ద మఱ్ఱిచెట్టుమీఁద మహాభయంకరమైన మహాకాయముతోఁ గానవచ్చు ఒకానొక గృధ్రమును జూచి అతఁడు రాక్షసుఁడేమోయన్న భ్రాంతిచే ఎవఁడవు నీవని రామలక్ష్మణు లడిగెదరు. అప్పు డా గ్రద్ద మధురాతిమధురమైన మాటలతో సౌమ్యముగా తన యూరుపేరులు చెప్పుకొనును. ఆ ఘట్టములో తన పుట్టుకనుగూర్చి చెప్పఁదలఁచి మొట్టమొదట ప్రజాపతుల కథ లెత్తుకొనును. ఇది-అసలు కథ. ఈ యున్న కథ వైశ్వనాథ మెత్తుకొనక, ఇష్టదేవతా ప్రార్థనమైన వెంటనే 'నాయనా రఘుపతి!' తో ప్రజాపతుల పుట్టు పూర్వముల కుపక్ర

మించుటలో కథాకథన కౌశలము మాయమైనట్లే స్పష్టమగుచున్నది.

ఈ కల్పములో శ్రీరాముఁ డడవిలో పెద్దపెద్ద యంగలతోఁ బోవుచుండ ఆతని యుత్తరీయపు కొంగును దన చీరచెఱగున ముడి వేసికొని సీతాదేవి నడచుచున్నట్లు చమత్కరించెను. ఒకచోట శ్రీరాముఁ డాఁగి స్నానమాడి భాస్కరుని వార్చెనఁట [73 పు] వార్చు అనఁగా ఆచమించు అని అర్థముగదా! భాస్కరుఁ డెందులకో? గంజివార్చుట జ్ఞప్తి* వచ్చెనుగాఁబోలు! ఆ వెంటనే ఈ రాముఁ డొకచో నగ్నిహోత్రంబు చేసి వేఱ వంట చేసికొని భుజించి సుంత విశ్రమించి అనుజుతోడ నేదో చెప్పినాఁడఁట [ 73 పు ] ఇదేమి కర్మము! సహధర్మచారిణి సీతామహాసాధ్వి తన చెంత నుండఁగా సేవాపరాయణుండగు రామానుజుఁడు సన్నిధి నుండఁగా తాను వంటచేయుట కాదు; చేసికొనుటకాదు; అందును వేఱ చేసికొనుట ఎందులకో! వైశ్వదేవాదికమువంటి వేవైన శ్రీరాముఁడు చేసి ఏదేని వ్రతములో నుండెనాయేమి! అట్లని వాల్మీకము చెప్పలేదే. ఇందును–ఈ 'వేఱ' ఏర్పాటు ఇక్కడ మాత్రమే! ఎందులకో మఱి!

కొంతసేపటికి, నీకు నీ వదినెగారికి కంటికింపగు చోటు చూడ వయ్యా! ఇల్లు కట్టుదమని రాముఁడు తమ్మునితో అన్నాఁడఁట. అప్పు డాతఁడు 'ఇంపునింపు కాకుంటయు లేదు. సమాజ్ఞ ననుగ్రహింపవే. శతవర్షంబులు నీవు చేసిన సమాజ్ఞాబద్ధుఁడై పోయెద'నని యన్నాఁ డఁట. ఇక్కడ వాల్మీకములోఁ జెప్పిన ఒక్కముక్క, రత్నమువంటిది వినవలె. 'పరవానస్మి కాకుత్స్థ! త్వయి వర్షశతం స్థితే, స్వయం తు రుచిరే దేశే క్రియతా మితి మాం వద,' రామా! నీ సన్నిధిలో నేను నూఱేండ్లు ఉన్నను పరతంత్రుఁడనుగానే యుందునుగాని స్వతంత్రుఁ డను గాను. నీవే యింపైన ప్రదేశమును నిర్ణయించి ఆజ్ఞాపించినచో నేను జేసెదను. ఇది లక్ష్మణుని ధోరణి. అందును–'సీతాసమక్షం కాకుత్స్థ మిదం వచన మబ్రవీత్'–అనుటచే లక్ష్మీవిశిష్టుఁడైన శ్రీమహావిష్ణువు సన్నిధిలో పారతంత్ర్యరూపముగా తనకైంకర్య సంబంధమును లక్ష్మణస్వామి వ్యక్తపఱిచినట్లు స్వారస్యమును గలదు.

వర్షశతమనఁగా ఒక్క నూఱేండ్లనియే కాదు. సార్వకాలికమనియే భావము. ఈ మంచిభావము కల్పములో 'శతవర్షంబులు నీవు చేసిన సమాజ్ఞాబద్ధుఁడై పోయెదన్' ఇత్యాదిగ రెండుమూఁడు పద్యములలో నీరసముగ సాగినది. నీవు చేసిన సమాజ్ఞాబద్ధుఁడఁట - ఏక దేశాన్వయ దోషముతోపాటు 'బద్ధుఁడ'ని ప్రథమపురుషప్రయోగము. యతి కోసమై ఈ కవనములో రఘువంశస్వామి యన్న మంచిమాట 'రఘుసంఘుస్వామి'గా సృష్టింపఁబడినది [74 పు] అక్కఱనుబట్టి కులము - వంశము అన్నవి 'సంఘుము'గా చెలామణి కావచ్చునుగదా!

రామాజ్ఞప్రకారము స్థలనిర్ణయమైనపిదప పర్ణశాలానిర్మాణమును వరుసగా నాలుగయిదు పద్యములలో కల్పము వర్ణించినది. అందు, 'చేయుచున్ - ఒప్పగన్ - నేతగన్ - సాధువుగాన్'వంటి అసమాపకము లేగాని సమాపకక్రియలు శాస్త్రమునకైనఁ గానరావు. అవి యన్నియు అధ్యాహార్యములతో అతికించుకొని కథాతంతువును త్రుంపని వాక్యార్థమును మనము గ్రహింపవలసి యుండునని కల్పవృక్షకర్త అనుశాసనము కావచ్చు.

అరణ్యకాండములో పదునాఱవ సర్గ మంతయు సీతారామలక్ష్మణుల గోదావరీనదీ స్నాన ప్రయాణాదికమును వాల్మీకము వర్ణించినది. ఆ మధురమైన ఘట్టమును 'కల్పము' ముప్పదినాలుగు పద్యగద్యములలో తెలుఁగునకుఁ దెచ్చి యున్నది. ఈ రెండు రచనలను రెండు చేతులలోఁ బెట్టుకొని ఒక్కసారి పరిశీలించితిమేని అవురా! యని ఔడు గఱచి యట్టె రాపడిపోవలసినదే! ఎందులకు? మధురాక్షరములతో మధురభావములతో మహాముని వాల్మీకి ఆ కవిత్వము మనకు వినిపించినందులకు; ఈ తెలుఁగుకవి ఈ పని చేసినందులకు. మూలములో ఈ భాగమున ఆద్యంతములు ముచ్చటగా ముగిసినవి.

శ్లో॥ 'ప్రయయా వభిషేకార్థం రమ్యాం గోదావరీం నదీం. ప్రహ్వః కలశ హస్తస్తం సీతయా సహ వీర్యవాన్, పృష్ఠతోఽను వ్రజన్ భ్రాతా సౌమిత్రి రిద మబ్రవీత్' [అర. 1041 పుట]

గోదావరీ స్నానమునకై పోవు ఆ మువ్వురిలో ఒక్క లక్ష్మ

ముని చేతిలోనే వాల్మీకి కలశముంచినాఁడు. ఇఁక మన తెలుఁగు కవి సమ్రాట్టు; రాత్రి యుదికిన మడుగుదోవతులు మడిగాఁ జుట్టి పెట్టిన కృష్ణమృగచర్మంబును సీత కక్షభాగంబులో నుంచినాఁడు. కమండలువును శ్రీరామచంద్రుని చేతిలోఁ బెట్టినాఁడు. లక్ష్మణుని చేతిలోనే మున్నదో చెప్పలేదు. ఇట్టి మార్పులు-భావ్యములు చూపుటకే ఈ కల్పవృక్షము మనకు అవతరించినది.

శ్లో॥ 'తర్పయిత్వాథ సలిలై స్తే పితౄన్ దైవతాని చ, స్తువంతి స్మోదితం సూర్యం దేవతాశ్చ సమాహితాః. కృతాభిషేక స్స రరాజ రామస్సీతాద్వితీయస్సహ లక్ష్మణేన, కృతాభిషేకో గిరి రాజ పుత్ర్యా రుద్రస్సనందీ భగవానిలేశః' [1048 పు]

శ్రీరాముఁడు గోదావరిలో స్నానముచేసి తర్పణములు వదలి సంధ్యావందనాదికములు ముగించుకొని పార్వతీనందీశ్వరులచే పరివేష్టింపఁబడ్డ పరమేశ్వరుని భాతి ప్రకాశించెనఁట. ఆ తీరుగ సర్వము ఆచరించి ఆ ముప్పురు పర్ణశాల చేరి ముచ్చటలలో మునిఁగియుండఁగా యాదృచ్ఛికముగా శూర్పణఖ వచ్చినట్లు వాల్మీకము చెప్పినది. కల్పములో ఈ సన్నివేశమే కానరాదు. 'ఆరేపల్లి అగ్రహారపు బ్రాహ్మణులు' వోలె ఈ రాచబిడ్డలు మడుగుదోవతులు మున్నగు సరంజామ చంకను బెట్టుకొని స్నానార్థము బయలు దేరిరి. మధ్యే మార్గములో లక్ష్మణకుమారుఁ డేవేవో వర్ణించినాఁడు. శ్రీరాముఁడు సైతము అయోధ్యావార్తలు కొన్ని ముచ్చటించును. మడుగు దోవతులతో పయనము గట్టిన ఈ మూవురు గోదావరికి వెళ్ళినట్లుగాని స్నానసంధ్యాదు లాచరించినట్లుగాని శాస్త్రమునకైన ఒక్క-ముక్క ఈ కల్పములోఁ గానరాదే! కాఁగా 'అనుస్వామి సాధు ప్రసన్న తానుగతా యోధ్యాపూర్వ సుఖ కథా ప్రాసంగికు లగుచున్న వారికడ కొకనాఁడు-ఒకానొక కామిని కానిపించె' అని కథలో 'కలగా పులగము వోలె' నడక సాగినది. [84 పు]

మాటవరుసకు 'సాధుప్రసన్న తానుగత'మని ఒక బారెఁడ సమాసము కల్పములో వేయఁగలిగెనేగాని, వాల్మీకములో 'ప్రసన్నత్వము'నుగాని భరతునిగూర్చి శ్రీరాముఁడు పలికిన సాధ

వాక్యములుగాని శాస్త్రమునకైన మందునకైన కలికమునకైన ఈ కవి చూపలేకపోయెను. త్రోవలోఁ బోవుచు లక్ష్మణుఁడు అన్నగారితో ఇట్లనును :-

'శ్లో. న పిత్ర్య మనువర్తంతే మాతృకం ద్విపదా ఇతి, ఖ్యాతో లోకప్రవాదోఽయం భరతేనాన్యథాకృతః, భర్తా దశరథో యస్యాస్సాధుశ్చ భరతస్సుతః, కథన్ను నాంబా కైకేయీ తాదృశీ క్రూరశీలినీ, ఇత్యేవం లక్ష్మణే వాక్యం స్నేహాద్బ్రువతి ధార్మికే, పరివాదం జనన్యాస్తమసహన్రాఘవోఽబ్రవీత్, న తేఽంబామధ్యమా తాత! గర్హితవ్యా కథంచన, తా మేవేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు, నిశ్చితాపిహి మే బుద్ధిర్వనవాసే దృఢవ్రతా, భరతస్నేహసంతప్తా బాలిశీక్రియతే పునః, సంస్మరామ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ, హృద్యాన్యమృతకల్పాని మనః ప్రహ్లాదనాని చ, కదా న్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునందన!' [అర-1097 పు]

మగపిల్లలకు తల్లిచాలు ఉండునని వాడుక ఉన్నది. భరతుఁడు దీనిని తాఱుమాఱు చేసెను. భర్తయైన దశరథుఁడా మహాసాధువు; బిడ్డయైన భరతుఁడా అంతకన్న దొడ్డవాఁడు. ఇఁక - ఈ కైకేయి అంత క్రూరశీలినిగా ఎందులకైనదో! - ఇది లక్ష్మణుని మాట. ఇది వినెనో లేదో శ్రీరాముఁడు బొత్తిగా సహింపలేక 'బాబూ! నీవు అమ్మను కైకేయిని మాత్రము మాట అనవలదు. ఎంతైనను భరతునిగూర్చి వినిపింపుము. విని సంతోషింతును - ఇత్యాదిగ - ఇక్ష్వాకువంశరత్నమైన శ్రీరాముఁడు చెప్పిన మంచిమాటలు రామరామ! ఒక్క పద్యములోనైన ఒక్క పెలుచువచనములోనైన కల్పవృక్షము మనకు వినిపించినదా! లేదు, లేదు. భాష్యము వ్రాసెదనని వ్రాసితినని ఎందులకీ బజారుకూఁతలు-కోఁతలు! నదికిఁబోవునప్పుడు లక్ష్మణుఁడు - ఈ భరతప్రసంగము తెచ్చినట్లు వాల్మీకములో నుండఁగా కల్పములో 'వ. మఱి పర్ణశాలాభిముఖులై యిట్లనియె, ఉ. ఈ సమయంబునన్ భరతుఁ డే గతి నుండెనొ యింటివద్ద -' ఇత్యాదిగ [82 పు.] మార్చుటకు కారణ మే మున్నదో! పైగా - పదునాలుగక్షరాల పైవచనములో 'అభిముఖులై యిట్లనియె' అని

వచనభేదపుసొంపునైత ముండవలెనా! అన్న దెవరో విన్న దెవరో దానినిబట్టి మనకుఁ దెలియదు. పోఁగాపోఁగా – కొంతదూరాన 'నా విని శ్రీరామచంద్రుండు' [83 పు] అని యుండుటఁజేసి ఓహో! ఈ చెప్పిన ముక్కలు లక్ష్మణస్వామివా! అని ఊహించుకొని కథ సాగించుకొనవలెను. ఈ పక్షములో డెబ్బదియేడవ వచనము ఎందులకు వ్రాసినట్లు! అంకె కోసమా! ఇంతకు ఈ ఘట్టములో కల్పములోని శ్రీరాముఁ డన్నది రెండే రెండు ముక్కలు. 'దుఃఖశీలునకు దేశము – కాలము రెండును ఏవేవో బాధలు కలిగించుననియు; ఇన్నాళ్లు గడచెనుగదా! ఇఁక నొక్క కొలఁది దినము లోర్వలేవె యనియు – ఇంతే. మూలము చూచియైన సమర్థుఁడైన కవి వ్రాయ వలసిన దెంతైన ఉండఁగా ఈ మాత్రము వ్రాసినవ్రాఁతకా ఊరూర – వాడవాడ 'బాజాబజంత్రీలు' మ్రోగించునది? భరతుని వాక్యములు ప్రియములనియు మధురములనియు హృద్యములనియు అమృత కల్పములనియు మనఃప్రహ్లాదనములనియు శ్రీరాముఁడు భావించెనని వ్రాయఁగలిగినందులకే ఆ మహాకవి 'మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః'గా కాఁగల్గెను. అట్టి భావములు నిండిన స్వభావము కావుననే ఆ రాముఁడు లోకాభిరాముఁడై ఆదర్శభ్రాతగా భారతీయులలో కలకాలము నిలిచిపోయెను. ఇట్టి గట్టి యంశములన్నియు విడిచిపెట్టి రామకథ పేరుతో ఏవేవో గీకినంతమాత్రాన – అది రామాయణమగునా! అతఁడు రామాయణ కర్త కాఁగలఁడా!

ఇఁక – ఒకానొక కామిని కానిపించెనఁట [84 పు.] ఎవరికి – అని ఆకాంక్ష రావచ్చు. ఈ కల్పవృక్షములో ఆకాంక్షలు గీకాంక్షలు కుదురవు. ఎందువలన! 'వారికడ కొకనాఁడు ఒకానొక కామిని కానిపించె' అని వ్రాయఁగలిగినందులకు. అనఁగా – వారికడకు 'వచ్చి' కామిని కానిపించెనని అధ్యాహారము తెచ్చుకొని ఆమాత్రము చదువుకొనరా! అని కల్పవృక్షకర్త ధీమా కావచ్చు. ప్రభుత్వము వారి ప్రకటనలలో కొన్నిచోట్ల 'వారావధిమీఁదగా దాటినవారిని శిక్షింపబడుదురు' అన్న ఘట్టములు కొన్ని 'కల్పము' చదువు

చుండఁగా జ్ఞప్తికి వచ్చుచుండును.

ఇంతకు – ఆ కామిని శూర్పణఖ, కల్పములో ఎట్లున్నది! రతీబాష్పసంతానమే ఈ దేహము పూనెననఁగ నున్నదఁట! మన్మథ దహనబాధలో మునిఁగియున్న ఈ 'రతికి' గణముకోసమై ఈ కవన ములో రతీబాష్పమని దీర్ఘము ప్రాప్తించి కొంతలాభము కలిగించి నది. ఆబిడ మునికాంత యని ఊహింతుమన్న వీలులేదఁట! ముని కాంతల కింత వేసపుంబదను తెలుంగు తెలియదఁట. పోనీ! స్వర్గపురీ సరసీజనేత్ర కావచ్చునా! కాదు. ఎందువలన? దివిషదంగనల్ సిరికిఁ దోడగు మండిగమందు నిల్వరు కావున – అఁట! మండిగము మీఁద కాలుపెట్టి నిలుచుట తప్పనియు ఆ పని, దేవతాస్త్రీలు చేయరనియు ఈ కల్పవృక్షకర్త తీర్పు. ఆశ్రమప్రాంతమునకు యాదృచ్ఛికముగా శూర్పణఖ వచ్చినట్లు వాల్మీకి వ్రాయఁగా – ఈ కావ్యములో ఈబిడను 'పర్ణశాలాకవాటసంబంధమూర్తి'గాఁ జేసి ప్రాంతీయమైన మండిగము సంప్రదాయమును మనకు బోధించుట మెచ్చుకోవచ్చు. లేక, దేవతాంగనలు మండిగముమీఁద నిల్వరను టకు ఏదేని ఒకానొక ఉపనిషద్రహస్య ముండెనో! మూఁడవది మనుష్యకాంత యగునట్టుల లేదఁట. ఎందువలన! 'త్రపావిహీనతన్'– ఇది కారణము. అనఁగా సిగ్గులేకపోవుటచేత. మునికాంతలకుఁగాని సురకాంతలకుఁగాని సిగ్గుసెరములతో పనిలేదు కాఁబోలు! అసలు మునికాంతలు మనుష్యకాంతలలోఁ జేరరా యేమి! ఇఁక శూర్పణఖా శ్రీరామచంద్రుల శృంగారఘట్టము మనము వినవలసియున్నది. ఇట్టి పట్టులలోనే ఈ కావ్యకర్త పట్టుదల మిక్కిలి గట్టిగా పరవళ్లు త్రొక్కుచుండును. రసమున కుచితమైన నడక ఉండవలెననియు – ఆ రసమునుబట్టియే వృత్తములుగాని పదములు గాని మహాకవులు వాడుకుందురనియు ఆలంకారికులు వచింతురు. అది శృంగారముగానీ రసాభాసశృంగారముగానీ అర్థము స్పష్టముగా గోచరింపవలెఁ గావున తెలిసిన కవీశ్వరులు దీర్ఘసమాసములు వాడరు. కోమలబంధమైన రచనయే శృంగారమున కందమిచ్చును. ఈ కల్పవృక్షకర్త 'శృంగారవీథి'యని పేరుపెట్టి వ్రాసిన గ్రంథములో

ముప్పాతికముప్వీసము దీర్ఘసమాసభూయిష్ఠమై 'అరీతి' యన్న దోషముతో నిండియున్నదని పెద్దలే యెన్నఁడో నిర్ణయించి వ్రాసి యుంచిరి. శృంగారరసమునకు ప్రతిబంధకమైన దీర్ఘసమాసభూయిష్ఠ రచనకు అలవాటుపడ్డ ఈ కల్పవృక్షకర్త చేతిలో, శూర్పణఖ చెప్పిన పద్యములుసైతము ఆబిడ కన్నులో తమ్ములో అనిపించునట్లు ఉండ వలెఁగదా! వానిలోఁ గొన్నింటిని చిత్తగింపవలెను.

'శా. ద్రాఘిష్ఠాశనిపాతభీకరమహోద్యద్ఘుర్ఘురధ్వానఘోణీ
ఘోరాపఘనాభమున్ .... . . ... ....

శా. భర్గశ్రీగళకాంతిభావపరిదీవ్యత్ దైత్యరాజేంద్వింది రాదుర్గద్వారకవాట
మోహనకళాదుర్వార మీ వక్షమా
నర్గళ్యం బుపగూహనక్రియకు సంధానించు నచ్ఛోట నం
తర్గాఢోజ్జ్వల వల్లభోదితరసోద్యద్బ్రహ్మకైవల్యమా

శా. ఘోషాకంపితకేసరోగ్రహరి సంక్షుభ్యద్వలగ్నేందిరాదోషారోపణశీల
మీ నడుము నీ దోర్దీర్ఘదండంబు లీ
వేషం బెల్ల వృథావృథా రతికళావేశాంగజోన్మర్దన
ప్రేషవ్యుష్టిరసాధిపత్యవిచరద్విశ్వత్వమే లేనిచో

[అర-86 పు]

రసానుభవమునకు సమాసములు ప్రతిబంధకము లనియు రసస్ఫూర్తికి అర్థస్ఫూర్తి మూలమనియు ఆలంకారికులు రోళ్లో రోఁకళ్లో వేనోళ్ల ప్రచారము చేసినను 'విశ్వనాథ రచన' ఇట్లే యుండుటలో ఇది యొక విశిష్టత యనవలెను. లేదా-ఒకవేళ శూర్పణఖ రాక్షసి కావున, ఆబిడ శృంగారమును రామచంద్రుఁడు పాటింపఁడు కావున అది నాయికానాయకులలో వర్ణింపఁదగిన శృంగారరసము కాదు కావున పైగా - ఆబిడ మిక్కిలి భయంకరురాలు గావున ఆబిడకుఁ జెందిన ఈ 'రసవిషయికఘట్టము' కూడ ఇట్లే భయంకరమై ఉండవలెనని రామాయణకల్పవృక్షకర్త వివక్ష యగునా! కానిచో, రామా! నీ నడుము సింహాము నడుమువంటి దనుటకు అంతలావు సమాస మెందులకు! ఆ పద్యములలో అర్థము తెలిసికొనవలెనన్నను తన్మూలమున రసానుభవము పొందవలె నన్నను కల్పవృక్షకర్తతోపాటు ఆ శూర్పణఖ-ఆరామయ్య మాత్రమే భాగము పంచుకొందురు. పాఠకులకు మన క్లేశమ ఎందులకు

వచ్చినట్టు! ఇట్టి క్రమమును ఏ కోశములోను గలిగింపనిదియు బ్రహ్మానందమును గూర్చునదియు అయిన వాల్మీకము మన కుండఁగా ఈ రచనను మూఁచూడనైనవలదు.

'అలుపఁపు' పద్యము [86 పు] రెండవచరణములో 'అఖండయతి' సౌభాగ్యము కలదు. అలుపఁపులో అక్కఱలేని అఱసున్నయు, 'పర్ణశాలాకవాటసంబంధమూర్తి' యైన శూర్పణఖ, సీతారాముల వద్ద గ్రుక్క తిఱుగకుండ పదునైదు పద్యగద్యములలో పలికినదాఁక శ్రీరాముఁడు పల్లెత్తిమాటాడఁడు. దుర్భరసమాసములతో ఆ శృంగారమును బొంగించిన ఈ కవిత, అంతలో జట్టున జాఱి ఈ మాటలలోనికి దిగినది.

ఉ. 'కండ్లకు మంచి దవ్వయిన కాలము పోయెను నేను రెండుమూఁ
డేండ్లిట రాను మీఁది యస లెక్కడ! వచ్చితి వెన్ని కాలువల్
గండ్లను దాఁటి యేమి కడగండ్లివి కానన మెల్లత్రోవలన్
మండ్లను గంచెలున్ నడచిపోదువొ చెప్పులు లేవె వాఁకిటన్

చం. మును శివుకంటిమంటఁ బడి బొగ్గయిపోయిన మన్మథుండెఱుం
గనియతఁ డేమి కాఁడిది జగంబునఁ జెప్పెడునంత లేదు కా
వినిజమ యందగాఁడయగు నీ విది యెక్కడ వానియబ్బవం
దును నిను నక్షరాలఁ దులతూఁగఁడు నీ కొనగోటికేనియున్

[అర.87]

లోకములో ఉండుటకు 'ఇండ్లు' ఉన్నవి; నమలుటకు 'పండ్లు' ఉన్నవి. కనుటకు 'కన్నులే'గాని 'కండ్లు' లేవు. కల్లు శబ్దమును నేత్రార్థమున అర్వాచీనులు ప్రయోగించిరనియు దానికి బహువచనము 'కండ్లు' కావచ్చుననియు శ్రీవజ్ఝలవారు అని యుండవచ్చును. పూర్వాంధ్రగ్రాంధికమురీతిగా ఇది దుష్టమనియే నా భావము. నేఁటికి కల్పవృక్షవరప్రసాదమునఁ జేసి మనకు గ్రాంధికాంధ్రమున 'కండ్లు' సైతము దక్కినవి. 'కండ్లకు మంచి దవ్వయిన కాలము పోయె'ననఁగా 'బలే ఛాన్స్ పోయె'నన్నపల్లవి జ్ఞప్తికి వచ్చును. 'నేను రెండుమూఁడేండ్లిట రాను; మీఁది యస లెక్కడ! ఎన్ని కాలువల్ గండ్లను దాఁటి వచ్చితివి! చెప్పులు లేవె వాఁకిటన్'

ఇవి వాడుకమాట లున్న కవనమని కొందఱు ప్రబుద్ధులు మెచ్చుకోవచ్చును. తేనియ లానుటకు తేనెను ద్రావుటకు రచనలో భేదమున్నది. 'మంచితిండి తిని'యన్నది మృష్టాన్న మారగించుటకు సమానము కాదు. 'మంచిబట్టలు కట్టుకొని'యనుటకన్న మేలి వలిపములు దాలిచి యనుట మేలుగదా! 'మీది యసలు ఏయూరు!' అని బజారులో మనము బాహాటముగా వాడుకోవచ్చుఁగదాయని కావ్యములలో బంధింపరాదు. ఆశ్రమవాసినితో మాటాడునపుడు ఎంత రాక్షసిముండయైన 'మీకు చెప్పులు లేవటండీ!'యని యడుగునా యేమి! 'వాని యబ్బవందును నిను నక్షరాల'-ఇక్కడ ఈ కల్పవృక్షము రాక్షసిచే వ్యంగ్యముగా మాటాడించినది. అందచందములలో మన్మథునకు శ్రీరాముఁడు అబ్బయఁట! లక్ష్మీనారాయణ పుత్త్రుఁడు గాదూ మన్మథుఁడుమఱి! చెప్పులు లేవా యని ప్రశ్నించిన శూర్పణఖతో - అవును మాతమ్ము 'డొకఁడు కాలికిఁ జెప్పు లేకుండఁ జేసె'నని [88 పు.] రాముఁడుచెప్పెనఁట. అందువలన మైథిలి, మడమల పగుళ్లకు మాపటివేళను ఇంగుదినూనియ మర్దనము చేయునఁట! అహో కల్పములోని చమత్కార మనల్పము గదా! 'మిథిలయందు ఈయమ నాకు మొలఁత యయ్యెననుటకు అగ్ని అంతమంది వైదేహులు సాక్ష్య'మని రాముఁడు రాక్షసికి 'సంజాయిషి' ఇచ్చును. అగ్నులు మూఁడు గావున ముప్వురు వైదేహులు సాక్షులని చెప్పవలెనా! అగ్నివంటి పవిత్రులైన వైదేహులు సాక్షులనవలెనా! 'ఇంతమంది సాక్ష్యము' - ఇదికూడ బజారువాడుకలో మొనగాఁడైన పలుకే గావచ్చును.

ఏకపత్నీవ్రతుఁడని సర్వలోకములలోఁ బేరు వొందిన శ్రీరాముఁడు ఈ కల్పములో అన్యకాంతయైన శూర్పణఖతో ఇట్లనును:—

కం॥ 'తెఱవలకు మోహ మెక్కువ కఱదలు బోధించి లాభగతి లేదైనన్
తఱుసంటి మోహమున్నను మెఱటుగ భార్యల సమక్షమున వలతురె లే'
[88 పు

కామశాస్త్రములో చెప్పియున్నను 'తెఱవలకు మోహ మెక్కువ' యన్నమాట వాల్మీకిరాముఁ డీబిడతో అనలేకపోయెను విశ్వనాథులవారి పాత్రలకు ఇట్టి ఘట్టములనఁగానే హుషారు పెరిఁ

వచ్చును. నామీఁద నీ కెంత మోహ మున్నను పిచ్చిదానా! ఈ యాడుకూఁతురుముందటనటే నీ వలపులు చూపునది! మనదగ్గఱ ఈబిడ (ఈ సీత) లేనప్పుడు చూచుకోరాదా! అన్న ధ్వని లేక పోలేదు. ఇది మొఱటుఁదనమని రాముఁ డన్నాఁడేగాని కల్పవృక్ష పక్షమున తప్పు కానట్లున్నది. రాముని జూడఁగానే వాల్మీకములోని శూర్పణఖ, అన్న మాట ఇది:—

'శ్లో. జటీ తాపసరూపేణ సభార్యశ్శరచాపధృత్,
ఆగత స్త్వ మిమం దేశం కథం రాక్షససేవితం, కి
మాగమనకృత్యం తే త త్త్వ మాఖ్యాతు మర్హసి' [అర 1050]

'సభార్యః' అనుటచే శూర్పనఖదృష్టిలో శ్రీరాముఁడు కాముకుఁడుగాఁ గన్పించెను. కాముకునకు భార్య - సమక్షమందని పరోక్షమందని భేదము లేదని ఆబిడ భావము కావచ్చును.

దైత్యేశ్వరుం, డన్నానే పెదతల్లిపుత్త్రికుఁడు నా కాతండు,
తద్విక్రమచ్ఛన్నం బేడుజగంబు నేర్వినరు తచ్చౌర్యక్రియాశ్చర్యముల్.
[అర 88]

శూర్పణఖకు రావణుఁడు పెదతల్లిపుత్త్రికుఁడఁట. 'క' ప్రత్యయమహిమవలన రావణుఁడు బుల్లిబాలుఁడని కల్పవృక్షమును బట్టి మనము భ్రాంతిపడరాదు. 'రావణో నామ మే భ్రాతా బలీయాన్ రాక్షసేశ్వరః' అని వాల్మీకి అన్నదానికి పెదతల్లి పుత్త్రికుఁడని తెలుఁగుప్రాఁత. పయిపద్యములో ఆతఁడు నాకు పెదతల్లి పుత్త్రికుఁడు అన్నతరువాత ఉన్న 'అన్వయసౌభాగ్యమును' జూడవలెను. ఆ పదము లివి:—'తద్విక్రమచ్ఛన్నంబు - ఏడు జగంబున్ - ఏర్ - వినరు- తచ్చౌర్యక్రియాశ్చర్యముల్', విక్రమచ్ఛన్నము - క్రియాశ్చర్యములు వీనినిగూర్చి ఏడు జగములలో ఎవ్వరు వినరయ్యా! యని కవిభావము కావచ్చును. చచ్చిచెడి లాగినను ఈ భావము ఈ పదములలో కుదురదు; రాదు. ఏడుజగంబున్ - అనఁగా ఏడులోకాలలో నని అర్థ మెట్లువచ్చును? త్రయాణాం భువనానాం సమాహారః 'త్రిభువనమ్' - అని ఏకవచనము - నపుంసకము ఆ భాషలో రాఁగా ఈ భాషలోఁగూడ ఎందులకు కాఁగూడదని కల్పవృక్షకర్త ధైర్య

మేమో! 'వారసులు - గౌరవనీయులు - దివానిశలు - క్షిత్యాది తేయులు - గదయిత్నుశిరోమణి - తాత్సారము - బ్రహ్మాచార్లు-గళాంభోరుహము - కంకాలభృద్ధనువు,' ఇట్టివి బాహాటముగా వాడుకొన్న ఈ కవిసమ్రాట్టు, మహాసభలో పలికిన 'పూర్వసంస్కృత సాహితిలో నా కంత ప్రగాఢపరిచయ ముందికాబట్టి - ఆ లోతు పాతులు నాకు తెలుసు' అన్న పలుకులు విన్నచో సంస్కృతపండితు లెంతగా నవ్వుకొందురో గుర్తించియుండఁడు. అసలు పూర్వ సంస్కృత సాహిత్య మెఱిఁగిన కవీశ్వరుఁడు, కాలిదాసును వాల్మీకిని మనస్సులో పెట్టుకొన్నచో అర్థము లేనివి విగ్రహవాక్యములకు వీలుగానివియగు ఈ దీర్ఘసమాసముల జోలికి పోవనేపోవఁడు. ఒకవేళ పోయెనా! రామరాజభూషణ కవిసార్వభౌమునివలె చేయి తిరిగినవాఁడైనఁ గావలయును. అర్థము లేక - అన్వయము కుదురక - సారళ్యము కానరాక - రసమును బరిశీలింపక అడ్డగోలుగ మూరెడు బారెడు సమాసములు దించి, ఇది నా ప్రతాపమన్నచో సహృదయులు మెచ్చరు; విద్వత్కవు లంగీకరింపరు.

ప్రకృత మనుసరామః—

వ. 'రావణకుంభకర్ణవిభీషణులు వారు ముగ్వురు. నా తమ్ములు ఖరదూషణులు. నే నందఱకుఁ బెద్దదానను. ఒక్కర్తన యాడపడుచను' [అర. 88 పు.]

ఈ రెండు బంతుల వచనమునకుఁగూడ టుప్‌టీక ఒకటి కావలసివచ్చెను. మొదటివాక్యములో అన్వయమున్నదా! రావణ ... విభీషణులు, వారు ముగ్వురఁట. అనఁగా సంఖ్యకు వారు మూవురని భావమా! ఆబిడకు వారు అన్నలో తమ్ములో చెప్పరే! రెండవ ముక్కలో ఖరదూషణులు తమ్ములగుటచే మొదటి మూవురు శూర్పణఖకు అన్నయ్య లయ్యెదరా! ఆ పక్షములో 'నే నందఱకుఁ బెద్దదాన'నన్న మూఁడవమాట దెబ్బగొట్టునే! ఈ గడబిడ లేక, వాల్మీకులు చెప్పినదైనను ఒక్కసారి చక్కగాఁ బరిశీలించి ఉన్నది ఉన్నట్లు తెలుఁగులో వ్రాసినను మేలయ్యెడిది. శ్లో. 'రావణో నామ మే భ్రాతా బలీయాన్ రాక్షసేశ్వరః - ప్రవృద్ధనిద్రశ్చ సదా కుంభకర్ణో మహాబలః, విభీషణస్తు ధర్మాత్మా న తు రాక్షసచేష్టితః, ప్రఖ్యాతవీర్యౌ చ రణే భ్రాతరౌ ఖరదూషణౌ' [అర-1050]

మహాబలవంతుఁడైన రావణుఁడు - సర్వదా నిద్రపోయెడి కుంభకర్ణుఁడు - రాక్షసచేష్టలు లేని ధర్మాత్ముఁడైన విభీషణుఁడు - ప్రఖ్యాతవీరులని పేరు వడసిన ఖరదూషణులు, వీరు నాతోఁబుట్టువులనుచు ఏవురకు విశేషణము లయిదు చక్కఁగా వినిపించును. మూలములో ఎచ్చటను నే నందఱకుఁ బెద్దదాననన్న మాట లేదు. ఇది వీరి సొంత కవిత్వము. ఈ సొంతములో మనకు ఒఱిగిన దేమియు లేదు. వెనుకటి కెవ్వరో అన్నారని విన్నాముగదా! ఏమని!

'కవయః కాలిదాసాద్యాః కవయో వయ మప్యమీ
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్.'

ఆ సోదరుల విషయమై 'తా నహం సమతిక్రాంతా' అని శూర్పణఖ వినిపించినది. సమతిక్రాంత యనఁగా అతిక్రమించి వర్తింతునని అర్థము. అనఁగా స్వచ్ఛందచారిణియని భావము. సహజమైన ఈ భావమునకు ఈ కల్పకర్త ఒక రంగు పూసి ఇట్లు పలికించెను.

'ఆడపడుచునవుటను పెద్దదాననవుటను ప్రేమము పెరిమ హెచ్చుటఁజేసి నాదుసహోదరులలో ఒక్కఁడును నాదుగీచినగీటు దాఁటఁ'డని. ఈ హేతువు మాట యెట్లున్నను, 'సహోదరులును వేటుకాండ్రు - ఒక్కరుఁడును నాదుగీచినగీటు దాఁటఁడు' - ఈ మాటలలో వాక్యనిర్మాణమే కానరాదు. ఇట్టిది ఈ కవితకు పుట్టినిల్లు కావున మనము సహింపకతప్పదు. ఇఁక రావణబ్రహ్మ బలపరాక్రమములు చూడవలెను.

'క. ఆ రావణుండు స్వఃకాంతారావణుఁ డతని కత్తి నానాదిక్కాం
తారు చిరవలగ్న పునూగారు యమదిశాచకోరగరుదగ్రంబున్'
[అర-89 పు]

రావణుఁడు లోకరావణుఁడని వైరివిద్రావణుఁడని మున్ను విన్నాము; నేడీ కల్పము 'స్వఃకాంతారావణుఁ'డని మనకు క్రొత్తగా వినిపించినది. ఆతని కత్తి, దిక్కాంతల నడుములలోని నూగారఁట! వలగ్నమనఁగా దేహముయొక్క మధ్యమని-నడుమని యర్థము. నూగారు ఉండున దెక్కడనో! ఆతని కత్తి నూగారువలె నున్నదనుటలో ఉన్న సారస్యమేమో! ఇంకొక్క బంగారుముక్క:-

‘యమదిశాచకోరగరుదగ్రంబున్’— దక్షిణదిశలోని చకోరపక్షుల యొక్క ఱెక్కల చివరలు గలది కత్తియని కాంబోలు! అహో! ఏమి భావనాబలము!! ఇట్టివి సరిగా అర్థము కావలెనన్న ‘ఎంతో అంతర్దృష్టి’ ఉండవలెనని ఈ కల్పవృక్షకర్త ఎన్నఁడో యుపన్యసించి యుండుట పత్రికలవలన వినియే యుంటిమి.

‘సీ. కూర్చున్న పెండిలికూఁతును దట్టతో మేనమామ గ్రహించు తీర్మి గాఁగ’—[89] రావణుఁడు కైలాసగిరిని చేతులతోఁ బట్టి అట్టిట్టు జరిపి బిట్టు కదలించి పాదుతోఁ బెల్లగించునప్పటి దృశ్య మెట్లున్నదనఁగా, మేనమామ వచ్చి పెండ్లిపందిరిలో పెండ్లికూఁతును తట్టలోఁ బెట్టుకొని వివాహవేదికవద్దకు తెచ్చినట్లు. ఈ మాట కల్ప వృక్షకర్త, ఎవరినోట అనిపించెనో మనము మఱచిపోరాదు. తనంతఁ దా రాముని వలచి వచ్చిన శూర్పణఖచేత, ఇంతకు ముందు - ఒక ప్రసంగములో శూర్పణఖ రామునితో ఇట్లన్నదని కల్పము వ్రాసినది:-

గీ. ‘ఎంత యల్పబలులో అంత యధికవివేకులు మనుష్యజాతి తెలియ మీరు
తెలివి యింత దేవతలకైన నుండదు రాక్షసులు సరే పరాస్తమతులు’ అని [88పు]

ఇక్కడ మూఁడు జాతుల తెలివితేటలను వర్ణీకరించిరి. మనుష్యజాతికి దేహబలము తక్కువయఁట; బుద్ధిబలము హెచ్చఁట! ఈ బుద్ధిబలము దేవతలకునైతము ఉండదఁట. ఇఁక రాక్షసులు సరే సరి; వాండ్రు పరాస్తమతులఁట. పరాస్తమనఁగా - అపజయ మొందుట, నిరాకరింపబడుట. ఈ దృష్టి శూర్పణఖదో కల్పవృక్షకర్తదో మనము సరిగాఁ జెప్పలేము. ఇద్దఱు అసాధ్యులే. ఇద్దఱు శ్రీరాముని వలచినవారే. ఇద్దఱకు ఏదో గొప్ప సంబంధ మున్నదనవలె. ఆబిడ నీచురాలుగదా యని మనము భ్రాంతి పడరాదు. ‘ఈవు విప్రకాంత నేను క్షత్రియుఁడను. నీవు చూడ గొప్పయింటిబిడ్డవు నేను నవునో కాదో యడవులందుఁ దిరుగ [93 పు] అని శ్రీరాముని నోటితోనే ఈ కల్పవృక్షకర్త శూర్పణఖకు విప్రకాంతాత్వము చెప్పి పెద్దఱిక మిచ్చెను గావున కావ్యకర్తకు ఈబిడకు ఏదో చుట్టరిక మున్నదనుటలో పట్టింపు లేదు. ఆ చుట్టఱికమునుబట్టియే, యావద్భారతములో ఏకదేశమైన ఈ తెలుఁగుదేశములోని ఒకానొక అల్పాల్ప సంఖ్య గల తెగలో నున్న ఈ ‘మేనమామ తట్ట’ సంప్రదాయము

శూర్పణఖ నోటితో మనకు వినిపింపఁగలిగెను. ఔరా! ఈ కవీశ్వ రుని దూరదృష్టి ఎంతటిది! రామయ్య పుట్టిన పురుటింటిలో - అది యయోధ్యగానీ, ఉత్తరప్రదేశముగానీ వారు క్షత్రియులుగానీ సూర్యవంశ్యులుగానీ 'సాగనారమట్టలు' కట్టించిపెట్టిరి. రామయ్య పెండ్లినాఁడు 'పానకాల కావళ్లు' తెప్పించి యిచ్చిరి. ఆ పెండ్లింట్ల సందడిలో వియ్యాలవారి నడుమ 'అలుకుగుడ్డల తగాదా' తగిలింపించిరి. ఇప్పుడు ఈ మేనమామ మేనకోడండ్ర తట్టసంబరములు వర్ణించి చూపిరి. తురకలలోసైతము పెండ్లికూఁతును తట్టలోఁ బెట్టుకొనుట విన్నాముగాని అక్కడ తట్ట మోయువాఁడు మేనమామ కాదు; పెండ్లికొడుకే. ఇట్టి సత్సంప్రదాయములను సనాతనాచార పరాయణమ్మన్యులైన కల్పవృక్షకర్తలు తన మహాకావ్యములో నిబంధించుట మన మేలుకొఱకేగదా! పాత్రలమాట దేవుఁడెఱుఁగు; దేశముమాట దైవ మెఱుఁగు. తనకుఁ దోఁచిన సంప్రదాయమును తాటకచేనైననేమి శూర్పణఖచేనైననేమి ప్రచారము చేయించుటయే పరమార్థముగా భావించు ప్రకృతకావ్యకర్తను సనాతనాచారపరాయణజీవు లెల్లరు సన్నుతించితీరవలసియున్నది. శూర్పణఖ, రావణుని పరాక్రమ మెఱింగించి వెంటనే శ్రీరామునితో ఈ మాట యనును :-

'రామ! త్వా పూర్వదర్శనాత్, సముపేతాస్మి భావేన భర్తారం పురుషోత్తమమ్, అహం ప్రభావసంపన్నా స్వచ్ఛందబల గామినీ, చిరాయ భవ మే భర్తా సీతయా కింకరిష్యసి' [ఆర-10౬1 పు]

-రామా! అపూర్వమైన నీ దర్శనము నాకు దొరకినది. నీవు పురుషోత్తముఁడవుగా నాకుఁ దోఁచినది కావున నిన్ను నేను భర్తగా భావించితిని. నేను మహాప్రభావము కలదానను. ఆపై స్వచ్ఛంద బలగామినిని. చిరకాలము నీవు నాకు భర్తగా ఉండవలెను. ఈ సీత నీ కెందులకుఁగనుక! అని శూర్పణఖ మనస్సులోని కోరిక వెల్లడించును. దేవదానవమర్త్యులలో ఇంతవఱకు ఇట్టి యందచందములు తాను జూచియెఱుఁగననియు తనకంటి కాతఁడు పురుషోత్తముఁడన్న భావము స్పష్టమైనదనియు శ్రీరామునిగూర్చి ఈ వాల్మీకి శూర్పణఖ మంచి వ్యాఖ్యానమే చేసినది. ఇఁక విశ్వనాథశూర్పణఖ వైఖరి

వినవలెను :-

‘చం. ధృతరతివాంఛ స్త్రీపురుషదేహనిబద్ధము దేహధారులన్
దితిజులదైనసృష్టి గడిదేరని మోహనిమగ్నసృష్టి యు
ద్ధతమగు కామతృప్తి యొకదారి తపశ్చరణానుకూల్య ప
ద్ధతికి నను గ్రహించి పరితర్పణ చేయుము కామదేవతన్

శా. బాహూబాహవి సంచరింతము దిశాపర్యంత మాకాశవీ
థీహర్మ్యంబునఁ గాంతిగోళచయముల్ దీపాళిగాఁగన్ మరు
ద్వ్యూహంబుల్ ధృతచామరంబులుగ దివ్యన్ నవ్యనిన్ గాంచు చే
యూహో వెట్టెదు నెల్లయచ్చరల కీర్ష్యాస్థానమై పాల్పెదన్

కం. కడచిన కడవని మనుగడ అడుగునఁ గల భోగవస్తు లాఘ్రాణింతున్
విడివడని యూహ విందున్ గడించెదను వాని నీకుఁగా భోగనిధీ!

వ. నన్ను స్వీకరింపుమనిన .... .... ....’ [అర-91 పు]

ఈ కల్పవృక్షకర్తకు ఏండ్లు పూండ్లు ఎంతగా నిండినను రతి విషయకవర్ణనావాంఛ ఉత్కటముగా ఉన్నదనుట కెన్నో తార్కాణము లున్నవి. ఇట్టి స్వభావ ముండుటఁబట్టియే వీరి రచనలు పెక్కింట రతివిషయకవర్ణనలు అస్థానపతితములై అకాండతాండవము చేయుటయు కద్దు. ఇప్పుడు తనకు నచ్చిన యువతి శూర్పణఖ, దొరకనే దొరకెనన్న సంబరముతో, గోపిక శ్రీకృష్ణమూర్తితో సరసాలాడినట్లు శూర్పణఖాముఖమున కావ్యకర్తయే రామచంద్రునితో సరసములకు దిగెను. కామదేవతకు సంతర్పణ చేయవలెనఁట. కామతృప్తి కలిగింపవలెనఁట. రతివాంఛ తీఱవలెనఁట. మనుగడలో ఇంతదనుక అనుభవింపని భోగవస్తువు లన్నియు ఆఘ్రాణింప వచ్చునఁట. ‘సముపేతాస్మి భావేన భర్తారం’ అన్నదానిలో భావేన - అనఁగా హృదయముచేత - లేక, రత్యాఖ్యభావముచేత అని రెండువిధాల భావము చెప్పవచ్చునుగాన ఈ యొక్కముక్కకు ఈ కల్పకర్త ఇంత భాష్యము వ్రాయనేర్చెను. అందును వీరికి ‘రతి ఘట్టు’ మభిప్రేతమాయె. ఈ రత్యావేశములో కొన్నింట ‘పదశుద్ధి’యు ఎగిరిపోయినది. నీవును నేనును ‘బాహూబాహవి’ సంచరింతమని శూర్పణఖ అన్నదని కల్పమన్నది. ‘చచ్చేవానికి సంధిమంత్ర’ మన్నట్లు అచ్చులో ‘సంచరింతయు’ అని యున్నది. కర్మవ్యతీహార

ఘట్టములో 'కేశాకేశి – హస్తాహస్తి – బాహాబాహి' వంటి పదము లను విన్నాము. ఇదేదో 'బాహూబాహవి'గా తయారైనది. దీని ఆకారముమాట యెట్లున్నను లోపలి సరకు చూడవలెను. 'బాహాభిశ్చ బాహాభిశ్చ ఇదం యుద్ధం ప్రవృత్తం బాహాబాహి' అని విగ్రహవాక్యము చెప్పెదరు. సప్తమ్యంతములైన గ్రహణవిషయ సరూపపదములును తృతీయాంతములైన ప్రహరణ విషయసరూప పదములును 'ఈ యుద్ధము ప్రవర్తిల్లినది' అన్న అర్థములో వ్యాపార వినిమయము స్ఫురించుచుండఁగా సమసించునని శబ్దశాస్త్రము చెప్పి నది. కేశాకేశివంటివి సప్తమ్యంతములకును బాహాబాహివంటివి తృతీయాంతములకును ఉదాహరణములు. ఈ సమాసములో విశిష్య – 'ఇదం యుద్ధం ప్రవృత్తం' అన్న యర్థము స్ఫురించి తీఱ వలెను. శూర్పణఖా శ్రీరామచంద్రులు 'బాహూబాహవి' సంచ రించుటలో కల్పకర్త దృష్టిలో యుద్ధప్రసక్తి లేదుగదా! 'చెట్ట పట్టాల'తో ఆ యిర్వురు తిరుగవలెననియే కవివివక్ష. ఇట్టి విశిష్టార్థము గల ఈ ప్రయోగమును తెలుఁగులో తన యిష్టము వచ్చినట్లు వాడుకొని 'నేను సంస్కృతసాహిత్యములో లోఁతుపాతులు తడవి చూచితి'నని కోఁతలు కోయుట రోఁతగాదా! లేదా – ఈ కర్మవ్యతీ హారబహువ్రీహిలో యుద్ధప్రసంగము తప్పనిసరి కాదనియు 'విహా రార్థము'కూడ ఉండవచ్చుననియు 'ముగ్ధబోధ' వంటి ప్రాచీన సంస్కృతవ్యాకృతు లేవైన విశ్వనాథులకు ప్రత్యేకముగా బోధిం చెనాయేమి! ఇక తెలుఁగు వెలుఁగు చూడవలెను. 'మనుగడలడు గునన్ – మనుగడల యడుగునన్ అని – భేదము. మనుగడలయొక్క అడుగుభాగమని షష్ఠీసమాసము. ఇట్టి పట్టుల గణములకోసమై ఇట్టి దుష్టసంధులు చేయుట ఈ కవి కిష్టమైన అభ్యస్తవిద్య. ఈ సందర్భములో వాల్మీకి, శూర్పణఖకు 'కామపాశావపాశిత'అన్న విశేషణము వాడెను. కామ ఏవ పాశః – తేన అవపాశితా – బద్ధా, అని అర్థము. ఆ ధోరణిలో నున్న ఆ రాక్షసిని జూచి వాల్మీకి శ్రీరాముఁడు 'స్వచ్ఛయా శ్లక్ష్ణయా వాచా స్మితపూర్వ మథా బ్రవీత్', నవ్వుచు మృదువుగాను స్పష్టముగాను ఏదో చెప్పెనఁట. ఏమని! 'కృతదారోఽస్మి భవతి భార్యేయం దయితా మమ,

త్వద్విధానాం తు నారీణాం సుదుఃఖా ససపత్నతా. అనుజ స్త్వేష మే భ్రాతా శీలవాన్ ప్రియదర్శనః, శ్రీమా నకృతదారశ్చ లక్ష్మణో మమ వీర్యవాన్ అపూర్వీ భార్యయాచార్థీ తరుణః ప్రియదర్శనః, అనురూపశ్చ తే భర్తా రూపస్యాస్య భవిష్యతి. ఏనం భజ విశాలాక్షి భర్తారం భ్రాతరం మమ'-ఇత్యాది. [అర-1052]

'ఇదిగో! ఈమె నా భార్య, సవతుల కెన్నో ఇబ్బందు లుండును. అదుగో! అతఁడు నా తమ్ముఁడు. వాఁడు చాల-చక్కనివాఁడు, వానిని పెనిమిటిగాఁ జేసికొమ్ము' అని పలుకఁగానే ఆ పిచ్చిది, పాపము! నిజమనుకొని రామానుజుని సన్నిధికిఁ జేరును. ఇక్కడ కల్పవృక్షములోని శ్రీరాముఁడు - ఆబిడను అంత తేలికగా తమ్ముని వద్దకు పంపఁడు. ఇరువది గద్యపద్యముల ఉపన్యాస మిచ్చి ఆబిడ పుట్టుపూర్వములు బిట్టుగ కదలించి, హాస్యము లాడియాడి సింగారము లొలుకఁబోసిగాని విడిచిపెట్టఁడు. కల్పకర్త కభిప్రేతమైన ఇట్టి ఘట్టములో నడచిన నడకలు పోయినపోకడలు రవ్వంత మనముకూడ విని వినోదింపవచ్చును. 'అనార్యః ఖలు పరదారవ్యవహార'మన్న మాట మన కెందులకుఁగనుక!

'శా. మా ముత్తాతలనాఁటివాఁడఁట నిలింపద్వేషి మీ తమ్ముఁ డీ
వేమో యింతకు నెంత పెద్దవొకో నీ యీ దేమి నే నేమి! నా
కేమో నల్బది నిండ విప్పటికిఁగా కీ కామమార్గానికిన్
ప్రేమవ్యాపృతిచే నలౌకికరసౌత్కృష్ట్యంబు సంధింతువో!

మ. కొడుకుల్ కొమ్మలు లేరె! భర్తయును నీకున్ లేఁడె! వాఁ డేమి యి
య్యెడుఁ బైనిన్ గొనితెచ్చికొన్నటుల నాకీ పెద్దశత్రుత్వ మీ
తడవైనన్ బడి రాఁగ నట్టనడికాంతారంబునం దీ సతిన్
విడువన్ నాకనుగాని పుట్టగతు లున్నే! ఉండనీ! పోవనీ!

గీ. నీవు నన్ను వలచినావు నిన్నును నేను వలవవలదె! అట్లు వలచుటకును
ముగుద! నీదుసహజమూర్తి చూడకయుండ వలచు టెట్లు ప్రేమకలుగు టెట్లు!'

ఇందలి సంబరము కొంత చూతము. నిలింపద్వేషి యనఁగా ప్రకరణమునుబట్టి రావణబ్రహ్మ, అతఁడు రాముని ముత్తాతలనాఁటి వాఁడఁట, అతఁడు శూర్పణఖకు తమ్ముఁడఁట! ఔరా! ఇది యొక

'శతకంఠరామాయణము'వో తెతయారయినది. శృంగారావేశములో వావివరుసలు దూసికొనిపోయినవి. విశ్రవసునకు కైకసియందు రావణ కుంభకర్ణవిభీషణులును శూర్పణఖయు పుట్టిరనియు వాండ్రకు ఈబిడ చెల్లెలనియు ఎఱుఁగని భారతీయు లెందఱో ఉండరు. వాల్మీకములో రావణాదులకు శూర్పణఖ 'భగినీ-స్వస' యనియే పెక్కు-చోట్లఁ జెప్పఁబడియున్నది. 'రావణో నామ మే భ్రాతా బలీయాన్ రాక్షసేశ్వరః' అనియు, 'ప్రఖ్యాతవీర్యౌ చ రణే భ్రాతరౌ ఖరదూషణౌ' అనియు శూర్పణఖ, రామునితోఁ జెప్పినది 'శశంస సర్వం భగినీ ఖరస్య సా' [అర-1055]

'భగినీం క్రోధసంతప్తః ఖరః పప్రచ్ఛ రాక్షసః [అర-1055] అన్నచోట వ్యాఖ్యాత-'భగినీం' జ్యేష్ఠాం 'అత్తికా భగినీ జ్యేష్ఠేత్యమరః' అని సూచించెను.

'ఉ. అత్తిటఁ బంక్తికంఠు చెలియల్ కఠినాత్మక చుప్పనాక' ...'పంక్తికంఠుఁడను పేరఁ దనర్చిన దైత్యభర్తకుం జెలియలఁ బేరు శూర్పణఖ చెప్పెడిదేమి మహీశ!' అని భాస్కరరామాయణమే గాదు [152 పు] తెలుఁగులో నున్న గద్యపద్యరామాయణములే గాదు, హరికథలే గాదు, 'తోలుబొమ్మల' ఆటలే గాదు సర్వజనము రావణునకు శూర్పణఖ చెల్లెలు అని ఘోషించుచుండ ఈ కల్ప మొక్కటిమాత్రమే 'నిలింపద్వేషి మీ తమ్ముఁడు' అని రామయ్యచేత అనిపించినది. ఒకవేళ 'భగినీం క్రోధసంతప్తః' అన్నచోట 'జ్యేష్ఠాం' అన్న వ్యాఖ్యానము చూచి కల్పకర్త భ్రాంతిపడెనా అనుటకు-ఆమాత్రము 'వ్యాఖ్యాన' పరిశీలనముకూడనా! అనిపించు ధోరణిలో ఈ రచన కానవచ్చుచుండును. వాఁడు ఖరుఁడు కావున అక్కగారి యిక్కట్లు ఆలకించెడి ఆ ఘట్టములో భగినికి ఆ యర్థమును వ్యాఖ్యాత జ్ఞప్తిచేసెను. అంతేగాని రావణునకు ఆబిడ అక్కయుఁ గాదు; ఆబిడకు ఆతఁడు తమ్ముఁడునుగాదు. ఆపైని-ఇంకొక్క 'తమాషా':- శ్రీరాముని నోటితో రావణుఁడు మీ తమ్ముఁడని ఏ 'కల్పము' మనకుఁ జెప్పించినదో-ఆ 'కల్పమే' రామానుజుని

నోటితో 'ఆయనయును మీ యన్నయుఁ జేయియుఁ జేయియును గలపఁ జేవ గలరు' [అర-97పు] అని చెప్పించినది. ఇది యొక అల్పాంశమని మనము ఒప్పరికింపరాదు. మొదటి 'తమ్ముఁ'డన్న దళముతో ఒక హేతువాదము, రెండవ 'యన్న' యన్న విశేషణముతో ఇంకొక చమత్కారము మనకు వినిపింపవలెనని 'కవిసమ్రాట్టుల' సంకల్పమైననాఁడు - ఈ పూర్వాపరముల యంతు తేల్చుకోవలెనుగదా! ఒకచోటఁ దాను జెప్పినదే ఇఁకొకచోట తబ్బిబ్బుగాఁ జెప్పుటయు కల్పవృక్షకావ్యకర్త కున్న ఘనతలలో ఒక 'ఘనత'. అసలు రససిద్ధములైన రామాయణాదులలో రస విరోధములైన కల్పనలు చేయరాదని అభిజ్ఞు లందురు. రసవిరోధిగా సిద్ధమైన స్వేచ్ఛ, మంచిదికాదు. ఏవియేని మార్పులు కూర్పులు కావలెనని-చేయవలెనని కుతూహల మున్ననాఁడు లోకప్రసిద్ధికి విరుద్ధముగాని త్రోవ త్రొక్కవలెనని పిండితార్థము. దీనినే ప్రాచీను లిట్లనిరి: - 'శ్లో. సన్తి సిద్ధరసప్రఖ్యా యే చ రామాయణాదయః కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ.' అని.

ఇఁక రామయ్యశృంగారములోనికిఁ బోదము. 'నీ యీడేమి! నే నేమి' - మా ముత్తాతలనాఁటివాఁడయిన అంతవానికి అక్కగారైన మీఁయొక్క ఈడు ఎక్కడ! నా ఈడెక్కడ! అనవలసి, కవనము కుదురక 'నీ యేడేమి నేనేమి' యను ధోరణికి దిగినది. ఇట్టిదే ప్రక్రమభంగమువంటిది. 'నా కేమో నల్బది నిండవు' పాపము! ఎంత తేఁబ్రాయము!! కలివులో అధికమాసమన్నట్లు 'నల్బది' యఁట! ఈ కవిసమ్రాట్టువలన తెలుఁగునకు ఎంత 'తెగులు' తగిలెనయ్యా! నాలుగునకు నలు - ఆదేశమని, పదిలోని పకారమునకు వకారము వచ్చి 'నలువది - నల్వది' యగునని ఈమాత్రము వ్యాకరణము, పెద్దగద్దె యెక్కిన ఈ యొజ్జలకుఁ దెలియకపోయెనే! నేఁటి టపాలోనే [12-9-1961] నాకు అపరిచితులైన ఒకానొక 'B. A.' బిరుదవాచ్యు లిట్లని వ్రాసిన ఉత్తరము వచ్చినది:- 'ఈ విశ్వనాథ, అబ్బె! తెలుగంటే ఇదా! ఇస్సీ! అన్నట్టు చేశాడు. ఈ చెడ్డను మొగ్గ పాటులో తుంచివేయాలి'- ఇత్యాది. తెలుఁగునేలలో ఇట్టి భావమే

ఎందఱకో ఉండునట్లుగా ఈ కల్పవృక్షకర్త తెలుఁగును-తెలుఁగుదనమును-తెలుఁగు సారస్వతమును 'ధ్వంసము' చేసినాఁడు. వెనుకటికి ఎవ్వఁడో ఒకఁడు రాముసకు సీత ఏమగును! అని ప్రశ్నించెనఁట. ఆ ప్రశ్నలో అనేకధ్వను లున్నవఁట. రాముఁడు భూపతిగదా! సీత భూజాతగదా! ఇది యొకటి. ఆపైని, సీతాదేవి వయస్సెంత! జనకుని కామె కన్పించిన దెపుడు? సీతారాములలో వయస్సులో పెద్ద ఎవరు? ఇత్యాది. ఈ ధోరణిలోనే 'విశ్వనాథ' ధోరణికూడ వెలసి విప్పారినది. మా ముత్తాతలనాఁటి రావణబ్రహ్మకు అక్కవైన సీకు, 'నల్బది' నిండని నాకు దాంపత్య మెట్లు కుదురునని శాస్త్రీయముగా ఒక 'ధర్మసందేహము'ను రామయ్యనోటికి ఈ కావ్యకర్త అందించెను. శ్రీమన్నారాయణుని సాక్షాదవతారము రాముఁడన్న మాట అట్లుంచినను, శూర్పణఖ - రూపయౌవనసౌందర్యములు - అనువగునట్లు చేసికొని రాఁగల 'సత్తా' కల 'కామరూపిణి' యని రామయ్యకే కాదు గ్రంథకర్తకైనఁ దెలియదా! ఒకవేళ తెలిసియే వెటకారముగా ఆ 'రాక్షసిముండతో' ఈ రామయ్య, సింగారమును వెళ్లఁగ్రక్కెనని కవివివక్షగా మనము భావింపవలసియుండునా! అదే ఈ 'కవి'లో నున్న చమత్కారము. అంతటి 'ముసలిముండను' బట్టుకొని వసంతాలాడుచున్నది ఏకపత్నీవ్రతుఁడని పేరు మోసిన ఆ యిక్ష్వాకుకులతిలకుఁడు కాదు; శృంగారప్రియుఁడైన ఈ 'శ్రీ విశ్వనాథకులపారావారశశాంకశోభనాద్రి గర్భంబె' కావచ్చును. కానిచో ఆ 'రామచంద్రవరబ్రహ్మము'నోట 'ఈ కామమార్గానికిన్ - అలౌకికరసౌఖ్యప్రాప్త్యంబు సంధింతువే' అని ఒక 'పరాయి' భాగ్యశాలినితో మఱొక 'కవిసమ్రాట్టు' అనిపింపఁగలఁడా! 'కామమార్గానికి' దిగిన ఈ కల్పవృక్షకర్త, వయసులతో వావులతో సొగసులతో సోయగములతో సంభాషణము సాగింపించెనేగాని, సోమయాజులవారి వయస్సెంత యుండునో-అతఁడు స్వర్లోకము చేరిన పిదప ఎదురై ఆహ్వాన మిచ్చి ప్రేమ లొలుకఁబోసి కౌఁగిటఁ జేర్చుకొని శయ్యాసుఖ మిచ్చుటకు 'సిద్ధమై' యున్న 'రంభ' వయస్సు ఎంత యుండునో స్మరించినట్లే లేదు. రంభాసంభోగఘట్టముదాఁక

రాఁగలిగిన అర్జునునకే ఈ వయోభేదాదికముల అంతరాయ ముండరా దని ఆ దేవతాంగన సెలవిచ్చియుండఁగా, ఈ శూర్పణఖవద్ద ఈడులు-రసభంగములు వచ్చిపడినవా! అవురా! కాలమహిమ!! విశ్వనాథ కవితామహిమ !!

'కొడుకుల్ కొమ్మలు లేరె !' ఇది శ్రీరాముని ప్రశ్న. ఓ శూర్పణఖా! నీకు కొడుకులుగాని కొమ్మలుగానీ లేరా! ఎంత ముద్దైన ప్రశ్న. అనఁగా నీకు కుమారులుగాని, ఆఁడువాండ్రుగాని లేరా! యని భావము. కొమ్మ అనఁగా శాఖ, ఆఁడుది యని యర్థము. ఆఁడుదానికి మగవాఁడుకావలెఁగాని కొమ్మ లెందులకు ? కోఁతు లెందులకు! ఇంతకు ఈ కవిసమ్రాట్టు వివక్షించినట్లు మన మూహించుకొనవలసినది కొడుకులుగానీ కూఁతులుగానీ 'లేరఁటే భామా! నీకు' అని కాఁబోలు! కూఁతులని వ్రాసికొన్నచో గణముకూడ సరిపోవునుగదా! ఎందులకీ 'కొమ్మల' తిప్పలు తెచ్చుకొనుట. అయినను మహాకవుల మాటలలో అంతరార్థము లుండునేమో! అవి గుర్తింపను మనకు అంతర్దృష్టి కావలసియుండునుగదా ! 'చేను చెట్టు-పులి పుట్ర-రాయి రప్ప' అన్న ధోరణిలో ఈ కవీశ్వరు లీ 'కొడుకుల్ కొమ్మలు' వేసిరయ్యా యని మురిసిపోయెడి ముద్దుశిష్యులుసైత ముందురు. భర్తయును లేఁడా! యని ప్రశ్న వేసి 'విశ్వనాథరాముఁడు' ఒక విచిత్రమైన ధోరణికి దిగెను. ఏమని! ఓసీ కాంతా ! ఆ భర్త ఏమయ్యెనే! అప్పైని కొని తెచ్చి పెట్టుకొన్నట్టులు నా కెందులకే ఈ పెద్దశత్రుత్వము వానితో? వాఁడేమేని మమ్ములను జేయవచ్చును. అదియుఁగాక నా వెంటఁబడి వచ్చిన ఈ సతిని నట్టనడి కాంతారములో విడిచితినేని నాకునుగాని పుట్టగతు లున్నే! నీవే చెప్పుము !! అని తుదికి సరే! ఉండనీ! పోవనీ! నీవు నన్ను వలచి నావుకాబఁట్టి నిన్ను నేను వలవవలసియుండునుగాఁబట్టి అందులకై నీదు సహజమూర్తి చూడనిచో ప్రేమ కలుగదుకాఁబట్టి చూపవే నీ యసలు రూపము !! అని. 'శ్లో. ఏవముక్తస్తు రాక్షస్యా శూర్పనఖ్యా పరంతపః ఋజుబుద్ధితయా సర్వ మాఖ్యాతు ముపచక్రమే॥ అనృతం నహి

రామస్య కదాచిదపి సమ్మతం, విశేషేణాశ్రమస్థస్య సమీపే స్త్రీజనస్య చ' [అర-1050 పు]

'శూర్పణఖాం, స్వచ్ఛయా శ్లక్ష్ణయా వాచా స్మితపూర్వమథాబ్రవీత్" [1051]

అనఁగా-శ్రీరాముఁడా రాక్షసికి తన వృత్తాంతము ఋజుబుద్ధితో వినిపించెననియు 'ఆర్జవం హి న శోభతే సర్వత్ర' అన్న నానుడిని సైతము కాదని కుటిలస్వభావులయెడఁగూడ అకుటిలబుద్ధితో సంచరించు వ్యక్తి యనియు-ఆతఁడెవ్వరితోనైనను రెండునాలుకలతోఁ గాక అర్థము స్పష్టమగునట్టుగా మృదువుగా మాటాడుననియు అసత్యమే ఆతని నోట రాదనియు ఎన్నో విధాల వాల్మీకి, రాముని సన్నుతించి ఆతని నిజ వైఖరి అక్షరాల చిత్రించి మన కిచ్చెను. అట్టి మహామహిమ గల 'పాత్ర' ఈ కల్పములో అనల్పమైన చిలుము పట్టి ఎట్టి దుర్గతికి దిగెనో శ్రీమద్రామాయణపారాయణపరాయణులు చిత్తగింతురుగాక!!

కలలోననైన నవ్వులకైన అన్యకాంతల వృత్తాంతము అపమార్గములో పట్టించుకొనని శ్రీరాముఁడు, తన భార్యను దగ్గఱలోఁ బెట్టుకొని ఈ దానవితో ఈ సరసాలకు దిగెనన్నమాట రామాయణకథ విన్నవారుగానీ రామహృదయ మెఱిఁగినవారుగానీ నమ్మవలసిన మాట యగునా! 'కొడుకుల్ కొమ్మల' పద్యములో ప్రాసలో పడిన 'తడవైనన్' పదమునకు ప్రాససంరక్షణార్థము తప్ప మఱియొక యర్థమే లేదు. ఇక్కడ ఒక చిన్న 'నాటకీయత' 'వెలగఁ' బెట్టిరి !!

'వ. అని సీతవంకఁ జూచి 'యిది నాకుఁ బ్రియురాలు. నన్ను వలచి వచ్చిన వనిత. నాకు బుద్ధి తెలియనప్పుడు నా తండ్రి నిన్ను నాకుఁ గట్టెను. ఈమె యతిలోకసౌందర్యంబు నీవు చూతువుగాని' యని దైత్యాంగనతో నిట్లనియె. (92)

అక్కడ ఆశ్రమములో ఉన్నది ముగ్గురు. ఒకప్రక్క సీతారాములు; వారి కెదురుగా శూర్పణఖ. శూర్పణఖతో మాటాడుచున్న

శ్రీరాముఁడు సీతవంకఁ జూచి 'ఇది' యని యెత్తుకొని 'నిన్ను' నాకుఁ గట్టెనని చెప్పును. ఈమె యతిలోకసౌందర్యంబు-ఎవరిది! నీవు చూతువు గాని, చూడవలసినదెవరు? శూర్పణఖ సౌందర్యము సీత చూడవలెనని ప్రకరణము స్ఫురింపఁజేయును. 'నా తండ్రి నిన్ను నాకుఁ గట్టెను'-అనెడి కల్పవృక్షములోని ఆణిముత్తెమువంటి సూక్తిని 'ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ' అన్న ఆర్షకవి మధురాక్షరములను ఇరుగేలఁ బెట్టుకొని ఒకసారి పరిశీలనబుద్ధితోఁ జదువుకొన్నచో-ఈ కల్పవృక్షము బ్రదుకు బట్టబయలయి పుట్టగతులు లేనిదై రోఁతవేసి తీఱును. ఎవరితో ఎవ రన్నది వినవలసిన దేది! వినెడివా రెవ్వరు!- ఇత్యాద్యంశములను చిన్నివచనములోనైతము సున్నితముగా శుద్ధముగాఁ జెప్పలేని ఈ రచయితకు 'కవిసమ్రాట్టు' అని పేరు పెట్టి పిలుచుకొనువారినే మనము మెచ్చుకోవలెను. 'విధిరేవ విశేషగర్హణీయః కరటస్త్వం ఖలు...'

రామచంద్రప్రభువు దైత్యాంగనకు స్త్రీపురుషుల ప్రేమసూత్రమును విప్పి వ్యాఖ్యానించుచు 'రసాలవృక్షమును' సాక్ష్యముగాఁ దీసికొనును. ఓ కాంతా! ఒక రసాలవృక్ష మున్నదనుకో. ఎందులకు దానిమీఁద అందఱకు అంత మమత ? దాని ఫలము మధురమనియే కదా! ఇంతవఱకు ఏదో రూపముగ ఈ బండి సాగినది. ఈ గీతములో మూఁడవచరణము ముక్కచెక్కలైనది. 'అన్ని చెట్ల ఫలము లట్టిదే రుచియైన – ఈ రసాలవృక్ష మేమి గొప్ప!' అన్ని చెట్ల ఫలములకు ఆ రుచియే ఉన్ననాఁడు రసాలవృక్షమున కున్న ప్రత్యేకవిశేష మేమి! అని పైపైభావము లాగవచ్చును. కాని 'అన్నిచెట్ల ఫలములయొక్క రుచి అట్టిదేయైన' అనియుండవలసిన అన్వయమును 'ఫలము లట్టిదే రుచిగా' కవనము చేయునినాఁడు తొమ్మిది – పదివందల యేండ్లనుండి ప్రవృత్తమైన ఈ తెలుఁగువాఙ్మయములో ఈ 'రామాయణ కల్పవృక్ష మేమి గొప్ప?' కల్పము ప్రేమనుగూర్చి మన కిచ్చిన బ్రహ్మాండమైన భాష్య మిది. ఆ పిచ్చిది, ఈ రామయ్య అన్నమాట నిజమనుకొని వికృతాలంకరణములతో సాక్షాత్కరించెనఁట 'అసలు రూపము

చూపుము - అప్పుడుగాని నాకు నీమీఁద ప్రేమ పుట్టదు'-ఇట్టి పిచ్చి మాటలు వాల్మీకిరాముని నోట రాలేదు. మొట్టమొదట కన్పడ్డవెంటనే ఆబిడ యడిగినదానికి ఋజువుగా సమాధానమిచ్చి రాముఁ డన్నమాట ఇది :- 'శ్లో. త్వాం తు వేదితు మిచ్ఛామి కథ్యతాం కాసి కస్య వా. నహి తావన్మనోజ్ఞాంగీ రాక్షసీ ప్రతిభాసి మే. ఇహ వా కిన్నిమిత్తం త్వ మాగతా బ్రూహి తత్త్వతః' [ఆర - 1050] నీ వెవరవో తెలిసి కోవలెనని నాకు కుతూహలముగా ఉన్నది. ఇంత మనోజ్ఞాంగివి నీవు రాక్షసివిగా నాకు తోఁచుట లేదు. నిజము చెప్పుమా విందము-ఇదియే వాల్మీకి రాముని సభ్యత. ఇఁక మన కల్పములోని తెలుఁగురాముఁ డున్నాఁడే వాఁడొక పట్టి 'సాదుపలవ' 'అలగా-సింగారపులేకి రకము'-. ఆబిడ సంసారము సంగతి - బిడ్డపాపల ధోరణి - తనకున్న సాధకబాధ కములు చాలవఱకు తడవి చూచుకొని, ఏదో 'నీదు సహజమూర్తి' చూపు మొక్కసారి యని విలాసములోనికి దించును. వికారాకార ముతో ఆబిడ కన్పడిన వెనుక ఎంతకైనఁ జాలుదువే కాంతా! ఇంతటి నీ 'సురూపమును' మఱుగుపఱిచి నన్నుఁ గికురింప నెంచితివా! యని వెండియు వెటకారములోనికి దిగి ముచ్చటగా మూఁడు పోలిక లిచ్చి ఆబిడకు నచ్చఁజెప్పవలెనని చూచును. పిల్లి - ఎలుకమగనిని బెండ్లాడు నఁటే! పులి, దుప్పిరాజును బొందునఁటే! అగ్నిశిఖ, దూదిని అభిగమిం చునఁటే! ఇవి మూఁడుచరణములలోని మూడు పదార్థములు. నాలవ చరణము 'నల్లబొగ్గు'లాయె. అయిన మగఁడు లేదో 'అప్పడంబు'- ఇదియే ఆ 'రమ్యము'. అయిన, అని వేఱుగ ఛేదము చేసి చూతమా! లేక 'అయిన మగఁడు' అని కొంటెమాట రామయ్య నోట అనిపిం తుమా! లేదా - అన్న 'ఆఖ్యాతము' ఏ కర్తను జెప్పెనో - ఈ పరగణాలో లేదు. అప్పడంబు లేదా - ఇది యొక జాతీయమో ప్రాంతీ యమో లేక 'అప్పడాల కట్ట - ఆవకాయ ముక్క'వంటి 'సినిమా' సారస్వతసూక్తియో! అనూచానపరంపరగ అట్టి పేరుప్రతిష్ఠలు పొంది అంత బ్రదుకు బ్రదికిన ఆ యిక్ష్వాకువంశరత్నము ఈ కల్పవృక్షకవిత్వ ములో ఎలుకమగఁడు - దుప్పిరాజు - దూదిపింజగాఁ దేలిపోయెను.

కల్పములో ఏహ్యముగా చూపదొరకొన్న ఆ పాపిష్ఠ-శూర్పణఖ తీరా-
రంగములో పులిబిడ్డ అయి కూరుచుండెను. ఆపై అగ్నిశిఖయు నయ్యె.
ఇంతటి ఉదాత్తమైన పవిత్రమైన ఔపమ్యమును దానవి కిచ్చి, ఎలుక
పిల్లతో దుప్పిమెకముతో వట్టిదూడితో రాముని సమానుని జేసిన కల్ప
వృక్షకవిని ఏమని కొనియాడవలెనో యెఱుఁగము. 'ఉపమ'రుచి చూపు
టలో కాళిదాసు మొనగాఁ డన్నఘను లెల్లరు 'విశ్వనాథ' కవిసమ్రా
ట్టుల ఉపమావస్తువులనుగాని ఉపమానసౌందర్యమునుగాని ఒక్క-సారి
పరిశీలించి రేని నిర్విణ్ణులై హతాశులై హా! ఆంధ్రకవితామతల్లీ! యని
అట్టె రాపడి నిలిచిపోయెదరు!! పిల్లి - పులి అయినవెంటనే, 'ఈవు
విప్రకాంత వేను క్షత్త్రియుఁడను' 'ఈవు దైత్యకాంత వే మనుజుఁడ'
ఇత్యాది భావకవిత్వపుజాలు పొటమరించినది. ఆబిడ, విప్రకాంత కాఁబట్టి
తాను క్షత్త్రియుఁడుకాఁబట్టి వెంటనే చేపట్టవలెనన్న - ధర్మశాస్త్రి
మీ రామయ్యను అడ్డగించినట్టు కల్పకర్త, సందేశ మిచ్చెను. అదేమి
స్వామీ! మనకు పురాణవాఙ్మయభండారము కావలసినంత కలదు
గదా! ఏ మూల చూచినను ఏ ప్రాంతము కాంచినను ఏ కొసకుఁబోయి
నను ఏ ధర్మమైన ఏ యాచారమైన ఏ సంప్రదాయమైన దేశమును
బట్టి కాలమునుబట్టి పాత్రలనుబట్టి మనకుఁ గావలసినట్లు పదిలముగా
మార్చుకొనను గుదురుగా బంతిలోఁ గూరుచుండను సర్వసౌకర్యము
లున్నవే. వలసినచో మనకు యయాతిమహారాజు ఆదర్శపురుషుఁడు
లేఁడా! విప్రతనయ 'మహాతల్లి' ఆ దేవయానమ్మ లేదా! ఆ మహా
మహుఁడు సర్వశాస్త్రవేత్త - ప్రత్యేకధర్మశాస్త్రకర్త శుక్రాచార్యుల
వారు మనకు లేరా! త్రేతాయుగమునాఁటికి వీరొకవేళ లేరని ఎవ్వరైన
సందేహింతురేమొ! ఈ సందేశము మనకు రామయ్య నోట ఇప్పించి
నది ఆ నాఁటి వాల్మీకులు కాదు; ఈ నాఁటి విశ్వనాథులవారు.
కావున ఈ సందేశములోని సందేహ మావలఁ బెట్టి కథావిధానము
లోనికి నడువవచ్చును.

'దీని కేమిలే పోనిమ్మని'శూర్పణఖ అని, వికావిక నవ్వినదఁట
ఆ రసికునితో వెండియు నిట్లన్నదఁట:

ఉ. 'నా మగఁడేమొ వచ్చి నిను నాటఁగఁ బల్కెనటంచు నెంచితో
ఆ మగఁ డెట్లు నే ననిన నట్టుల వచ్చెడువాఁడు కాదయే
నీ మతిమాటలోన వధియించెద వానిని నన్నెఱుంగఁడా!
ఈ మన సంగమంబు విధియేనియుఁ గాదన నడ్డ దింతయున్'

శా. నాకా కోపము వచ్చుటా యదియు నిన్నా! ఓరెముం జేయుటా
యీ కాంతాళపుమాట లేమిటికి నా కీ యూహాయే వచ్చినన్
నా కంఠంబును నేన కోసికొనెదన్ నా ప్రాణమిత్రంబు ని
న్నాకాంక్షించెదఁ దిండి కేమి మరి కన్నావూహ పారమ్యమున్.

కం. మగవారికంటెఁ గామము మగువల కొక వందరెట్లు మనుజులకంటెం
దగు నన్నిరెట్లు దితిజుల కగడుం జేయక సరేనటంచుఁ బలుకుమీ'!

[అర_93]

పైలోకములో నుండవలసిన కల్పవృక్ష మెంత అధోగతికి జాఱెనది? ఔరా! ఈ కావ్యములోని ఔచిత్యము తుదకు బంగారక్క 'బాగోతములోనికి' దిగినదే సరేనటంచుఁ బలుకవలెనని ఒకానొక అవతారపురుషునితో ముఖాముఖిగా ఒకానొక ఆఁడుదానిచే అనిపించిన ఈ మహాకవిని ఏమని వర్ణింపవలె? మగవారియు మగువలయు కామము హెచ్చులొచ్చులనుగూర్చి ఈ ఖండములోనే ఈ కల్పకర్త మనకు రెండుసారులు వినిపించెను. పాప మీ కామ ఘట్టములో పట్టము గట్టుకొన్న ఘటకులు కావున ఈ గ్రంథకర్త లెంత శ్రద్ధ చూపిరి!! 'తెఱవలకు మోహ మెక్కువ' అని రామయ్య అనఁగా_ఆ 'పల్లవి' శూర్పణఖ ఇప్పు డందుకొని 'మగవారికంటెఁ గామము మగువల కొకవంద రెట్లు' అని వంతపాట పాడినది. అవురా! ఈ యంశములో ఈ నాయికానాయకు లిర్వురును ఏకగ్రీవముగ 'తీర్మానము' చేసి రనఁగా—ఇది 'విశ్వనాథ' కవితామహిమ కానోపును. దితిజులలో ఈ ధోరణి మఱికొన్ని రెట్లు హెచ్చుగావున 'సరేననమని' ఈ దానవకాంత ఆ సీతాకాంతుని హెచ్చరించును. సరి+ఏ+అటంచు_సరేయటంచు నుండవలసిన పదము కూడ, ఆలంకారిక గ్రామ్యమైన ఈ పట్టులో వ్యాకరణగ్రామ్యమైపోయినది. ఇక శూర్పణఖ మగనిగూర్చి పరామర్శింతము. నా మగఁడేమొ

వచ్చి నిన్నేమి అనవచ్చునేమో యని రామయ్యా! నీ వేమియు అనుకోఁబోకుమయ్యా యని శూర్పణఖ అన్నదఁట. ఆతఁ డేమియు అనఁడని ఈబిడ కున్న ధైర్యమునకు ఆధార మేమని కల్పవృక్షకర్తలు సెలవిచ్చిరో పాఠకులు శ్రద్ధగా గమనింపవలెను.

'ఆ మగఁ డెట్లు నే ననిన నట్టుల వచ్చెడువాఁడు'—అనఁగా నేను జెప్పినదే ఆతనికి వేదము. 'మీఱఁజాలఁగలఁడా నా యానతి' జాబితాలో ఆతఁడు చేరునని గ్రంథకర్త కున్న నిండు ధైర్యము. ఒకవేళ వాఁడు కాదన్నచో ఈ 'మఱిమాటలోన'– ఈ వెంటనే వానిని వధించెద నన్న గుండెదిటవు గలదిసుమా 'విశ్వనాథ' శూర్పణఖ. ఆ పైని (ఆ వెధవ) 'నన్నెఱుంగఁడా' అని ఒక హెచ్చరిక; లేదా ఒక బిభీషిక; నా సంగతి ఎఱుఁగవా అన్నట్టు. తుదకు– ఈ మన సంగమమును అడ్డగింప వలెనన్న ధాతకైనను దరమా! అన్నంత పైమెట్టునకు ఈ కవిత సాగినది.

అసలు—ఇక్కడ ఈ కల్పవృక్షకర్తకు రామాయణకథయే అంతు పట్టలేదు. రామాయణ మనఁగా సామాన్యముగదా! యనియు 'వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితివంచనిపించుకో' అని 'ఆ నా తండ్రి' అనఁగా 'అట్టితండ్రికిఁ బరమ భక్తాగ్రగణ్యుఁడైన పుత్త్రుఁడ నేను రామాయణంబు ... అప్పణము సేతు'ననియు భావించి కయితను అల్లినంతమాత్రాన కథ కుదిరినట్లా కైవల్య మబ్బినట్లా!

అసలు—ఈ శూర్పణఖ, మన యాచారము ప్రకారము 'విధవ'. అందఱు బలాఢ్యులు వీరాధివీరులు సోదరు లుండియు ఆబిడ యిప్పు డనాథ యగుటకు ఒక పెద్దగాథ కలదు.

శూర్పణఖభర్త పేరు విద్యుజ్జిహ్వుఁడు. వాండ్రి కుమారుఁడే జంబుకాసురుఁడు. 'కాలకేయాది' ఘోరసంగ్రామరంగములో రావణుని సేనలోఁ జేరి విద్యుజ్జిహ్వుఁడు యుద్ధము చేయుచుండఁగా – విరోధి పక్షములోని వీరుఁ డేమో అన్న భ్రాంతితో రావణుడే ఈతనిని జంపి వైచెను. తీర – సరిగా పరిశీలింపఁగా ఈతఁడు శూర్పణఖాభర్తయగు విద్యుజ్జిహ్వుఁడని తేలెను. అట్టి దుర్భరమైన విపత్తును దానే చేసేత

చెల్లెలకుఁ గావించితినన్న విచారముతో రావణుఁడు చాల బాధపడి దండకారణ్యములో ఖరదూషణుల పోషణములో నుండుమని చెప్పి, ఆబిడ నోదార్చి పంపెనఁట. నాఁటినుండి శూర్పణఖ ఇక్కడనే మకాము పెట్టి సీతారాముల యీ కథలో మనకుఁ గానవచ్చును.

ఈ కథ యిట్లుండఁగా అనాథయైన ఈ శూర్పణఖను విశ్వనాథ, శ్రీరాముని సన్నిధికిఁ దెచ్చి 'వెధవ' సంభాషణలోనికి దించెను. తన కనుభవములో నుండినట్లు—ఆ యింటిగుట్టు బయట పెట్టి, ఆ బిడకు లేని భర్తను దెచ్చిపెట్టి ఆతనిని వట్టి 'సక్కుబాయి పెనిమిటి'నిగాఁ జేసిపెట్టి 'విశ్వనాథ'—ఈ కథ నింత తాఱుమాఱు కావించెను. ఆపై, శూర్పణఖ 'నాకా! కోపమా! వచ్చుటా! అదియు నిన్నా! ఓరెముం జేయుటా' అన్నదఁట. ఓరె మనఁగా భోజనము. 'నీకుఁ గోపము వచ్చునన్న మాట'. ఇంతకు ముందు రాముఁ డీబిడతో అన్నట్లు ఈ భాగములోఁ గానరాదు. నీకు మేము ఓగిరముగదా యనిమాత్ర మనును. పైగా ఇచ్చుట 'విశ్వనాథ సర్వస్వామ్యసంకలితమైన' వాక్యనిర్మాణవైచిత్రియుఁ గద్దు. 'నాకా కోపము వచ్చుటా ! అదియు నిన్నా!'

అది యనఁగా ఆ కోపము వచ్చుట. అది నిన్నా — అని అన్వయము. ఆ కోపించునది నిన్నుగూర్చియా యని మన మూహించు కోవలెను. లేదా — నిన్నా ఓరెముంజేయుటా! అని సమర్థింపవలెను. ఈ యూహాయే నా కున్నచో నా కంఠమును నేన కోసిగొనెదనని యన్నదఁట. ఇది యొక 'ఒట్టు' కాఁబోలు. కోసిగొనుట యేమిటి స్వామీ గొబ్బరి కాయవోలె, అసలు — అఱసున్నలు 'వగైరా'లు పాటించినట్టు నటించిన ఈ కావ్యములో చాల పదములలో అచ్చువారి నేర్పువలననో గ్రంథకర్త కూర్పువలననో పరిష్కర్తల పరీక్షలోని ప్రమాదమువలననో ఆ 'గొడవ' పెట్టుకొన్నట్టే కానరాదు.

ఇఁక — ఈ కామప్రసంగములో 'విశ్వనాథుల' రాములవా రిచ్చిన సమాధానము మనము వినవలసియున్నది.

'చం అన రఘురామచంద్రుఁ డిటులాడెను నీకును నంత కామ ముం
డిన మఱి కామ మంత నెగడెన్ మగవానికి వేని కాతనిన్
గనవలె మాదృశుల్ వలచి కామము తీరక రిత్తవోవనే
లనె మగవారి కింతటి యిలాతల మంతయు గొడ్డువోయెనే.

వ. కనుక మఱియొండెడఁ 'జూదికొమ్ము' [అర–94] ఇది – మగ వారిలో మొనగాఁడైన రామయ్య మాటల వరుస.

'నీకును నంత కామ' మన్నదానిలోని సముచ్చయసౌరభమును బట్టి ఎట్టయెదుటి పురుషోత్తముని విడిచిపెట్టి తక్కిన మగవారు–తక్కిన మగువలు దితిజులకు ఉన్నట్లే కామము నీకుఁగూడ ఉన్నచో అని సారస్యము పిండుకొనవలెను. అంత కామము నీకుఁగూడ ఉన్నచో నీవేమి చేయవలెనో భామా! నేను జెప్పెదను వినుమని రామయ్య పాపము నిరపాయమైన యుపాయ మొకటి చెప్పెను. ఏమని! ఓసీ! పిచ్చిదానా? నీకు 'అది' యున్నచో–'మఱి అంత కామము వేనికి మగ వానికి నెగడెన్ ఆతనిన్ గనవలె'. ఈ పదములు మనకు ప్రసాదించినది కల్పవృక్షకర్త సుమా! వానినే తెచ్చి వరుసలో పెట్టుట ప్రకృతము ఈ ఖండన గ్రంథకర్త వంతు. ఆపై దాని సారము గ్రోలుట చదువరుల వంతు. అనఁగా, నీ కున్నంత కామము ఏ మగవాని కున్నదో చక్కఁగా పరీక్షింపించి అతనినే చూడవే. నావంటివానివలన లాభ మేముండునే! తీర – కామము తీరక రిత్తవోవనేలనె! ఇంతటి యిలాతల ముండఁగా పిచ్చిముండా! నీకు మగకుంకలే దొరకలేదా! నేల గొడ్డువోయెనా! ఇట్టిది, పదింబదిగా ఏకపత్నీవ్రతుఁడని ఎన్నో రీతుల రోళ్ల రోఁకళ్ల వేనోళ్ల ఎల్లవారిచేఁ'గొండాడ'బడ్డ రామచంద్రమూర్తి విశ్వనాథ శూర్ప ణఖతోఁ జెప్పిన ధర్మసూక్ష్మము. కామమన్న మాట ఈ రామా యణములో పారాయణమై, ఈ కవనములో ఇంత ఎల్లిదమైపోయెనే. రిత్త + పోవన్ + ఏలను + ఏ రిత్తవోవనేలనె! అని విశ్వనాథవారి తెలుఁగు వ్యాకరణము. ఏల – అని, ఏలా – యని తెలుఁగువారెల్లరు ఈ శబ్దమును ఎన్నఁడేని కళగా భ్రాంతిపడెదరేమో యన్నభావముచే భావి

పోరులను గరుణించి 'ఏలన్' అని ప్రాసలో బిగించి 'మేకుబంది' చేసి సహాయము చేసిపెట్టిరి. ఇంతటి కవిసమ్రాట్టుల ప్రయోగరత్నము మన కండగా కంటియెదుట నుండఁగా, అర్షముగా మనము ఆరాధించుకోవలసియున్న 'కూచిపూడిభాగవతములో 'ఏలనే ధర్మి!' అన్న పిలుపులు మనకు వినఁబడుచుండఁగా ఏలశబ్దము ద్రుతాంతమయ్యా యని ఏల చెప్పకొనరాదు? ఔరా ! కల్పవృక్షమహామహిమవలన తెలుఁగుపదముల కెంతటి మహాభాగ్యము దక్కినది! అర్థమునుబట్టి నెగడన్ – అని ఉండవలసిన తద్ధర్మ క్రియకు యతిసంరక్షణార్థమై 'నెగడెన్'—అని 'భూతము' పట్టినది.

పూర్వకాలపు నాటకములలో మనము 'లంఖిణి–'ఆంజనేయ' సంవాదములవంటివియుఁ గనియునుంటిమి. అట్టి నేర్పు గడింపలేక ఈ కాలపు 'చచ్చుకవులు' ఆ సంభాషణధోరణులు తీసివైచి ప్రాచీనసంప్రదాయమును బగ్గముపాడు చేసిరి. సనాతనాచారపరాయణమ్మన్యులైన మన విశ్వనాథకవిసమ్రాట్టులు పూర్వాచారసంప్రదాయములను సర్వతోముఖముగ నిలువఁబెట్టుటకే నడుము కట్టిరికావున అట్టి 'లంఖిణీ' సంభాషణముల కక్కయో, చెల్లెలో అయిన 'ఉక్తి ప్రత్యుక్తికా' ధోరణి యొక్కటి క్రొత్తగాఁ దెచ్చిపెట్టిరి. చదువరు లోపిక చేసికొని ఈ వచనములోని మూలస్వరూపమును జిత్తగింపవలెను. దానినే మనము 'డైలాగులో' మార్చుకొని వినోదింతము :—

'ఇలాతల మంతయు గోడ్డువోయెనే! కనుక మఱియొండెడఁ జూచికొమ్మ' —ఇది కల్పములోని రామయ్య మాట. [అర–94 పు]

శూర్పణఖ :— కాదు నేను నీయందు బద్ధానురాగను.

రాముఁడు :— నే నేకపత్నీ వ్రతస్థుఁడను

శూ :— ఆ వ్రత మైహికసుఖదాయి కాదు. దానియందుఁ బారలౌకికసుఖము చెప్పంబడినట్లు లేదు.

రా :— నేను సుఖమే వాంఛింపను.

శూ :— అయినచో నీమెతో సంసార మేల చేయుచుంటివి ?

రా :— అది ధర్మమని.

శూ :— ధర్మము చతుర్విధము. అందులోఁ గామ మొకటి.

రా :— మన కూటమి విలోమము.

'లేనిదానికిఁ బేరుండదు'— ఈ పలుకును ఉభయులలో ఎవరి నోటఁ బెట్టవలెనో - నా కంతుపట్టలేదు. ఈ మొత్తము స్వరూపమును ఒక క్రొత్తమాటలో మనకు వినిపించిరి. ఏమని!

'ఇత్థంప్రచలితోక్తి ప్రత్యుక్తికానంతరమున' అని 'కామశాస్త్రోపాధ్యాయివి నా వచించెదవు మేలోహో!' ఇత్యాది వరూథినీప్రవరాఖ్యుల ఘట్టమును మీఱుఁగల ఘట్టమువంటిదని దీనిని మనము భావింపవలయునేమొ! ఈ ఘట్టములో 'కృత్యవిచారణకు' నిలువఁదగ్గ యంశములు లేవు. ధర్మము నాలుగువిధములని_అందుఁ గామ మన్నది ఒకటి యని ఇదే క్రొత్తగా వినుట. చతుర్విధపురుషార్థము లనియు వానిలో కామ మొకటియనియు కామమువలె ధర్మముసైత మొకభాగమనియు ఏదోకొంతవిన్నాముగాని ఈ క్రొత్తభాష్యమువంటిది వినలేదు.

నా యందమును జూచికాదా కాంతా! నీవు నన్ను వలచినది· సౌమిత్రిసైత మట్లే ఉండెంగద_అని రాముఁ డనును. ఉండెనని భూత మెందులకో! ఇప్పుడా యందము మాఱిపోయెనా యేమి? అట్లే ఉన్నాఁ డనరాదా! అయ్యో! కర్మమా ఈ కవనములో ఏ క్రియ ఎప్పు డుండవలెనో ఒకరీతి-రివాజు పద్ధతి గిద్ధతి ఉండెనా యేమి! నోటికి వచ్చినట్టు మాటాడుట-గణమున కతికినట్టు గీకుట-ఇదే ఈ కావ్యకర్తకు పరాయణముగాఁ దోఁచుచున్నది. పైగా-'అతఁడు ఎట్టివాఁడు. ఆ యీ పదుమూఁడువత్సరములైనన్ స్త్రీవియోగోగ్ర బాధాయుక్తిం జనునే! కావున ఆతనిన్ వరింపుము. తా నీకు పుణ్యాం బగున్'_ఇది హాస్యమా! అభ్యర్థనమా! పాపము! తమ్మునికూర్చి జాలిపడి రామయ్య కోరిన కోరికయా! 'పుణ్యాం బగున్'_అన్నది దొడ్డమాట. నాలుగుపాదములలో రాముఁడావ్యాయముగా రెండుసారులు 'కాంతా! కాంతా! యని పిలిచి మఱి ఈ ప్రేమసందేశమును తమ్మునివద్దకుఁ బంపెను. వాఁడఁట తన మాట

కాదునాఁగఁజాలఁ డఁట. అతఁడు 'మోహాచ్ఛేద విధాసామగ్రీనిపుణ చిత్తసారసుఁడు'నఁట. లక్ష్మణస్వామికి కల్పకావ్యకర్త వెదకి వెదకి ఎంత మంచి విశేషణము సమర్పించెను. మహర్షి వాల్మీకికి ఇట్టి 'దళముల'లో ఒక్కటియైన దొరకెనా? ఆయన ఇంతలావు సమాసము వేయఁగలిగెనా!

'అనుజస్త్వేష మే భ్రాతా శీలవాన్ ప్రియదర్శనః-అనురూపశ్చ తే భర్తా రూపస్యాస్య భవిష్యతి'-ఇంతమాత్రమే అంతలావు గీర్వాణ కవి అనఁగలిగెను.

ఆశ్రమదూర దేశంబున నిలచియున్న సౌమిత్రివద్దకు శూర్పణఖ వెళ్లి ఇట్లన్నదఁట:—

కం. 'అన్నలు రాజ్యముపోయినదన్నన్ దన కెట్లువచ్చునా యని యూహిం
పన్నేర్చిన లోకంబున నెన్నన్ నీవంటివాఁ డహీనుఁడు సుమ్మా!'-(94)

తమ్ముఁ లీ రీతిగ ఊహించునది ఏ లోకములో? ప్రకరణమునుబట్టి భూలోకములో. అది ఏ యుగమున? ఈ కథనుబట్టి త్రేతాయుగమున. ఆ యుగములో ధర్మము మూఁడుకాళ్లనడకలో నడచునని విందుమే! ఇదేమి కర్మము! తమ్ముఁ లీ రీతి 'వెధవలై' అప్పుడుకూడ ఈ రీతిగా ఉండిరా యేమి! లేక-కల్పవృక్షకవీశ్వరులు, అధర్మమును నాలుగుకాళ్ల నడకలో నడిపించు పాపిష్ఠ కలియుగములో ఉద్భవించిరికావున వీరివి సర్వానుభవములు రాశీభూతములు చేసి త్రేతాయుగములోని ఆ పాపిష్ఠ శూర్పణఖముఖమున కలియుగజీవులమైన మనకు ప్రబోధింపఁగలిగిరేమో! ఏది యేమైనఁ గానిండు; అన్నలకు రాజ్యములు ఊడిపోయి తమకే రావలెనని తహతహపడు తమ్ముయ్యలు త్రేతాయుగములోఁగూడ ఉన్నారన్న వింతవార్త సనాతన పరాయణులైన రామాయణకర్తల నోట విన్నాము. అదే చాలు. అట్టి లోకములో 'ఎన్నన్ నీవంటివాఁ డహీనుఁడు సుమ్మా!' అట్టి మానవులలో నీవంటివాఁడు గొప్పవాఁడగును గదా! అని అన్వయము. హీన_అహీన_దోష_అదోష- విధుర-అవిధుర- ఇట్టి సొగసులేగదా ఇట్టిపట్టుల ఈ కవనములో మనము హెచ్చుగా వినఁ గలిగి యున్నవి!!

'ఒక వృక్షచ్ఛాయ నిలుచుండి......ధనుస్సుపై నాని నిలచి యున్న' [అర–94] ఈ రెండునరపంక్తుల వచనపుముక్కలో 'నిలుచు' ధాతువులు రెండు నిలిచినవి. తెలుఁగులో అందఱము వినుచున్న అనుచున్న 'నిలుచు' ధాతువు ఈ మహాకావ్యములో 'నిలచు'గాఁ గనపడుచున్నది. ఇందు ఏ మూలఁ జూచిన 'నిలచి–నిలచి' ఇదే పల్లవి. 'నిలుచుండి'–అని ఒక చోట వ్రాసిన చేయి 'నిలిచి' యున్న రూపమును వదలి 'నిలచి'ని వల చుటలో హేతువేమో! హేతువు లేదు; గీతువు లేదు. కల్పవృక్షముకుఁ బట్టిన తెగుళ్లలో ఇదియొక 'తెగులు'.

శ్రీరాముని మాట విని వెంటనే లక్ష్మణునివద్దకుఁ బోయి శూర్పణఖ, 'అస్య రూపస్య తే యుక్తా భార్యాహం వరవర్ణినీ,మయా సహ సుఖం సర్వాన్ దండకాన్ విచరిష్యసి' [అర–1053] నీ రూప రేఖల కనువైన భార్యగా నయ్యేదను. ఈ దండకలో అంతటను హాయిగా నిన్ను త్రిప్పెదను!–అని మూలములో నున్న కథను కల్ప మింకొక త్రోవలో నడపినది. ఆ నడకలోని చాతుర్యమును జక్కఁగా చవిచూడ వలెనన్న–ఆ 'చెత్త'యంతయు ప్రోవు చేసి మీ ముందు పెట్టకతప్పదు. గదా!

'శా. కన్నుంగన్నను గానిపించనది చీకట్లైన మోహాంబు నా
కన్నుల్ వెల్గులఁ జిమ్మె నీవగు తనూకాంతుల్ పిసాళించినన్
దన్నుం గాడని నిన్నుఁ బొందుమనియెన్ దా నన్న నీ వన్న మా
ట న్నిల్పంగల యోగ్యశీలుఁడవు వెంటన్ వచ్చితీకానకున్,

చ. వలసిన నీకు దైత్యజనవల్లభరాజ్యమృగేంద్రపీఠిపై
నిలిపెద నీవు కాదనిన నీవలె నిచ్చటఁ బర్ణశాలలో
పల నది యేదియేనియును భక్షణచేయుచు నిల్చిపోయెదన్
దెలియని కోర్కి చీఁకటులు దీప్తభవత్తనుకాంతి నార్పమి' [95 పు]

కానిపించనిది చీఁకట్లైన ! అన్న దళము 'మోహాంబు'నకు విశేషణము కాఁబోలు! నీవగు తనూకాంతుల్ ! అనఁగా నీకుఁ జెందిన దేహ కాంతులు. చీఁకట్లు క్రమ్మఁగా వెలుఁగులు చిమ్మఁగా, ఇత్యాదిగ ఏదో

ఒక విశేషము స్ఫురింపవచ్చునుగాని దానిని పదబద్ధము చేసి వాక్యములో మలచి సూటిగా మనకు విప్పిచెప్పెడి కవనము దీనిలో దొరకదుగదా! తన్నుం గాదని అన్న నిన్నుఁ బొందుమన్నాఁడఁట! ఇంక నయము 'నీ బొంద' అనలేదు, వట్టి 'అన్న'గారు గాదు; 'తానన్న'గారు. ఈ కానకు అన్న వెంటఁ బడి వచ్చితివి కావున అన్నమాట నిలుపఁగల యోగ్యశీలుఁడవు ఉన్నాఁడవుగావున నన్నేలుకో నాస్వామి యని సారస్యము లాగవచ్చును. నీకు కావలసినచో రామానుజా! దైత్యజనవల్లభరాజ్య మృగేంద్రపీఠిపై నిలిపెద నని విశ్వనాథ శూర్పణఖ ధైర్యము పూని పెద్దఆశ పెట్టినది. దైత్యజనవల్లభ! అనఁగా రావణబ్రహ్మ అనియే మన మనుకొనవలెనా! మగఁడు పోయి ఇడుమలు పడి అన్నగా రూరడించి సాగనంపఁగా దండకలో పడియున్న ఈబిడకు, రావణబ్రహ్మసామ్రాజ్య పీఠిపై-లక్ష్మణుని నిలుపఁగల 'సత్తా', మాటవరుసకైన హాస్యమునకైన లేదన్నమాట కల్పకర్తకుఁ దెలియదనియే తేలుచున్నది. ఒక వేళ ఆ రాజ్య మాతని కిష్టము గానిచో ఆతనివలె పర్ణశాలలోపల ఏదియేని యు భక్షణ చేయుచు శూర్పణఖ నిలిచిపోవునఁట. ఆబిడకుఁ గావలసిన దెల్లను 'తెలియని కోర్కి-చీఁకట్లార్పుట యే? అప్పుడు లక్ష్మణుఁడు చెప్పిన సమాధానము తప్పక మనముకూడ వినవలెను.

'చం. ఇది యొక గంత నా మెడకు నేటికిఁ గట్టికొనంగ నున్నదే
వదలి యయోధ్య నిర్మమత వచ్చితి నిచ్చట నున్నపూట లే
నిదియును బూట నీకు మఱి నెత్తికి నేలకు చేయలేను నే
నోదుగుచు గాలియున్ వెలుఁగు లోగిరమై మనుచుంటి నక్కటా!

కం. నాయొక్క పొట్టకోసమె యీ యన్నపయిన్ వనాన నాధారపడం
గా యుక్తము కాదంచును జేయుదు నుపవాసముల నశేషదినంబుల్.

శా. నీడ న్నిల్వఁగనైన లేద యిచటన్ నీ పొట్ట కైవారమే
చూడన్ యోజనమంత యున్నయది రోజున్ రోజు నీ భోజనం
బేడన్ వట్టి కనీసమైన నగునే రయే యేన్గో మా తల్లి! నీ
తోడం గాననమందుఁ గాపురము నాతో నాకుఁ గైవల్యమే'-[95-పు]

ఓహో! ఏమి కవనము! ఏమి హేతువాదము! ఏమిసింగారము!

ఎంతటి పాత్రౌచిత్యము! ఈ ఘట్టమువలన, 'విశ్వనాథ'లో అంతర్వాహినియైన లక్ష్మణస్వామిమూర్తిగానీ, లక్ష్మణస్వామిలో ప్రతిబింబించు 'విశ్వనాథ' ప్రకృతిగాని అద్దములోఁ జూచినట్లు మన కంటికిఁ గట్టినట్లు స్పష్టముగాఁ గానవచ్చును. ఎక్కడి రామాయణము! ఎప్పటి త్రేతాయుగము! ఏనాఁటిరామలక్ష్మణులు! అవురా! వారెల్లరు ఈకలియుగ కవి సమ్రాట్టులకవనములో లేకిమూఁకలై పొట్ట గడువనివారై కట్టుకొన్నదానికి తిండి తిప్పలు చూపెట్టలేని చవటలై అరసికులై అనాథులై పోయిరే! ఇది, కాలమహిమ-యుగమహిమ కావచ్చును. ఇది యొక గంతయని-ఉన్న గంతనే అయోధ్యలో వదలి నిర్మమతతో వచ్చితినని లక్ష్మణుఁడన్నాడన్నమాట నిజమనియే మనము భావింపవచ్చునా! ఈతఁడీ 'రకపు' వాఁడే అయిననాఁడు సీతకన్నను పవిత్రయైన ఊర్మిళనుగూర్చి ఈతనికీ భావమే ఉన్ననాఁడు - అన్నమీఁద ఆధారపడక ఉపవాసములు చేయవలసివచ్చెనని లాఁతివారితో ఈతఁడు తన దైన్యము చెప్పుకొన్ననాఁడు ఈతఁడు రామానుజుఁ డెట్లు కాఁగలఁడు? ఇట్టి పాత్రలు గల రామాయణము మనకు పారాయణమై యుగయుగాలుగా ఈ జగములో బ్రదికియుండఁగలదా! హాస్యమే ఆడవలసివచ్చినను - ఎదుటివ్యక్తి వట్టి నైచ్యమే కలిగియున్నను ఉదాత్తమైన హృదయము గల వ్యక్తులు, లేకిగా ఈ తీరుగ దిగజారిపోవరన్నమాట కల్పవృక్షకర్తకుఁ దెలియునే తెలియదని గట్టిగా అనకతప్పదు. మన మనుకొను రామాయణములోని మంచి పాత్ర లన్నియు ఈ కల్పములో ఈ తీరుగ ఉజాడయి ఊడుకొని పోయినవి.

'ఇచ్చట నున్నపూట లేనిదియును బూట' -ఇది యేమి మాట స్వామీ! ఇచ్చట-ఒకపూట ఉండి ఒకపూటలేక (తిండి) ఏదో బ్రతుకు చున్నాములే' అన్న ధోరణిలో దీనాతిదీనముగ రామానుజుఁడన్నట్లు-ఆ పద్యపాదమునకు మేము అర్థముచేసికొనవలెనా! దీని కీడుజోడైన ఆణిముత్తెమువంటి మఱొక జాతీయ మిదిగో! 'నీరు మఱి నెత్తికి నేలకుఁ జేయలేను నే నోడుగుచు'-అంతటి శక్తిసంపన్నురాలు శూర్పణఖ వచ్చి కేవలము ప్రేమభిక్ష యాచింపగా, అది తప్పని ఒక్కమాట చెప

వచ్చునే. 'ఈ రెండవ గంత నాకేల' కట్టుకొన్నదానినే వదలివచ్చితిని గదా! ఒకపూట ఉండి లేక గాలియు వెలుతురుమాత్రమే ఆరగించుచు మనుచుంటినక్కటా! [మనుచున్నానుగాదు] నా ఒక్క పొట్టకోసమే అన్నమీఁద ఆధారపడవలసివచ్చినదే యని అన్నిరోజులు ఉపవాసములు చేయుచున్నాను'—అని రామానుజుఁడు చెప్పెనని కవనము వ్రాయుటకు కవిసమ్రాట్టు చేయి ఎట్లువచ్చెనో!

'నీడన్ నిల్వఁగనైనలేద యిచటన్=ఇచ్చట ఏ చెట్టునీడలోనో మనముభయులము కాలక్షేపము చేయువలయునన్న—లేద=వీలులేనేలేదు. ఎందువలన! నీ పొట్టకైవారమే చూడన్ యోజనమంత యున్నది=ఓసీ భామా! నీ పొట్ట చుట్టు కైవారము ఒక ఆమడదూరము బరాబరిగ ఉన్నదే! రోజురోజు నీ భోజనము ఏడఁ దెచ్చిపెట్టెదనే. వట్టి కనీసము ఒక యేనుగైనఁ గావలసియుండునే మా తల్లీ! నీవు నాకు వద్దు. నీతో)—గాపురము నాతో నాకుఁ గైవల్యమే — అన్నాఁడఁట మహానుభావుఁడు కల్పవృక్ష లక్ష్మణుఁడు. 'వట్టి కనీసమైన నగునే యే యేన్గొ—' ఇదియొక కవనమా! మన మనుకొన్న భావము దీనిలో సూటిగా దొరకునా! నీతోడ—నాతోడలు, రెండు 'తో' లెందులకో! హాస్యమునకైన సమయ మున్నది; సభ్యత యున్నది. సభ్యత లేని మానవుఁడు సభ్యత లేని రచన సభ్యత లేని బ్రదుకు గణ్యత కెక్కువుగదా?

'కేతిగాని'కూఁతలకు 'బంగారక్క' పెట్టెడి వాతలువోలె 'దానవి' మాత్రము సామాన్యురాలా! 'విశ్వనాథ' చేతిలోఁ బెరిఁగిన కొమ్మ ఆమె ఏ మన్నది? 'నీ కా భీతి లేదోయి నా తినునాహారము నేనుగావనిని సాధింపన్ సమర్థం జుమీ'—అనఁగలిగినది. నెత్తికోసము నూనెగాని కట్టుకోను గుడ్డగాని కోరను. భార్యగఁ జూడంగదే, అని తన శక్తిని ఆసక్తిని ఈ తీరుగ వెల్లడించినది:—

'ఏ పులినేని సామజమునేని పదామడ మేరలోపలన్
రేపుల మాపులందుఁ బొనరించిన గర్జలు మెల్ల నా చెవిం
జోపి వినంగఁజాలుదును నూ!

ఏ పులియేని సామజమేని పొసరించిన గర్జలు—అనవలసినమాటలో 'పులినేని సామజమునేని' అని విభక్తి వ్యత్యయము వచ్చిపడినది. పొసరించిన — అనెడి క్రియకు 'పులినేని — సామజమునేని' అన్న పదములు ఎట్లు కర్తలగునో ఈ కావ్యకర్తకే తెలియవలెను

'వెంపలిచెట్టుఁబండ్లకయి వేడినయట్టుల మిమ్ము నింత దై
న్యంపడి సుంత కామమునకై బతిమాలుచు వేడ... [96 పు]

కామముతో గిలగిల కొట్టుకొనుచున్నట్టు ఇంతవట్టు ఈ పాత్రను చిత్రించిపెట్టి అంతలో 'సుంత' కామ మనుటలో అంతరార్థ ముండియుండును. వెంపలిచెట్టుఁబండ్లఁట!! ఒకప్రక్క వ్యాకరణపుగొడవ లక్కఱ లేదన్నట్లు 'నాజూకులు' చూపుచు 'మధ్యవైష్ణవము' వోలె నియమములు అతిగా అంటించుకొనుట యెందులకో! చెట్టుయొక్క పండ్లు — చెట్టుపండ్లేగాని చెట్టుఁబండ్లుగావన్నమాట, ఇన్ని యేండ్లుగా తెలుఁగు పండితులుగా బడులలో కాలము గడపుచు బండ్లకొలఁది పిల్లలవ్రాఁతలు దిద్దుచు ఏవేవో ప్రూఫులుసైతము చూచుచు ఒజ్జలుగా బ్రదికిన అన్నదమ్ము లిర్వురకుఁ దెలియదన్నమాట. ఈమాత్రము గుర్తింపని పండితుఁడు పండితకీర్తనీయుఁ డెట్లయ్యెనో! ఇరుబాసల దిట్టతన మిట్టిదే ఆయెనా! తత్పరీక్షలోఁ బడి తీర్థమై చన్నది ఈ మహాభాగ్యమేగదా! మునికి—గణనాధుఁడువోలె యజ్వకు—గురునాధుఁడువోలె ఈ యన్నగారికి ఆ యనుజుఁడు వ్రాయసగాఁడై సాయపడఁగా యావదాంధ్రులకు ఈ రామాయణ కల్పవృక్షమహాకావ్యము లభించినది కాఁబోలు!

ఈ కామశాస్త్రప్రసంగములో శూర్పణఖాముఖమున విశ్వనాథ వారు సెలవిచ్చిన ఒక యనుభవమును మనము తప్పక గుర్తింపవలసి యున్నది. అది ఏదనఁగా—

గీ. 'లింగసంబంధికామమ్ము లేదు దితిజమనుజ యన్న భేదమ్ము యౌవనము
వార్ధకంబన దశాప్రభేదముల్ కామసహితభావమే దివ్య మప్రతిబంధకంబు'
[అర—96 పు]

దితిజుల లింగసంబంధికామము వేఱు; మనుజుల లింగసంబంధి

కామము వేఱు — అని మనము భేద మెంచరాదఁట! ఈ నియమము ఒక్క 'లైంగికకామమునకే' కాఁబోలు! తక్కిన కామముల ప్రసక్తి ఈ కల్పములో నింకెక్కడనైన రావచ్చును. అప్పుడు చూతము. ప్రస్తుతము ఒక్క లైంగికమునే వైశ్వనాథము వర్ణించినది. నేనేమొ వయసు మీఁటినదానను; అందువలన మీరేమొ మసలుకొన్నరైతిరని— ఇంతకు ముందు శూర్పణఖ చెప్పి—ఇప్పుడు 'ఓయి పిచ్చివాఁడా! యౌవనము—వార్ధకము అన్నవి దశాప్రభేదములోయి. ఆ దశనే ప్రధాన మనరాదు; ఏ దశలోనైనసరే కామసహితభావమే మనము ముఖ్యమని ఎంచవలెను అది దివ్యము; దాని కడ్డంకు లేవియు నుండవు ఆలోచించు కొమ్ము' అని మేల్కొల్పును నన్నే మీరు స్వీకరింపనినాఁడు తినను నిదురపోన యిచట దిగవిడుతును నా తనువు-అని ఈ 'సత్యాగ్రహము' మాట మూలములో లేని క్రొత్తబాట. ఆబిడ ఆ తీరుగ ఆ తనువును దిగవిడచినచో సహస్రాబ్దంబులుగా ఆ యన్నదమ్ముల గుండెల దినుసు జగంబునఁ దెలియునఁట! ఎంత మనోజ్ఞమైన భావము! ఎట్టి మనోహర మైన పదములు!! అయ్యారే! కల్పమా! నీ వీ దినుసు పదాలతో ఈ దినుసు భావాలతో ఈ యాంధ్రవాఙ్మయములో ఆకల్పము మనియెదవు కాఁబోలు!! చిరంజీవ! సుఖీభవ!!

నేను నిన్ను వలచి వచ్చితిని. నన్ను భార్యగాఁ జేసికొమ్మని యన్న శూర్పణఖతో వాల్మీకి లక్ష్మణుఁడు చెప్పిన మాట—ఇది:—

'శ్లో. కథం దాసస్య మే దాసీ భార్యా భవితు మిచ్ఛసి, సోఽహ మార్యేణ పరవాన్ భ్రాత్రా కమలవర్ణిని,... ఆర్యస్య త్వం విశాలాక్షి భార్యా భవ యవీయసీ. ఏనాం విరూపా మసతీం కరాళా నిర్ణతోదరీం, భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వామేవైష భజిష్యతి. కో హి రూప మిదం శ్రేష్ఠం సంత్యజ్య వరవర్ణిని, మానుషీషు వరారోహే కుర్యాద్భావం విచక్షణః. ఇతి సా లక్ష్మణేనోక్తా... [అర-1053]

ఓసి పిచ్చిదానా! ఎంత భ్రాంతిలో పడితివే. అసలు నేనే ఒక అయ్యకు దాసుఁడనై ఉన్నాను. నీవు వచ్చి తొత్తుక్రింద బడి తొత్తుగా

నుందువా! మా యన్నగారినే చేపట్టుటలో నీకు లాభ మున్నది. ఆయన
కూడ, అదిగో అక్కడ ఉన్నదే ఆ 'విరూప – అసతి – కరాళ –
నిర్ణతోదరి – వృద్ధ', అయిన భార్యను విడనాడి తప్పక నిన్నే పరిగ్ర
హించును. తెలిసినవాఁ డెవ్వఁడైనంగానీ – ఓ సుందరీ! నీవంటి అంద
గత్తెను గాముకూడదని మానవాంగనమీఁదికి మనస్సు పోనిచ్చునా !
అని. ఈ మాటలలో వేళాకోళము కావలసినంత ఉన్నది. కల్పము,
నేర్చి మనకుఁ జెప్పిన 'గంతలకు – లేని పూటలకు – ఉపవాసములకు–
పొట్ట కైవారములకు – గుడ్డగోచులకు – తలనూనెలకు' ఈ లక్ష్మణుని
వేళాకోళములకు ఉన్న తారతమ్యమును సహృదయులు గుర్తింతురు
గాక! మాతృదేవివంటి సీతాదేవినిగూర్చి మఱఁది లక్ష్మణుఁడు
హాస్యమున కైనసరే అట్టి మాట లనవచ్చునా అని మూలమునుగూడ
కొందఱు సందేహింపవచ్చును. ఆ మాటలు కేవలము నిందాస్ఫోరక
ములు గావు. ఆచి ఆచి తూచి తూచి వేసిన ఆదికవి ఆర్షప్రయోగ
ములు. విరూప అనఁగా శూర్పణకుఁ దెలిసినది 'వికారరూపము గలది
సీత' అన్నంతవఱకే. వస్తుతః, లక్ష్మణుని దృష్టిలో ఆమె 'విశేషరూపా–
త్రిలోకసుందరీ' అనియే. 'అసతి' యనఁగా చెడ్డది యని పైకిస్ఫురించు
అర్థము. 'న విద్యతే అన్యా సతీ యస్యా స్సా అసతీ' అని విగ్రహ
వాక్యము. అనఁగా పరమ పతివ్రతయని ధ్వని. కరాళ యనఁగా
శూర్పణఖదృష్టిలో సీతాదేవి 'గేడెకాళ్ల'దని. లక్ష్మణుని దృష్టిలో
'ఉన్నత'యని. 'కరాళో దంతురే తుంగే తారుణేఽపి చ కథ్యతే' అని
నిఘంటువు. శూర్పణఖదృష్టిలో సీతాదేవి 'నిర్ణతోదరి'. అనఁగా
నడుము లేనిదని. అసలు అర్థము:– 'నిర్ణతం నిమ్నం ఉదరం యస్యా
స్సా. తనుమధ్యా' అని. వృద్ధ – అనఁగా శూర్పణకుఁ దెలియవలసి
నది 'వట్టి ముసలమ్మ' అని మఱఁది దృష్టిలో సీతాదేవి, 'జ్ఞానశీల
గుణవృద్ధ' యని. ఇట్టి భావములతో కనుగలిగి లక్ష్మణుఁడు 'పరాయి'
యువతితో చక్కని హాస్యము లాడినట్లు వ్రాసిన – ముందు పుట్టిన
వాల్మీకమును జూచియు – అనువాదములు చదివియు ఈ కల్పకర్త
పూర్వకాల 'పాత్రల'లో అధునాతన భావములను అంటును లేకితనము

వెళ్లఁబోయువానిని దూర్చి, ఇది నా భాష్యమన్నంత 'అహము' చూపి ఈ పవిత్రమైన ఇతిహాసమునకు అపహాస్యము గూర్చెనే అన్న విచారము సంస్కృతాంధ్రపండితులలో ఒక్కరికైన ఇంతవఱకు లేకుండుట – ఉన్నచో వెల్లడింపకుండుట తెలుఁగుభాషకుఁ దీరని కళంక మనియే చెప్పక తప్పదు.

'నీ నన్నగారి మాటమీఁద నంత నిలచెడువాఁడనని వచ్చితిని. కాదన్నచో మరల నాయనవద్దకే పోదు' నన్న శూర్పణఖకు లక్ష్మణుఁ డిచ్చిన సమాధాన మిదిగో :—

'ఒకనిం జేపట్టి యతఁడు కాదని చోసిన యొలనాగ యిట్టి చొప్పునఁ బలుకున్ :–

'అన్న నచ్చిన వెలఁదిన్ గామించునంత దైత్యవ్యామోహము లేదు. దితిజభామిని నాకున్.

'ఆతనయును మీ యన్నయుఁ జేయియుఁ జేయియునగలపఁ జేవ గలరు నే నాయనకు నెంత! పొమ్మనఁ బోయెదు రమ్మన్న వచ్చు భూనినబంటన్.

ఆయన కాదన్నను గొప్పే యే నిను స్వీకరించి యేమగునది శూ
న్యాయితగగనంబును జేదోయి గ్రహించినవిధంబు దూరఘూర్ణీ! [అర–97]

ఒకనిఁ జేపట్టి యతఁడు కాదన్నచో వచ్చిన యువతివంటిదఁట ఈ శూర్పణఖ. శ్రీరాముని జేపట్టినదా! లేదు. ఆతని యాజ్ఞచేతనే ఈతనివద్దకు వచ్చినది. అన్న నచ్చిన వెలఁదియనఁగా–అన్నకు నచ్చిన వెలఁది యని మనము అనుకొనవలెను. ఈ శూర్పణఖ అన్నకు నచ్చిన దని ఈతనితో ఎవరన్నారు? పైగా–ఇక్కడ ఒక మంచి హేతువుకూడ లక్ష్మణస్వామి ముఖమున గ్రంథకర్త చెప్పినాఁడు. మీ యన్నయు మా యన్నయు 'సమ-ఉజ్జీ'లు. అయనకు నే నెంత? అయన పొమ్మన్నఁ బోయెదను; రమ్మన్న వత్తును. ఆయనకు నే నొక బంటును' బంటు అయినచో, అయనమాటలో నిలిచెడి విధేయుఁడైనచో ఆయన చెప్పి నట్లే ఆ బిడను గ్రహింపవచ్చునుగదా! ఈ 'పేచీలు' లక్ష్మణున కెందు లకు? అయితే ఆయనగా తనకు చెప్పలేదుగదా! ఆబిడద్వారమునఁ

బంపిన సందేశమాయె. ఆ సందు చూచుకొని ఈ రామానుజుడు ఈ యాడుగూతుతో సరసాలకు దిగినట్లు సమర్థింపవలెనా! ఇక్కడ మాత్ర మెందులకో రావణబ్రహ్మ శూర్పణఖకు అన్నయ్య అయినాడు. 'ఆయన కాదన్నను గొప్పే'–అన్న పద్యములో మెలికలు తిరిగిన భావ మును వాలునుబట్టి లాగికొనివలసియున్నది. 'గిరినిర్ఝరవేగధారగా నూపిరి పీల్చి ఓరెముకోసర మెట్టి జంతువులను లాగగలన'ని–ఇంతకు ముందు శూర్పణఖయే ఈతనికిఁ జెప్పుకొన్నందువలన ఆ భావము మనస్సులోఁ బెట్టుకొని కావలయు ఆతఁ డీబిడను 'దూరఘూర్ణిణీ!' అని ఒక్క పిలుపు పిలిచెను. పిలుపులు, పిలుచుటలో కల్పవృక్షకర్త అందె వేసిన చేయిగదా!

ఏదో కోపము వచ్చి చుప్పనాక రుసరుసలుగా రివ్వునఁ బర్ణ శాలప్రాంతమునకు మఱలఁ బోయినదఁట. పోయి, అక్కడ–

శ్లో॥ ఏనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీం వృద్ధాం భార్యామవష్టభ్య మాం న త్వం బహు మన్యసే. అద్యే మాం భక్ష యిష్యామి పశ్యతస్తవ మానుషీం, త్వయా సహ చరిష్యామి నిస్సపత్నా యథా సుఖమ్' [ఆర_1053] శ్రీరాముని జూచి, ఏమయ్యా నీవు ఈ ముసలమ్మను భార్యగాఁ బెట్టుకొని నన్ను గౌరవింపవైతివి. ఇప్పుడే నీ కన్నులయెదుటనే ఈబిడను మ్రింగివేసి సవతిపీడ నా కిఁక లేకుండచేసి కొని హాయిగా నీతోఁ దిరిగెదను_అని కోపముతో రేఁగిపోయి సీత మీఁద పడఁబోవును. మూలములో నున్న ఈ స్వల్పమును కల్పము అనల్పముగా పెంచి పోషించి హేతువాద మెట్లు భావించెనో మనము పరిశీలింపవలసియున్నది. శూర్పణఖ మాటలు:—

'కం. నీ వంపించుటయైనది నే వచ్చుటయైన దెంత నేర్చినవారో
ఈ వెర వెటఁ జనెఁ బిన్నమ్మా వనవాసమున కంపునవసరమందున్

ఉ. తమ్ముఁడు నీదుమాట జవదాటఁ డటంచును నమ్మకంబు చి
త్తమ్మునయందు భద్రముగ దాఁచుము ముందవియేవి యాపదల్
క్రమ్మునో యట్టివేళల భరంపడి తమ్మున కప్పఁజెప్పి భా
గ్యమ్మును గాని జానకిని గాని యెటే విడనాడిపోకుమీ!

''ఎట్టివాఁ డతఁడు నుంతే భేదము – ఆతండు కాంతా! ఆ యీ పదుమూఁడు వత్సరములైనన్ స్త్రీవియోగోగ్ర బాధాయుక్తిం జనునే, వరెంపు మతనిన్ దా నీకుఁ బుణ్యంబగున్ – నా మాటగాఁగఁ జెప్పుము, సౌమిత్రియుఁ గాదునాఁగఁ జాలఁడు వాఁడున్ నీ మోహాచ్ఛేద ... సారసుఁడు సుమీ !'' అని. ఇంతలావు 'సిఫారసు' చేసి తమ్మునివద్దకు పంపించి, యిప్పుడు – ఏమి తెలియని పొలతీ! ఇంకొక్క వానికడకుఁ బోవరాదా ! అనుట ఇతరులమాట యెట్లున్నను రామయ్యకు న్యాయము గాదు. ఒకే మాట – ఒకే భార్య – ఒకే బాణము – అని రామచంద్రుని గూర్చి భారతీయులలో ననాదినుండియు ఒక విశ్వాసము ఉన్నదాయె. ఇప్పు డీ 'విశ్వనాథ' చేతిలోఁ బడి రామయ్య అందఱిలో ఒకఁడుగా 'జమ' అయినాఁడు 'కలలోనైనన్ నవ్వులకైన నినుమంత బొంకి యెఱుంగని పుణ్యమూర్తి' అయిన శ్రీరామమూర్తి కల్పములో ఈ స్థితికి దిగినాఁడు. ఆపల శూర్పణఖ, ప్రేమతత్త్వమును బోధించి, 'రతి దీనయైన వనితను దిరస్కరించెడివాని కెపుడును స్త్రీ సుఖ ముండఁబోదని' ఘంటాపథముగఁ జెప్పినది. అచ్చముగా శూర్పణఖలో 'విశ్వనాథ' ఆవేశించి ఈ మాట చెప్పె ననవలయును. ఈ మాత్రము ఆర్షకవికిఁ దెలిసినదా మఱి! ఇందెంత సత్య మున్నది. ఔరా! నానృషిః కురుతే కావ్యమ్మని పెద్ద లన్నమాట ఈ విశ్వనాథులవంటి కవిసమ్రాట్టులను మనస్సులోఁ బెట్టుకొనియే యని మన మెంచవలయును. అక్షరాల – ఇది ఋషివాక్కుగా మనము భావింపనిచో శ్రీరామునకు స్త్రీసుఖ మెందులకు లేదో ఊహింపవలె. అన్నేండ్లు ఆ యడవులలో ఇడుములు గుడిచి రావణవధానంతరము – ఏ కొన్నేండ్లో రాజ్యము చేసి అడవుల కామెను బంపి చీకాకుతో జీవించి తుట్టతుదకు సరయువులోఁ బడి తనువు చాలింపవలసిన దుర్గతి ఎందులకుఁ బట్టినట్లు! ఈ శూర్పణఖ మాటయే పెద్దవేటుగా దెబ్బగొట్టి ఒక శాపముగా పరిణమించెనోటు! ఈ దూరదృష్టి గల మాట – కావ్యార్థసూచనగాఁ బనికివచ్చుమాట రామాయణకర్తలలో నాకుఁ దెలిసినంతవఱకు ఎవ్వరినోటను వచ్చినట్లు లేదు రతి

విషయమై శాస్త్రపారంగతుఁడైన పండితకవికే ఇట్టి పట్టులలోని కీలకము తెలియఁగలదు. ఓహో! మహాజనులార! పరాంగనలని పరదార వ్యవహారమని మనస్సులోఁ బెట్టుకొని మడిగట్టుకొని కూర్చుండి పుణ్య మని యేదో చేయఁబోయె దరేమోసుమా! తప్పక చేతులార మీరు పాపములు కట్టుకొన్నట్లే కాఁగలదని మన శ్రీ కవీశ్వరులు కాంతాసమ్మిత మైన కావ్యదృష్టిలో ప్రబోధించిరి. వేలతరబడి యేండ్లుగా బ్రదికి యున్నాను అవురా! నీ యందమువంటి అందము నా కెందును కంటి కందదు. ఈ నీయంద మెల్ల ఈమెయే అనుభవింపవలెనా యేమి! నావంటి యంగనలుకూడ పంచుకొనఁగూడదా! అన్న ధోరణిలో శూర్పణఖ అన్నదని కల్పము మఱొక 'తారాశశాంకము'గా తయారై నది ఆ మాటకు పాపము! భూమిజాతకు దయపుట్టినదఁట. ఆబిడమాట లన్నియు సీతామహాసాధ్వికి సహేతుకములుగా అనిపించినవఁట. శూర్పణఖ భావించిన ధోరణికి ఈమెయు ఇంకొకధోరణిలో వంతపాట పాడినది. ఏమని! స్వామీ! నాకు స్ఫురింపలేదుగాని సర్వఋషివాటిక లందున మౌనికామినులు సైతము తీయనిదృష్టితో నిన్ను అనుమతించి నప్పుడు ఈ యమలో మాత్రము దోస మేముండును ప్రభూ! వాండ్రు అందఱు 'మనుషులు' కావున నిన్ను స్వామివంచు ఊరేగించుకొనిరి. ఈబిడ మానవికాదుకావున నేను నిన్నుఁ జూచినట్టులే ఈబిడయు నిన్నుఁ జూచుచున్నది. తప్పేమున్నది! ఇట్టిది సీతాదేవి హేతువాదము. ఇందలి 'మానవికామిన్' అన్నదానిలో సారస్య మున్నది. సీతయుఁ గేవలము మానవకాంత కాదు; అయోనిజ. ఆపై లక్ష్మికి అపరావతారము. శూర్పణఖయు మానవి కాదుగదా! అనఁగా మానవాతీత యనవచ్చును గదా! ఆపై విశ్రవసోబ్రహ్మకు బిడ్డ ఆయె. రావణబ్రహ్మకుఁ జెల్లె లాయె. సీతాదేవితో పాటు ఈమెయు రామబ్రహ్మనుఁ గోరుటలో ఆక్షేప మేముండునని సీతాదేవి హృదయములోని భావమును కల్పవృక్షకర్త ఈ తీరుగ మనకు వెల్లడించెననవలెను. ఇట్టిదే ఆయన, అనుకొన్న — అను కొన్నట్లు వినిపించుకొనుచున్న 'భావ్యఫక్కిక' అని మనము భావింప వలెను—

శూర్పణఖ అన్నమాట విని సీతకుఁ గలిగిన కనికరము గమనించి శ్రీరాముఁడు మండిపడినట్లు కల్పము మనకుఁ జెప్పుచున్నది.

'కం. ఇది జారపురుషవాంఛాస్పదవృత్తిని భర్త నక్టై చంపెద ననెడున్
ముదిసినదియుఁ గామము చావదు దీనికి సర్వ పాపభాజన మగుచున్.

వ. నేను దీనిమొగంబు చూడను దీని నవతలకుఁ బంపివేయుమని స్వామి పెడమొగమై యుండ సీత గడగడలాడ. [అర-99]

వెనుక విరాధుఁడు వచ్చి సీతను బట్టినపుడు 'పరమదైవమంచుఁ బ్రార్థించుచుంటి'నని ఆయమ్మ మొత్తుకొనుచున్నను [అర-10పుట] నిబ్బరముగా నిలిచి తమ్మునితో ఏదో కబురులలో దిగినట్లు వర్ణింపఁ బడిన ఈ కల్పవృక్షములోని శ్రీరాముడు ఇప్పుడీమె మొగము చూడ నన్నంత తీవ్రతతో సీత గడగడలాడవలసినంత అపావుడిలో ఉండుట విచిత్రమేసుమీ! భీకరాకారయై శూర్పణఖ, చంపెద నిన్నని సీత మీఁదఁ బడఁబోయినప్పుడె శ్రీరాముఁడు కుపితుఁడై నిగ్రహించి, ఓయీ లక్ష్మణా! ఈబిడ 'వ్యవహారము' ముదిరిపోయినది. దీని 'సంగతి' తేల్చవోయి అన్నట్లు వాల్మీకములోనున్న దానిని కల్పము మార్చివైచినది కల్పము చేసిన కల్పన కానిచో శూర్పణఖ తన భర్తను జంపెదనని శ్రీరామునితో అన్నట్లు విశ్వనాథ కెవ్వరు చెప్పిరి! వాల్మీకి వ్రాయలేదే! పైగా భర్తపోయినదానిని బట్టుకొని వచ్చి, ఈ యాటలాడించి, అనని దానిని అన్నట్లుగా అనిపించి, ఈ కారణముచే ఈబిడ వట్టిపాపిష్ఠ యని రామునిచే నిర్ణయింపించి, దీని మొగము చూడను బంపివేయుమని స్వాములు పెడమొగము పెట్టువఱకు కథ లాగివైచె. ముదిసినదఁట— కామముచావదఁట, అందువలన దీని మొగము చూడనని రాముని భావమా యేమి! పడుచుఁదనములోనుండి కామము చచ్చిపోయిన దానితో విశ్వనాథరాముఁడు సరసాలాడునేమి! ఈ రామున కింత క్రోధము వచ్చుటకు—తాను అవలకుఁ బోయివచ్చులోఁగా సీతమ్మ ఏదో మత్తు మందు చల్లినట్లును, చక్రము త్రిప్పినట్లును మగనిని వలలో వేసికొన్నట్లును క్రొంగ్రొత్తకల్పనలు శూర్పణఖమాటలలోఁ బెట్టి కల్పము మనకు రుచి

చూపినది 'అసలు నిజమైన రాచపడుచులు అంతిపురి వదలి ఈవల కడుగు పెట్టరు. నీ వైఖరి చూడఁగా 'దేశ-ద్రిమ్మరి'గా తోఁచుచున్నది. వట్టి అమాయకుఁడైన నీ పెనిమిటిని జిలుకనువోలె ఆడించుచున్నావే నీవు. లక్ష్మీదేవిగుణాలు నీలో రాశీభూతమై యున్నవి. రాజు లేమిటి! ఏకపత్నీ వ్రతము లేమిటి! నేనెన్నఁడు విన లేదు; కన లేదు. మాయమందు పెట్టితి వేమే భామా! నీవు. ఓహో! మీరు వేదాంతులు కాఁబోలు! మిథిలాత్మానాధుల జాతి ప్రాణాంతకమైన జాతి. ఇఁక నీవు ఉండఁగా ఈ స్వామికి సుఖమే లేదు. ఇదిగో నిన్ను నా పండ్లతో గ్రీవా దేశములోఁ బట్టుకొని 'వైయాఘ్రపుగావు' పట్టి మట్టుపెట్టెదనని' పలికి, శూర్పణఖ సీతమీదికి దూఁకెనఁట- ఇవి యన్నియు మనకు తెలుఁగుకవీశ్వరు లిచ్చిన నిగ్గు తేలిన భావాలు. ఇందులోఁ గొన్ని ధ్వనులు_వ్యంగ్యములు. లక్ష్మి చంచలకావున లక్ష్మీదేవి గుణాలు సీతలో ఉన్నవఁట. ఈమె సంచారమునకు అది - కారణమని స్వారస్యము. 'ప్రథమశాఖ ప్రాణాంతకమన్న' తెలుఁగు జాతీయమును 'మిథిలాజాతికి' ఈ కవి తగిలించెను. వారు వేదాంతులే. అది నిజమే. 'గ్రీవా దేశము'లో పట్టుకొనునఁట. గొంతు పట్టుకొని మ్రింగెదననుటకు అదనముగా 'దేశ' మొకటి ఈ కవనములోఁ దూరినది. వైశ్వానాధము కాఁబట్టి శూర్పణఖ 'వైయాఘ్రపు గావు' పట్టవలె. ఆ దెబ్బతో వైదేహి కూఁకవెట్టి నేల మీఁద వ్రాలినదఁట. [101 పు]

'రామస్య పార్శ్వతః, ఉద్ధృత్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసం మహాబలః, నికృత్తకర్ణనాసా తు విస్వరం సా వినద్య చ యథాగతం ప్రదుద్రావ ఘోరా శూర్పణఖా వనమ్' - 'రాముని యాజ్ఞప్రకారము లక్ష్మణుఁ డాయన ప్రక్కగా నున్న కత్తిని జేతఁబట్టి శూర్పణఖ చెవులు ముక్కు కోసివైచెనఁట. ఆ దెబ్బతో శూర్పణఖ అడలి పెద్దఅఱపు అఱచి వచ్చినత్రోవను బడి అదేపోకగా పోయెనఁట. ఈ రవ్వంత 'ప్రక్రియను' కల్పము ఒక యుద్ధముగాఁ జేసి పర్ణశాలాబహిఃస్థలములో కోలుకొక్కుర 'వగైరా'లతో శూర్పణఖాలక్ష్మణులు కలియఁబడిరని.

వర్ణించినది. ఈ ఘట్టములోనే 'లాటీవిటము—అసంబాధము—హాలముఖి—క్రీడ' అన్న మాఱుమూల 'వృత్తము'లలో కథ నడపించి, వెనుకటి తోలుబొమ్మలాటలను — ఈతముక్కల జంగాల 'బాగోతము'ను మఱొకసారి మనకు జ్ఞప్తి కెలయించి, చావ లేదు — చావ లేదు తెలుఁగు వెలుఁగని ఈ కల్పము మనకు బోధించినది.

కం. 'అటు లెగిరి చనిన దానవి బొటబొట స్రవియించు నెత్రుచుక్కలు మార్గ
స్ఫుటభావ మేర్పరించుచు రటదంబుదమట్లు ఖరుని రాజ్యము చేరెన్'

[అర-102]

దెబ్బ దిన్న దానవి, ఖరుని రాజ్యముచేరినది. సరేగాని, ఇచ్చట ఏర్పరించుచు—అన్న మాటకు శూర్పణఖను కర్తగాఁజేయవలెనా! నెత్రు చుక్కలు కర్తలై నిలుచునా! దానవి స్రవించిన నెత్రుచుక్కలు రటదంబుదముపోలె రాజ్యము చేరెననుటలో అందము లేదు; అర్థము లేదు. రటదంబుదమువంటిది దానవి అన్నప్పుడే 'ఉఱుములు — మెఱుపులు—వాన—గీన' స్ఫురించును. ఈ రచనను బట్టి దానవి కర్తగా సూటిగా రాదాయె. ఈ కవనమున కిట్టివి స్వభావమాయె. మన మేమి చేసెదము!! స్థితస్య గతి శ్చింతనీయా!!

నెత్తురుముద్ద యయి వికారాకారముతో నేలమీఁదఁ బడియున్న ఆ యక్కను శూర్పణఖను ఖరుఁడు చూచి మండిపడి, ఎవఁడమ్మా! నీ కీపని చేసినది! ఆ 'వెధవను' జంపెదను; వెంటనే చెప్పుమన్న ఈ ఘట్టములో-ఆతఁ డన్న మాటలలోఁగాని ఆబిడ చెప్పిన సమాధానములలోఁగాని 'వాల్మీకి - విశ్వనాథములకు హస్తిమశకాంతర మంతటి అంతరమున్నది. ఇట్టి పట్టులలో నన్నయాదులు-ఆ భాగము మొత్తము చదువుకొని అందలి సొగసులు లవలేశము పరిహరింపక తమ స్వత్వమును జతపఱిచి ఆ రచనలో ఒక విశిష్టత సమకూర్చి మన కందించినారు కావుననే వారి రచన ఇన్నేండ్లు కడచినను ఎన్ని పర్యాయములు చదువుకొన్నను నిత్యనూత్నమై వెలయుచున్నది. ఆ ధోరణి ఈ కల్పమున కెంతో దూరమైపోయినట్లు ప్రతిఘట్టములోను గానవచ్చును. మూలమునకు 'భాష్య' మన్న భావనతో ఉన్నదానికి వన్నె పెట్టుట

చేతఁగాకపోఁగా సొంత యూహాలు తెచ్చిపెట్టి సారస్యమే కాదు ఔచిత్యము మూలముట్టుగఁ జెడఁగొట్టుటయే ఈ కల్పవృత్తకర్త కలవాటయిపోయినది.

'శ్లో. కః కృష్ణసర్ప మాసీన మాశీవిష మనాగసం, తుదత్యభిసమాపన్న
మంగుళ్యగ్రేణ లీలయా. కః కాలపాశ మాసజ్య కంఠే మోహాన్న బుధ్యతే,
యస్త్వా మద్య సమాసాద్య పీతవాన్విష ముత్తమమ్.' [అర–1055 పు]

కదలని మెదలని నల్లత్రాఁచు నెవఁడమ్మా వాఁడు చిటికెన వ్రేలితో విలాసముగా చెనకినవాఁడు? తెలియక కాలపాశమును మెడకుఁ – దగిలించుకొన్నవాఁ డెవఁడంట! నిన్నంటుకొని ఇంత విషము పుచ్చుకొన్నవాఁ డెవఁడు? ఈ భావమే కల్పములో ఈ తీరుగ 'దిగుమతి' యైనది.

'ఉ. నిద్దుర పోవుచున్న యహి నిద్దుర లేపి ఫణాగ్రమందునన్
గ్రుద్దె నెవండు దాని పెనుకోఱలు గ్రక్కు విషోగ్రవహ్నికల్
ముద్దలు చేసి మ్రింగెడు విమూఢత వేనికిఁ గల్గె మూర్ఖుఁడా
గద్దరి యెవ్వఁడో విలయకాలమహాగ్నులయందు దూఁకెడున్' [అర.108].

కృష్ణసర్పమన్నమాట ఇంతలావు తెలుఁగు 'వృత్తములో' రానేలేదు. 'లీలయా – అంగుళ్యగ్రేన'–అన్న నాజూకుభావమే ఈ తెలుఁగులో మాయమై మొఱటుగా 'గ్రుద్దు'లోనికి దిగినది. అత్యంత భయంకరవిషాగ్నియని చెప్పవలసినచోట అల్పార్థమో స్వార్థమో చెప్పఁగల 'క' ప్రత్యయ మరువు తెచ్చుకోఁబడినది ప్రాసకోసము గ్రుద్దుటతోపాటు 'గద్దరికాఁడు'ను గావలసివచ్చెను. గద్దరికాఁడనఁగా – సమర్థుఁడు, దిట్టతనము గలవాఁడని అర్థముగదా! ఆ మూర్ఖుఁడు – ఆ సమర్థుఁడు ఎవ్వఁడనుటలో ఈ రెండవ విశేషణమును 'వెటకారముగా' అన్వయించుకోవలెనేమో! ఇంకను – ఆ వెంగలి యెవఁడోగాని,

సింహాసటమున్ గని యెఱ్ఱని గడ్డియంచు లాగంగను లేకపోయెన!
నికామము త్రోసుక వచ్చె వానికిన్' — 'సట' – ఆకారాంత స్త్రీలింగము.

'శిఖా చూడా కేశపాశః వ్రతినస్తు జటా సటా
సటతీతి సటా - అమరము'

'సట' యని దేశ్యముకూడ ఉన్నదికాని, దాని కర్థము కపటము. మన కిప్పుడు కావలసినది జూలు. సటమున్ గని - అన్న దానిని సటలున్ గనిగా మార్చుకొన్నచో సందేహామే లేదు. 'త్రోసుక వచ్చె' ననుటలో మృత్యుదేవత నెట్టుకొనివచ్చెనన్న 'జాతీయత' స్ఫురించు మాట నిజమైనను 'త్రోసుక'లో చ్యుతసంస్కార మున్నది

చం. 'మొగి బహుకాలమై యనుభూతము మాకు నెవండు నెగ్గుసే
త గుడుసువారి యెవ్వఁడొ విధాతృవరంబులు పొంది క్రొత్తక్రొ
త్తగఁ దొలిపొంగు నోర్చుకొనఁ జాలక దుష్టుఁడు చేసెఁగాని యి
ట్లుగ మఱి తా నదేమి యగుటో యొకయించుక యెంచఁజాలఁడే.

చం. ఇది దనుజాళ్ పొనర్చు పని యెప్పుడు కాదు మనుష్యులే పొన
ర్పఁ దగు మనుష్యులన్ దిననివారల క్రౌర్యమ యిట్టు లుండు నీ
వు దినవు ప్రాణిఁ జంపెదవుపో యిటు క్రౌర్యము చూప విట్టి క్రౌ
ర్యదశకుఁ దానుఁ బొల్పదు నరాధముఁ డన్నముం గానిచోటులన్'[1048]

మొగి - పూనిక; గుడుసు-కపటము; ఎగ్గు - కీడు. ఇక, ఈ పదముల అల్లికలోని సొగసు చూతము. ఎవఁడైనగానీ మాకు పూనికతో కీడు చేయుట అన్నది అనుభవించి ఎంతోకాలమైనది. అనఁగా ఇటీవల చాలకాలమునుండియు మాకు అపకారము చేయఁగల వాఁ డున్నాఁడనుటగానీ, మేము అనుభవించుటగానీ యెఱుఁగనే యెఱుఁగము. కపటముతో ఎవ్వఁడోగాని బ్రహ్మావరము పొంది ఆ తొలిపొంగు ఓర్చుకోలేక తరువాత తా నేమియగునో యని ఊహించు కోలేక ఇంతపని చేసియుండును! ఈ సొగసులో విజృంభించి ఖరాసురుఁడే మైన తనజోలికి వచ్చునేమో అని భీతుపుట్టి కాఁబోలు, మూఁడవ పాదములో యతీశ్వరుఁడు అంతుపొంతు లేకుండ అమాంతము మాయమైపోయినాడు. ఇక్కడ ఒక మంచి హేతువాదముతో ఒక కొంగ్రొత్తయంశముకూడ వింటిమి :-ఏమని !

ఈ ముక్కు చెవులు కోయునట్టి నీచమైన పని దనుజు లెన్నఁడును జేయరు. మనుజులే ఇట్టివి చేయుటలో దిట్టలు, ఎవ్వరు మనుష్యులను దినఁజాలరో వారు చూపెడి - చేసెడి క్రూరకర్మము లిట్టులే యుండు నట! ఇదెక్కడివబ్బా క్రొత్తనార్త? పైగా నీ వేమో ప్రాణులను జంపెదవుగాని పొట్టనుబెట్టుకోవైతివి; ఇట్టి క్రౌర్యములు చేయవైతివి. అట్టి నీవిషయమై ఎవఁడమ్మా వాఁడు ఇట్టి క్రౌర్యదశకు పాల్పడి నాఁడు! పైగా ఆ నరాధముఁడు 'అన్నము గాని చోటులన్-' ఇఁక పద్యము లేదు. కాని ఈ ముక్కను పైకి లాగి చూతము. 'ఆ నరాధముఁడు - అన్నముగాని చోటులన్ ఇట్టి క్రౌర్యదశకుఁ దాను పాల్పడును' అని అన్వయమేమొ! అన్నముగాని చోటులనఁగా ఏదో ఉన్నది పెద్దభాష్యము'! ఆ కోసిన నాసికగాని చెవులుగాని అన్నముగా అనఁగా ఆహారముగా ఉపయోగింపఁదగినవి కావనియా! లేక 'కోడి-గొఱ్ఱె' వంటివానిని తినుటకుఁగాని యాగార్థముగానీ మంత్రించి చంపుటలో పాతకము లేదనియు వృథాగాఁ జంపి అవలపాఱవేయుట పాపమనియు 'యాగాల' వారు 'బిసిమిల్లా' మతమువారు వ్యవహరించు ధోరణియా!

వ. 'అని శూర్పణఖను లేవఁదీయుచు
లేవఁదీసి మఱల ఒక పద్యము చెప్పి;

వ. అని కూర్చుండఁబెట్టె' నఁట. లేవఁదీసినపుడే కూర్చుండఁ బెట్టినచో ఆబిడకు ఆదుర్దశలో ఏమైన ఇబ్బంది ఉండుననియా! లేక పద్యగద్యముల సంఖ్యకు పనికివచ్చుననియా! వాంఛ్ర విషయమై చెప్పవమ్మా చెప్పుము.

'నినువంటిదానినే, గాడగఁ జేసినట్టి బలగర్వితు లీ వనమందు నున్కియున్
గూడద యల్పరాక్షసులకున్ బెనుసేగి ఘటించువారలై' [104]

నీవంటిదానినే ఇంతపని చేసిన ఆ కాలాంతకులు ఈ కాంతార మందున్నచో సన్నకారు రాక్షసు లిఁక బ్రతికెదరా! అని భావము. కూడదు + అ-కూడద→ఉండుట కూడనేకూడదన్న క్రియ వచ్చిన పిదప,

'ఘటించువారలై' అన్నమాటకు అన్వయము లేదు. కాని ఈ కవన ములో పూర్వులు చెప్పిన కావ్యదోషముల మాట స్మరింపక వీరు చెప్పిన ధోరణిలోనే మన మీ కథనుగాని సారస్యమునుగాని గ్రహింప వలసియుండు. ఈ వనమందు .......ఘటించువారలై ఉన్కియున్ గూడద — అని దీని సరణి.

ఈ తీరుగ ముక్కు చెవులు కోయుట దనుజుల పనికాదు; మనుజుల పనియే యని ఏదో క్రొత్తసిద్ధాంతము ఖరుఁడు తెచ్చి ప్రశ్న వైచినట్లు కల్పము వ్రాయఁగలిగినదేగాని మూలములో ఈ ఘట్ట మందున్న అంశములను స్పృశింపనైన స్పృశింపలేదు. అంతటి బల విక్రమసంపన్న-కామరూపిణి ఇంతటి పరాభవము పొంది తన కట్టెదుట వలవల ఏడ్చి విలవిల తన్నుకొనుచున్న దృశ్యమును జూచిన తరుణ ములో—ఆ ప్రాంతమున కేకచ్ఛత్రాధిపతియైన ఖరుఁడు తన యూర్ధత్య మెట్లు చూపవలెనో, అంత బ్రదుకు బ్రదికిన అక్క నెట్లు ఆదరింప వలెనో—ఆ ప్రమేయమే కల్పము ఊహింపలేదు. మూలములో నున్న ఒక్క కృష్ణసర్పముమాట — అదియు 'అహి' పేరట నిద్దురలు — గ్రుద్దుటలు — ముద్దలు ఇత్యాదిధోరణిలో కొంత అనువాదమునకు వచ్చినదికాని ఖరునినోట వచ్చిన వీరవాక్యములుగాని ఊరడింపులుగాని ఇందు మున్ముందునకైనఁ గానిపింపవు 'శ్లో. ఇమా మవస్థాం నీతా త్వం కేనాంతక సమాగతా. దేవగంధర్వ భూతానా మృషీణాం చ మహాత్మనాం, కోఽయ మేవం విరూపాం త్వాం మహావీర్యశ్చకార హ న హి పశ్యామ్యహం లోకే యః కుర్యాన్మమ విప్రియం, అంత రేణ సహస్రాక్షం మహేంద్రం పాకశాసనమ్......ఉపలభ్య శనైః సంజ్ఞాం తం మే శంసితు మర్హసి యేన త్వం దుర్వినీతే న వనే విక్రమ్య నిర్జితా' [అర-1056]

'అక్కా! నీ బలవిక్రమము లింతయంతయని చెప్పలేమే. నీ యిష్టము వచ్చిన వేషముతో ఎక్కడికైనను బోఁగలదానవు. అట్టి నీకీ దురవస్థ యెందులకు వచ్చినట్లు? ఎవఁడు చేసినట్లు? ఈ ప్రాణికోటిలో వాడెవ్వఁడు ? దేవతలలోనివాఁడా! గంధర్వజాతివాఁడా! ముని

సంఘమువాఁడా! ఈ లోకములో నా కప్రియము చేయఁగల మొనగాఁడు పుట్టనే లేదే. పాకాసురుని సంహరించిన సహస్రాక్షుఁడుసైతము నా జోలికి రాఁడే. ఎవఁడమ్మా వాఁడు! వాఁ డెక్కడనున్నను సరే వాని ప్రాణాలను నీళ్ళలోఁ గలిసిన పాలను హంస త్రాగివైచునట్లు నా బాణాలతో తోడి వైచెదను నాబాణాలకు వాని ప్రాణాలు నిజచుట కల్ల. నురుగు దొప్పలతో పరువులు త్రోలు వాని నెత్తురుచేరును ఈ భూమి త్రాగవలసియున్నది. పక్షులు గుంపులు గుంపులై వాని కళేబరమును జీల్చిచెండాడి తినవలసియున్నది. వానిని గాపాడఁగల దిక్కే ఉండదు. ఎవఁడమ్మావాఁడు! వానిజాడచెప్పవమ్మా! ఈ దండకలో వాఁడింతపని చేసెననఁగా ఎంత ఘోరము!! నెమ్మదిగా తెలివితెచ్చుకో! గుర్తులు చెప్పు. వాని 'సంగతి తేల్చెదను' ఇట్టివి ఆ యాపదలో 'ఆర్చుటకు తీర్చుటకు' అర్హత గల తమ్ముఁడు అక్కతో అనవలసిన మాటలు. ఈ మాటలు కట్టిపెట్టి నిబ్బరముగా ఆ తమ్ముఁడు–ఏ వేవో లోకాభిరామాయణము లెత్తుకొన్నట్లు వ్రాయుటలో సందర్భశుద్ధిగాని ప్రాతౌచితిగాని కానరాదు.

ఇఁక వారెవ్వరో శూర్పణఖ, తమ్మునకుఁ జెప్పవలె.

కం. 'వా రన్నదమ్ము లిద్దఱు వారలలోఁ బెద్దవాని భార్యయు విద్యు
ద్ధారాశరీరలత సంసారార్ణవతరి, కృపారసపయోనిధియున్

కం. అల్పపుమనుధర్మవిధాజల్పాకులు నగ్నిహోత్రసాంయాత్రికులున్
కల్పాంతవహ్నిరేఖాకల్పులు వారలను నన్నగా రతఁడన్నన్' [అర–16

వెనుక, 'వగలమారినదానా! నీ మగనికి మందు పెట్టితివే. అంత మంచివాఁడు రవ్వంతలో మాఱిపోయి నా కపకారము తలపెట్టెనే' అని శూర్పణఖ స్వయముగా ఎవరిని దిట్టిపోసి మీఁదమీఁదికిఁ బోయెనో ఆ సీతాదేవినే ఇప్పుడు తమ్మునిపద్ద 'కృపారస పయోనిధి' అనవలసివచ్చుటకు హేతు వేమై యుండును. పైగా కసిదీఱఁ జెప్పవలసిన చోట ఆ యమ్మ మంచిదని చెప్పుటలో ఇఁక అంతరార్థము లాగవలెను. వారలను=వారిలో, అన్నగారు–అతఁడు=అన్నగా రున్నాఁడే అతఁడు. అన్నన్–అనఁగా అని పైపద్యములోని కన్వయము.

'వ. వారి నామములు రామలక్ష్మణులు భార్య వైదేహి'. ఇది యొక వాక్యము; రామలక్ష్మణులు ఇరువ్వురుగదా! ఆ వెంటనే భార్య యనఁగా, వారిలో ఎవ్వరి భార్య వైదేహి యని మనకు సందేహము కలుగకున్నను ఖరునకైనఁ గలుగవచ్చునుగదా! పెద్దవాని భార్య కృపారసపయోనిధి యని చెప్పలేదా! ఆమెయే ఈమె గావున పెద్దవానికే ఈమె భార్యయని ఊహింపరాదా! యనవచ్చును. కాని ఈ ఘట్టములో తమ్ముని భార్య ఇక్కడ లేదనికాని ఈ వచ్చినవారు మువ్వురనిగాని ఇంతవఱకు కల్పము చెప్పలేదు. అక్కఱలేనివి మూలములో చెప్పనివి 'పినతల్లి పంపుటలు – కాంతారావాసమునకు వచ్చుటలు – వచ్చి పద మూఁడేండ్లగుటలు – అన్నదమ్ముల నలుపు – ఎఱుపులు మాత్రము ఈ కల్పము శూర్పణఖచేత తమ్మునకుఁ జెప్పించినది.

'కాంతారావాసము చేయఁగ
వారిచ్చటికి రాక వచ్చి పదమూఁడేండ్లే' — ఇది పద్యపాదము.

ఇచ్చటికి రాక–ఇచ్చటికి వచ్చుట, ఇదిమాండలిక ప్రయోగము. పదమూఁడేండ్లై–అన్నమాటకు సమాపకక్రియ అక్కఱలేదా! పూర్వాపరములలో ఎక్కడను దొరకదు. దొరకకుండ ఈ ప్రయోగము నిట్లు ప్రయోగించుటయే ఈ కల్పకర్త కొక రివాజు. అది యొక గొప్ప ప్రౌఢియని తచ్ఛిష్యుల బూకరింపు.

'దుష్యఖుఁడనువాఁడు ఖరునితో ఇట్లనియె'... [అర. 106 పు]

స్వరము ననుసరించి వ్రాఁతలోఁ గనిపింపవలసిన 'అఱసున్న' ఈ కల్పములో పంక్తికి ప్రారంభాక్షరమగుటయు పరిపాటియైపోయెను. శ్రీరాముని నరజాతివిప్రు లెవ్వరో [106 పు] నుతించిరని వార్తామంత్రి, ఖరునితో అన్నట్లును – అతఁడే శ్రీరాముని 'వర్మ'! యని పిలిచి నట్లును [107 పు] కల్పవృక్షము వ్రాసినది. ఈ జాతులు – విప్రులు కేవలము నరులలోనే గాదుసుమా సర్వలోకములలో సర్వజాతులలో ఉన్నారన్న వింతవార్తయు నేఁటికి మనకుఁ దెలిసినది. దీనినిబట్టి ఈ కల్పవృక్షకర్తకు ఏడు – ఏడు పదునాలుగులోకాలలోను చాతుర్వర్ణ్య

వ్యవస్థ స్థిరమై ఉండియుండునన్నంత చరిత్రజ్ఞానము కుదిరినందులకు మెచ్చుకోవలెను. ఆ దృష్టితోనే రామపరబ్రహ్మమునుసైతము 'వర్మ' యని పిలిపింపఁగలిగెను. ఇంతటి సనాతన చరిత్ర పరిజ్ఞానమునకు అనువుగ అధునాతనవైఖరి కూడ ఈ కల్పవృక్షకర్త లెస్సగఁ దెలిసినవాఁడు కావుననే పాపము! ఈ మహాకావ్యము ప్రారంభదశలో 'కలిలో దైవము లేఁడు భూసురులనంగా ద్వేషమై పోయె నీతెలుఁగున్నాఁట మఱీ విచిత్రమయి' అనఁగలిగెను. ఇట్టి పాపిష్ఠమైన కలికాలములోని 'కాలుష్యమును' ద్రోచివైచుటకే ఈ మహాకావ్యమును దాను దెనుఁగులో వ్రాయవలసివచ్చినదన్నట్లును సూచింపఁగలిగెను. అవురా! ఎంతటి మహానుభావుఁడు తెలుఁగువారికి కవిసమ్రాట్టుగా లభించెను. అందులకే ప్రాచీను లనియుందురు-ఏమని! 'నా నృషిః కురుతే కావ్యమ్'-అని.

శూర్పణఖ కష్టవార్త విన్నంతనే ఖరుని పంపున - ఆతని చతుర్దశానీకినీపతులును రివ్వున రాముని పర్ణశాలకు వచ్చిరి. అక్కడ వారిలో దుర్ముఖుఁడన్నవాఁడు '...ఇవి యేటిమాటలో

వర్మ! వెలంది నిన్ వలచివచ్చినదే యను నీవు కాదనన్
దుర్మద వృత్తి నేదయిన దోసము చేసెన యన్మ క్రూరతా
కర్మకుఁ గొంచనట్టి మతికాక ప్రసన్నమతుల్ పొనర్తురా!

చం. తమి పెనుపైన నూరకొనె దానవి మిమ్ముఁనువంటి నూర్వరన్
నమలఁగలట్టి దీ యతివ నాయమె యయ్యది దైత్యరాజు స
త్యము వచియించె దైత్యుల మహా! పొనరింపము యిట్లు మాకు న
న్నముఁ బ్రియమూరఁ జంపెద మనాథమనుష్యతి యిట్లు చేయుటల్'

అని రాముని ప్రశ్నింపఁగా ఆతఁడు పాపము నిరుత్తరుడైనాఁడఁట [107 పు] 'ఈ వెలంది, నిన్ వలచివచ్చినదే యను' - అని దుర్ముఖుఁడు రామునితో అన్నాఁడని కల్పము మనకుఁ జెప్పుచున్నది. ఈ వెలంది రాముని వలచినట్లుగా ఈ దుర్ముఖున కెవరు చెప్పిరి! దుర్ముఖుని బంపిన ఖరునకే ఈ వార్త తెలిసినట్లు కల్పములో లేదే. తన 'ఘోష' తమ్మునకుఁ జెప్పుకొన్న ఘట్టములో సైతము ఆయమ్మ ఈ

మాట అన్నట్లు ఈ రచనలో కానరాదే. కాఁగా – ఆబిడ ఆ యేడ్పులోఁ జెప్పిన చివరిమాట ఇది :–

శా. 'నా కబ్రంబుగ నున్న దే విధమునన్ నన్నేలకుం ద్రోచెనో
నాకై జంటను బిగ్గఁబట్టెనొ మతిన్ నా నాసికం గోసెనో
చీకాకై యెఱుఁగంగ నేరను దటిచ్ఛీఘ్రక్రియావంతుఁడై
యా కోఁతింబలె నున్న లక్ష్మణుని దౌరాత్మ్యం బసహ్యంబుగా.' [106]

ఇంతే. ఆ కోఁతి 'వెధవ' లక్ష్మణుఁడు తన్ను నేలమీఁద పడఁగొట్టుటగానీ రెండుచేతులు గట్టిగా బిగించి ముక్కు కోయుటగానీ (చెవులమాట పద్యములో పట్టలేదు.) ఆ చీకాకులో నాకుఁ దెలియనే తెలియలేదని ఆబిడ తమ్మునితో అన్నట్లు కల్పమున్నదేగాని 'ఈ కారణమువలన ఈ కార్యము జరిగినది' – అని సూచనగానైన ఆబిడ అన్నట్లు చెప్పని ఈ కావ్యములో, ఇప్పుడు – ఈ వలచినమాట దుర్ముఖునినోట అనిపించుటలో 'వాస్తవికత' లేదు. అసలు కథాతంతువులో, వంపులు తుంపులు లేకుండ సూటిగా వ్రాయుటలో ఈ కల్పకర్తకు చేతఁగాదనుట కెన్నో తార్కాణము లిందున్నవి.

'శ్లో. తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా, దృష్టా తత్ర మయా నారీ తయోర్మధ్యే సుమధ్యమా తాభ్యా ముభాభ్యాం సంభూయ ప్రమదా మధికృత్య తాం, ఇమా మవస్థాం నీతా హం యథాఽనాథాఽసతీ తథా' [అర. 1060]

వారిర్వురి నడుమ ఒక అందగత్తె ఉన్నది. ఆబిడనుబట్టియే ఆ యిద్ద ఱేకమై నన్నీపని చేసినారని వాల్మీకి చెప్పిన చక్కని 'సూచనను' ఈ కల్పవృక్షకర్త రేఖామాత్రముగనైన వ్రాయలేక దుర్ముఖుని నోట ఈ కూఁత కూయించుటలో అర్థము అందము లేనేలేదు. వెలందినిన్ వలచివచ్చినదే అనుకో! నీవు కాదనఁగా ఆబిడ ఏదో దుర్మదవృత్తితో దోసమే చేసెనే అనుకో! నీ వెందులకీ 'కర్మ'కు దిగితివి! ప్రసన్నమతులు ఈ పని చేసెదరా!' ఇది దుర్ముఖుని వాదములోని ఎత్తుగడ.

"అన్నముఁ బ్రియమారఁ జంపుటయె' దైత్యుల యాచారమఁట. ఇది యొక వింత భావము; వింత ప్రయోగమును.

పదునాలుగుమందికి శూర్పణఖ దారి చూపఁగా అందఱు రాముని పర్ణశాలకు వచ్చినట్లును ముందుగ శూర్పణఖ 'శో' యని కూసి రామలక్ష్మణులను బిలిచినట్లును — వెంటనే బయటికి వచ్చిన రామునితో 'ఇరుగో మా సేనాపతు లరుదెంచిరి. నీవు చేసినది చెప్పు' మని ఆబిడ అన్నట్లును, రాముఁడు నవ్వి 'నేను జేసిన దేమో నీ మొగమే వచింపఁజాలునని' సమాధాన మిచ్చినట్లును, వెంటనే దుర్ముఖుఁ డందుకొని వాదమునకు దిగినట్లును కల్పము, కథ మార్చినది. చేతిలో బలమున్నవాఁడుసైతము వాదములో హేతువు చూపి మఱి ముందునకు దూకుట నైజముగదా! ఈ యుద్ధమునకు ముందు ఎత్తుగడలోనే 'వాల్మీక — కల్పములకు' హస్తిమశకాంతరమంత భేద మున్నది. ఆ వచ్చిన మూఁకను జూచి, శ్రీరాముఁడు సీతకుఁ దమ్ముని గావలిగా నుంచి ధనువు చేతఁబట్టి వారి వద్దకు వచ్చి ఈ మాట అనును:—

'శ్లో. పుత్రౌ దశరథస్యావాం భ్రాతరౌ రామలక్ష్మణౌ, ప్రవిష్టౌ సీతయా సార్థం దుశ్చరం దండకావనం, ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ, వసంతౌ దండకారణ్యే కిమర్థ ముపహింసథ! యుష్మాన్ పాపాత్మకాన్ హన్తుం విప్రకారాన్ మహాహవే, ఋషీణాం తు నియోగేన ప్రాప్తోఽహం సశరాయుధః. తిష్ఠతైవాత్ర సంతుష్టా నో పావర్తితు మర్హథ, యది ప్రాణై రిహార్థో వా నివర్తధ్వం నిశాచరాః'

[అర—1062]

'ఓ రాక్షసులారా! మేము దశరథమహారాజు బిడ్డలము. నేను రాముఁడను. మా తమ్ముఁడు లక్ష్మణుఁడు. నా భార్య సీతతోఁగూడ ఈ దండకారణ్యమునకు వచ్చి ఏవేవో కాయగసురులు తినుచు తపస్సు చేసికొనుచు కాలక్షేపము చేయుచున్నాము. మా జోలి మీ కెందులకు! ఎందులకు మమ్ము హింసింపవలెనని పూనుకొంటిరి! పాపాత్ములైన మిమ్ముల నందఱను యుద్ధములోఁ జంపివేయవలెనని మహర్షులు మా

కాజ్ఞ యిచ్చిరి. అందువలన ధనుర్ధరులమై ఇక్కడికి వచ్చితిమి. మీరు యుద్ధమే చేయఁదలఁచితిరా సిద్ధమై ఇటు రావచ్చు. ప్రాణాలు తీపిగా మీకుఁ దోఁచెనా మీదారిని మీరు పాఱిపోవచ్చు—' ఇది ధీరోదాత్తుఁడగు వాల్మీకి రాముని హెచ్చరిక. ఇక కల్పములోని రాముఁ డేమనుచున్నాఁడనఁగా—

శా. 'ఓ సేనా పతులార! మీరు చని మీ యుర్వీపతిం జెప్పుఁ డా
యాసం బేటికి సర్వరాక్షసుల సంహారమ్ము గల్గంగ నే
మీ సంతోషమె దైత్యులున్ మునుల సామీప్యంబు పోరాదు త
చ్ఛ్రీసంపాదితయజ్ఞకర్మల కొఁగిన్ క్షేమంబు నిత్యంబుగాన్.

ఉ. వింజము దక్షిణంబునను బృథ్వి విశాలముగాఁగ నున్న దిం
దుం జను మీరు దైత్యులు మునుల్ వసియింపఁగఁ జాలినంత ధా
త్రిం జనియించు దుంపలు ధృతిం దినవచ్చు ఫలాళి దున్నకో
నుంజను భూమి కాదనినసుం వనజంతువు లున్న వా పయిన్

కం. దైత్యులు మునులం దినియెడు మత్యధమత యేల కర్త మానిజనతపః
స్తుత్యక్రియ మీదునధోగత్యుగ్రత కాక యేల గాసిం బెట్టన్

మ. కొనుఁడీ! రాజసహోదరిన్ జెవులు ముక్కుంగోఁత మేలయ్యె నం
దున మీరిచ్చటి కేగుదెంచితిరి మంత్రుల్ పోయి మీ రాజుతో
ననుఁడీ మానుల జోలికిం జనఁగ దైత్యశ్రేణి యంగీకరిం
పను నా కట్టడి యిద్ది యొప్పుకొనినన్ వైరంబు లేదింతయున్.

చం. భరతుఁడు భూమిరా జతనిపంపున వచ్చితి నేను రాముఁడన్
ధరణియుఁ దమ్ముడున్ దశరథక్షితినాథుని పుత్త్రి లేము నా
భరతుఁడు సర్వధర్మపరిపాలనతీక్ష్ణుఁడు దైత్యజాతికిన్
ధరపయి నిల్చుకోర్కి కలదా మును లగ్నులు సుష్ఠు గావలెన్

కం. ఒక యాట దాని చెవులున్ ముకుపుటముం గోఱకు వగవఁబోకుఁడు దితిజ
ప్రకరంబు సర్వనాశనమకటా! చేసికొననేల యల్పుపుఁబనికై' అని.

పై హెచ్చరికలో వాల్మీకి మన కొక బ్రహ్మర్షిగా ప్రతిబింబించుచున్నాఁడు. మేము 'ఫలాని' వారి బిడ్డలము. మా ప్రవర్తన మిది. మా దీక్ష ఇట్టిది. మా జోలికి మీరు రావలదు; వచ్చితిరేని

చచ్చెదరు'—అని ఒక క్రమములో శ్రీరాముఁడు చెప్పినట్లున్న ధోరణిని వంకరటింకరగా నోటికి వచ్చినట్లెల్ల వైశ్వనాథము మార్చుటలో అందము లేదు చందము లేదు. వింధ్యకు దక్షిణాన విశాలమైన పృథ్వి యున్నదఁట. అందు దైత్యులు ఉండి, దుంపలు గింపలు దిని బ్రదుక వచ్చునఁట. పొలము దున్నుకోవచ్చునఁట. ఆపైని కాదనినను వనజంతువు లున్నవఁట ఇది వైశ్వనాథములోని శ్రీరామాజ్ఞ. కాదుకాదు; రాముని నోటితో విశ్వనాథులవారు సెలవిచ్చిన శ్రీముఖము. ఓరోరి! అధమ రాక్షసజాతులారా! 'వింధ్యహిమాచలయోర్మధ్యము' ఆర్యావర్తము రా! అది వల్లమానిన పుణ్యభూమి రా. అందులో మీ జాతి ఉండ రాదు 'దక్షిణాది'కి పొండు. ఇక్కడ ఉండవలసిన పుణ్యజాతులు వేఱు రా! అని 'ఆర్య|ద్రావిడ' కథలు కల్పముముఖాన మనకు జ్ఞప్తి కెల యింపవలసియున్నది. మునీశ్వరుల యాగములలో రాక్షసులు అల్లరి యాగములు చేసినట్లు వారివారి 'కర్మకాండ'లకు విఘ్నములు కావించు నట్లు హెచ్చుగా పురాణకథలలో మనము వినుచుందుము. 'మునులం దని యెడు మత్స్యధమత' దైత్యుల కున్నట్లు కల్పము చెప్పుటలో ఆధారము లేదు వాతాపివంటి వ్యక్తులలో శాపగ్రస్తులైన జీవులో ఈ పని ఒకవేళ చేసియున్నట్లు కథ లున్నను దైత్యసంఘము మునిసంఘమును అచ్చముగా భక్షించునట్లు వినలేదు. ఇఁక వాక్యప్రయోగసౌభాగ్యము చూడవలె.

ఓ సేనాపతులారా! మీరు చని యుర్వీపతిం జెప్పుఁడు. ఆ యాసం బేటికి! సరే! 'సర్వరాక్షసుల సంహారమ్ము గల్గంగనే మీ సంతోషమె!! ఈ ప్రయోగమున కర్థమేమై యుండును? 'సర్వ రాక్షసులను జంపినపుడే మీకు సంతోషమా యేమి! అనఁగా మీ యందఱను జంపినఁగాని మీకు తృప్తి లేదా యేమి'అని మన మనుకొని తృప్తిపడవలెనా! యజ్ఞకర్మలకు ఒగిన్ సేమంబు, నిత్యంబుగా నిత్య మగునట్లుగా, దైత్యులున్ - దైత్యులును (మీరు) మునుల సామీప్యంబు పోరాదు. వాండ్రు, మునుల సమీపమునకుఁ బోయిరేని

వారి యజ్ఞకర్మలకు సేమము లేదని కవిభావము. అనుకొన్న భావము సూటిగాఁ జూపలేని కవనము ఒక కవనమా!

'మీరు చని మీ యుర్వీపతిం జెప్పుఁడు' - ఇట్టి కారకముల కాకర మీ కల్పమని వెనుక ముచ్చటించుకొంటిమి. నచ్యర్థాముఖ్య కర్మమునకు 'తోడ-కు' వర్ణకములు ప్రాయికముగ వచ్చునని తెలుఁగు వ్యాకరణములు చెప్పినవి. అనఁగా ఉర్వీపతితోడ-చెప్పుఁడు; ఉర్వీపతికిఁ జెప్పుఁడు. అని యుండును. ప్రాయికమనుటచే ఒకానొకచో ద్వితీయయు నగునని ఎంతో కట్టుదిట్టముతో వివరణము చేయఁగా, ఆ ద్వితీయలోఁగూడఁ 'గూర్చి' మాత్రమేసుమా ఉండవలసినది అని వ్యాఖ్యాతలు వివరించిరి. కాఁగా 'ఉర్వీపతితోడ-ఉర్వీపతికి-ఉర్వీపతిని గూర్చి' అన్నవే ఈ కారకములో ఉన్న రూపములని పెద్ద లందురు. "సంయమీంద్రుఁ బలికె-విశ్వభూవరుఁ డొక యింతిఁ బలుకుటయు'అని పూర్వప్రయోగములు ఒండో-రెండో ఉన్నంతమాత్రాన కల్పమువోలె మనము బాహాటముగా ఇట్టివానిని ప్రయోగింపరాదు. ప్రయోగించి కారకములోని తెలుఁగుఁదనమును స్వత్వమును జంపుకొనరాదు. మీదునధోగతి-యజ్ఞకర్మలు-అనినను-అందున (అందువలన అన్న అర్థములో)-మునులగ్నులు (మునులయగ్నులు) పుత్త్రిలేము (పుత్త్రిల మేము) (ఏమునాభరతుఁడు ఏమున్+ఆ-భరతుఁడు) ఇట్టివి ఈ కల్పము నకు క్రొత్తవి కావు

'మంత్రుల్ పోయి మీ రాజుతో నను(డీ మానుల జోలికిం జనఁగ దైత్యశ్రేణి యంగీకరింపను - ఈ కూర్పులో సాగనుచూడ వలెను. ఓ మంత్రులారా! మీరుపోయి మీ రాజుతో దైత్యశ్రేణి మానుల జోలికిం జనఁగ అంగీకరింపను - అనుఁడు. అంగీకరింపనని అనుఁడు అని మనము అనుకొనవలెను. కొనుఁడీ రాజ సహోదరిన్= ఖరమహారాజు తోబుట్టువైన ఈ శూర్పణఖను కొనుఁడు - అనఁగా తీసికొని వెళ్లుఁడు అని అర్థము కాఁబోలు!

'భరతుఁడు భూమిరాజు'... పద్యములోని అన్వయసౌభాగ్యము నొకసారి చిత్తగింపుఁడు:—

భరతుఁడు భూమిరాజు — మా దేశమున కిప్పుడు భరతుఁడే రాజు. భూమిపతులు — భూపతులు, రాజులు — రారాజులు ఉన్నారు గాని 'దేశిరాజు — బట్టురాజు'వోలె 'భూమిరాజు'ను ఇంతకు మున్ను గ్రంథాలలోఁ జూడలేదు. సరే — అతని పంపున — ఆతని యాజ్ఞచే — అనఁగా కైకేయివరముచేఁ గాఁబోలు — వచ్చితిన్ — నేను వచ్చితిని. నేను రాముఁడన్ — నా పేరు రాముఁడు. తరుణియు — ఆఁడుదియు లేదా — భార్యయు తమ్ముఁడున్ — తమ్ముఁడును — ఇంతే, ఈ రెండు పదములకు అన్వయ మిఁక లేదు. ఏము — మేము, దశరథక్షితినాథుని పుత్త్రులు — దశరథమహారాజు పుత్త్రులము. ఆ భరతుఁడు లేక —నా భరతుఁడు, సర్వధర్మపరిపాలనతీక్ష్ణుఁడు (అచ్చులో ఉన్నది తీక్ష్ణుఁడు) కావున, అని అధ్యాహార్యము దైత్యజాతికిన్ — రాక్షసజాతికి, ధర పయి — భూమిమీఁద, నిల్చుకోర్కి — బ్రదుకవలెనన్న కోరిక, కలదా!— ఉన్నదా ! (ఉన్నచో అని ఊహింపవలెను) మునులగ్నులు— మునులు అగ్నులు అనిగాని, మునులయొక్క అగ్నులని కాని, సుష్ఠు — సరిగా, చక్కఁగా, కావలెన్ — కావలయును. మునుల యగ్నులు సరిగా ఉన్ననాఁడే రాక్షసులు నాలుగు కాలాలు బ్రదుకుదు రఁట. పృష్ఠతాడనాద్దంతభంగః. మునులు అగ్నులు చక్కఁగా ఉన్నచో విశ్వకల్యాణము జరుగునని చెప్పినను సొగసుగా నుండెడిది. అసలు — కవివివక్ష ఇది కావచ్చును:— 'ఓరి ! 'వెధవలారా'! మీరు నాలుగుకాలాలు భూమిమీఁద ఉండవలెనన్న కోరిక మీ కుండెనేని మునులజోలికి — వారి యగ్నుల జోలికి పోకుండ, వారు హాయిగా ఉండునట్లు, వారి యగ్నులు చక్కఁగా సాగునట్లు చేయుండోయి' అని. మునీశ్వరుల యోగక్షేమములో శ్రద్ధ చూపిన ఈ కవీశ్వరుఁడు, తన మనస్సులో ఉన్నదానిని నలువురకుఁ జెప్పఁగల రచన చేయుటలోఁ గూడ శ్రద్ధ చూపినచో ఉభయులకు మేలు కలిగెడిదిగదా ! 'పుత్రౌ

దశరథస్యావాం భ్రాతరౌ రామలక్ష్మణౌ' — ఈ చిన్న యంశము ఆ వచ్చిన శత్రువులతో ఎప్పుడు చెప్పవలెనో అట్టి ప్రసంగౌచిత్యము కల్పములో కనుమరుగైపోయినను, 'కనీసము'—మేము దశరథుని బిడ్డలము—రామలక్ష్మణులము, అని ముద్దుగా ఒక్క-చోట ఒక్క- పద్యములోనో గద్యములోనో చెప్పఁగూడదా ! ఒక 'యాటదాని చెవు'లఁట. గ్రాంథికభాష అని పేరు పెట్టినపుడు దాని లక్షణములన్నియు పాటింపవలెను ఉచ్చారణములో ఉపకరింపని అఱసున్నలు వ్రాఁతలో ఎందుల కన్నవాదము దేశములో ఉన్నను, అఱసున్నలు పాటించినట్లు నటించుచున్న ఈ 'కల్పములో' ముప్పాతిక మువ్వీసము ఉండవలసినచోట అవి ఉఁడనే ఉండవు. అక్కఱలేనిచోట చక్కఁగా కానవచ్చును. ఆఁటది — అనఁగా ఆఁడది, ఆటది యనఁగా, నర్తకి, ఈ కల్పకర్తమనస్సులో 'ఒక ఆఁడదియే యుండవచ్చు. అచ్చులోమాత్రము 'నర్తకి' వచ్చి కూర్చున్నది. 'ఆఁటదాని చెవులున్ ముకుపుటమ్ము గోఱకు' ఈ కోఱకును చెవులకుఁగూడ తగిలించి మన మర్థము చెప్పుకోవలెను అనఁగా—చెవులకోఱకు ముకుపుటము కోఱకు వగవరాదని అన్వయింపవలెను. ఇట్టి వింతలను 'ప్రౌఢవ్యాకరణము' వంటివి లక్ష్యములుగాఁ జూపవచ్చునుగాని, కవీశ్వరులలోని 'సత్తా' ఇట్టి ఘట్టములలోనే మనము కనిపెట్టవచ్చును.

(శ్రీ)రాముఁ డన్నమాటకు దుర్ముఖుఁ డోరగా నగి ఇట్లన్నాఁడఁట—'ఈ నీ ధనుస్సును నిమ్నం గని నాల్గుమూరల మనుష్యున్ మేము నీ గీయుగీతను నిల్వన్వలె-నివ్వధింపక ఖరున్ దర్శింపఁబోలేను'! ఈ నాలుగుమూరల కొలత ధనుస్సుదా! మనుష్యునిదా! నీ ధనుస్సును నిమ్నం గని అన్నతరువాత, నాల్గుమూరల మనుష్య ననుటలో పస లేదు. నీ గీయుగీతన్-నిల్వన్వలెన్=నిలువవలెనా! అన్న 'కాకువు' రావలెఁ గాఁబోలు. అని యాతఁడు శూలంబును స్వామిపై విసరె. సరే జరుగవలసినది జరిగినది. కర్మ కన్పించినది; క్రియ పూర్తియైనది. ఆపైని 'కొంచున్ వజ్రకల్పంబునున్' ఈ రెండు ముక్కలు ఈ

కవితలో ముందడుగు వేసినవికాని, అన్వయములో వెనుకడుగు వేయవలసివచ్చినది. అనఁగా–అతఁడు, వజ్రకల్పంబునున్! వజ్రమువంటిదైనట్టిదియును శూలంబును కొంచున్ స్వామిపై విసరెన్ అని సర్దుకొని పోవలయును. ఈ దోష మీ కావ్యమున కొక భూషణమై విలసిల్లును. సమస్తరుజల్ తన్ను నె పొందినట్లు [అర–110పు] తన్నున్+ఎ–తన్నునె కన్న 'తన్నె' అన్నదియే శ్రావ్యము. పదునాలుగుమంది నీ వెనుకన రారు [111పు] మహాద్వాచకములు పదునలుగురని అమహద్వాచకములు పదునాలుగని కావ్యభాషగా వింటిము. మూఁడుమంది–నాలుగుమంది– అని ప్రయోగించుటలో వ్యాకరణమును వాఙ్మయమును దిరుగవేయవలసిన పనిలేదే. పలుకుబడినిబట్టియే చూడవచ్చునుగదా! 'తుహిన భూమిభృత్కన్యకామనోహరు కార్ముక'మఁట (114 పుట) శివధనుస్సునకు వచ్చిన తిప్పలు.

దుర్ముఖాది వీరాధివీరులే హతులైనపిదప శ్రీరాముని విషయమాలోచింపను ఖరుఁడు 'పరిషత్తు'ను బిలిచినాఁడఁట. ఇది 'కల్పము' చేసిన కల్పన. ఆ పరిషత్తులో ఖరుఁడు వినిపించిన సందేశ మిది:– 'ఓహో! వీరాధివీరులారా! మీ రందఱు రభసంబునఁ జని దండక కాననధూమకేతువులయిన ఆ మానవులను వధింపఁగావలయు. మనకు– ఈ వచ్చిన ఆపదకంటె 'వారు దుర్వారుల'టన్న అల్పమునుల భావన, చాల బాధ ఘటింపఁజేయుచున్నది. సాధుమృష్టాన్న మారగించు సమయములో పంటిక్రిందికి గులకఱా వచ్చినట్లుగా వీరమాని వీఁడొకఁడు వచ్చినాఁడయ్యా. 'అల్పమునులెల్ల వీఁడొకఁ డధికుఁడంచు' – ఈ గీతపాదమునకు అన్వయము దొరకదు. ఈ కవితలో భావమును పరిగ యేఱుచు పదములను సరిపెట్టుకోవలసియుండునన్న మాట జ్ఞప్తిలోఁ బెట్టుకోవలెనన్న మాట. 'గులకఱా'–వంటివాఁడు రాముఁడు కావచ్చును గాక, సాధుమృష్టాన్నభోజనసమయమునకు సాదృశ్య మేది! ఐదుగుర మన్నదమ్ములము ఈ యైదుగురికి పెద్దయైన ఒక్క యీడ పడుచు మక్కెడిన యామెను గాంచుచు ఈ దైత్యులలో 'ఏదీ యే

మంచు బ్రతుకుట' అని ఖరుఁడన్నాఁడఁట. ఇందఱము అన్నదమ్ముల ముండియు ఈమె ఒక్కగానొక్క తోఁబుట్టువయ్యు - ముక్కు పోయిన ఈమెను జూచుచు ఈ దైత్యులలో మే మెట్లు బ్రదుకఁగల మయ్యా అన్న భావమును ఆ మాటలలో మునము పిండుకొనవలెను. ఆ యయిదుగురలో కొందఱకుఁ జెల్లెలు కొందఱ కక్కయునగు ఈ శూర్పణఖ, ఈ కల్పములో అందఱకు అక్కయై కూర్చున్నది. అప్పుడు పరిపన్నముఖమై శూర్పణఖ అన్నదఁట. ఏమని ! ఇవిగో కవి వాక్యములు:- 'అక్కట ! నా సహోదరుల కందఱకు ఏను అనన్ ఆ మక్కువ చెప్పరాద. వారు బాహుబలమంధరు లంచును జెప్పి నాన. వారెక్కడ నామమాట చెవి కెక్కెనె! వానరులున్ నరుల్ కదా ! అక్కర మొక్కఁడే వెనుక నైనది. భేద మదేటి నవ్వులో'- ఈ భావకర్త మేమై యుండును ? వాండ్రకు నేనఁగా మక్కువ యెక్కవయే. అంతవఱకు సరియె. వాండ్రు 'మంధరులంచును జెప్పి నాన' ! ఇది ప్రశ్నమా ! ఏమో ! తనమాట వాండ్ర చెవి కెక్క లేదఁట ! ఎప్పుడు ! ఎక్కడ ! ఏమని ! ఆ నరు లిర్వురు బలాఢ్యు లయ్యా యని మున్మొదట ఏడ్చుచు వచ్చి మొత్తుకొన్నమాట వాండ్ర చెవి కెక్కలేదని భావమా! చెవి కెక్కనినాఁడు అంతటి బలాఢ్యులను 'పదునాలుగుమందిని' ఖరుఁ డెట్లు పంపఁగలిగియుండును ? ఆ పైని- వానరులున్ నరుల్ కదా! ఇందు అక్కర మొక్కటే వెనుక నైనదిగదా! దీని భావమేమి తిరుమలేశ ! 'అదేటి నవ్వులో' - ఇదేటి మాట ! అసందర్భపుకూఁత !! నరులే ఒకనాఁడు వానరులుగదా ! అన్న చారిత్రికాంశము శూర్పణఖ మనకుఁ జెప్పఁ దొడఁగెనా! ఆ యంశము నకు ఈ ఘట్టమునకు ఉన్న సంబంధమేమి ! ఒకవేళ ఉన్నచో ఈ పాడి పాడిమాటలే ఆ భావములను మాట గట్టుకొని ఎట్లు చెప్పఁగలిగి యుండును ?

మున్మొదటి తన పరాభవమునుగాక, రెండవతూరి జరిగిన పదు నలువురు మరణించునట్టి మహాపరాభవమును అనుభవించిన

శూర్పణఖ, రివ్వున వచ్చిపడి నెత్తి మోదుకొనుచు ననుమాత్రమ్ము మిగిల్చినాఁడు, పృతనానాథుల్ తదీయోగ్రబాణనికాయమ్ములఁ జచ్చినారును త్రిపాసద్ధన్ నినున్ జూడవచ్చిన నాకే అది యేమి చెప్ప వలయుం జిత్తంబునం దోఁచదే' అని మాత్రమే ఖరునితోఁ జెప్పి నట్లు ఈ కల్పము వ్రాసినది ఇక్కడ – రెండు ఘట్టములలో అపూర్వమైన పరాభవము ననుభవించిన ఆ దానవి, నెత్తి నోరు గొట్టు కొను ✻ తమ్మునివద్ద చెప్పుకోవలసిన అంశము లేవో కల్పమునకు దొరక లేదు. ఆపదలో నున్న ఆఁడుఁగూఁతుకూయి ఎట్లుండునో వాల్మీకి మును జూచియైన తెలుఁగునకుఁ దేవచ్చునే. !

'శ్లో. అస్మిదాని మహాం ప్రాప్తా హ్యూత్రశ్రవణనాశికా, శోణితౌఘ పరిక్లిన్నా త్వయా చ పరిసాంత్వితా, "ప్రేషితాశ్చ త్వయా వీర రాక్షసాస్తే చతుర్దశ. నిహంతుం రాఘవం క్రోధాన్మత్ప్రియార్థ సలక్ష్మణమ్."
ఇత్యాది. [అర–1064 పు]

'అవునయ్యా అవునవును ముక్కు చెవులు పోయి నెత్తురు కార్చుచు నీవద్దకు నేను రాఁగా నీవు నన్ను ఓదార్చి ఆ రామలక్ష్మణులను జంపుటకును నాకు సంతోషము గలిగించుటకును పదునలుగురు రాక్షసులను బంపించితివి నిజమే. వాండ్రును – కత్తులు కటారులతో రామునిమీఁద పడినదియు నిజమే. లాభ మేమి.! వాండ్రందఱు త్రుటిలో రాముని చేతిలో చచ్చి నేలమీఁదఁ బడిరి. ఆ దృశ్యము స్వయముగా నేను చూచితిని. నా కెంతో బీతు పుట్టినది. గుండె దడతో కొట్టుకొనుచు నిన్నే మఱల శరణు చొచ్చితిని. 'వల్లమాలిన దుఃఖసాగరములో మునిఁగిపోవుచున్నాను. తమ్ముఁడూ ! నన్నుఁ గాపాడవా ! నీవు పంపిన రాక్షసవీరుల నందఱను వాఁడు పొట్టను బెట్టుకొన్నాఁడే ! ఈ దండకారణ్యములో తిష్ఠ వైచి సర్వరాక్షసులకు అతఁడు కంటకుఁడైనాఁడే. ఇంకేమి చెప్పవలె ! నాయనా ! నా మీఁదను రాక్షసవర్గము మీఁదను నీకేగనుక కనికర మున్నచో ఆ రామునితో సమానమైన శక్తి – తేజస్సు నీలో ఉన్నచో అతనిని

వెంటనే నీవు చంపవలె. ముక్కు – చెవులు పోయి సిగ్గుపాలినదాన నైతిని. ఇంక నా శత్రువును నీవు చంపవలెను. చంపవా, చంపలేవా – ఇంక నేను క్షణమైన బ్రదుకను. నీకాళ్ల దగ్గఱనే ప్రాణాలు వదలెదను – ఓ వీరుఁడా ! నీకుఁగానీ నీసేనకుఁగానీ రాముని యెదురుగా యుద్ధములో నిలువఁగల శక్తి లేదనియే నాకుఁ దోఁచుచున్నది. మహావీరుఁడ నన్న గర్వముతప్ప నిజముగా నీలో శౌర్యమే లేదు. శౌర్యమే ఉన్నవాఁడు – ఆ మానవు లీ పాటికి చావకుందురా ! వాండ్రకు నీవు చాలనే చాఁవు. నీవలన వాండ్రు చావనేచావరు. నీ పరాక్రమము వట్టి నేతిబీరకాయ. నీ మాటలు వట్టి బొంకులు. నీవు కులములోఁ జెడఁబుట్టినాఁడవు. నీలో మగతనమున్నచో వెంటనే పో. పోయి ఆ రాముని జంపిరా. చంపవా, వెంటనే నీవు నీ బలఁగము ఈ జనస్థానమునుండి లేచిపోవలె. అల్పవీర్యుఁడు దుర్బలుఁడు ఈ జనస్థానములో ఉండరాదు. వెంటనే పో. ఇక్కడనే ఉందువా రాముని చేతిలో చచ్చుట నిశ్చయము. నాకీ వికారాకారము సృష్టించిన ఆ తమ్ముఁడు లక్ష్మణుఁడుసైతము సామాన్యుఁడు కాదు రా తమ్ముఁడూ!' అని పెద్ద పొట్ట ఈడ్చుకొనుచు నెత్తినోరు బాదుకొనుచు మొత్తుకొన్నదఁట.

వాల్మీకములోని ఈ ఇరువదియొక సర్గములోని ఈ వృత్తాంతమంతయుఁ జెప్పవలసిన తీరులోఁ జెప్పలేక, ఆపదలో మ్రగ్గిన శూర్పణఖపాత్రను 'భావదృశ్యములో' జూపలేక మునీశ్వర పరిషత్తులవంటి 'పరిషత్తు' నొకదానిని క్రొత్తగా సృష్టించినంతమాత్రాన కల్పము మన కేమి ఒఱగఁ బెట్టినట్టు!

అప్పుడు ఖరుఁడు రోషము వచ్చికాఁబోలు బ్రహ్మాండమైన ధోరణిలో యుద్ధసన్నాహము చేసెనఁట అందఱు జనస్థానమునుండి కదలి, పొలిమేర దాఁటిరో లేదో అపశకునములు కావలసినన్ని ఎదురైనవి. ఈ యశుభములను జూపుటలోఁగూడ వాల్మీకములో నున్న వరుసగానీ సొగసుగానీ కల్పములోఁ గన్పింపదు. 'ఏవో గాడిదరంగుల మబ్బులు–సూర్యుని పరివేషములు' ఒండురెండు క్రొత్త 'వృత్తముల'లో

కల్పము వర్ణించినది. ఈ యశుభములను నేను లెక్కచేసెదనా! అని ఖరుడీ విధముగా నన్నాఁడఁట :—

చం. కలితసహస్రవర్షముల కాలము చేసితి మెన్ని సంగరం

బులు...ఇత్యాది. ఈ యశుభాలలో మఱల మఱొక్క అశుభముగా కాలము చేసితిమని భావింపరాదు. సహస్రవర్షముల కాలము—ఎన్ని సంగరములు చేసితిమని ఖరుఁ డన్నట్లు మన కీ కవనము బోధించునని మన మూహింపవలెను. 'గగనానికెన్' అఁట. గగనానకు అనఁగా ముసలి గ్రాంధికవేషము స్ఫురింపవచ్చునని కల్పకర్త ఊహించెనో, లేక ఆయనకు తగ్గ 'కంపాసిటరు' వీరాసామిగారు కూడ ఆయన కవనమునకు సాయముచేసెనో! వెఱ్ఱి మొఱ్ఱి — ఇత్యాదులలో బండిరాలు గిండిరాలు ఉండవలెనని ప్రాచీను లేవో గ్రస్తులు చెప్పినంత మాత్రాన ఆ త్రోవలో ఈ బండ్లు సాగింపవలెనా యేమి! యని కాఁబోలు 'వెఱ్రి మొఱ్రి అనియే కల్పము మనకు వ్రాఁతలోఁ జూప నేర్చినదహా! 'కణకణలాడు నిప్పుకలకంటెను దీక్ష్ణములైన కన్ను' లఁట [అర—120]

'మా యప్పగారహా! మహనీయ పౌలస్త్యవంశ గౌరవనీయ' యఁట [120] పందె మొడ్డక—చేసి తబల, వంటి సొగసులలోఁ జేరిన ఆణిముత్తెమే 'నిప్పుక' సైతము. అప్పగారహా! ఎంత ముచ్చట గూర్చు ప్రయోగము!! 'గౌరవనీయ' అన్నమాటకు గౌరవము లేదన్న మాట సంస్కృతసాహిత్యము లోఁతుగాఁ దడవి చూచితినని చెప్పు కొన్న ఈ కల్పకకర్తకుఁ దెలిసియుండకపోదు.

'మా యప్పగారహా మహనీయపౌలస్త్య
వంశగౌరవనీయ వట్టిగొడ్లు' [అర - 120 పు]

'గౌరవనీయ' వఱకు వచ్చిన పద్యపునడక, 'వట్టిగొడ్లతో'— అట్టె తెలిపోయినది.

'కనిపించిన దుశ్శకునావళిన్ భయంబును గని
కారణం బెఱుఁగఁబొందకభీతి వహించి రెల్లరన్' [అర—12i]

ఈ దుశ్శకునములను భయమునుజూచి మునీశ్వరులు కారణము ఎఱుఁగఁబొందక భీతి వహించిరఁట. రెండు 'భయము' లెందులకో! ఎఱుఁగఁబొందక — అనఁగా ఎఱుఁగక, ఎఱుఁగుటకు వీలుపడక అని యర్థముకాఁబోలు. మునీశ్వరుల ఈ సందడి దందడిలో ఈ కవీశ్వరుని 'యతీశ్వరుని' గాపాడుటకుమాత్రమేవచ్చి కూర్చున్న ఈ 'బొందలో' అంద మేమున్న దందుము ?

'ఇతఁడు పినాకియో యేమో త్రిపురదాహవేళాసముద్భూత విధురమూర్తి' [అర 124]

ఇది శ్రీరామునకు విశేషణము. త్రిపురాసురసంహారములో సిద్ధమైన పినాకియా! అన్నట్లు రాముఁడున్నాఁడఁట. సంతోషమే. కాని, 'విధురమూర్తి' అనఁగానేమి! విధుర = ఎడఁబాటు, వైకల్యము, అని నిఘంటువు. విధురుఁడనఁగా భార్యపోయినవాఁడని లోక వ్యవహారము ఇక్కడ — త్రిపురదాహవేళలో పుట్టిన వికలమైన ఆకారము గలవాఁడని కవివివక్ష కావచ్చును. కాని, అడ్డమైన ఎల్ల చోట్లను, అపార్థ మిచ్చు ఈ 'విధుర' శబ్దమును వాడవలసినంత అక్కఱ యెందులకు ! ఉభయభాషలలో పదములు లేకుండుటచేతనా! ఉండియు మననోటి కందకపోవుటచేతనా !

'సంతతుల మధ్య — సముద్రముమధ్య — ధారాప్రలీనగ్రావంబు— ప్రథమ ప్రాకారము' ఇవి ఈ రచనకు ప్రాఁతపురాణమేగదా! [125_126]

'రక్షోదయితుండు సామమునకుం దిగునో యని చూచు భావమున్' [అర — 127 పు]

భావమునందుఁ జూచునని ఇక్కడి భావము. భావములో అనుకొనవలెఁ గాని చూచుట ఉండదే. ఒకవేళ ఉన్నదన్నను 'భావమున్' అనఁగా భావమందు అన్న అర్థ మెక్కడిది ? నోటికి వచ్చిన పదము వాడు కొనుచు — ఇష్టమైన అర్థమెట్లు రాఁబట్టఁ గలము ? తెలుఁగునకు 'కారక' ప్రకరణము లేదా యేమి !

కం. ఓ సేన లీతఁడొక్కఁడు లేసున్నములోని కెముక లేకుండ సునా
యాసమ్ముగఁ జంపఁగఁ బరిహాసమ్ముగఁ బాఱిపోవుటయ్యెయ్యెఁ బతే 127

ఇది దూషణుఁడను రాక్షసనాథుని మాట. రాముని బాణమున కదరి బెదరి రాక్షసులు పాఱిపోవుచుండ వారి కడ్డము సొచ్చి ఆతఁడీ మాట యనును. ఓ సేనలు=ఓ సైన్యములారా! ఈతఁ డొక్కఁడు లేసున్నములోనికి ఎముక లేకుండఁ జంపఁగాఁ బాఱిపోవుటెందులకయ్యా అన్నట్లు ధోరణి ఉన్నది. ఇందు 'ప్రశ్నోత్తరమాల' సొగసుసైత మున్నది. ఎందులకు మీరు పాఱిపోవుట! ఈతఁ డొక్కఁడే అయ్యు నుగ్గునూఁచగాఁ జంపుటఁజేసి. ఆ 'ధోరణిలో సునాయాసముగా' ఆతఁడు వరుస పెట్టి చంపుచుండఁగా ఆ 'ప్రబుద్ధులు' పాఱిపోవక ఏమిచేసెదరు? పాఱిపోవునట్టి పిరికిపందలకు అధిపతి చెప్పవలసినమాట లెట్లుండవలె! పైగా ఈ మాటలలో ఒక 'జాతీయము' సైతము చొచ్చినది. లేసున్నమంట-ప్రాసకోసము కావచ్చునేమోగాని లేతసున్నమని – ముదురుసున్నమని తరగతులుగాఁ జెప్పవలసినపని లేదే. సున్నములోనికి ఎముక లేకుండ నలగఁబొడిచిరని చితుకఁగొట్టిరని వాడుకొందురుగాని చంపిరని ఎవ్వరు వాడినట్లులేదే. కల్పమును జదివినపిదప ఇఁక మనము దీనినిగూడ వాడుకలోనికిఁ దీసికొనిరావచ్చునేమో!

స ధీచీనుండని వెంబడిన్ దఱుము మృత్యుం బట్టుచున్ శౌర్యరే' [అర-133ప]

ఈ రాక్షసుల యుద్ధపుగడబిడలో, ఈ చరణములో 'యతీశ్వరుఁడు'-కాలికి బుద్ధిచెప్పినట్లున్నాఁడు. 'మిత్తిన్' అన్నచో యతికి గతి దొరకును. భ్రష్టయతులతోపాటు 'అఖండయతులు' సైత మీ కవి కభిప్రేతము లనుట క్రొత్తమాట కాదు. 'యమ్ములు, ర్వరవ్రాలెన్ బరిపుష్టి లేక చెడు సూర్యాంశుప్రతానంబునాన్.' [141]

'శా. హేవాకంబుగ రాముఁడున్ ఖరుని నోయీ! వానికిన్ వానికిన్
నీవుం గార్ముకదక్షుఁడౌదు నగిషీ ల్నే ర్తీవు చేయన్ ధను
ర్జ్యావల్లీకృత చిత్రకర్షణ నినీషన్ నైకయీదేవి వి
ద్యావిష్కారము నీ వెఱుంగవుసుమీ యంచున్ మఱిన్ నవ్వుచున్. [142]

ఖరునితో రాముఁ డీ మాట అన్నాఁడఁట. వానికి వానికి నీవుం గార్ముకదక్షుఁడౌను వనఁగా— నీవుకూడ కార్ముకవిద్యలో దక్షుఁడవని వాఁడును వాఁడును (నీకుఁదగినవాండ్రు) అనవచ్చుననుకో.

'నగిషీ ల్నేర్తీవు చేయన్' — అహెూ! ఎంతటి నగిషీ చెక్కి— ఇక్కవి మనకిక్కడ చక్కని ప్రయోగ మిచ్చెను? నగిషీలు—నేర్తువు—ఈవు—చేయన్, ఇది పదచ్ఛేదము. ఈవు—నగిషీలు—చేయన్—నేర్తు, ఇది ఖండాన్వయము. ఎన్నో నగిషీలు చేయఁగా నేర్చితివయ్యా, అని భావము. 'షీల్నేర్తీ' లోని అక్షరరమ్యత చెప్పఁదరము గాదుగదా! పైగా నన్నయ్య 'అక్షరరమ్యత', ఎన్నోవిధాల మెచ్చుకొన్న 'మనిసి' ఈ కల్పవృక్ష కర్తయని మనము మఱచిపోరాదు. మెచ్చుకొన్నంతమాత్రాన మాటలలోఁ జెప్పుకొన్నంతమాత్రాన ఆ గుణమే మెచ్చుకొన్నవారికిఁ జెప్పుకొన్నవారికి అలవడునన్న సిద్ధాంతము కలదాయేమి! ఎవని బుద్ధి, వానిదే. 'ప్రకృతిః దుస్త్యజా' అని పెద్దలనియుండలేదా! మఱియు—క్రొత్తవాఁడైన ఆ ఖరునితో ఈ రాముఁడు కైకయీదేవిప్రస్తావ మెత్తవలసిన అవసర మేమున్నది! 'కైకయీదేవి విద్యావిష్కారము నీ వెఱుంగవుసుమీ' ఈ మాటకు ఎంతో 'భాష్య' ముండియుండును. ఆమె కున్న విద్యలలో ఇది ఏ విద్య! ఇది యుద్ధరంగము కావున, ఆ నాఁటి శంబరాసురఘట్టము—దశరథమహారాజులు కావించిన యుద్ధము—అప్పుడు సారథ్యము చేయుచు కైకమ్మ చేసిన సాయము జ్ఞప్తికి వచ్చి రాముఁ డీ మాట అనెనా! లేక, కైకమ్మ విద్యావిష్కారముమూలముననే, అనఁగా ఆమె దూరదృష్టిచేతనే నన్నిక్కడికిఁ బంపఁగా నీ యంతు నేను తేల్చుకొనునట్టి వార్త నీ వెఱుంగవు సుమీ! అని రామయ్య ఖరునితోఁ జెప్పెనని అనుకొందమా! ఏమో! కవీశ్వరులు ఋషీశ్వరులవంటివారుగదా! వారు త్రికాలజ్ఞులు! వారి పొట్టలో ఏ భావము లుండునో వారి భాష్యములు స్వయముగా వినఁగానిస్పష్టముగా నిర్ణయింపలేము.

శ్రీరామునకు ఖరునకు జరిగిన యుద్ధము అత్యద్భుతమైనట్లే వాల్మీకములో ఆ వర్ణనముసైతము అత్యద్భుతముగా సాగినది. అందలి చిద్విలా

సము లన్నియు కల్పములో లేవనియు తాలేదనియు మనము విచారపడ వలసినపని లేదుగాని మూలము ఆ తీరువైభవములో కంటికిఁ గానవచ్చు చుండఁగా అనువాదకర్తలు సమర్థులయిననాఁడు ఆ పదార్థములను విడువ రనియే మనము భావింపవలయును. ఖరాసురుఁడు సాలవృక్షము నొక దానిని రెండుచేతులఁ బెళ్ళగించి ఎత్తి రాముని నెత్తిమీఁదికి విసిరివైచి ఇదిగో చత్తువని ఒక్క అఱపు అఱచెను వెంటనే రాముఁ డా చెట్టును ముక్కలుముక్కలు చేసి వానిమీఁద వేయి బాణములు కురియించెనఁట. ఆ దెబ్బకు దేహ మంతయుఁ దూట్లు పడియు నెత్తురు లోడికలు గట్టియు ఖరుఁడు రామునిమీఁదికి దూఁకఁగా రాముఁడు రవ్వంత వెనుకకుఁ దప్పుకొని దేవేంద్రుఁ డిచ్చిన బాణమును బ్రయోగించెనఁట. ఆ దెబ్బ కాతఁ డడలి శ్వేతారణ్యములో రుద్రునిచే దహింపఁబడ్డ అంధకాసురుఁ డువోలె దేవేంద్రుని వజ్రాయుధముచేఁ జంపఁబడ్డ వృత్రాసురుఁడువోలె నముచివోలె బలాసురుఁడువోలె నేలఁ గూలినాఁడని మూలములో నున్నది ఈ వృత్తాంత మంతయు 'ఖరుండొక మహాసాలంబు వెఱికి రామచంద్రునిపైకి రాఁగాఁ దద్వధానంతరమున స్వామి కూర్చున్న' అని ఒక్కవచనపుముక్కలో కల్పము తేల్చివైచినది [అర-145 పు] ఈ చెప్పిన సంగ్రామఘట్టములో తక్కిన రక్కసులతోడ జరిగిన యుద్ధ మొక యెత్తు; రాక్షసనాయకుఁడగు ఖరునితో జరిపిన యుద్ధ మొక యెత్తుగా వాల్మీకము వర్ణించినది. ఇట్టి యుద్ధపుఘట్టములలో తెలుఁగువాఙ్మయ మున ఒక్కతిక్కన్నయే చేయితిరిగిన మహాకవి యని చెప్పవచ్చును. తక్కిన వారిధోరణి 'తద్వధానంతరమున' అన్నట్లే తేలిపోవుచుండును.

---

ఖరాసురవధానంతరము రాజర్షులు బ్రహ్మర్షులు తక్కినవా రెందఱెందఱో వచ్చి రాముని అభినందించిరనియు దేవతలు చారణులు దుందుభులు మ్రోయించిరనియు పూలవాన కురియించిరనియు వాల్మీక ములోఁ జెప్పియుండఁగా, ఆ నాఁడుగాక మఱునాఁడు 'గోదావరీ స్నాన సమనంతరంబున సర్వర్షులు సికతానిషణ్ణులయి సంధ్యాతర్పణం బులు చేయుచు నేదో రవ్వంత రాముని మెచ్చుకొని ఖరాసులకుఁ దర్పణము చేసి వెడలిపోయి'రని కల్పము క్రొత్తగా తెలుఁగులో

సృష్టించి యిచ్చినది. ఆత్మజ్ఞానము గల శ్రీరాముని మహావిష్ణువుగా దేవతలు భావించినట్లు మూలములో స్పష్టపఱిచెను. ఈ ఖరాదులను నీవు చంపవలెనని భావించియే దేవేంద్రుఁ డా నాఁడు శరభంగాశ్రమమునకు వచ్చినాఁడనియు, ఉపాయము పన్ని మహర్షులు నిన్నీప్రాంతము పంపిరనియు పాపకర్ములను క్రూరకర్ములను జంపివైచితివనియు, ఇఁక నీ దండకారణ్యములో మహర్షు లెల్లరు ధర్మ మాచరించుచు హాయిగా నివసింతురనియు— ఆ వచ్చినవారు ప్రశంసించుచు రామున కుత్సాహము గలిగించినట్లు వాల్మీకి వర్ణించినాఁడు. చేసినపని మంచిదని యితరు లెంచినపిదప — ఆ వ్యక్తి సంతృప్తి యెట్లుండునో దానిని ఆదికవి మనకు బోధించెను. ఈ గొడవ యేదియు—తడవక కల్పము, 'తర్పణములతో' ఈ 'పంచవటీ' ఖండమును ముగించినది.

••••••••••••••••••

# మారీచ ఖండము

'ఆకాశాదిక భూతతనూ ! కైలాసాద్రి నిత్యనూతనగేహీ !' ఇవి, కల్పములోని ఇష్టదేవతాప్రార్థనములోని పలుకులు. అష్టమూర్తి యనఁగా పరమేశ్వరుఁడు. పంచభూతములు — సూర్యచంద్రులు—పురుషుఁడు, వీనినే అష్టమూర్తు లందురు. పంచభూతములలో పృథివి మొదటిది. ఆకాశ మైదవది. 'పృథివ్యాది భూతతనూ !' అనక ఈ కవీశ్వరుఁడు 'ఆకాశాదికభూతతనూ!' అనుటలో అంతరార్థ మేమైన ఉన్నదో ! ప్రాసముకోసమే వేసిన పదమో ! పరిశీలింపవలెను.

జనస్థానములో జరిగిన సర్వరాక్షససంహారవార్త రివ్వున లంకకుఁ జేరినది. ఈ వార్త రావణునకు వెంటనే అందించినవాఁడు అకంపనుఁడను రాక్షసుఁడు. ఆ వార్తతోపాటు సీతాసౌందర్య వృత్తాంతము సైతము విన్నవాఁడై రావణుఁడు మఱునాఁడు రేపకడ లేచి పోయి మారీచునితో మంతనా లాడెనన్నది మూలములో నున్న వస్తువు. ఈ వస్తువునకుఁ దోడు మఱికొంత 'దస్తు' కల్పము కల్పించి కిచ్చినది.

'వ. పరమవృద్ధులైన కొందఱు రాక్షసులు రక్షశ్చమూ సర్వనాశన వార్తాముఖుని నకంపనుఁడను వానిఁ బిలచి 'యీ వార్త రావణునకుఁ దెలియవలయును. తరువాత మనమీఁద నెపమని చెప్పఁగా నందులో నొక కృకలాసం బిట్లనియె.

కం. ఈ యింద ట్టిట్టులైరికదా యాయన తొందరించి యాహావబుద్ధిం
జేయునొ వారికి మాఱుపాయంబునఁ బక్షులట్లు వలపన్నవలెన్.

వ. అని యకంపనునితో మాటాడి.

మ. అది మార్గంబుగ నుండె రావణుఁడు స్త్రీ యన్నన్ మహామోహదు
ర్మదవృత్తిం జనువాఁడు మారెఱుఁగరే రంభాకథన్ వానిక
య్యదియే యెంతయు నచ్చఁజెప్పవలె నభ్యామర్దబుద్ధిం జనన్
బదునాల్గై చను వేల సైన్యము తలంపంగావలెన్ నీతిపై.

మ. అని పంపిఁప నకంపనుండు ... ... [అర- 148 పుట]

అకంపనుఁడనువాఁడు రావణచారుఁడు. ఇతఁడు తన విధ్యుక్తమును మఱువక వెంటనే రావణునకు ఈ వార్త వినిపించును. అందువలననే 'త్వరమాణ స్తతో గత్వా జనస్థానా దకంపనః ప్రవిశ్య లంకాం వేగేన రావణం వాక్య మబ్రవీత్' అని వాల్మీకము మనకుఁ జెప్పినది. ఇక్కడ 'త్వరమాణః' అన్న పదమునకు శూర్పణఖా గమనమునకు ముందే ఈతఁడు రావణున కీ వార్త వినిపించెనన్న స్వారస్యము కలదు. అది గూఢచారుని బాధ్యతకూడ. పైగా ఈతఁడు రావణునితో 'జనస్థానస్థితా రాజన్! రాక్షసా బహవో హతాః, ఖరశ్చ నిహతస్సంఖ్యే కథంచి దహ మాగతః' [అర-1098] అని చెప్పుకొనును. ఖరునితోపాటు జనస్థానమందున్నవారందఱు ప్రమందిరి. నే నెట్లో వచ్చితినన్న మాటలో ఒక రహస్యము కలదు. ఈతని తరువాత వచ్చి రావణునితో శూర్పణఖ, మొత్తుకొన్న సందర్భములో – 'ఏకా కథంచి న్ముక్తాహం పరిభూయ మహాత్మనా, స్త్రీవధం శంకమానేన రామేణ విదితాత్మనా' అన్న ముక్క ఒక్కటి ఉన్నది. అనఁగా స్త్రీలను జంపరాదన్న ధోరణిలో ఆ మహాత్ముఁడు శ్రీరాముఁడు సంచరించుటఁజేసియే బ్రదికి నేను బయటపడి నీదాఁక రాఁగలిగితి నని భావము. ఈ భావమునే మనము అకంపనుని మాటలలో 'కథంచి దహ మాగతః' అన్న దాని కన్వయించు కొనవలయును. అప్పుడు, 'మహారాజా! నే నేదోరీతిగ ఆఁడువేషము వేసికొని బ్రదికి యిక్కడికి రాఁగలిగితినని రావణచారుఁడు విన్నవించు కొన్నట్లు మనము గ్రహింపవలెను. ఇట్టి గూఢచారుల ధోరణి దూరీకరించి, 'పరమవృద్ధులైన కొందఱు రాక్షసులు అకంపనుఁడను

వానిని బంపినట్లు కల్పవక్షము కల్పించుటలో విశేష మేమియు పోఁగా 'సంచి మొదలు' దెబ్బతిన్నట్లే యగును. అకంపనుఁడు లేక 'రక్షశ్చమూ సర్వనాశనవార్తా ముఖుఁ'డఁట. అది యాతని యుద్యోగము కాఁబోలు ! ఏది ! రాక్షసుల సర్వసేనలు నాశనమైన వార్తలే అందించుట. నాశనవార్తలే గాదు; విశేషవార్త లేవైన ప్రభువుల కందించుట గూఢచారుల ధర్మము. ఇది మఱచిపోయి వృద్ధులు వానిని పంపిరన్నట్లు వ్రాయుటలో అర్థము లేదు. 'అందులో నొక కృకలాసం బిట్లనియె'నఁట ఎందులో స్వామీ ! వెనుకముందర ఎక్కడ అందులోని కన్వ యింపఁగల ముక్కలే లేవే. అందులో ననఁగా ఆ పరమవృద్ధులైన రాక్షసులలో అని సరిపెట్టుకోవలసి యుండును 'అందులో'నికిఁ దగినదే 'కృకలాసం' బన్న పదముకూడ. కృకలాసమనఁగా—ఊసరవెల్లి, తొండయనియే సాహిత్యములో మనము విందుము. ఈ వృద్ధరాక్షసులలో 'తొండ'గూడ ఒక సభ్యుఁడా యేమి ! అహాహా ! ఏమి కథాకల్పనావైచిత్రి !! ఈ కల్పమునుబట్టి చూడఁగా ఈ రాక్షసజాతిలో 'రక్షోవిప్రజాతులు [151 పు]- శూద్ర మాంసమును వాడని రాక్షసద్విజులు [9౪పు] రాక్షస విప్రకాంతలు [ 93 పు] పౌలస్త్యవంశగౌరవనీయులైన అప్పగారలు [ 12౦ ] కృకలాసములు, ఇన్ని తరగతు లున్నవని మనము నేర్చుకొనవలెను. లేదా – రాక్షసులు కామచారులు కావున 'కృకలాస' రూపములో నున్న ఒకానొక రాక్షసుఁ డిట్లన్నాఁడని మనము చెప్పుకోవలెనని కల్పకవీశ్వరుల భావమా ! ఆ భావమే యున్నచో దానినే చక్కఁగాఁ దెలియఁజేయఁగల పదములే భాషలో దొరకవా ! లేక, కవనములో ఇదియు నొక 'ప్రౌఢి'యా !.

ఇంతకు పరమవృద్ధులైన కొండఱు రాక్షసులలోఁ జేరిన ఈ 'కృకలాసము' చెప్పిన దేమో మనముకూడ వినవలయును. ఈ యిందఱు ఇట్లైపోయిరికదా యని ఆయన, యనఁగా రావణబ్రహ్మ, తొందరించి ఆహవబుద్ధిని జేయునోయేమొ! ఇంతవఱకు అన్వయములో

ఒక రేవు దొరకినది. 'వారికి మాయోపాయంబున పక్షులట్లు వల పన్నవలెన్' ఉన్న చిక్కెల్ల నిక్కడనే. వారికి అనఁగా నెవరికి! పక్షులట్లు – అనఁగా పక్షులవోలె అని ప్రథమాంతమా! పక్షులే వల పన్నునా! ఎవరో పన్నిన వలను 'హితోపదేశ' కపోతము లెత్తుకొని వెళ్లినట్లు కథలు విన్నాముగాని పక్షులే వల పన్నినట్లు విన్నది లేదు; కన్నది లేదు. కాఁగా పదములనుబట్టి కాక, ప్రకరణమును బట్టి 'వారికిన్ – రావణులవారికి, పక్షులట్లు – పక్షులనువలె, వల – వలను, పన్నవలెన్ – (మనము) పన్నవలసియున్నది.' అని భావము చెప్పుకొనవలెనేమో? రామలక్ష్మణులను పక్షులనుగాఁ జేసి వలలో వేయుట అందుమా! పొసగదు. రావణునే వలలోఁ బక్షిని వేసినట్లు మాయోపాయములో వేయవలెనని 'కృకలాసము' సంకల్పమా? 'కల్ప' హృదయములోని కృకలాససంకల్పము సూటిగా అర్థము కాదుగదా! పోనీ! ఈ మాయోపాయ మేమో మనము చూతము. "రావణుఁడు స్త్రీయన్నన్ మహామోహాదుర్మద వృత్తిం జనువాఁడఁట. దానికి 'దాఖలా' రంభాకథయఁట. అదియే వాని కెంతయు నచ్చఁ జెప్పవలయునఁట' – ఇది మాయోపాయములోఁ జేరునా! ఈ మాటలో రావలసిన భావ మంతయు వచ్చినదా చచ్చినదా! ఈ మాట చెప్పి అకంపనుని పంపెనఁట. ఇక్కడ మనము ఊహింప వలసిన దిది:– 'ఈ వార్త వినఁగానే రావణుఁడు ఏకాయెకిని యుద్ధసన్నద్ధుఁడు కావచ్చును. వెండియు ఈ సందడిలో దండడిలో మఱి కొందఱు మ్రిందవచ్చును. ఇట్టిది జరుగకుండ ఒక యుపాయము పన్నవలె. రావణునకు స్త్రీలనఁగా మోహముగదా! ఆ మోహమును సీతాదేవి పక్షముగాఁ ద్రిప్పి ఆ పక్షిని (రావణుని) ఈ వలలో వేసెదముగాక!' అని.

కృకలాస మిచ్చిన ఈ 'సలహా' ప్రకారము అకంపనుఁడు "వనరాశిలో పాటిరేవున బారుటీతం బడి పోయి రావణుని జూచి ఖరాదినాశనకథనంబు సర్వంబును జెప్పె'నఁట. కథనమనఁగా – చెప్పుటకదా! కథనమును జెప్పుటలో అర్థము లేదు.

'అది మార్గంబుగ' పద్యములోని అభ్యామర్ధబుద్ధి' నుండి ఆ, పాదమున కర్థమేమొ విద్వజ్జనము పరిశీలింపవలెను. 'పదునాలుగు వేలసైన్య'మన్న పదము పద్యభాగములో ఇముడక'పదునాల్గై చను వేల సైన్యము'గా పరిణమించినది. 'సత్య పూర్వకనారాయణ'–అన్నట్టు అహాహా! కవితాప్రౌఢి !!

ఆ వృత్తాంతము విన్నవెంటనే కన్నుల వెంట నిప్పులు గ్రక్కుచు యుద్ధమునకు సన్నద్ధుఁడైన రావణునితో అకంపనుఁడు మఱల నిట్లనును:– 'మహారాజా ! నీవేగాదు. మఱెవ్వరును యుద్ధములో రాముని జయింపలేరు. నా మాట నమ్మవలెను. ఆ రాముని జంప వలెనని నీకున్నచో ఉపాయ మొక్కటి కలదు. సావధానముగా వినుము. అతని కొక భార్య ఉన్నది. ఆమె భువనైకసుందరి. అంద చందములలో తీర్చిదిద్దిన విగ్రహము. ఆమెపేరు సీత. ఆమె నేదో విధముగ నీవు అపహరించుకొని రావలెను. రాముఁడు వట్టి కాముకుఁడు. సీత లేనినాఁడు – అతఁడు ప్రాణములే విడుచును. ఇదే నీవు చేయ వలసిన పని'. అని మూలములో నున్న కథను'కల్పము'కొన్ని రెమ్మ లతికించినది:–

'కం. పరకాంతవాంఛ నేరిపెదరు రక్షోవిప్రజాతి తలగుతలగు నా
గురుసులు వారిన నవ్వుల విరిసి రకంపనుఁడు దనుజవిభుఁ డొక్కటిగా
[ 151 ]

రక్షోవిప్రజాతి, పరకాంతవాంఛ నేర్పెదరఁట. అని ఆ యుభయులు నవ్వుకొన్నారఁట.

'అతని భార్య యాతనిది ప్రాణరహస్యము రాక్షసేశ్వరా'. [151 పు]

'గీ. అతఁడు ప్రాణి యామె ప్రాణంబు ప్రాణంబు నపహరింపుమయ్య
యసురనాథ !'

ఇవి కల్పములోని అకంపనునిపలుకులు. రాముఁడు ప్రాణియఁట. సీత ప్రాణమఁట. ఆ యిరువురి కున్న సంబంధమును కల్పము మన కిట్లు చెప్పఁగలిగినది. ఇంత మమకారమున్న ఆ జీవులు, వెనుక

విరాధుఁడు వచ్చినవేళలో ఆ తీరుగ ప్రవర్తింపనేల! ఉత్తరకాండములో ఈ ప్రాణము అడవులకుఁ బోయినపిదప ఆ ప్రాణి చిరకాలము మనియున్నట్లే రామాయణము మనకుఁ జెప్పుచున్నదే. అనఁగా సీత, రామునకు ప్రాణప్రియ అన్నంతవఱకే యని తేలిన యర్థము. ఇక్కడ 'ప్రాణి యెవరో ప్రాణ మెవరో' గాని భాస్కరరామాయణముసైతము 'మానవనాథు భార్యఁ గుటిలాలక సీత హరింప దాన శోకానిలుఁడై వెసం బోలియు నాతఁడు దమ్ముఁడుఁ జచ్చు నన్నతోన్' (170 పు) అని తమ్ముఁడుసైత మన్నతోపాటు చచ్చునన్న విశేష మింకొకటి చూపినది.

అకంపనుని పలుకులకు మురిసిపోయి రావణుఁడు వెంటనే మారీచునింటికిఁ బోయెనఁట. ఇక్కడ రావణమారీచుల సంభాషణములోఁ గూడ మూలములో లేని 'చణుకులు' కొన్ని కల్పములోఁ గానవచ్చును.

మూలము :- 'శ్లో. కచ్చిత్సు కుశలం రాజన్ లోకానాం రాక్షసేశ్వర! ఆశంకే నాథ జానే త్వం యతస్తూర్ణ మిహాగతః'

[అర-1104 పు]

రాజా! అందఱకు కుశలమా! ఏదో తొందరపనిమీఁద ఇక్కడికి దయచేసినట్లున్నారు!! సెలవీయవలె – ఇది వాల్మీకి ధోరణి. 'అయ్యో! యేదో పనిలేక దానవశ్రీచణులైన రావణులు చేరరు పేదల యిండ్లటంచు మారీచుఁడు బిట్టు తా ననుసరించెను దానవనాథు చిత్తమున్' ఇది 'కల్పము'లోని వెటకారపుధోరణి.

'శ్లో. ఆరక్షో మే హతస్తాత! రామేణాక్లిష్టకర్మణా, జనస్థానమవధ్యం తత్ సర్వం యుధి నిపాతితం, తస్య మే కురు సాచివ్యం తస్య భార్యాపహరణే–'

నాయనా! మారీచా! ఇంకేమున్నది! జనస్థానమున కెల్ల తలారిగా ఉన్న ఆ, ఖరుని అసాధ్యుఁడా రాముఁడు చంపివేసెను.

అవధ్యులైన రాక్షసయోధు లెల్లరు వానిచేతిలో హతులైపోయిరి. వాని భార్యను దొంగిలింపవలెను. ఆ పనిలో నీవు సాయము చేయ వలసి యున్నది – అనఁగా 'కల్ప' మేమున్నదో వినవలెను.

'గీ. నివ్వెఱను బొంది మారీచుఁ డవ్వ! యెవరు నీకుఁ జెప్పిరి జానకినిన్ హరింపుమనుచు మెడమీఁదఁ దల లుండ నభిలషింతె యన్నయుం దిని బ్రతుకఁగా నభిలషింతె'

సీ. సేమమా! దానవ శ్రీమహారాజ్యేందిరాసమాసన్నభద్రత్వమునకు . . . శ్రేయమా! . . . . భద్రమా! . . .

శా. ఐపో వచ్చిన వేళ యిం దైత్యులకుఁ గట్టా! మంచి రోజుల్ . . .
శ్రీద్వీపం బుప్పొనలోన ముంచుకొనలేదే నిట్టు లూహింతు రే.

గీ. లక్ష్మిమి దైవముతోడ నేటికి విరోధింపన్!

గీ. చాలుచాలు సంకఁ జనవయ్య లంక కనంగ రావణుండు మ్రుంగిపోలె
లేచిపోయె హస్తలీలాసరోజాత మచటఁ బారవైచి యవశబుద్ధి' [153]

హాత 'స్తాత' అని మారీచుని రావణుడు పిలిచినట్లు మహర్షి వాల్మీకి మనకు వినిపింపఁగా, మారీచుఁడు రావణబ్రహ్మను అవ్వ యని పిలిచినట్లు వైశ్వనాథము మనకుఁ జెప్పుచున్నది. ఆయన, తాత యనఁగా ఈయన అవ్వ అనెను. ఆ తాతకు సంస్కృతములో అర్థము వేఱు కావచ్చును. ఈ యవ్వకు స్త్రీత్వమే స్ఫురింపవచ్చు. ఏమి పలుకుబడి స్వామి మీది! అవును మఱి! వ్యవహారములో నేఁడు మనము 'ఎప్పుడు వచ్చావమ్మా' అని మగపిల్లవానిని బలుకరించుట లేదా! అది వాత్సల్యార్థము. దానిలో ప్రేమ ఉట్టిపడునని మన భావము. అట్లే, ఎవరు చెప్పిరవ్వ! నీకునని మారీచుఁడు రావణు నడిగెననవలెను. ఒకవేళ, ఈ 'అవ్వ' పదవాచ్యుఁడు వయసులో – హోదాలో చిన్నవాఁడయ్యె నేని అనవచ్చు ననుకొందము. ఈ తాటకపుత్త్రుఁడు – మారీచుఁడు, ప్రభువును బట్టుకొని 'అవ్వ' యనునా! అవ్వ!! ఎంత తప్పు !! పోసీ ! ప్రాసకోసము వచ్చిన తిప్పలని ఇప్పటికి సర్దుకొందుము. పెద్దపిన్నల సంభాషణప్రసంగములో పదములలో భావములో – ఔచిత్య మన్నది రవ్వంతైన

పాటింపని వింతధోరణి ఈ విశ్వనాథకవికి వెన్నతోఁ బెట్టిన విద్యగా అలవడినది. అంతటి రాక్షసప్రభువైన రావణబ్రహ్మను మారీచుఁడు అవ్వయని పిలుచుటే కాదు; 'మెడమీఁదఁ దల లుండవలెనని కోరుచుందువా! అన్నమును దిని బ్రదుకవలెనని అభిలషింతువా! 'అనియు మందలించెనఁట. మారీచుని బొందిలో 'విశ్వనాథ' జీవుఁడు దూరియుండవచ్చును. లేనిచో ఆ యాశ్రమవాసికి అంత పొగ రెక్కడిది? ఏ ప్రభుత్వములో సర్వలోకములు గడగడలాడునవని వాల్మీకి వర్ణించెనో— దేవతల యాపద గడవఁబెట్టను శ్రీమన్నారాయణుఁడే అవతరింపవలసి వచ్చెనో ఆ రావణప్రభువు మోల ఆతని నీతఁ డింతమాట అన్నట్లు వ్రాసినవానికి 'ఔచిత్యబుద్ధి' యుండవలెను. 'ఇంక నీకు అన్నోదక ప్రాప్తి యుండునా' నీ మెడమీఁద తలకాయ నిలుచునా!' అనెడి తెలుఁగునానుడి ఈ కల్పములోఁ జొప్పింపవలెనన్న ధోరణిలో ఔచిత్యముమాట లీలగానైన స్ఫురింపలేదుగదా! ఎప్పుడో వచ్చి స్వాగతము పుచ్చుకొని 'భక్ష్యభోజ్యాచమనములతోఁ'దనిసి తాను వచ్చినపనినిగూర్చి రావణుఁడు ముచ్చటించినపిదప కొంతసేపటికి 'సేమమా! శ్రేయమా! భద్రమా.' అన్న పల్లవితో మారీచుఁడు యోగక్షేమ మడుగుటలో అర్థమేమి! ఈ కోరికతో నీవు వచ్చితివి కావున ఈ పాటికి నీ సామ్రాజ్యలక్ష్మీ శ్రీరాముని శౌర్యవహ్నికి ఆహుతి కాలేదా! అన్న ధ్వని ఉన్నదని సారస్యము లాగవలెఁగాఁబోలు !! లక్కిమి దైవమఁట—లక్ష్మీపతికి ఎంత మద్దుమురిపములు గూర్చు భార్య దొరకినదయ్యా! వికృతి పదము లున్నవిగదా యని అడ్డమైన చోట యతిప్రాసల గడ్డుదనమునకడ్డము వైచుకొనుట దొడ్డకవుల లక్షణము గాదు. చనవయ్య లంకకని మారీచుఁడనఁగానే, హ స్త లీ లా సరోజాతమును బాఱవైచి రావణుఁడు ముంగిపోలె లేచిపోయినాఁడఁట.

ఏమను 'సమస్యలు' వచ్చినను ఎడమొగము పెడమొగముగాఁ గావలసివచ్చినను సంభాషణలో నేర్పు చూపుట మహాకవుల లక్షణము. తన ప్రభువునకు మారీచుఁడు చెప్పవలసిన మాట లెన్నో చెప్పిచెప్పి, రామలక్ష్మణుల మహామహిమను వర్ణించి యుద్ధము

లందలి అనర్థకములను వివరించి తుట్టతుదకు మహాప్రభూ! కోపము వలదు. ప్రసన్నుఁడవయి లంకానగరమునకు మఱలిపొమ్ము. అక్కడ నీ యంతిపురిలో సొంతభార్యలతో హాయిగా క్రీడించుము. ఇక్కడ శ్రీరాముఁడు ఈ యడవిలో తనభార్యతోఁ దాను క్రీడించును. అని హితము చెప్పఁగా రావణుఁ డప్పటికా మాటలు విని తన పట్టణమునకు ప్రయాణ మాయెనని వాల్మీకము వర్ణించినది. కల్పములో ఈ 'మోదాంత' మెక్కడిది! చనవయ్యా లంకకని విశ్వనాథ మారీచుఁడు వినురుగా అనఁగలిగెనేగాని 'ప్రసీద లంకేశ్వర! సాధు గచ్ఛ!' అన్న బంగారుపలుకు తుద కొక్కటియైన నోరార అనఁగలిగెనా! ఔచిత్యము, మానవుని ప్రకృతిలో ఉండవలెఁగాని తెచ్చిపెట్టుకొందమన్నచో అందఱ కందునా! అందదు. కవితలో సైతము దాని ఉనికిమనుకు లక్ష్యే ఉండకతప్పదు.

ఈ ఘట్టములో కల్పకర్త రావణుని ముంగిగాఁ జేసి వానిచేతిలో లీలాసరోజాతమును పెట్టుటలో అంతరార్థ మేమైన ఉన్నదా! దేవర్షులు వచ్చి తనతండ్రితో తన మనువునుగూర్చి ముచ్చటించుచుండఁగా అధోముఖియైన పార్వతి 'లీలాకమలపత్రాణి గణయామాస' అని కవికులగురువు కాళిదాసు ఆ కావ్యములో చెప్పఁగా 'హస్తలీలా సరోజాత'మచట రావణుఁడు పారవైచెనని కవిసమ్రాట్టు ఈకావ్యములోఁ జెప్పఁగలిగెను. అక్కడ పరిణయఘట్టములో నున్న పార్వతిచేతిలో లీలాకమలము ఉండఁగా, ఇక్కడ సీతాపరిణయఘట్టములో రావణుని చేతిలో 'లీలాసరోజాత'మున్నది. అక్కడ ఉన్నది కన్యకామణి కావచ్చు; ఇక్కడ ఉన్నవారు రావణబ్రహ్మ కావచ్చుస్త్రీలింగము చేతిలోనే లీలా సరోజాత ముండవలెనని కవిసమయమేమైన జ్ఞప్తికిఁ దేవలదుసుమా; అది శృంగారరంగము గావున పురుషుఁడైన—భూతమైన కిరాతుఁడైన — కీచకుఁడైన — వాని చేతిలో ఈ 'కమలాలు' ఉంచుటయే మంచిదని కల్పవృక్షమునుబట్టి మన మెంచవలసి యున్నది.

అంతటి తల బిరుసుగా బెట్టిదముగా 'చాలులేవయ్యా! చనవయ్యా' అన్న మారీచునకు రవ్వంతైన సమాధానము చెప్పక 'సరోజా

తము' పాఱవైచి బుఱ్ఱున విమాన మెక్కిన రావణుని కక్కడనే శూర్ప ణఖ దృష్టిగోచర మైనదని కల్పము వ్రాసినది. మారీచుని మాటలు విని లంకకుఁ బోయిన రావణునివద్దకు, శూర్పణఖ వచ్చి తనగోడు మొత్తుకొన్నట్లు వాల్మీకములోఁ గనిపించును. ఇక్కడ కనకసింహాసనా సీనుఁడై కొలువు తీర్చియున్న రావణబ్రహ్మ తేజస్సును - చరిత్రను ఇరువది శ్లోకములలో వాల్మీకిమహర్షి అత్యద్భుతముగా వర్ణించెను. ఆ ధోరణి తెలుఁగులో ఇక్కడ మందునకైనఁ గానరాదు. నక్క యెక్కడ! నాకలోక మెక్కడ! విజయవాడ ఎక్కడ! పుట్టంబుట్టువు వాటిక యెక్కడ! భారతమునకు దొరకినట్లు భాగవతమునకు లభించి నట్లు రామాయణమునకు తెలుఁగులో చక్కని అనువాదము దొరక లేదే అని ఇన్ని వందలయేండ్లుగా బాధపడుచున్న తెలుఁగువారికి, ఏనుఁగు కడుపున పందిపిల్ల పుట్టినట్లు కల్పము పుట్టుకొనివచ్చినది. కాని ఆ వింతపిల్ల పుట్టుటకు గిట్టుటకు అంతర మెంతో కాలము ఉండదని లోకానుభవము మనకుఁ జెప్పకయే చెప్పును. ఇట్టి తాలు - తప్పలు మఖలో పుట్టి పుబ్బలో గిట్టవచ్చు. ఆ పిదప—ఉన్నంతలో ఆ భాస్కరము ఆ గోపీనాథము ఆ మొల్లయే మనకు శరణ్యము కావచ్చు. ప్రకృత మనుసరామః

> 'రావణుఁడు లేచిపోయె. వ. అంత సామాత్యుండు విమానస్థుండైన రావణుని దృష్టిగోచరమైన శుర్పణఖ' [అర-153]
>
> వ. అంత శూర్పణఖ రావణుఁగాంచి యాశ్చర్యము కోపము శోకంబు వ్యక్తం బుగా నిట్లనియె [అర-156]

ఈ రెండు వచనపుముక్కల నడుమ పదమూఁడు పద్యము లున్నవి. ఆ జరిగిన విషయమును గూర్చి శూర్పణఖ, తన మనస్సులోఁ దానే అనుకొన్న భావములే ఆ పద్యములలోని వస్తువు. అనఁగా అక్కడ దృష్టిగోచరమైన శూర్పణఖ 'ఇట్ల'నుకొని అంత శూర్పణఖ రావణుఁ గాంచి ... ఇట్లనియె నని మన మనుకొనవలెను. ఇది మధ్యే మార్గమున జరిగిన ఘట్టమని చదువరులకు భ్రాంతి కలుగవచ్చును. రావణుఁడు సామాత్యుండు విమానస్థుండును అయినదెక్కడ! దారిలో

గాదు లంకానగరములో. శ్లో. సా దదర్శ విమానాగ్రే రావణం దీప్త తేజసం, ఉపోపవిష్టం సచివై ర్మరుద్భిరివ వాసవమ్ [అర–1107] పుష్పక విమానాగ్రమును అధిష్ఠించిన రావణుని శూర్పణఖ చూచెనన్న మాటకే కల్పము చెప్పిన ఆ తెలుఁగు. హస్తలీలాసరోజాత మచటఁ బాఱవైచి రావణుఁడు లేచిపోయి లంకానగరములో కొలువుదీఱియున్న తరుణములో శూర్పణఖ వచ్చెనని అమె ఆతనిని గాంచెనని ఆ 'కొలికి' ఒక్కముక్క ఎక్కడనేని చెప్పినచో 'కావ్యప్రౌఢి' తఱిగిపోవునా! మన కున్న ప్రాచీనవాఙ్మయములో నన్నయాదు లందఱును కథాతంతువు నెట్లు విచ్ఛిత్తి లేకుండ గగ్గులు కాకుండ అనుస్యూతము కావించిరో పరిశీలించి మఱి ఇట్టి కావ్యము లెత్తుకోవలసియున్నది. మురారే స్తృతీయః పంథా—అన్నచో సర్వత్ర ఆ యాటలు సాగునా! ఆ పప్పులుడుకునా!

ఆపదలో మునిఁగి అగతికయై వచ్చిపడిన ఈ శూర్పణఖ తన గోడు వెళ్లఁబోసికొను ఈ ఘట్టములో రావణుని ఠీవి ఇట్టిదని యెన్నోరీతుల వాల్మీకి వర్ణించెను. రాఁబోవు సీతాపహరణగాథకు ఈ ఘట్టము నాంది వంటిది. ప్రతినాయకుని ఉత్కర్షము వర్ణించి తన్మూలమున కథానాయకుని విశిష్టత చూపుట మహాకావ్యలక్షణము. ఆ యుత్కర్షము సైతము ప్రకృతకథకు ఉపయోగిగాఁ గలసిరావలెను. ఈ భావముతో వాల్మీకి మహర్షి రావణగుణగణవర్ణనము ఇక్కడఁ జక్కఁగాఁ జేసి చూపెను. దీని నే వ్యాఖ్యాతలు సైతము మెచ్చుకొని శ్లో. 'శ్రుత్వా దశగ్రీవగుణానువర్ణనం సర్గం విశిష్టో భవితా ధరిత్ర్యామ్' అని'సర్గశ్రవణ ఫలముగా ఉట్టంకించిరి. ఇది రవ్వంతగానైన కవిసమ్రాట్టు–ఈ కల్పములో అంటుకొనెనా! కవికి ఆ యా పాత్రలవిషయమై రాగద్వేషములు ఎంతగా బలిసియున్నను ఔచిత్యము పోషించుటలో కథాక్రమము నడపుటలో సామరస్యము పాటించుటలో ఏమఱుపాటు ఉండరాదు. ఇట్టి ఘట్టములలోనే కవిపదవాచ్యులకు మహాకవులకు అంతర మింతయని కొలతలు కట్టవచ్చును.

నిండుకొలువులో నుండి నిఖిలభూతములకే కాదు; సర్వలోకములకే భయము గొలుపుచున్న ఆ రావణబ్రహ్మను జూడఁగానే

శూర్పణఖ భయవిహ్వలయైనదఁట. శూర్పణఖ 'అభీతచారిణి' యని వాల్మీకి మనెను. బిడియము గిడియము భయము బండలు లేక యెక్కడికైన పోఁగల సత్తా గలది శూర్పణఖ యని దాని భావము. అంతటి కాలాంతకురాలుసైతము తన రూపరేఖలు అట్లయినందులకు భయమోహములచే మూర్ఛితయైనదనియు ఆవల తెప్పిరిల్లి కోపముతో రేఁగిపోయి పరుషవాక్యములు పలికెననియు మూలములో నున్నగాథను 'ఆశ్చర్యము కోపము శోకము వ్యక్తంబుగా నిట్లనియె' అన్న ముక్కలతో కల్పము మనకు వ్యక్తము చేసినది. ఆ నిండు సభలో ఆబిడ, రాజ్యపాలనములో పాటింపవలసిన లక్షణములు గూఢచారుల వైఖరులు విషయలోలుత్వములు యుద్ధములందు జయాపజయములు కోశసంరక్షణములు మున్నగునవి మున్ముందు చక్కఁగా బోధించి, వానిని రావణరాజ్యమున కన్వయించి అప్పుడు ఖరాది సర్వరాక్షససంహారకథను ఎత్తుకొనును. ఆ యెత్తుగడలోనే ఒక ఉదాత్తత కానవచ్చును ఆబిడ పేర్కొన్న తన దోషము లన్నింటిని దర్పితుఁడు బలవంతుఁడైన ఆ రావణుఁడు చాలసేపు ఆలోచనమునకుఁ దెచ్చుకొన్నాఁడఁట. అప్పుడు 'ఎవఁడమ్మా వాఁడు! వాని కథ యేమి! వాఁడు పట్టిన ఆయుధ మేది'యని ప్రశ్న వైచెనఁట. ఈ ధోరణిలో - ఒక దీనురాలను బలవంతుఁడైన అప్తుని రంగములో ప్రవేశపెట్టి భావిరామాయణగాథకు బలమైన బీజమును వేసి. కథను రమ్యముగా నడపి ఆదికవి మన కిచ్చియుండఁగా దానినే ఈ కల్పవృక్షము ఏమిచేసెనో ఎంతక్రిందికి దించెనో సహృదయులు పరిశీలించి లోకమునకుఁ జెప్పవలసియున్నది.

కల్పములో, ఎత్తుగడలోనే 'నీ కేమి మహారాజవు-' అని దెప్పి పొడుపు. మూలములో పెద్ద 'రాజకీయవేత్త'గాఁ గానవచ్చిన శూర్పణఖ కల్పములో ఒక మామూలు ఆఁడుఁగూఁతురుగాఁ దేలిపోయినది.

'అమ్మో! రావణు నప్పగారతివ రమే మాకీవి!
ఇయ్యందం బిది నా మొగానికి మొగంబే! యోయి పౌలస్త్యుఁడా!*

ఈ మాటలే విశ్వనాథ—శూర్పణఖ నోటికి ముందుగా వచ్చిన మాటలు. ఇట్టివి నాలుగయిదుమాటలే చెప్పి ఈ శూర్పణఖ 'అందగత్తె బైరాగికి నతివఁ జేయుదానికంటెను బ్రహ్మ ఛాందసము లేదు' అని సీతావృత్తాంత మెత్తుకొనును. 'నా పరాభవ మార్పుమనియు ఖరనాశమూ పగను దీర్పుమనియు నేను గోరఁబోవననియు, పాప మా జనకపుత్త్రికిసైతము త్వద్దయారసస్ఫురణము గల్గఁగోరెదన్' అని విశ్వనాథ శూర్పణఖ రావణబ్రహ్మతో పలుకును.

సీతాదేవి 'తరపున' ఈ శూర్పణఖ ఈ తీరుగ 'వకాల్తనామా' తీసికొనుట ఈ కల్పము మన కిచ్చిన క్రొత్తవస్తువు సుమా! ఆ సీతమ్మ అంద మెంతదని కల్పము, శూర్పణఖా ముఖముగాఁ జెప్పె నో విందురా!

'వ. తాతమ్మగారు సరస్వతీదేవిగారి సౌందర్య మెఱుఁగుదున. ఆలోచనకొలందిగాని యామె సౌందర్యము పొడకట్టదు. పరమప్రపితామహి భవాని సౌందర్య మెఱుఁగుదును. తదేకధ్యాననిష్ఠఁగాని యామె సౌందర్యము సౌందర్య మనిపించదు. సంగీతమువలె నాపాతమధురమైన సీత సౌందర్యమే వేఱు'. [అర 158 పు.]

అవురా! ఈ కల్పకర్త చేతిలోని నేర్పును చూపులోని తీర్పును ఏమని కొనియాడవలె! ఒకప్రక్క మునులనే నిత్యము తినునట్టి వట్టిగొడ్లుగా పోషించుకొనుచున్న ఈ రాక్షసజాతికి, వేఱొకప్రక్క—ద్విజులతో—విప్రులతో చుట్టఱికంబులు కట్టఁబెట్టుటయేగాదు; వీండ్రకు సరస్వతీదేవిగారు తాతమ్మగారులఁట. భవానిగారు పరమప్రపితామహిగారులఁట. వావివరుసలమాట దేవుఁడెఱుఁగునుగాని ఇది యేమి శయ్యా సౌందర్యము స్వామీ! ఆ యిద్దఱమ్మగారుల సౌందర్యము మీకును మీ శూర్పణఖమ్మకును నచ్చినట్లే మీ రచనాసౌందర్యము సైతము తెలుఁగువాండ్రకు ముప్పాతికమువ్వీసము నచ్చదన్న 'వదంతిని' ఒక్కసారియైన మనస్సులో ఆలోచనముఁ దెచ్చుకొని యుందురా!. పైగా, 'పనివడి నారికేళ ఫలపాకమునన్ జవియైన భట్టహర్షుని' పద్యమును ఉట్టంకించి, 'నా అంతస్తునకు రాఁదగ్గవానికే నా సత్తా అర్థమగును. కావున దిగవలసినది నేను గాదు; ఎగురవలసినది మీరే'

అని కోఁతలు కోసి 'ఎదురుకేసు' పెట్టెదరు కాఁబోలు !! ఆస్తాం తావత్ !! –.

ఆఁడువాంధ్ర అందచందములు అభివర్ణించు సందర్భములలో ఆంధ్రగీర్వాణములలో ఏ కవియైన దేవతలనో గంధర్వులనో కిన్నరులనో కింపురుషులనో ఉదాహరించుట మనము చూతుము. ఆమె పార్వతివోలె ఉన్నది, ఈమె సరస్వతివోలె వెలుఁగుచున్నది. లక్ష్మివోలె రాణించున్నది – అని అందచందములే చెప్పవలసిన ఘట్టములో ఆ ముగ్వురు అమ్మలను రంగమున కెవ్వరును దీసికొనిరారు. ఎంత దానవుఁడైనను రావణుఁడు, బ్రహ్మజ్ఞానియై పార్వతీ పరమేశ్వరులను– ఇలువేల్పులుగా ఆరాధించుకొనునట్లు కథలు విందుము. అట్టి పార్వతీదేవి అందముకూడ సీతాదేవి యందముముందు బలాదూరురా పోవరా! అనఁగానే రావణుఁను ఉబ్బిపోవునని శృంగారరసప్రవణుఁడు విశ్వనాథుఁడు భావింపవచ్చును. రాక్షసుల మొగాననైతేమి ఇట్టి సాదృశ్యములు తెచ్చుట 'సనాతనకవికి' సంప్రదాయము గాదు ఒక వేళ, మూలములో నున్నచో కాదనలేముగాని ఆర్షకవుల కీ కర్మ మొదలకుఁ బట్టును ! వాల్మీకి శూర్పణఖ, అన్న ముక్క లివిగో!.

'శ్లో, దేవతేవ వనస్యాస్య రాజతే శ్రీరివాపరా, తప్తకాంచన వర్ణాభా, రక్తతుంగనఖీ శుభా, సీతానామ వరారోహా వైదేహీ తను మధ్యమా. నైవ దేవీ న గంధర్వీన యక్షీ న చ కిన్నరీ, నైవం రూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే.' ఇత్యాది. ఈ తీరుగ ఆ శూర్పణఖ చిత్రించి,

'భార్యార్థే చ తవానేతు ముద్యతాహం వరాననాం, విరూపితాఽస్మి క్రూరేణ లక్ష్మణేన మహాభుజ' – అని ఇంకొక్క ముక్క, సమయమునకుఁ దగినట్లు పలికినది. అనఁగా, సోదరా! అంత అందగత్తెను నీకు భార్యగాఁ దేవలెనని నేను ప్రయత్నము చేయఁగా ఆ క్రూరుఁడు లక్ష్మణుఁడు న న్నీరీతిగ విరూపను జేసినాఁడన్నమాటలో ఎంత అర్థ మున్నది ! ఈ భావము రవ్వంతైన విశ్వనాథ శూర్పణఖ

పొట్టలోఁ బుట్టెనా ! ఎందులకుఁ బుట్టును ! ఆయన త్రేతాయుగపు కవి; ఈయన పాపిష్ఠ కలియుగపు కవి. కాఁగా సౌందర్యపరీక్షలో మాత్రము 'తెలుఁగు మీఱిన' విశ్వనాథమునందు వాల్మీకి 'గీర్వాణము' సైతము తేలిపోయినది. ఆపాతతః — మనము పరిశీలింపఁగా 'సౌందర్యము' భౌతికముగా మానసికముగా రెండు తెగలలో స్ఫురించును. ఆమె 'సుందరి' యనఁగానే చప్పున దైహికసౌందర్యమే మనకుఁ దోఁచును. భీముఁ 'డుగ్రసుందరుఁ'డనఁగా అది వేఱు. కావ్యసౌందర్య మన్నను సంగీతసౌందర్యమన్నను శరీరసౌందర్యము వంటిది గాదని చిన్నపిల్లలకు సైతము మనము చెప్పవలసినపని లేదు. సీతాసౌందర్యము ఆపాతమధురమైన సంగీతమువంటి దనుటలో సారస్యము చచ్చినది. ఆలోచనామృతమైన సాహిత్యసౌందర్యమే సంగీతసౌందర్యముకన్న మిన్నయని అభిజ్ఞులందురు. భౌతికముగా మిలమిల మెఱయు వన్నెచిన్నెల వంటిదే ఆపాతమధురమైన సౌందర్యము. నాలుగు కాలాలు నిలిచి నవకముగా పెరిఁగి బలిసి ఆనంద మిచ్చునదే రెండవ సౌందర్యము. అట్టి దీనిని గాదని ఆపాతమధురముచే ఆబిడ మెచ్చుకొనెననఁగా — అది రాక్షసజాతి కొలతయైనఁ గావచ్చు; 'లోకో భిన్నరుచి' యైన ననవచ్చును.

ఇంతకు — ఈ సౌందర్యములు తేలినపిదప 'అన రావణుండు రాముండని యెవ్వఁడు లక్ష్మణుండటంచని యెవఁడున్, వనజాక్షి సీతయును రాముకుం గామినియ చెప్పుము సవివరమనన్' అని రావణుఁడు తోఁబుట్టువు శూర్పణఖను ప్రశ్నించెనఁట. వెనుక మారీచునితో మాటాడు నప్పుడే 'వనవాసి రాముఁడు ఖరదూషణాదులను జంపెనన్న' కథను రావణుఁడు చెప్పియుండుటచే [అర-152 పు] మఱల క్రొత్తగా, ఎవరమ్మా! వాండ్రు! అని రావణుఁడు తోఁబుట్టువును ప్రశ్నింపవలసిన పనిలేదు. అయినను, ఆ కథనే వెనుక అకంపనుఁడు తనకుఁ జెప్పియున్నను ఈమె ముఖముగాఁగూడ విని కర్తవ్యము చూచుకొనవచ్చునని రావణుఁ డనుకొనవచ్చును. బహుశః — అందులకే

ఈ కల్పకర్త 'చెప్పుము సవివరమనన్' అని దళము వేసియుండఁ వచ్చు. కాని, వివరమనఁగా బిలము – దూషణము; వివరణమనఁగా వ్యాఖ్యానము. 'వివరముగా' అని వ్యవహారములో ఈ యర్థమున ఉన్నంతమాత్రాన ఈ పదమును ఈ యర్థములో విద్వత్కవులు వాడరుగదా !.

'కలిగియుండను వలయునుగాదె చూడఁగాను సీతను పిచ్చిబికారితోడ' [ 157 ].

ఇది శూర్పణఖ మాట. ఈ పద్యపాదములో సొగసు మనము చూడవలెను. 'కలిగియుండన్ – వలయున్ – కాదె – చూడఁగాను – సీతను – పిచ్చి బికారితోడ' ఈ పదములను మన కవీశ్వరులు అనుకొన్నభావమునుబట్టి ఈ వరుసలో కుదింపవలసియున్నది:– సీత, పిచ్చి బికారితోడ కలిగియుండను. (మనము – అధ్యాహార్యము) చూడను వలయునుగాదె ! ఇందును ఇంకొక 'అపస్మారకము'. సీత బికారితోడ కలిగియుండుట వ్యాకరణ మంగీకరింపదు. బికారిని గలిగియుండుట యనవలె. కాదు కాదు; జ్ఞప్తికి వచ్చినది. పాప మీ మహాకవి ఈ కావ్యకన్యను సృష్టించి, పదిలముగాఁ జూడవయ్యా అని 'చిన్నయ్య' చేతిలోఁ బెట్టఁగా ఆ 'యిరుబాసల దిట్ట' సరే యని తనకు నచ్చిన అచ్చువారి కిచ్చెఁగాఁబోలు! వారి ధర్మాన మనకీ కర్మము ద్విగుణముగా త్రిగుణముగా పెరిఁగి పెద్దదయినదనవలె. లేనిచో, పాపము ఈ కవి సమాశ్రిట్టు 'కలిసి యుండను వలయునుగాదె' అని బహుశః వ్రాసికొని యుండఁగా మన కంటికి ఈ యచ్చులో 'కలిగి'యుండను వలయునని ఏల యుండును ! పోనీ, యిట్టివి యింకొకసారి కంటికి అడ్డుపడినవి బుఱ్ఱకు ఎదురైనవి ఏరి – లాగి గ్రంథాంతమున 'పట్టిక' వేయించినచో మనకుఁ గొంత బాధ తగ్గవచ్చునే ! అయినను అవశ్య మనుభోక్తవ్య మన్నట్లు – ఈ కవనములో పదముల నడక – వచనపు సొగసు – క్లిష్టాన్వయపు సొంపు – ఇత్యాది కష్టములలో లెక్క కిది యొకటికూడఁ జేరవచ్చునుగదా యని సమర్థించుకొని చదువుకొందము.

'భూవుల రాచవాని దగుఁబోడిమి గుర్తిడె దుర్ముఖుండు నా
దేవుఁడు రాముఁడాతని వధించి మహోపకృతిం బొనర్చె.' [అర - 155]

దుర్ముఖుండున్—అ అని కవివివక్ష కాఁబోలు. అక్కడ అ లేని సముచ్చయమువలన, ఆ దేవుఁడు నా దేవుఁడై నా భర్తయన్న అపార్థమును సైతము తెచ్చిపెట్టినది. ఇట్టివి ఈ రచనకు క్రొత్తవి కావుగదా! శూర్పణఖ చెప్పిన దంతయు విని రావణుఁడు కర్తవ్యము నిర్ణయించుకొని స్థిరచిత్తుఁడై తన కిష్టమైన రథము నెక్కి ప్రయాణమాయెను.

ఆ తెల్లని పూలమాలలతో వైడూర్యకాంతులవంటి ఒంటితో తప్తకాంచనకుండలములతో దర్శనీయమైన దుస్తులతో ఆ రథము అధిష్ఠించి పోవుచుండఁగా దశగ్రీవుఁడు దశశీర్షాల పర్వతమువోలె మనోహరముగాఁ గానవచ్చెనఁట. అంబరతలాన రథాధిరూఢుఁడైన ఆ రాక్షసేశ్వరుఁడు, బలాకపంక్తులతో తళతళలాడు విద్యుల్లతలతో పరువులు తీయు నీలమేఘమువోలె భాసించెనఁట. ఆతని రథ మా తీరుగ మేఘనాదము చేయుచు సముద్రతీరము చేరెనఁట. [వాల్మీ-అర-1114 పు]

రావణప్రయాణమునుగూర్చి వాల్మీకి వర్ణించిన విశేషము లివి. ఆతఁ డెంతటి దుష్టుఁడైనను ఆతనిలోని విశిష్టత సమయము వచ్చినప్పుడు చక్కఁగా విప్పిచెప్పుట ఆదికవికి అభ్యాసమైనది. అందును, సర్వ వాఙ్మయమునకు తలమానికమైన సంస్కృతవాఙ్మయములో ఆతఁడు 'మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః!' అనిపించుకొన్నవాఁడాయె. 'ఉపమా కాలిదాసస్య' అని పేరు మోసిన కవికులగురువంతవానికి ఆ విద్యలో అక్షరాభ్యాసము చేయించిన మహోపాధ్యాయులు వాల్మీకులేగదా! అనఁగా మధురాతిమధురములైన అలఁతి యలఁతి పదములలో అనంతమైన యర్థములను మప్పి అడుగడుగునకు ఉపమాన సౌందర్యమును అగ్గలముగాఁ జూపనేర్చినవారు సంస్కృతాంధ్ర వాఙ్మయములలో నాకుఁ దెలిసినంతవఱకు ముప్పురే మూవురు. ఒకరు వాల్మీకులు; వేఱొకఁడు కాలిదాసు; ఇంకొకఁడు తిక్కయజ్వ.

'విద్యున్మండలవా న్మేఘ స్స బలాక ఇవాంబరే'[రామా1114]

చూపుల కియ్యవి చిన్నముక్కలే కావచ్చు. అక్కడ విద్యున్మాలం డల యుండెనఁట - ఇక్కడ రావణుని కొంటెనిండ నగలు నాణెము లుండెనఁట. అక్కడ మేఘము - ఇక్కడ రావణుఁడు. అక్కడ బలాక పంక్తి - ఇక్కడ కామగమైన రథము. ఇత్యాది వర్ణనములతో వాల్మీకి, ప్రతినాయకుని మనకు ఎన్నోచోట్ల చిత్రించి యిచ్చెను. మున్ముందుగా ఆతఁడు చేరవలసినది సముద్రతీరముగాన ఆతఁడొక మేఘమువంటివాఁ డనుటలో అంద మున్నది. అదే ఔచిత్యము. ఈ ఘట్టమే యెత్తుకొని రామాయణ కల్పవృక్షకర్త ఏమన్నాఁడో విందురా!

'కం. పదితలలపాము క్రతుసంపద తూలించెడు నఘంబు బయలువెడలె నాన్
మొదలిఁటి యసత్పదార్థము పది విశ్రుతాస్యములతోడ బయలువెడలె నాన్.

గీ. విద్యయును నవిద్య శౌర్యంబు భీరుతయును ధైర్యము భయంబు పరమహాదాత్త్య
రేఖ, మత్సరతయుఁ బ్రతీపసామగ్రి కలసి మోహనామోహనాకృతి
పూనె ననఁగ' [అర - 161 పు].

దశగ్రీవుఁడు, దశశీర్షపర్వతమువోలె ఆదికవిమదికి స్ఫురింపఁగా తెలుగుకవి తెలివి కీతఁడే పదితలలపాముగాఁ దోఁచెను. రావణుని విద్యలో అవిద్యలో లీనమైయున్న మోహనామోహనాకారమును విశ్వనాథకవి చూడఁగలిగినట్లుగా ఆదికవి చూడలేకపోయెను. శూర్పణఖ మాటలు విన్నవెంటనే విశ్వనాథరావణుఁ డెకాయెకీని రథ మెక్కి ప్రయాణమగును. అసలు జరిగినది - అనఁగా వాల్మీకులు చెప్పినది ఇది గాదు.

'శ్లో. తత శ్శూర్పణఖావాక్యం తచ్ఛ్రుత్వా రోమహర్షణం,
సచివా నభ్యనుజ్ఞాయ కార్యం బుద్ధ్వా జగామ సః'-ఇత్యాది[1113పు]

ఒడలు గగుర్పాటు పుట్టునట్లులు శూర్పణఖ చెప్పిన దంతయు రావణుఁడు విన్నాఁడఁట. 'కార్యం బుద్ధ్వా' - ఏమి చేయవలెనో తెలిసికొన్నాఁడు. అప్పుడు మంత్రులను బంపివైచి లోనికిఁ బోయి ముందువెనుక లాలోచించెనఁట. గుణదోషాల బలాబలాలు ఆచితూచి చూచుకొనెనఁట. ఆపైని 'కృత్వా నిశ్చయ మాత్మనః'-ఒక నిశ్చయము

చేసికొని స్థిరబుద్ధియై యానశాలకుఁ బోయెనఁట. ఇక్కడ 'గుణదోష పాల బలాబలా'లనుటలో ఆదికవి దూరదృష్టిని మన మర్థము చేసికొనవలెను. అట్టి విషమసమస్య కన్పట్టు ఘట్టములో ఆ మహావీరుఁ డేమి చేయవలెను! తన బలగమూ చాలమంది నశించిరి. చెల్లెలకు వల్లమాలిన పరాభవ ముద్భవిల్లినది. కలలోనైన నవ్వులకైన ఊహింపరాని అనఁకోరాని ఒక యిర్వురు మానవులు ఇంతపని చేసిరి. సరాసరి దండెత్తి పోవుట సముచితము గాదని ఆ దురవస్థ అనుభవించి ఆ పరిస్థితి గమనించి వచ్చిన ఇరువురు ముఖ్యులు తనకు విన్నవించిరాయె. రాజకీయముగా మాయోపాయము లున్నవిగదా! మనస్సు గట్టిచేసికోవలెనని గుణదోష ప్రాబల్యదౌర్బల్యవిషయమై చర్చించుకొన్నాఁడఁట ఇప్పుడు నేను జేయవలసినది 'సీతాపహరణము'. అది శౌర్యముచే సాధ్యమా ! చౌర్యముచే భావ్యమా!! ఏ పక్షములో మెఱుగున్నది; ఏ పద్ధతిలో తెఱుగున్నది ! ఖరాదియుద్ధవార్తలవలన రాముని పరాక్రమము నిర్వక్రమమని తెలిసినదికావున నిరపాయమైన యుపాయమే ఇప్పుడు కావలసియున్నది. దానికి చౌర్యమే మూలము. చౌర్యమే జరిగినను రాముఁడు వెంటపడఁడా! లేదు. ఆతఁడు కామి యని తెలిసినది. సీతారహితుఁడై ఆతఁడు ఆ వ్యసనములోఁబడి మనజోలికి రాలేకపోవచ్చు; చచ్చిపోవచ్చు. కావున ఈ పక్షమే ఇప్పటికి మంచిది. అని నిశ్చయించి రావణుఁడు యానశాలకు ప్రచ్ఛన్నుఁడై వెళ్లెనఁట. ప్రచ్ఛన్నుఁ డనుటలోను మంచియర్థ మున్నది. తాను జేయఁదలపెట్టినది చౌర్యకార్యము. శౌర్యమును వీడి చౌర్యమును జేపట్టుట తనంతవానికి సిగ్గుచేటు కావచ్చు. ఇది గుర్తింతురనియే 'సచివానభ్యనుజ్ఞాయ' అని సభలో నున్న మంత్రులను బంపివైచెను. ఈ సంకల్పము బయటికి పొక్కెనా వయసులో పెద్దలయిన తన బలఁగము అడ్డగింపవచ్చు; మందోదర్యాదులే కాదుగూడ దనవచ్చును. అందులకు రావణుఁడు ప్రచ్ఛన్నముగా యానశాలకుఁ బోయి తన కిష్టమైన రథ మెక్కి ప్రయాణము చేసెనని వాల్మీకి మనకు కథ వినిపించెను. ఈ కథలో ఈవార్త రావణుఁడు గూఢముగా నుంచెననియే మనము

వినుచుండఁగా కల్పములో 'అంత రావణుఁడు ప్రచ్ఛన్నవేషుఁడు... రథం బెక్కె [160] అని వినవచ్చినది. వేషము గాదు ప్రచ్ఛన్నము. మార్గము ప్రచ్ఛన్నముగ ఉండవలెను. ఇంతవఱకు మనము విన్న రావణుని యూహ లేవియు కల్పములోఁ గానరావు. 'ఈ దిక్కున నీతి సస్యములు తెచ్చిన నాటుట పండుటొక్కఁడై'(160) అని యేదో ఒక అనిర్వచనీయమైన ఊహతో విశ్వనాథరావణుఁడు యానశాలకు వెడలినాఁడు.

'సముద్రము చన్న' యతని కా ప్రాంతమున అనేకదృశ్యములు కన్పించినవఁట ఈ 'దృశ్యములను' కవితలో మనకుఁ జూపుటలో సైతము ఆదికవికి విశ్వనాథ కవికి హస్తిమశకాంతర మంతర మున్నది. అక్కడ నొక్క న్యగ్రోధవృక్షమును రావణుఁడు చూచెను. అది నూఱామడల నిడివి కలదై ఒకానొక మేఘమువోలె కన్పట్టెనఁట. దాని విశిష్టత సుస్పష్టమగుటకయి మహాబలవంతుఁడయిన గరుత్మంతుని పూర్వగాథను 'నాలుగయిదు శ్లోకాలలో' వాల్మీకి చక్కఁగా వర్ణించెను. 'శ్లో. తం మహర్షిగణై ర్జుష్టం సుపర్ణకృతలక్షణం నామ్నా సుభద్రం న్యగ్రోధం దదర్శ ధనదానుజః' [ఆర - 1117పు] ఆ చెట్టునీడలో మహర్షు లెందఱో తపస్సు చేసికొనుచున్నారఁట. దానిపేరు సుభద్రము. ఆ నాఁడు గరుడుఁడు విఱుగఁగొట్టిన ఆ కొమ్మగుర్తులు నేఁడుసైతము కన్పించుచున్నవఁట. అట్టి చెట్టు నా రావణుఁడు గాంచి దానిప్రక్కగా కొంతదూరము పోయి మనోహరమైన ఒకానొక యాశ్రమములో మారీచుని జూచెనఁట.

ఇక్కడ న్యగ్రోధవృక్షవర్ణనమునకై కావలసివచ్చిన గరుత్మంతుని కథ, రామాయణకల్పవృక్షములో పంద్రెండు పద్యగద్యములలో నిండి ఒక యుపాఖ్యానముగా సిద్ధమైనది. పోనీ! ప్రసంగవశమున వచ్చిన ఈ యుపాఖ్యానమైన మనోజ్ఞముగా నున్నచో సంతోషింపవచ్చు. అట్టి భాగ్య మీ 'కల్పములో' మన కెన్నఁడేని దొరకునా! ఇక్కడికి వచ్చినది రావణుఁడు. అతఁడు చూచిన దొక మఱ్ఱిచెట్టు. దాని

విడిగినకొమ్మకు ఒకానొక పూర్వగాథ. అంతే మనకు ఇప్పటికిఁ గావల సినది దీనిని 'పచ్చని కన్నులన్ గగనపద్మ' మన్నపద్యముతో [౨౪- 163 పు] ఎత్తుకొని, ఇంతకు మున్ను ఈ గరుడుని గాథ వినని చదు వరులకు – ఈ కథ ఆద్యంతము లంతుపట్టని ధోరణిలో తికమకలుగ 'రేఖాచిత్రము'గ శాఖాచంక్రమణముగ 'కల్పము' వినిపించును. 'హారిః ఓమ్మని' ఈ కథలో మొదటిపద్యములోనే 'మింటిలోఁ జొచ్చు స్వతంత్రుఁడో గరుడి చూచుచు వీపునయందుఁ బాములన్' అని, కథలో గజిబిజి – పదములలో తబ్బిబ్బు ప్రబ్బినవి. ఇది నవల కాదే; నాటకమును గాదే ఇట్టి కావ్యములో ఏదేని కథను వినిపింపవలె నన్న – 'ఉపక్రమోపసంహారము' లెట్లుండవలెనో నన్నయాదులు చక్కఁగా మనకు ఎన్నోరీతులఁ జెప్పిరే! మనము వ్రాయఁబోవు కథ– అది వినని వారికి వినిపింపవలెనన్న ధోరణిలో నడువవలెను. వెనుక మీరు విన్నదేకదా ఈ కథ యన్న ధోరణి మదిలోఁ బెట్టుకొని గజి బిజిగా దానిని నడుపరాదు తల్లి – దాస్యములో మ్రగ్గుచుండఁగా తాను – పాములను వీఁపున మోసికొనుచు కొన్నాళ్లకు అమృత భాండము తెచ్చి, ఈయవలసినవారి కిచ్చి ఆ గరుత్మంతుఁడు మాతృ దాస్య మెట్లు పోఁగొట్టెనో ఈ వృత్తాంతమును 'పచ్చని కన్నులన్–' ఇత్యాదిపద్యములు బొత్తిగా చెప్పనేచెప్పలేవు. 'గరుడి చూచుచు వీఁపునయందుఁ బాములన్–' ఇందు గరుడి చూచెడిదేమి ! పాము లను. ఎక్కడ ! వీఁపునయందు. ఎవని వీఁపునయందు? తన వీపున యందే. గరుత్మంతుఁడు తనవీఁపున పాములను బెట్టుకొని పైకిఁ బోవు చున్నాఁడని, ఇతరగ్రంథపరిజ్ఞానమువలన మన మర్థము చేసికొనవలెను. 'వీఁపునయందుఁ బాములన్ జూచుచు మింటిలోఁ జొచ్చు – అని యుండవలసిన అన్వయమునకు 'యతి' అడ్డువడి విడ్డూరము తెచ్చి పెట్టెను. 'మీ రెవ్వరంచు నడుగఁగ–' [163పు] ప్రసంగమును బట్టి మీ రెవ్వరయ్యా యని రావణబ్రహ్మ అడిగెనేమో యని యను కొనరాదు. 'దోరింపంబడితి మగ్నితో సూర్యునితో' అని వీఁపున నున్న ప్రాణులు అన్నట్లు – 'ఒక డైలాగు' లోనికి దిగినది. 'అగ్నితో–

సూర్యునితో' అనఁగానే అగ్నిదేవుఁడు సూర్యభగవానుఁడు ఇర్వురు నిక్కడికి రారుసుమా! ఈ కవనమునకు అర్థ మేమనఁగా, సూర్యునిలో నున్న మంటలకు దోరింపంబడితి మనియే. ఆ సంభాషణలో 'అందొక్కఁ డిట్లన్నాఁడఁట— 'పుట్టి నిముసంబు కాలేదు భూమి యాకసంబు సూత్ర పట్టినయట్లు సాగినావు' — అని. [అర - 164 పు] పుట్టి నిముసము కానిదెవరికి! గరుడునకు, ఈ మాట అన్న దెవరు! వీఁపున నున్న ఒక పాము. అది పుట్టి యెంతసేపైనది! 'అప్పుడే విచ్చిన గ్రుడ్డు డిప్పలలోనిది' కావున [163] దాని కెంతో వయస్సు ఉండియుండదు. ఈ సంభాషణములో వెక్కిరించుట లేదుగాని ఈ ఘట్టము 'గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించి'నట్లే నడచినది. పుట్టి నిముసంబుకాలే'దన్న మాటవలన, తల్లిదాస్యములోనే పుట్టిన ఈ గరుడి తానుసైతము పుట్టినవెంటనే సేవకావృత్తి వహించెననియు, వెంటనే ఈ పాములను వీఁపున వేసికొని భూమి యాకసంబు సూత్రపట్టినయట్లు సాగెననియు— ఒక 'భ్రాంతి' కలుగుటకు ఈ 'రచన' అవకాశ మిచ్చుచున్నది. ఈ సాగుట, ఇప్పటిది కాదు;

'బలవన్నిజదేహసముజ్జ్వలప్రభా
భూతపతంగతేజుఁ డుదితుండయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః
ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీథికిన్'

[భార. ఆది. 2. 38]

అని 'నన్నయ్య' చెప్పిన భావమునే ఈ కవిసమ్రాట్టు ఈ 'భ్రాంతి'లో పొదివెను. అనఁగా ఈ సూత్రపట్టినట్లు సాగుట. వీఁపున పాములను మోయునాఁటి 'సమాచారము' కాదనియు, ఆ తార్క్ష్యుఁడు ఉదితుఁడయి వెంటనే ఆ పని చేయఁగలిగెననియు, ఆ మహిమ గుర్తించి ఇంతకు రవ్వంతముందే 'గ్రుడ్డు డిప్పలలోనుండి వెచ్చని పెక్కలవలనఁ బుట్టుకొని వచ్చిన ఈ వీఁపుమీఁది పాఁపపిల్లగాఁడు పలికెననియు మనము ఊహించుకొని సమన్వయించుకొనవలెను..

'సమ్యక్కరణుండు నింద్రసఖుండై తొలఁగించెను దల్లిదాస్యమున్.
కం. చని సాగరాంతవేలావని నేకాంతప్రదేశపరంజితమై
చను నాశ్రమంబు మారీచుని యునికిని రావణుండు చూచుచు నిలచెన్' [165]

తల్లిదాస్యమును దొలఁగించె నన్నవెంటనే, రావణుండు చని మారీచుని యునికిని జూచుచు నిలచెనఁట. ఈ గరుత్మంతుని కథ రావణుని మ్రోలనే జరుగుచున్నదేమో అన్నంతగా ఈ పద్యరచన సాగినది. ఆతఁడు చూచిన ఈ న్యగ్రోధ మింతదయ్యా! యని ఈ పూర్వగాథ నుదాహరించి కావ్యకర్త తనమాటలలోఁ జెప్పవలసిన యంశమును ఈ 'కల్పము' తబ్బిబ్బు చేసినది. జలచరము నీళ్లలోఁ దిరుగుచు అక్కడ మునిఁగి ఇక్కడఁ దేలి, ఏ దిక్కునకో సాగి ఎక్కడనో కన్పించునట్లు, ఈ కల్పవృక్ష కర్త ఈ తీరుగ కథలు వ్రాసినచో, ఈ కథలు మున్ను వినియుండని పాఠకుల బుఱ్ఱకు ఇవి యెట్లు లర్థమగు ననిఊహించునో మన కర్థ మగుట లేదు. కథాకథనశక్తి బొత్తిగా తెలుగైన ఈ కవీశ్వరుని రచనను 'ప్రౌఢరచన'యని పేరుపెట్టి బిరుద్మార్థము పట్టెడి వందిమాగధులకు విద్వజ్జనులు బుద్ధి చెప్పవలసి యున్నది. ఈ కల్పవృక్షములో ఉపకథలను జెప్పవలసిన యన్నిచోట్లను ఇట్టి గజిబిజి ఉండితీరును. ఇది పురాణవాఙ్మయమునకుఁగానీ ప్రబంధ వర్గమునకుఁగానీ బొత్తిగా పనికిరాని ప్రత్యేక కావ్యదోషపదార్థములోఁ జేరఁగలదు.

ఈ ఘట్టములోని పదముల పొలకువ చూతము :—

'విజ్ఞాపన చేసినట్టి విధము' [అర–160] సంస్కృతములో అకారాంత నపుంసకమైన ఇది తెలుఁగున 'విజ్ఞాపనము' కావలెను. మన కవనము లోని గణములకోసమై కంటికిఁ గన్పించిన వన్నియు చరిత్రాదులలోఁ జేర్చి సమర్థించుకొనుట నేర్పు గాదు.

'అంత రావణుండు... రథచోదకుని సభయవేగసజ్జితము పిశాచ వక్త్రఖరయుగ్యంబు రథం బెక్కి' [అర–160 పు] ఈ ముక్కలకు మూలమైన శ్లోకముకూడ విందము:—

'శ్లో. సూతం సంచోదయామాస రథస్సంయోజ్యతా మితి. ఏవముక్తః క్షణేనైవ సారథిర్లఘువిక్రమః, రథం సంయోజయామాస తస్యాభిమత ముత్తమం, కాంచనం రథ మాస్థాయ కామగం రత్న భూషితం పిశాచవదనై ర్యుక్తం ఖరైః కాంచన భూషణైః '[అర-1114పు] రావణుఁడు ఆజ్ఞాపించిన వెంటనే ఆ సారథి, పిశాచముఖాల కంచర గాడిదల రథమును పూంచెనఁట. మూలములోని ప్రతిపదమునకు తెలుఁగు వ్రాయవలె నని ఈ కల్పకర్తకు నియమము ఉండవలెనని మనము భావింపరాదుగాని, అందలి సాభిప్రాయములను దీసివేయక వికారాకారములను సృష్టింపక కనుగలిగి తెలుఁగునకుఁ దేవలెనని చెప్ప వచ్చును. 'లఘువిక్రమః' అని సారథి కున్న విశేషణ మెగిరి 'సభయ వేగసజ్జిత' అన్న క్రొత్తపదము తెలుఁగున వెలసినది. ఈ రెండుపంక్తుల వచనములో వేసిన ఆ మూఁడు సమాసములు సరళముగా నడచినవి కావు. 'రథచోదకుని సభయ వేగసజ్జితము'— ఇది యొక వింతమాట. ఆ రథచోదకుఁడు భయపడి వెంటనే (ఆ రథమును) ఆయత్తము చేసె నఁట. సజ్జితమన్నది రథమునకు విశేషము 'చోదకుని సభయ...' అన్నది తెలుఁగుషష్ఠీసమాసము. ఈ పొందిక—ఈ పొంకము వచనములో సైతము మనము చూచి ఆనందింపవలెనని కల్పకర్త సంకల్పము కావచ్చు. 'పిశాచవదనై ర్యుక్తం' అన్నమాటను విన్న తెలుఁగువానికి పిశాచవక్త్రఖరయుగ్యంబు' వినవలసి వచ్చినపుడు 'పిశాచవక్త్రమైన' కవిత్వమే జ్ఞప్తికి రాకతప్పదు. మన సొంతములు మానివైచి, మధురాతి మధురమైన ఆ వాల్మీకిపదములను ఉన్నవి యున్నట్లుగా తెలుఁగులో దించినను వెనుక ఎన్నఁడో మనము విన్నట్లుగా అవి మనస్సు నాకట్టివైచి మన కానంద మిచ్చును. ఆ భాగ్య 'మీ కల్పము'లో మందుకైన అందదాయె. ఈ కల్పము ధరించినట్లు నటించు అఱనున్నాల తొడవులలో 'మొదలిఁటి' మొదలయిన పదములు చూఁడగా 'వద్దన్న కొద్ది ముద్దు' వచ్చుచున్నది. 'సముద్రము చన్న యతనికి'[161పు] అనఁగా ఆతఁడు సముద్రతీరమునకుఁ బోయినాఁడని భావము. ఇది ఈ కల్పములోని 'కావ్యభాష.'

పక్షులు చూలెంతరాండ్రయి వృద్ధవృక్షకషాయనిర్యాసములు చప్పరించుచున్నవఁట [అర-161 పు.] మూలములో 'నిర్యాసరసమూలానాం చందనానాం సహస్రశః, వనాని పశ్యన్' అన్నదానిలోని 'నిర్యాస'వర్ణనము తెలుఁగులో ఈ తీరుగ దిగియుండవచ్చును. నిర్యాసరసమనఁగా చెట్లకుఁ బట్టెడి ఒకానొక బంక. మూలకమను ఓషధులలో హింగురూపమైన నిర్యాసము వెడలునని ప్రసిద్ధి యున్నది. చందనవృక్షములలోని నిర్యాసరసమును వాల్మీకి మన కీయఁగా కల్పవృక్షములోని వృద్ధవృక్షములు మనకు, మనకుఁ గాదు—చూలెంతరాండ్రయిన పక్షులకు కషాయమైన బంక నిచ్చెనఁట. ఆ పక్షులు ఆ బంకను జప్పరించుచున్నవఁట. ఇవి పక్షులలోని 'వేవిళ్ల'లక్షణములుకాఁబోలు! అహహా! కవిసమ్రాట్టుల భావనాబలము'! ఇందులకే రవి గాంచనిడియుఁ గవి గాంచునన్నారు. చూలు – అనఁగా గర్భము. ఆలు – అనఁగా స్త్రీ. చూలెంతరాండ్రు పక్షులఁట! ఎంత దివ్యమైనమాట. పక్షులకు లక్షణయా చూలెంతరాలుఁదన మిచ్చి ముసలిమానుల [మ్రాకుల] బంక చప్పరింపఁజేసిన ఈ మహాకవి నెంతైనఁ గొనియాడవలెను. రెండవది ముసలిలేళ్ల నోటిపూతకు నేరేటిపొదల నిర్ఝరవారి పుక్కిలింతల మందు [161 పు] మూఁడవది తొండలకథ. ఆ తొండలకు ఏమి తిన్నవోగాని నోటి శుభ్రత కావలసివచ్చెనఁట. దానికై లవంగకవల్లి తుదికాడను గొఱికివైచినవఁట. మనము లవంగములు నోటి'శుభ్రత'కై వాడుకొనఁగా ఈ తొండలువాని నోటిశుభ్రతకై లవంగపుతీగల కాడలకొనలు కొఱికినవి అవురా! ఇది యెంతటి స్వభావోక్తి! నిత్యము, మనము పొట్లతీగెలలో కాపునకు వచ్చిన కొనగొమ్మలు తొండలు కొఱుకుట చూతుముగాని, ఈ రహస్యమును గుర్తించి వర్ణింపఁగలమా!

రావణుని రథధ్వని సముద్రము నగరములయు మ్రోతలు చీల్చుకపోవుచున్నవఁట [163] ఇదియు ప్రౌఢవర్ణనమేసుమా! చీల్చుకపోవుట – ఈ కవిదృష్టిలో అందము కావచ్చు. కావ్యదృష్టిలో రోఁత వేయవచ్చును. మహోదధిపయోధిని దాఁటి [163 పు] ప్రాసకోస

మేడ్చితివన్నట్లు — ఈ పదముల జంట పైకి ముచ్చటగానే కన్పింప వచ్చును. ధీ యనఁగా బుద్ధి, లేక మతి. అదికాదు ఇక్కడ, మహస్సు అనఁగా తేజము – ఉత్సవము. దానికి, ధీ — ఉనికి – అని భావింపవలెఁ గాఁబోలు.

ఇఁక మారీచునితో రావణుఁడు మాటాడవలెను. రావణుఁడు పోయి తాటకేయు ద్వాఃస్థలి నిలచెనఁట. అప్పు డాతనిని మారీచుఁడు కని రా! స్వామీ! రమ్మని మర్యాదలు నెఱపి, ఏలయ్యా సురారీ! ఈ యింతయులోన వచ్చితి వని ప్రశ్నించెనఁట [అర_165పు] అప్పుడు దనుజుఁడు, పదియు బిగించిన మొగములలో మానభావము వెలయునట్లు . . . ఏ దేదో చేసి తుదకు 'అది నిశ్చయింబు చేసితి ముదిత జనక సుత హరింపఁబోవలె నిది తప్పదు మఱి' అన్నాఁడఁట.

ఇక్కడ వాల్మీకములో, కావ్యార్థసూచనగా మారీచుని మంచితనము వెల్లడించుటకా యన్నట్లు 'శ్లో. దదర్శాశ్రమ మేకాంతే రమ్యే పుణ్యే వనాంతరే తత్ర కృష్ణాజినధరం జటావల్కలధారిణం, దదర్శ నియతాహారం మారీచం నామ రాక్షసమ్' [అర–1117పు] అని కొన్ని విశేషములు చూపెను. అది యొక ఆశ్రమమఁట. ఆ వనము మనోహరమే కాదు; పుణ్యమైనదియు; అందున్నవాఁడు జటావల్కల ధారియై కృష్ణాజినమును గప్పికొనియున్నాఁడఁట. ఆపైని ఆతఁడు నియతాహారుఁడును. ఈ దళములుగాని ఈ విశేషములుగాని విశ్వనాథ మారీచునకు బొత్తిగా లేవుపాపము !!

వాల్మీకములోని ఈ ముప్పదియాఱవ సర్గములో రావణుఁడు చెప్పిన మాటలు – చూపిన హేతువులు – పన్నిన యుక్తులు మనోహరముగాఁ గానవచ్చును తనకన్నఁ దక్కువవానివద్దకు వచ్చియున్నను వానితోఁ దన 'కవసరము' ఉన్నది కావున అట్టివేళలో 'కార్యస్థుఁడు' ఎట్లు మెలఁగవలెనో ప్రత్యక్షరము పూసగ్రుచ్చినట్టులు వాల్మీకి రమ్యముగాఁ జిత్రించి యిచ్చెను. ఆ'ధోరణి' తెలుఁగుకల్పనమున రా లేదు 'అది నిశ్చయంబు చేసితి'నని రావణుఁడు చెప్పినవిషయమును ఆదిలోనే 'నేను వినలేదేమి యేమి'యని మారీచుఁ డన్నాఁడని కల్ప మన్నది.

'ఓహో! విన్పడలేదయేమి యెదియో యూహించుచున్నావొ, నీ
యూహల్ నేను నెఱుంగుదున్ ముదిత లేదో సీత, ఆ చాపికిన్
దేహార్థంబును బ్రాణసర్వము, పడంతిం జెచ్చెదన్, రాముఁ డో
హో ! హాహాపరిదేవనాశిథిలమై యుల్లంబు పొల్లంబడన్.

'ఏనుగాని యనినమాట తాను వినలేదట వినలేదంతయుషమేమి. యాతఁడనఁగ [అర_166 పు]

ఇదియే ఈ కల్పములోని ఈ యిరువురి మాటల వరుస. తాను వచ్చినపనిని గూర్చిగానీ, మారీచుఁడు చేయవలసిన సహాయముగాని మూలములో, వెంటనే రావణునినోట వెల్లడి కాదు. రెండవసారి వచ్చినప్పుడుకూడ మారీచుఁడు రావణునకు అర్ఘ్యపాద్యాదు లిచ్చి, మహాప్రభూ! లంకలో అందఱు క్షేమమా! ఏ పనిమీఁద ఇంత తొందరగా మఱల వచ్చితివని ప్రశ్నించును. అప్పుడు రావణుఁడు,

'శ్లో. మారీచ శ్రూయతాం తాత! వచనం మమ భాషతః,
ఆర్తోఽస్మి మమ చార్తస్య భవాన్ హి పరమా గతిః'—
[ఆర – 1117 పు]

అని యెత్తుగడలోనే, కార్యగతినిబట్టి ఒక విధముగా మొత్తుకొనును. శ్రూయతాం తాత! – అనఁగా బాబూ! నా మాట వినుమని. ఆపన్నుఁడనైన నాకు ఇప్పుడు నీవే పరమగతివి. అని యుపక్రమించి జనస్థానమందలి సర్వరాక్షసుల శక్తియుక్తులను మెచ్చుకొనును. వారందఱు ఖరచిత్తానువర్తులై ఆ రీతిగ ప్రవర్తించిరి గదా యని విచారము సూపును. ఒకనిని గాదు; ఇద్దరను గాదు పదునాలుగువేల మంది రాక్షసయోధులను—ఒక పదాతి, అందును మనుష్యుఁడు చంపెను గదా! మనము ఉపేక్షింపవలసియుండునా ! ఈ రీతిగ జాలిగఁ జెప్పవలసిన వన్నియుఁ జెప్పి దీనికి ప్రతిక్రియగ ఆతని భార్యను సీత నెత్తుకొనిపోఁదలఁచి వచ్చితిని. ఇందు నీ సహాయము నాకుఁ గావలసియున్నది. మారీచా! నీవు సామాన్యుఁడవుగావు సుమా! కేవల శూరుఁడవే గాదు, సర్వమాయావిశారదుఁడవు. నాకు నీ వెట్లు సాయపడవలెనో అదికూడఁ జెప్పెదను వినుము. నీవు బంగారులేడివై

సీతకంటికిఁ గన్పించునట్లు ఆ ప్రాంతములోఁ దిరుగుము. ఆ లేడి నాకుఁ గావలెనని ఆబిడ కోరును. అట్లే యని ఆ యన్నదమ్ము లిరువ్వురు నీవెంటఁ బడెదరు. ఆ సందు చూచి అమాంతము నే నా సీతను అపహరింతును. ఆ దశలో ఆ రాముఁడు భార్యావిరహాకర్శితుఁడై మనదెబ్బకుఁ దప్పక లొంగును. అని. ఇదియే వాల్మీకిరావణుని సంకల్పము. ఈ 'సంకల్పము' సాంతము విన్నదాఁక మారీచుని నోట ఒక్క మాటయు రాదు. విన్న వెంటనే ఆతఁడు గడగడలాడి పోవును. నోరు ఎండిపోయి, ఎండిన పెదవులను నాలుకతో నాకుచు అట్టె కన్నులు తేలవైచి చచ్చినట్లు రావణునివంక ఏకధాటిగాఁ జూడ సాగెను. వాల్మీకి చూపిన ఈ దృశ్యము కల్పములో మనకు రవ్వంతయుఁ గన్పింపదు.

లౌక్యము తెలియని విశ్వనాథ – రావణబ్రహ్మ, ఆదిలోనే 'అది నిశ్చయంబు చేసితి. జనకసుత హరింపఁబోవలె నని వచ్చిన పని వెంటనే బంగనబయలు చేయును. దాని కా మారీచుఁడు అవిధేయ తగా 'నేను వినలేదేమి యేమి'యని అన్నాఁడఁట. ఓహో! నీకు విన్పడలేదయేమి! అవునులే నీ 'సంగతి' నాకుఁ దెలియును. ముదిత లేదో సీత – ఆ చాపికి దేహార్ధము ప్రాణసర్వము పడంతిన్ రాముఁ డోహో! హాహాపరిదేవనాశిథిలమై ఉల్లంబు పొల్లంబడన్ దెచ్చెదను. అని విశ్వనాథరావణుఁడు విశ్వనాథుని హృద్యములైన మాటలలో తన సంకల్పము వెల్లడించెను. ఈ వెల్లడింపులోని స్వారస్యమును వర్ణింప వలెనన్న గ్రంథము పెరుఁగవచ్చునన్న భయము లేకపోలేదు. అయి నను దప్పదుగదా!

భ్రష్టమైన ఈ పాత్రౌచితికి ఏ మాత్రము తీసిపోవని పదముల పొంకము వాక్యనిర్మాణవైచిత్రియు ఈ కవిసమ్రాట్టునకు దక్కినవన వలెను.

'ముదిత లేదో సీత' ముద్దైనమాట !!

'అదిగో ఆవిడలేదూ పుల్లమ్మ' అన్న వ్యావహారికధోరణికి మాండలిక ప్రయోగమునకు ఇది దగ్గఱి వేషము. ఇట్టివే మనము గ్రాంథికములో

అదికింపవలెనని మురిపపడువారు లేరనరాదు. ఆపైని, ఆబిడ ఆ చాపికి దేహార్థమఁట; ప్రాణసర్వమఁట!! వినఁగానే చాపి యేమాయని కొంత సందేహము కలుగవచ్చును. 'ధన్వి' యని విలుకాఁడు' అని మనము వినలేదో – అట్టిదే ఇయ్యది. 'చాపః అస్యాస్తీతి చాపీ' కాఁబోలు. వాలము కలవాఁడు వాలి కాఁగా తోఁక కలవాఁడు 'తోఁకి' కాఁడా అన్నట్లు. భిక్షుకులుగా వచ్చు ఆటవికులు కొందఱినోట హనుమదర్థములో 'తోఁకి' యని ఉచ్చరించుట వినియుంటిని. అది 'తెలుఁగుమీఁటి' ఉండఁగా 'చాపి'లో 'గీర్వాణము' బలసియున్నదని చెప్పవచ్చును. రావణుఁడు ఆ పడఁతిని దెచ్చునపుడు 'రాముఁడు – ఉల్లంబు పొల్లంబడన్' అగునఁట. ఈ పలుకులు చెవులకు ములుకులవలె గ్రుచ్చుకొనుచున్నవి. ఆతఁడు సీతను దెచ్చుచున్నాఁడుకాఁబట్టి కాదు సుమా! ఆ సీతను దెచ్చుచుండఁగా రాముని యుల్లము ఏమగునో తేట 'తెల్లముగ' ఈ కవనములో చెప్పలేదుగదా యనియే. 'రాముఁడు – ఉల్లము' ఈ రెండింటిలో పొల్లంబడిన 'పదార్థ' మేది! దగ్గఱిలో నున్న ఉల్లమును దీసికొందుమా! మొదలే, కష్టదశలో నున్న 'రాముఁడు' ఏమయిపోవునో! ఓహూ!! హాహా!! ఒకటి ఆశ్చర్యార్థకము. ఇంకొకటి సంతాపార్థకము. 'హాహా' పరిదేవనముచే శిథిలమైనది ఉల్లము. ఈ 'పరిదేవనము' నపుంసకలింగమని 'కోశము' చెప్పును. 'విలాపః పరిదేవనమ్.' పరిదేవనం అనుశోచనమ్. దేవృపరిదేవనే: అమరము 'పరిదేవనా' స్వరూపమునుగూడ జూపిన కోశము లున్నవేమో! చూడవలెను. 'ముదిత – పడఁతి' యని రెండుచరణములలో ఇద్దఱు 'స్త్రీలు' రావలసివచ్చినది. ఇది ఈ కవనములోని మహిమ. మొదటిపదము సీతమ్మను జెప్పుటకును రెండవ 'పడఁతి' యతిని గౌరవించుటకును కల్పమునకుఁ గావలసివచ్చినది. అవును! ఇఁక రాఁబోవు ఘట్టములో యతీశ్వరుఁడైన రావణబ్రహ్మను ఈ'పడఁతి'యైన సీతమ్మయే ఆదరింపవలసిన అక్కఱ ఉన్నదిగదా! పైగా ఇది, కావ్యార్థసూచనగా సైతము పనికివచ్చు పదార్థమాయె. అవురా! విశ్వనాథకవీశ్వర కవితాభవ్యత. యావత్తైలం తావద్వ్యాఖ్యాన మన్నట్లు – ఈ కల్పములోని పలుకులకు

పరమార్థము తోడిదెకోలంది ఊరుచున్నది. అందులకే కాంబోలు ఈ 'జీవుఁడు' బహిరంగసభలలో ఈరామాయణకావ్యమునునావంటివాఁడే వ్రాయవలెనుగాని లాంతివాఁ డెవ్వఁడును అంటుకోరాదని పలుమారు ఘోషించుట విందుము.

'అతఁడు నాకుఁ జేసినట్టిదానికి ఏనుగాని వాని కింత సేయఁ దగదా!అనిన మాట [నేనన్నమాట] తాను విన లేదట వినలేదు. అతఁ డనఁగ అంత యిష్టమేమి!' అని యప్పుడే 'ఎద్దేవ'లోనికి వెటకారము లోనికి ఈ రంగము ప్రారంభమైనది. తాను జేయఁబూనినదానిలో న్యాయ మున్నదనుటకు రావణుఁ డిఁక హేతువాదములోనికి దిగును.

'ఖరుఁడు దూషణుఁడు అంతటన్ త్రిశిరుఁడు అంతన్ ముప్వు రున్ రథోమహేశ్వరులో నా పినతల్లి పుత్త్రికులు చావం జూచు చిట్లుందునా![అర 166]ఇది మొదటి ప్రశ్న. ఎంత కమ్మని వాక్యము!! 'అంతటన్_అంతన్' అన్నవి తీసివేసినను కథ సాగవచ్చును. కావున అవి రెండును పడికట్టు ఱాళ్లుకూడఁ గావు; ఆ ఱాళ్లకును ప్రయోజన ముండును. ఇది పాదపూరణమహార్ణవకల్లోల పరంపర. పినతల్లి పుత్త్రులు కాదు; పాపము 'పుత్త్రికు'లఁట! ఎంతటి పసిపిల్లలు!! 'చతుర్దశంబగు సహస్రోపేతసైన్యంబు' [166] పదునాల్గవదియగు వేయితోఁ గూడిన సేన. అనఁగా పదునాలుగువేలమంది సైనికులకు వచ్చిన తిప్పలు. ఈ పట్టున, మండింపందగు నెల్ల లోకములనుచు' [167] ఏ వేదో ఉపనిష త్సిద్ధాంతములుకూడ రావణుఁడు మారీచునకు బోధించుచు, 'అహార్యముహార్యత యెంత నొప్పియో'అని యర్థాంతరన్యాసముకూడ వెలఁగబెట్టును. 'పెన్వగ యెట్టిదో యిదిం జేయఁగ వానికిం దెలియు' నఁట—ఈ పని నేను జేసినప్పుడుగాని ఆతనికి పెన్వగ యెట్టిదో అర్థము కాదని యర్థము.

'పదుమూఁడేడు లరణ్యదేశమున సంవాసంబు గావింప నే యదనన్' [167పు]

ఇదేమి స్వామీ! రావణుని నోటఁగూడ రాముని యరణ్య వాసము 'పదుమూఁడేడు'లని పలికించితిరి! చదువఁగాఁ జదువఁగా

ఉన్న మతియు పోయినట్లు, మీ కల్పవృక్షమును జదివినకొలఁది కథలే అడ్డము తిరుగుచున్నవి 'నవ పంచ చ వర్షాణి దండకారణ్య మాశ్రితః చీరాజినజటాధారీ రామో భవతు తాపసః [అయో. 494 పు] అనెడి వాల్మీకి వ్రాఁత నిఁకను గొట్టివేయవలసియున్నదో! లేక ఈకల్పవృక్షము కావించెడి ఇట్టి కట్టుకథలకు అంతరార్థమును ఏ బహిరంగసభలలోనైన వినవలసియున్నదో !!

'ఎదలో సూదిగ వచ్చి దబ్బనముగా నీ తేలు టట్లున్నదే'- [అర- 167 పు]

ఇది, తెలుఁగుగడ్డలో చిరకాలమునుండి వాడుకపడ్డ ఒక మంచి సామెత. ఆమెతవంటి ఈ సామెతసైతము ఈ కవనమును దబ్బనములో గ్రుచ్చుకొని కకావికలైనది. ఎదలో – అన్నది, ప్రాసకోసము వేసికొని, అందలి ఎకారమనెడి యతీశ్వరుని సంరక్షణార్థమయి 'ఈ' తేలుటలు తెచ్చిపెట్టిరి. సహజమైన సామెతనుగాని మంచిమాటనుగాని సరళమైన త్రోవలో వినిపింపను జేతఁగాని కవిత్వములో ఈ ప్రయత్నమెందులకుఁ జేసినట్లు ! ఈ ఘట్టములోనే రావణునినోట 'కలియుంజొచ్చినఁ గ్రొత్త లిట్టివి చెలంగన్ జిత్తవృత్తుల్ చనున్' అనుచు నేదో ఒక కలియుగచేష్టలుకూడ స్మరింపఁజేయును. త్రేతాయుగములోని ఈ కథలో కలియుగములోని ఈ 'విశ్వనాథ' కవికి కలినిగూర్చి వాపోవవలసిన కర్మ మేమి వచ్చినట్లు !

ఈ, పగ పొగ కుమ్మలో నణఁగుపొలిక చేయఁగ నేరనయ్యెదన్' [168 పు]

ఇక్కడ యతికి దుర్గతి, అచ్చువారివలన పట్టినదేమో ! 'పొగ పగకుమ్ములో' అని మార్చుకొని చదువుకొన్నచో యతి, బ్రతుకవచ్చుఁగాని, ఆ బ్రతుకు తుదకు అర్థములేని దగునేమో !

'ఈ యింతయులోన (ఇంతలోనే అనుటకు), ఇదిం జేయఁగ – ఎట్టెదరు' ఇత్యాది 'కల్ప'సూక్తులకు ఇంకొక తెలుఁగు వ్యాకరణము పుట్టవలసియున్నది ఎదురు + ఎదురు–ఎట్టయెదురు, అని, అట్టహుగు చదువులలోనే మొట్టమొదటగా పిల్లలకు బట్టీ పెట్టింతుము. ఎదురులో

'దురు'నకు ద్విరుక్తటకారము వచ్చి ఎట్టయని స్వరూపము పుట్టఁగా, ఆపైని విశ్వనాథకవీశ్వరుఁడు అకారసంధి చేసి 'చేత విలు గైకొని యొట్టెదు రేగుమందువా !' అనఁగానే అహో!! ఆంధ్రభాషామతల్లీ నీకు కడుపు నిండునుగాఁబోలు !!

'వట్టినే భీతిహేతులు' [అర–169] 'వట్టినే – ' ఇద్ది మాండలికము కాఁబోలు ! 'వృథాగా' అన్న అర్థములో. అహో! మహాకావ్యములో వ్యావహారికపుసొంపు. హేతువులకు బదులుగా, ఒకరిద్దరు వాడిరిగదా అని 'హేతు'లని కర్తృరూపము గైకొనుట మఱొక సంస్కారము.

సగరుఁడు అసమంజసుని ఇలు వెడలనడచినట్లే ఆ వంగడములోఁ బుట్టిన ఈ రాముని గూడ వీని తండ్రి వెడలఁగొట్టెననియు ఇది వీండ్ర కొలమున కున్న చాలిక యనియు రావణుఁడు మారీచునితో అన్నట్లు విశ్వనాథ మనకుఁ జెప్పినాఁడు. ఈ భావ్యము ఆర్షము కాదు; అనఁగా మయూర్తుల ఇది వైశ్వనాథమే. వెడలఁ గొట్టుటలోఁగాని దాని కున్న హేతువులలోఁగాని ఈ రెండింటను నిజమునకు పోలికయే లేదు. 'ఆతతాయిగా'నుండి చేయరాని 'దురాగతము'లు చేయుటచేతనే అసమంజసునకు ఆ నాఁ డా దుర్గతి పట్టినది. ఈ శ్రీరాముఁ డా 'కోటి'లోని వాఁడు కాఁడుగదా! ఈ మాట అయోధ్యలో కైకేయీ దశరథుల సంభాషణములోనే వచ్చినది. ఆ వార్తను అక్కడ కల్పకర్త వినిపించిన సొగసును జూడవలెను.–

> 'కం. కాలూనిన పులకలు మైఁ గ్రాలంగా రాము నెత్తి కౌఁగిటఁ గొని భూ
> పాలుం గని యసమంజసుఁ దోలె వనికి సగరుఁడట్లె తోలుము రామున్'
> [కల్ప –అయో. 101పు]

కైకమ్మ రాము నెత్తి కౌఁగిటఁ గొని భూపాలునితో ఈ మాట చెప్పెనఁట. ఇది కల్పము సొంతకవిత్వము. సర్వసేనలతో పాటు శ్రీరాముని అడవులకుఁ బంపెదనులే యని దశరథుఁ డనఁగా మిక్కిలి కోపమువచ్చి 'రాజా ! నీ వంశములో వెనుక సగరుఁడను

చేఁడు, పెద్దకొడుకును అడవికిఁ బంపలేదా ! ఆ పంపినపుడు సేనలను గాని పొమ్మని చెప్పెనా యేమి ! పూర్వాచారము మనము పాటింప వలెనుగదా' అని కైక చెప్పినది. ఇక్కడ, కైక, రాము నెత్తుటగానీ కౌఁగిటఁ బెట్టుకొనుటగానీ మూలములో లేనే లేదు. అసమంజసుని దోలినట్లుగా రామునిగూడఁ దోలవయ్యాస్వామీ'యని పశువుల ధోరణిలో ఈ కవనము నడుపుటకు అంతరార్థము చెప్ప వచ్చును. ఏమని! ఆ నాఁడు ఆ భ్రష్టుఁడు అసమంజసుఁడు అట్టివాఁడయ్యెనుగాన వానిని గొడ్డునువోలె బాది తోలివైచుటలో స్వారస్యము లాగవచ్చును. ఇప్పుడు ఈ కైకమ్మకు అక్కఱలేని రాముని అడవులకు తోలుటయే సమ్మతమనియుఁ జెప్పవచ్చును. ఇది యెఱిఁగియే ఈ మహాకవి ఇట్టి ఘట్టములలో 'తోలు'ధాతువు నుపయోగించుకొనును. ప్రకృత మనుస రామః—

అప్పటి ఈ యంశము నింకొక్కసారి రావణునినోటఁ జెప్పించు టయే ఈ కల్పవృక్షములోని ఘనత. ఇక్కడ వాల్మీకి చెప్పినది ఈ యొక్కమాట :—

'శ్లో. పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః'—

తండ్రికి కోపము వచ్చి తఱిమివేయఁగా ఈ నష్టజీవితుఁడు భార్యతోపాటు అడవికి వచ్చినాఁడు. ఇంతే ఆపైని కల్ప మన్న మాట:—

'చం. హరిణకులంబునందు జనకాత్మజ మిక్కిలి మెత్తనౌ స్పృహా
సరణి వహించునంట. . .' [అర-169 పు]

లేళ్లు అనఁగా సీతమ్మకుఁ జాల మక్కువయఁట. జానకి మనస్సులో ఉండు ఇట్టి కుతూహలము ఈ విశ్వనాథ రావణబ్రహ్మకు ఎట్లు తెలిసినదో ? 'రత్నమేఖల'గాని తత్త్వదీపిక'గాని సూచనగానైన గ్రహింపలేని ఈ క్రొత్తవార్త కల్పము గ్రహించెనని వందిమాగధులు మెచ్చుకొనవచ్చును. స్పృహాసరణి మిక్కిలి మెత్తనఁట. అనఁగా నాజూకయిన కోరిక యని భావము కాఁబోలు.

'కం. మరకతములు వైడూర్యము లిరవుగ మణి వజ్రమాది యెందెందగు బం
గరులేడివోలె నాచును తిరుగుము జనకాత్మజాత దృక్పథమందున్' [140]

ఇది విశ్వనాథ - రావణుఁ డూహించిన బంగారు లేడి బొమ్మ. ఈ చిత్రముమాట యెట్లున్నను ఈ పలుకులలోని విచిత్రమును మనము చూడవలెను. ఎందెందు - మరకతములు వైడూర్యములు - మణి - వజ్రము - ఆది, ఇరవుగ అగున్ - బంగరులేడివోలెన్ - ఔచును - జనకాత్మజాత - దృక్పథమందున్ - తిరుగుము. ఇది ఖండాన్వయము. ఈ బంగారులేడికి మరకతాది ఇరవుగ ఉండవలెనఁట. 'ఎందెందు వెదకి చూచిన అందందే'- ఈ ధోరణిలో ఇది లేదని మనము భావింపరాదు. యావచ్ఛబ్దము వాడిన పిదప - తావచ్ఛబ్దము విధిగా రావలెనని సంస్కృత భాషలో ఒక సంప్రదాయమువంటిది వినుదుము. అట్లే తెలుఁగులో 'ఎందెందు' అనఁగానే 'అందందు' రావలెనని ఉన్నదా యేమి ! అట్టివి అధ్యాహార్యములుగా మన మెంచుకొని ఈ కల్పమును జమువుకోవలెను. అనఁగా ఈ పద్యములో, ఎందెందు వజ్రమాది బంగరులేడివోలె నాచును దిరుగు మని మన మన్వయించుకొనవలెను.

'శ్లో. సౌవర్ణస్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిందుభిః
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర'-[1119]

ఇది వాల్మీకి చిత్రించిన మృగము. 'వెండిచుక్కలతో చిత్రమైన బంగారు జింక'కు కల్పములో క్రొత్తవేషము తొడిగిరి. వెండి చుక్కలకు బదులుగా తెలుఁగున మరకతములు పొదిగిరి. ఆ వరుస కూడ సొగసైన వరుస. 'మరకతములు - వైడూర్యములు - మణి- వజ్రము'- కవిత్వము కోసమై వీనిలో వచనభేదముసైతము రావలసి వచ్చినది. దశవిధరూపకములను వ్యవహారములలో 'నాటకము' లనుచు ఆ పదింటిలో 'నాటిక'మన్న దొక భాగము ఉన్నదని మనము భావించినట్లు, నవరత్నములను' మణులని భావించి, వానిలో ఒకటి 'మణి' అన్నది ఉన్నదేమో అని ఊహించి, ఈ 'కావ్యకర్త చేతిమీఁదుగా నడచిన దనుకొను ప్రభుత్వము ప్రకటించిన' తెలుఁగు నాలవ

'వాచకము'లో చూడఁగా 'వజ్రము – వైదూర్యము – మాణిక్యము ఇత్యాదిగా కన్పించినది. భీమసేనుని భీముఁడన్నట్లు వాసుదేవరావును 'వాసు' అన్నట్లు, ఆ 'మాణిక్యమే' ఈ కల్పవృక్షమహాకావ్యములో 'మణి'గా ప్రభవించెనేమో! అనఁగా ఈ 'మణిని' మాణిక్యముగాఁ జదువుకొనవలెనని పిండితార్థము. అన్నిపదములు అన్నిపద్యములలో అందఱకుఁ గుదురునాయేమి? 'సామవేదము జానకీరామశర్మ' అన్నాముగదా! యని 'విశ్వనాథ సత్యనారాయణా' అనఁగా పద్యము కుదురునా కూలునా! ఈ యిబ్బంది చేతనే ఇంతటి మహాకవిసమ్రాట్టు 'కల్పవృక్ష ఖండాంతములలో' 'నావలన సత్యకవి విశ్వనాథువలన - వినియె నెది సత్యకవివల్ల విశ్వనాథ' ఇత్యాదిగ అనవలసి అవస్థపడవలసివచ్చినది. ఈ ధోరణిలో 'సీతాయాః పతయే నమః - హిరణ్యపూర్వకశిప' అని ఆర్షకవులు సైతము పలుకవలసివచ్చినది. కావున 'మణి' యనఁగా 'మాణిక్య' మనుకొని ఈ 'రత్నమాణిక్యము' వంటి కవిత్వమును మెచ్చుకొందము.

రావణుఁడు తన సంకల్పము వెలిఁబుచ్చిన వెంటనే మారీచుఁడు – ఏ మొగము పెట్టెనో ఆ రూపరేఖ లెట్టివైఖరిలో కన్పట్టెనో వాల్మీకమును జూచికూడ కల్పము మనకు సరిగాఁ జెప్పలేకపోయెను. కాఁగా, క్రొత్తగా ఇక్కడ ఈ 'కల్పము' చెప్పఁదలఁచుకొన్నది మన మందఱము విని తరింపఁదగ్గది విశేషాంశ మొకటి వెలసినది. అది 'శైవవైష్ణవ' మతస్వరూపప్రతిపత్తి. రావణుని మాటలు విని మారీచుఁడు కొంచె మాఁగి యిట్లన్నాఁడఁట: — [అర-170]

'ఉ. నే నొక మాట చెప్పెదను నీకును గోపము రాదయేని నే
నైనను వీరశైవమత మాపితి వైష్ణవబుద్ధిఁ జొచ్చితిన్
బూని భవాదృశుల్ చటులమూర్తులు సాహసు లుగ్రనిష్ఠచే
మానని చంద్రశేఖరసమాధి వహింతురుగాక దక్షులై.

చం. అలుపమ శక్తులం గలిగినట్టిరు మాదృశు లీ శరీరదు
ర్బలతకు లొంగిపోయెదరు పట్టి యుమేశ్వరు జ్ఞానమూర్తి లో

నిలుపఁగలేమ రోం సులభనిష్ఠకునైనను సంతసించు వే
ల్పులకయి భక్తిచేఁ దనరుఁ లోఁగొనువారలఁ గొల్తు మింతటన్

కం. పదిసార్లు తనదునామము పెదవులు కదిలింప నిట్టె ప్రీతింగొను స్వా
మిదయావార్నిధి విష్ణువు మది నాతనిఁ గొల్తు సులభమార్గము పొంటెన్.

వ. అనిన రావణుండు

ఆ. వైష్ణవుఁడవు కాదు పాషండుఁడవు కమ్ము భక్తిమాత్ర మేల వట్టి నమ్మ
కమ్ము చాలు మోక్షగామి యన్మతమును స్వీకరింపు మద్ది నాకు నేల!

కం. చెప్పిన నాదే సంగతి చెప్పిన నీదేమి మనసు చెడెనాయేమి!
అప్పుడె తలకెక్కినదో అప్పా! నీ మతముమాట యదుకకయుండన్'
[అర - 171పు]

ఇట్టివే 'రామాయణములో పిడుకలవేఁట'వంటివి; పానకములో పుడకలవంటివి. వర్తమాన శైవవైష్ణవమతప్రభేదములకు అలవాటు పడ్డ ఈ కావ్యకర్త త్రేతాయుగమునాఁటి కథలకుసైతము - అందును దైత్యవర్గసంభాషణములో ఈ మతప్రభేదమునుగూర్చి ప్రస్తావించుట ఏతద్విషయమై తన కున్న 'కండూతి' తీర్చుకొనుటకే అనవలెను.

రావణుని మాటలకు చేష్టలు దక్కి కొంతవడికిఁ దెప్పిరిల్లిన మారీచునిగూర్చి వాల్మీకి చెప్పినది రవ్వంత వినదగును:-

శ్లో. 'ప్రత్యువాచ మహాప్రాజ్ఞో మారీచో రాక్షసేశ్వరమ్.
సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః అప్రియస్యతు
పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః'-ఇత్యాది. [అర-1120పు]

జాతీయముగ - సామెతగ - లోకోక్తిగ - చాటువుగ సుభాషితముగ మాఱిపోయిన 'అప్రియస్య తు పథ్యస్య' ముక్క ఈ రామాయణకల్పవృక్షమునకు పనికిరాకపోయెను. మంత్రిగా - శ్రేయస్కామిగా రాజకీయముగా నైతికముగా రావణునకు మారీచుఁ డేమి చెప్పవలెనో అదితక్క తక్కిన 'మతోపన్యాస మె'కల్పములో మనకు దొరకును. 'నేనైనను వీరశైవ మాపితి వైష్ణవబుద్ధిఁ జొచ్చితిన్' అని మారీచుఁడు, విశ్వనాథ కే గ్రంథములో వినిపించెను? ఉన్న శైవ మాపుటలు-నడుమ వైష్ణవము పుచ్చుకొనుటలు నేఁటివిగాని నాఁటివి గావు. ప్రహ్లాదవిభీ

వణాదులు వైష్ణవులుగాను రావణాదులు శైవులుగాను కథ లున్నవిగాని "మధ్యలో వైష్ణవము పుచ్చుకొన్న' మారీచకథ ఏ గ్రంథములోను వినలేదు. 'రామునిజోలికి నీవు పోవలదు; పరదారవ్యవహారము నీకుఁ బనికిరాదు. ఆతఁడు సామాన్యుఁడు కాఁడు. ఆతని ప్రభావము అక్షరాల గుర్తించి అనుభవించి చెప్పుచున్నాను. ఏ దిక్కు చూచినను రామమయముగా నాకు స్ఫురించుచున్నది. రోగికి పథ్యమువలె నా మాటలే నీకు మేలు కూర్చును. ఎవఁడో నీకు ఆ శ్రీరామునిగూర్చి తప్పుడుమాటలు ఒప్పని కథలు వినిపించినాఁడు. నా మాట విని స్వామీ! ఇంటికిఁ బొమ్ము.' ఈ ధోరణిలో వాల్మీకిమారీచుఁ డెన్నో నీతులు ఎన్నో కథలు పూసగ్రుచ్చినట్టులు ప్రబోధించెను. అందు, మందునకైన శైవవైష్ణవభావములే ఆ యిర్వురినోట రాలేదు. దుర్బలశరీరులు ఉమేశ్వరుని లోఁగొనలేరఁట. పదిసారులు ఆ పేరులు పిలిచి పెదవు లాడించినంతమాత్రాన విష్ణువు, చేతికిఁ జిక్కునఁట. సూక్ష్మములో మోక్షము రావలెనన్న విష్ణువును గొల్వవలెనఁట. ఇది విశ్వనాథమారీచుని సిద్ధాంతము. ఓహో! అప్పా! నీవు చాల గొప్పవాఁడవే! వైష్ణవుఁడ వవుదువో పాషండుఁడ వవుదువోగాని నీ సిద్ధాంతములో తప్పు ఉన్నది. మోక్షగామికి భక్తి ఎందులకోయి! నమ్మకమన్నది ఉన్నచో అంతవఱకుఁ జాలు. అది మఱెంత సూక్ష్మములో మోక్షము. ఆ మతమును జేపట్టవయ్యా! — ఇది విశ్వనాథ రావణుని పూర్వపక్షఖండనము. శైవవైష్ణవములలోని రహస్యములను వెలికిఁ దీసి మారీచరావణబ్రహ్మల సంభాషణాపుణ్యమా యని ఈకల్పవృక్షకర్త మనకు వల్లమాలిన ఒకానొక భాష్యము వినిపింపఁగలిగెను. ఇట్టి ఘట్టములలోనే ఈ విశ్వనాథ-నిజస్వరూపము మనకు కొట్టవచ్చినట్టు కన్పట్టును. వెనుక ఒకప్పుడు విశాఖపట్టణములో ఈ విశ్వనాథవారు 'కల్పమును' జదివి వినిపించుచు సభలో ఈ మాట యనెనఁట:— 'వాల్మీకి, తన రామాయణమును విశిష్టాద్వైతపరముగా రచింపఁగా నేను 'కల్పమును' అద్వైతపరముగా అన్వయించి రచించితిఁ' అని. సభ ముగిసినపిదప-అయ్యా! వాల్మీకులనాఁటికే ఈ ద్వైత — అద్వైతముల

రగడ ఉన్నదా! యని ఒకరు ప్రశ్నింపఁగా ఆ మహావక్త నిరుత్తరుఁడై నాఁడఁట. ఆ ప్రశ్నించినవారు – ఈ వార్త నా కెఱింగించినవారు సామాన్యులు కాదు; ఆంధ్రవిశ్వవిద్యాలయాచార్యులు. ఈ భాష్యములో చివరి, 'చెప్పిన నాదే సంగతి' [171పు] అన్న పద్యములోని భావము సూటిగా తల కెక్కనో లేదో పాఠకు లింకొకసారి పరిశీలింప వలెను.

'నీ విడియఁగఁ బోవకన్ పసిఁడియిఱ్ఱిగ నామెను మోహపెట్టు మ
ప్పు డతఁడు కాన దప్పఁ చను భూసుతఁ దెత్తు నటంచుఁ జెప్పితిన్' [171]

అని రావణుఁడు, పూర్వోక్తమారీచమతవిషయప్రబోధము వినికూడ, ఇంతకు ఇది చెప్పితినిగదా అని పలుకును. ఆ వెంటనే, 'వినతుండై యుల తాటకేయుఁడు ప్రభూ విన్నాను విన్నానయా' అని మారీచుఁ డందుకొన్నట్లు పద్యము నడచినది. కాని, చెప్పితిన్'తరువాత, 'వ. అనఁగా లేక, నాన్'అని పద్యములు రెండింటికి నడుమ ఒక్క ముక్క అన్నచో గద్యపద్యముల సంఖ్యయుఁ గలసివచ్చెడిది; కథాతంతువు అనుస్యూతమయ్యెడిది. ఇట్టివి ఈకల్పకర్తదృష్టిలో అల్పాంశములయి యుండనోపు!

'కం. నేనెత్తుక పోతి వనంగా నగు గుర్తేమి యెచట క్ష్మాసుత యుండెన్
నేనును నీవును మూఁడవవానికిఁ దెలియదు సభీతిభావాంభోధీ!'

ఇది రావణుని మాట; కల్పము కని పెట్టిన బాట. ఈ యెత్తుక పోవుటలో నీకును నాకును దప్ప తక్కినవారికిఁ దెలియదుగదా! నే నెత్తుక వెళ్లినట్లు గుర్తేమి చెప్పుమా! అని సామాన్యమానవుఁడువోలె రావణుఁ డన్నాఁడనుటలో కల్పకర్త 'సత్తా' మనము గుర్తింపవలెను. 'క్ష్మాసుత ఎచట ఉండెన్' – అనఁగా క్ష్మాసుత ఎచ్చట ఉండునో, మూఁడవవానికిఁ దెలియదని అన్వయము కాఁబోలు. ఉండెన్–అనెడి భూతముకన్న ఉండున్ – అనెడి తద్ధర్మ మిక్కడ ఉండుటలోనే అంద మున్నది. ఇఁక, ఎత్తుకలు–పోతిలు, అన్న, అన్నయ్యలు మన కున్నారు గదా! అన్న సంబరముతో సమర్థించుకొనవచ్చును. 'పోతివిగద వేతప్పాలా బాకించి పోతివే తప్పాలా' అని కూచిపూడి 'బాగోతుల' పాటలు

ప్రమాణము కావాయేమి? ఆపైని పొలుపు గల పిలుపు. ఏమని! సభీతి భావ=భీతితోఁగూడిన భావమునకు, అంభోధీ= సముద్రమైనవాఁడా! అనఁగా సముద్రమంత లోఁతైన భయము గలవాఁడా! 'దయాపయో నిధి' - కరుణాపయోనిధి' వంటి ప్రయోగ మిదియని మనము దీనిని సంభావింపవలసియున్నది కాఁబోలు!

శ్రీరాముని మహిమను వినిపించుచు మారీచుఁడు రావణు నితో నిట్లనును:- 'శ్లో. వృక్షే వృక్షేచ పశ్యామి చీరకృష్ణాజినాంబరం, గృహీతధనుషం రామం పాశహస్త మివాంతకం. అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ! రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే - ఇత్యాది.' [అరణ్య-1127 పుట]

ఆ ధనుర్ధారి శ్రీరాముఁడు యముఁడువోలె చెట్టుచెట్టున నాకుఁ గన్పట్టుచుండును. నాకు భయము వేయుచున్నది. 'రకా'రాదులైన రత్నములు-రథములు ఇత్యాదినామములు విన్ననుసరే రాముఁడు జ్ఞప్తికి వచ్చి అదరిపోవుచున్నాను. కలలోఁగూడ ఆ రాముఁడే కన్పించు టచే కలవరింతలతో నా బ్రదుకు గడచుచున్నది. అని ఎన్నెన్నో చెప్పి తుదకు మారీచుఁడు, 'యది శూర్పణఖా హేతో ర్జనస్థానగతః ఖరః అతివృత్తో హతః పూర్వం రామేణాక్లిష్టకర్మణా, అత్ర బ్రూహి యథా తత్త్వం కో రామస్య వ్యతిక్రమః' అని తెల్పెను. అనఁగా శూర్పణఖనుబట్టి ఖరుని జనస్థానరాక్షసులను రాముఁడు వధించుటలో తప్పేమున్నదో చెప్పుమని మారీచుఁడు ప్రశ్నించెను. ఈ ముక్కలకు, 'విశ్వనాథ'భాష్య మెట్లున్నదో గమనింతము:-

'కం అవుఁ జెప్ప నాక ముక్కుం జెవులును గోయుటది యేమి చెప్పు మసదవో యవురా ప్రాణము తీయఁడె యవనీసుతఁ జంపఁబోవు టది కని కంటే.

మ. మనబంగారము మంచిదైనయెడఁ గంసాలిన్ మహేలా యనన్ ననుఁ దా నించుక వచ్చి యడ్డిన ఫలానావాఁడు వాఁ డెట్టివాఁ డని యా జోలికిఁ బోవ వద్దనుచుఁ గట్టా చెప్పనా! రైనసుం దన యీ దేమిటి యేమి టీ వలపు సంధ్యాదేవతల్ నవ్వఁగన్'

[అరణ్య. 188 ప.]

చుప్పనాక ముక్కు-చెవులు కోయుటలో తప్పేమి లేదఁట. మన బంగారము మంచిదైననాఁడు కంసాలిని - అనవలసినదేమున్నది? ఈ జాతీయము చక్కఁగా అదికించినందులకు ఈ కవనమును అభినందింప వచ్చును. కంసాలి కాదు; కమసాలి యనవలె నన్నది తెలిసియే వ్రాసితి నని కల్పకర్త యనవచ్చును. కాని ఈ దేశములో ఒకప్పుడు విశ్వ బ్రాహ్మణుఁ డనవలెను; కమసాలి యనరాదని ప్రభుత్వమే నిర్ణయించె నని విశ్వనాథవారికిఁ దెలియదనరాదు. ఇదియుఁ దెలిసియే అనవలెనని పట్టుదలతో అన్నట్లే అర్థము చేసికొనవలెను కాఁగా తెలుఁగులో పరుషసరళములకు ముందే బిందువుండు'నన్న వైయాకరణుల మాటలు 'కవిసమ్రాట్టుల కొకలెక్కలో ఉండునా యేమి! పైగా సామెతలకు జాతీయములకు ఈ వ్యాకరణములు గోకర్ణములు కులాలు గోత్రాలు అడ్డము కావనికూడ వారిధోరణి కావచ్చు. తాను-అనఁగా శూర్పణఖ రవ్వంత వచ్చి నను అడ్గిన ఫలానావాఁడు ఫలానా, ఆతనిజోలికి పోవద్దు-అని నేను జెప్పనా! అదియుఁగాక తన యీడేమిటి! ఈ వలపు లేమిటి! సంధ్యాదేవతలు చూచి నవ్వరా! అని మారీచుఁ డన్నట్లు కల్పము కల్పించినది. కామచారులకు వయస్సుతో నిమిత్తమే ముండునో! విశ్వనాథ మారీచుఁ డీ వాదము నింకను బెంచి కైకమ్మ కథనుగూడ స్మరించి యిట్లనును :-

ఉ. 'ఆ పరమోత్తమోత్తమున కక్కట! యున్నది లోప మొక్కఁ డా
హా! పరిహాసశీలి యతఁ డద్దియ హేతువుగా నతండు వ
న్యాపథమిట్లు రావలసిదైయెనది యయ్యది యొక్క దాసి తా
నా పినతల్లిదాసి పగ యున్నది రూపము గొన్న దక్కటా!'

గీ. ముసలిమొగముది యొక కొండముచ్చుముండ పసితనంబున రాముని పారిహాస్య
మునకుఁ బగ పూని కైకతోఁ బుల్లవిరుపులాడి రాముని వన మేఁగుటాచరించె.

చం. అవి యొపు డిచ్చె నెందుకొ రహస్యము మిన్నుననుండి యూడిప
డ్డవి వరముల్ వినం దెలివి డక్కెను భూపతి తెల్విలేమి మృ
త్యువు గనుదాక నట్లె చని నూరక తండ్రి యొసంగియుండు న
న్న విషయభావబద్ధుఁడు సనాతనుఁ డీ గతి వచ్చెఁ గానకున్'

[అర - 191 ప]

పరమోత్తమోత్తముడైన శ్రీరామునిలో ఆ యున్న లోపము ఒక్కటే ఒక్కటి యని ఈ మారీచుఁ డుపన్యసించును. అది యేదఁట! ఆ రాముఁడు 'పరిహాసశీలి' యగుటయఁట. ఆ కారణము చేతనే ఆ రామయ్యకు అడవుల కిట్లు రావలసివచ్చినదఁట. అనఁగా శ్రీరాముఁడు బాల్యములో చేసిన పరిహాసమును మనస్సులో పెట్టుకొని ముసలి మొగ ముది కొండముచ్చుముండ కైకతో పుల్లవిఱుపుమాటలాడి రాముని వనమేగుట ఆచరించెనఁట. వనమేగుట యాచరించె ననఁగా – వనమునకు వెళ్లుట చేసెనని అర్థము చెప్పవలయునుగదా! ఏగుట చేసె ననఁగా – ఏగెను, అని భావము రావచ్చు. కవిసమ్రాట్టుల భావము అదికాదు సుమా! రామునియొక్క వనమేగుట కొండముచ్చుముండ చేసెనని మన మనుకొనవలెనని కల్పకర్తల ఆజ్ఞ కానోపును. అవురా! తెలుఁగువాక్యరచనకు ఈ కల్పములో ఎన్ని తిప్పలు వచ్చినవి. వన మేగుట ఆచరించుట యేమి స్వామీ! సూటిగా, వనమునకుఁ బంపించె నని కవనములో వ్రాయుట కుదరలేదా! లేదా–ఇది యొక ప్రయోగ ప్రౌఢిగా మేము భావింపవలెనా! వనములో రాముఁ డున్నాఁడు. ఆ ప్రాంతమందే మారీచరావణులు మాటాడుకొనుచున్నారు. 'సనాతనుఁ డీ గతి వచ్చెఁ గానకున్' అని తరువాతిపద్యములో వచ్చెననియే చెప్పెను. వనములో ఉన్నవారు వనమునకు వచ్చిన రాముని 'వన మేగుట' అనుటలో స్వారస్య మే మున్నది! అయోధ్యలో ఉన్నట్లుగా అనుకొని ఆ ముండ, రాముని వనమునకు ఏగుటగా చేసెనని అన్వయించుకొని ఆనందింపవచ్చును. కాని యిందలి పదములకు కర్తృ రచనలోని కొకిబికి స్పష్టమగుటలేదా! చిన్ననాఁటి సమాచారమునే పగగాఁ బెట్టుకొని ఆ ముండ ఇంతపని చేసెనని వాల్మీకిమారీచుఁ డనలేకపోయినను విశ్వనాథమారీచుఁడు ప్రత్యేకముగా ఆముండమీఁద పగ పట్టినట్టు రావణునిమ్రోల ఈ పురాణ మెత్తుటలో రహస్యమైన భావ్యమును మనము గుర్తింపవలెను.

'అనిన రావణుండు నేనన్న వేమియు నతఁడు కాఁడు [అరణ్య. 178 పుట] ఈ రెండు పంక్తుల వచనములో ఒక చిన్న తికమక.

నీ వన్న వేమియు నతఁడు కాఁడు – అని రావణుఁడు మారీచునితో అన్నట్లు అచ్చులో ఉన్నచో అన్వయము కుదురును. రచనలోని ఇట్టి సొగసునకుఁ దోడు 'ముద్రారాక్షసపు' సోయగముకూడ కొంత కలసి వచ్చినది.

'గులభామిని దొంగిలి నెంతయూ పగో' – [అర–178 పుట]

ఇది మారీచుని మాట. సంధివలన కులము గులలోనికి దిగుటయేఁ గాక 'ఎంతయూ పగో' అన్న పదములతో ముద్దు వచ్చుచున్నది.

'ఆ రఘూద్వహులు దక్షుల్ గేహినీ గర్భధారాధృత్యాశయులు' [179పు]

అని మారీచుఁ డన్నాఁడఁట. గేహినీ – గర్భధారా –ధృతి– ఆశయులు. బ్రహ్మాండమైన ఈ సమాసములో ఏదో భాష్య ముండ వలెను. 'ప్రజాయై గృహమేధినా'మన్న కాలిదాస మహాకవి సూక్తికి ఇది ఛాయగా సమన్వయింపవలెనా! గర్భధార అనఁగా గర్భాధానము కాఁబోలు. గేహినీ గర్భాధానములో మంచి పట్టుదల గలవారన్న మాట. అట్టివారితో వైరము పెట్టుకొనుట నీకు మర్యాద కాదని విశ్వనాథమారీచుఁ డొక క్రొత్తత్రోవ త్రొక్కఁ గలిగెను. ఈ మారీచుఁడే రాముని పరాక్రమ మెఱింగింపఁదలఁచి పరశురాముని కథ ఎత్తుకొని ఇట్లనును–.

'మడమలు త్రొక్కి–కొం చవనిమార్గము వీడి పలాయమానుఁడై
విడివడి కట్ట ! రే యడుగు వెట్టినచోటను నీల మండలం
బడఁగఁగఁ బిన్నపెండ్లికొడుకైన రఘూద్వహు బాణఘాతమై,
చెడెద నటంచు గ్రుడ్డుకుడిచెన్ దన యంతటి శౌదు తానయై' (179 పు)

భార్గవుఁడు రఘూద్వహుని బాణఘాతమువలన గ్రుడ్డుకుడిచె నఁట. ఆతఁడు కుడిచిన దేదోగాని ఈ యవతారద్వయములో సనాతనాచార పరాయణమ్మన్యుఁడైన కల్పకర్త ఒక యవతారమునకే దుర్గతి పట్టినట్టు వ్రాసిన ఈ కవితలోని ఔచిత్యమును మెచ్చుకోవలసియున్నది.

రావణుని సంకల్పము విన్నవెంటనే మహాప్రాజ్ఞుఁడైన మారీచుఁడా రాక్షసేశ్వరునితో ఇట్లనును.–

'సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః। అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః' [అర1120పుట] రాజా! ఇచ్చ కాలమారి మాటలు చెప్పెడివారు లోకములో ఎల్లప్పుడును అందు పాటులో నుందురు. కాని రోగికి పథ్యమువలె అప్రియమైనను మేలు చేయుమాట చెప్పఁగలవాఁడు దొరకఁడు. ఒకవేళ దొరకినను ఆ మాట వినువాఁడే యుండఁడు. ఈ భావము గల పయి శ్లోకపాదము సంస్కృతములో ఒక మనోహరమైన సామెతగా వెలసియున్నది. ఇంత మంచి శ్లోకమును మనస్సులో ఉంచుకొని, కొంతదూరము పోయిపోయి కల్పకర్త చెప్పిన తెలుఁగుపద్య మిదిగో చిత్తగింపవలెను:-

> 'హితమునె చెప్ప నెవండేన్ క్షితిపతికిని బథ్య మింత చెప్పఁడు ధాత్రీ
> పతి యోర్వలేఁడు కోరును సతము జనుఁడు మివులరాజు సద్యస్సుఖమున్'
>
> [181 పుట]

లోక సామాన్యముగాఁ జెప్పిన వాల్మీకి సుభాషితమును కల్పము మన కీ రీతిగ మార్చి చూపినది. ఎవఁడైనను రాజునకు హితమునే చెప్పునఁట. పథ్యము చెప్పఁడఁట. ధాత్రీపతి ఓర్వలేఁడఁట. అనఁగా ఎవ్వఁడైన పథ్యము చెప్పినచో ధాత్రీపతి ఓర్వలేఁడని అన్వయింపవలసియున్నది కాఁబోలు. జనుఁ డెప్పుడును రాజు యొక్క సద్యస్సుఖమునే మివుల కోరునఁట. ఈ భావమునకు ఉల్బణముగా వెంటనే మఱొక పద్యములో —

'అసలులోఁ దప్పులేదు సద్యోఽల్పసుఖము కోరియే జీవుఁడయి జన్మ గొనుట కలుగు' అని కల్పము వచించెను. అసలులోఁ దప్పు లేదఁట— ఇది యొక 'తమాషా' మాట. తాత్కాలికమైన తక్కువ రకపు సుఖమును గోరియే జీవుఁడుగా అయి జన్మించునఁట. జన్మించును— అనుటకు 'జన్మ — గొనుట— కలుగు' అని ఈ కల్పము యొక్క 'గో_కం_బర్డ్' తెలుఁగు రచన. జీవుని వైఖరి ఇట్టిదని మారీచుని ముఖమున విశ్వనాథవారు మనకు బోధింపనేర్చిరి.

> 'నలువుగ మీరుమీరు కనినం బెదతల్లియుఁ బిన్నతల్లి బి
> డ్డలు మఱి వారలట్లయి కడంకను మీరలు సర్వభోగముల్

కలిమికి బంధుతాగుణముగాని సహింపదు పైని దానవో
జ్జ్వలరమ యింక నెంతవు నపారపుఁ గాలము సాగనయ్యెడున్ [అర_183 పు]

ఇది మారీచుని నోటిమాట. ఈ పద్యమునకు దీని పూర్వా పరములకు సంబంధము లేదు. మీరుమీరు కనినన్ – పెదతల్లి పినతల్లి బిడ్డలఁట. అనఁగా శూర్పణ–రావణాదులు కాఁబోలు! వార లట్లుండుట మీరిట్లుండుట బంధుతాగుణము సహింపదఁట. దానవలక్ష్మి ఇంక నెంతవును ! అపారపుఁగాలము సాగనయ్యెడునఁట. ఔరా ! ఈ తెలుఁగులోని తెగులేదో గుర్తింపవలదా ! మీరుమీరు కనుట యేమిటి స్వామీ ! ముమ్మొదటనే ఉన్న నలువుగ' అన్న ఒక పడి గట్టురాతికి 'కనిన' అన్నది నెచ్చెలియైన 'యతి' కాఁబోలు ! అనఁగా చక్కఁగా పరిశీలింపఁగా మీరుమీరు పెదతల్లి పినతల్లి బిడ్డలుగదా యని అన్వయించుకొనవలెను. బిడ్డలులోని 'డకారమును' బట్టి ఇక్కడ అక్కఱలేని 'కడంక' వచ్చి కూర్చున్నది. 'ఇంక నెంతవు – అపారపుఁ గాలము' ఈ పదముల సొగసు ఈ కవనములోని బిగువును జెప్పక యే చెప్పుచున్నది.

'నా మారీచుఁడు నవ్వి నిక్కువముగా నాపైని కోపంబు నీ
కే మంత్రిత్వము మాని యిన్ని దినముల్ స్వేచ్ఛాగతిఁ దున్కికిన్
నీ మంత్రిత్వము మానలేదు గద పై నే నిట్లు సన్యాసినై
నీ మంత్రిత్వము చేయుచుంటి నసురానీకిన్యసుపాత్రిజితా.
'మంత్రి నాటఁ జెప్పితిని . . . . . . .
వంతెపు దేగుదెంచు నని వాకిలి చూచుచునుంటి నెప్డుడున్'–[అర_184 పుట]

పయి పద్యములోని ఆమ్రేడితమువంటి 'మంత్రిత్వ' పదమునకు స్వారస్యమో భావ్యమో సాగఁదీసి చెప్పవలసియున్నది. వర్తమాన కాలములో మంత్రిగానున్న మారీచుఁడు 'నీ మంత్రిత్వము చేయుచుంటి' నని భూతములో పలుకుట కల్పవృక్షకవిత్వమునకు ప్రాఁతబాటయే గదా! 'వంతెపుదేగుదెంచునని' వాకిలి చూచుచునుంటి' నన్నాఁడఁట మారీచుఁడు. ఎపుడు తనవంతు వచ్చునో అనుటకు 'వంతు ఏగ

దెంచునో’ అని ఈ కవిప్రయోగములోని సొగసును వాకిలి చూచుచు నుంటిలోని అవకతవకను గుర్తింపవలసియున్నది.

మారీచుఁడు రావణునకుఁ జెప్పవలసిన నీతులు చెప్పిచెప్పి తప్పనిసరి యగుటచే తుద కాతని త్రోవ కంగీకరించి ఇట్లనును:— ‘న హి రామం పరాక్రమ్య జీవన్ ప్రతినివర్తతే, వర్తతే ప్రతిరూపోఽసౌ యమదండహతస్య తే కిం ను శక్యం మయా కర్తుమేవం త్వయి దురాత్మని, ఏష గచ్ఛామ్యహం తాత స్వస్తి తేఽస్తు నిశాచర’— అని. [వాల్మీ. అరణ్య. 1135 పు] శ్రీరాము నెదిరించినవాఁడెవ్వఁడు బ్రదికి బయటఁబడినది లేదు. యమదండము రుచిచూచుటకై నీతో పాటు నేనును సిద్ధమే. నావలన నేమియుఁ గాదుగదా నాయనా! సరే పోయెదను. నీకు శుభ మగుఁగాక! — అని మారీచుఁ డనఁగానే రావణుఁడు సంబరపడి, అందాఁక ఈ రథమునీఁదఁ బోవుదమని ఆతనిని రథమెక్కించుకొని రామాశ్రమప్రాంతమునకుఁ దీసికొనివెళ్లి విడిచిపెట్టును-ఈ మూలకథకు కల్పవృక్షము పూసిన రంగు-ఇది:— ‘వ. మఱి బతుకు లేరుము నిన్నందు డించెద నన మారీచుం డిదిగో యని తన యాశ్రమమునఁ గుండ లన్నియుఁ బగులఁగొట్టి పైకప్పంటించి గోడలు పడఁద్రోసి తన్నుఁ దీక్ష్ణముగాఁ జూచుచున్న రావణువంకఁ జూడక రథం బెక్కి రాముని యునికి కల్లనిద్దఱు రథావతరణంబు చేసి మారీచుం డిట్లనియె’ — [కల్ప-అరణ్య - 184 పుట]

సరేయని మారీచుఁ డంగీకరించినపిదపఁ దన యాశ్రమములోని కుండ లన్నియు విశ్వనాథమారీచుఁడు ముక్కలు చేయుటలోను పైకప్పు తగులఁ బెట్టుటలోను గోడలు నేలఁగూల్చుటలోను గల అంతరార్థము మనము గ్రహింపవలెను. ఈ నడుమ ‘గోవా’ పరగణాలో విదేశ్యుల పెత్తనమును భారతప్రభుత్వము ఊడఁగొట్టుటకు ఉన్ముఖమైనప్పుడు అక్కడి ప్రభుత్వాధినేత ఈ విశ్వనాథమారీచునివలెఁ దాను వసించిన భవనమును అందలి వస్తువాహనములను భగ్నము చేసెనని పత్రికావార్తలు వింటిమి. ఆదికవికిఁ దెలియని యిట్టి రహస్యమును కల్ప

కర్త వ్రాయఁగలిగినందులకే తనవ్రాఁత, వాల్మీకమున కొక 'భాష్య' మన్నంతదాఁక ఘోషింపసాగెను. 'ఇద్దఱు రథావతరణంబు చేసి మారీచుం డిట్లనియె' అను ముక్కలోని అపభ్రంశమునకు 'విశ్వనాథ ప్రయోగదక్షత' అని వ్రాసెడి 'వందిమాగధులు' పుట్టుకొనివచ్చుటయే గాదు; ఇట్లే ఒండురెండు చోట్ల నాచనసోమన్న సైతము అనలేదా అన్నధోరణికి దిగుచుందురు.

రామాశ్రమప్రాంతములో రథావతరణము చేసినపిదప రావణుఁడు మారీచుని చేయి పట్టుకొని మిత్రమా ! అదిగో అదే రామాశ్రమము. మనము వచ్చిన పనిని త్వరగాఁ జేయవలెనని చెప్పఁగా సరేయని మారీచుఁడు లేడియై పోయినట్లు వాల్మీకములో కథ కన్పించును; ఇక్కడ కల్పములోఁ గొంతమార్పు కూర్పు కన్పించుచున్నది. ఏమని ! —

రథావతరణము చేసినపిదప విశ్వనాథమారీచుఁడు మఱల వాదములోనికి దిగి.

'వినను నిక్కముం దెలియ నద్దిద మద్వ్యథ మొక్కఁ డెంచిరే
నా ! నలినాయతాక్షి జనకాత్మజ నిక్కముగా హరింతువా !
పూని హరించితేని రఘుపుంగవుఁ డార్తి భరించలేఁడు రా
జ్యానికి రాజ్యమట్లయి కులాంగన యాగతి దూరమై చనన్
'పదుమూఁడేడు లవెట్లునుం గడచె నప్పా ! యొక్క యేడాది కా
నిదిగాఁ గన్నులు మూసికొన్నఁ బదకొండే మాసముల్ మాసమ
య్య దయోధ్యాగమనాంతరం బెసఁగు వార్తాపైన నిందుండవ
చ్చెదరా ! వా రెవరోను నీ వెవరొ దాక్షిణ్యైక వారాన్నిధీ!' [అర.185పు]

రాముఁడు మహామహుఁడనియు అతని భార్య నపహరించినచో నీకును నాకును మన సర్వవంశమునకు సర్వనాశనము సంభవించుననియుఁ జెప్పవలసిన ఈ మారీచుఁ డీ తెలుఁగు కావ్యములో రాముని పక్షమున వాదములోనికి మఱలఁజొచ్చి దయాదాక్షిణ్యములు చూపుమన్నంత దైన్యమునకు దిగజారెను. 'వినను నిజ మేదో చెప్పుము. నా చావు ఒక్కటే. ఎంచి ఆ జానకిని హరింతువాయేమి ! పట్టు ప

అమెను నీవు హరించితివేని పాపము ! రాముఁడు ఆ యార్తి భరింప లేఁడుగదా ! రాజ్యానికి రాజ్యమేమో ఊడిపోఁగా, కులాంగన ఈ రీతిగ దూరమై పోఁగా–ఆతఁ డేమైపోవునో! ఆలోచింపవలదా! ఇప్పటికె పదునాఁడేండ్లవెట్లో కడచిపోయినవి. ఇఁక– ఒక్కయేఁడాది మనది కాదుగదాయని కన్నులు మూసికొన్నచో వారితోవను వారు పోయెదరే. ఆపైని వారు ఇక్కడికి వత్తురా ! ఉందురా ! ఆవల, వారెవరో! నీ వెవరవో !' – ఇది ఈ మారీచుని దేవిరింపు.

మద్వ్యథ మెంచి జనకాత్మజ హరింతువా అన్నమాటలో అర్థము లేదు. తన బలఁగమును ఆ తీరుగఁ కష్టాలపాలు చేసి పెద్దగా అవమానించిన రాముని సహింపరాదని, పనిపూని వచ్చిన రావణునితో–పాప మా రాముఁడార్తి భరింపలేఁడుగదా అని మారీచుఁడు వకాల్తనామా తీసికొని మాటాడుటలో స్వారస్యమే లేదు. ఆతని భార్యను హరించుట నీకు శ్రేయస్సు కాదు; ఆతనిని జయించుట నీకు సాధ్యము గాదు – ఈ ధోరణిలో నీతిని జెప్పవలసిన మారీచుఁ డీ కల్పములో దిగజారి పోవుటకు ఈ భావ్యకర్త చూపిన దక్షతయే కారణము. రెండు పాదములలో 'నిక్కమ'న్న పదము రెండు సారులుగ ఈ కవనమున కెక్కినది. 'అడ్డెద' అన్నరూపము ఉన్నదిగదా యని చేయి తిరిగిన కవి వాడుకొనఁడు. ఎంచియేనా – అవధారణార్థకమైన 'ఏ' తరువాత ద్రుతస్వరూపము చూపుట వ్యావహారికము.సరిగా దీనికి సహోద్యాయి 'వారెవరోను' అన్నపదము. 'ఆపైన' ఇత్యాదు లీ రచనలో బాహాటముగా నుండుటఁజేసి అవి అచ్చుతప్పు లనవలసినపని లేదు గదా !

మారీచుఁ డన్నమాట విని రావణుఁడు 'దక్షిణగల్లభాగ వికృతంబుగా నవ్వి యిట్లన్నాఁడఁట :–

'పరమభక్తుఁ డుండఁ బరమేశ్వరుండు కాలేక యేమి నిన్ను లేడిఁ జంప నేను రాముఁడైన నినుఁ జంప నేనైన రాముఁ డపహరింపఁడా మెలంత' [185 పు]

విశ్వనాథ రావణుఁడు చెప్పిన ఈ మాటల కర్థము విశ్వనాథ

మారీచునకే తెలియవలెను. అవురా ! ఏమి కవనము ! ఏమి భాష్యము!! పరమ భక్తుఁడఁట ! పరమేశ్వరుండఁట ! నిన్ను లేడిని జంపుట యఁట ! నేను రాముఁడైన — అఁట. ఇది యంతయు పెద్ద అడవిగోడు కవనముగా సిద్ధమైనది. ఇందు పరమార్థమున్నదని వాడ వాడల ఘోషించుటకన్న దీని కొక వ్యాఖ్యానము వ్రాసి దేశములో వేసినచో దీని పస తేలిపోవునుగదా !

'ఏనున్ రామునిచేతఁ జావవలెనం చే యిట్లు కూర్చుంటి నీ
వైనం జావ నటంచు నెంచెదవు నీ కా చావు తప్పింపరా
దానీహారనవాంశుమౌళియును జేయన్ లేఁడుపో / సీత నా
గా నొప్పారెడు ధూమకేతువును లంకామధ్య మందుంచుకో'

'భూమిజాతఁ గొంచుఁ బోవఁగా నీ కెంత చేయవలయు నంతచేతుఁ జూడు మనిన —'.  [అర-186 పు]

లేడిగాఁ బోయి చేయవలసినదానికి సమ్మతించిన పిదప, మారీచుని దన రథమం దెక్కించుకొని రావణుఁడు రామాశ్రమమునకుఁ జేరెను. చేరిన పిదప మఱల ఈ మాటలు మారీచుఁడు చెప్పినట్లు కల్పవృక్షము కల్పించుటలో క్రొత్త దనమున్న దేమో పరిశీలింపవలెను. నేను రాముని చేతిలోఁ జావవలెనని ఎంచియే నీవు కూర్చుంటివయ్యా స్వామి ! నీకుమాత్రము చావు రాదా ! నీ చావు తప్పింపవలెనన్న చంద్రమౌళికి సైతము సాధ్యముకాదే. ధూమకేతువు వంటి సీతను లంకలో ఉంచుకో. ఆమెను గొంచుఁబోవుటకై నీ కెంత చేయవలెనో అంతయు నేను చేతునని ఈ మారీచుఁడని, వెంటనే లేడిగా మాఱెనఁట. రథావతరణము చేసిన పిదప మారీచుఁడు చేసిన ఈ ప్రసంగ మంతయు వట్టి చర్వితచర్వణము పిష్టపేషణము.

తీర — మారీచుఁడు లేడియై కన్పించినంతనే రావణుఁడు తన యుత్తరీయమును విసరి దానిమెడకు వేసి కూడఁబట్టి మఱల ఇట్టు లన్నాఁడఁట.

'ఆ రాముం దరుదెంచి మత్పరిఖ నాల్గంభోధు లింకించి యో
హో రోదస్సుదితాగ్నిమండలము చేయూన్ విష్ణుచక్రంబు చ

క్షూ రాజీవయుగంబు విచ్చికొని కన్గోఁజూడు చాలుండ మా
మారీచుండనిపించుకో అతఁడు చంపం డాత్మభక్తున్ నినున్’
‘క్షితికన్యామణి నేత్రతర్పణముగాఁ జెల్వైనరూపంబు తా
ల్చితి మండోదరి కింత సంతసము కల్పింపంగ నెట్లైనఁ జే
సితివా ! యిన్ని దినాలు దాఁచితి పరశ్రేయోనిధానైక దు
ర్మతి! చంపంగను వీలుగాని తరి మర్మవ్యక్తిగాఁ దోచుమన్’ [అరణ్య '89పు]

నా కీ పనిచేసిపెట్టుమని కోరవలసిన దశలో నున్న దశగ్రీవుఁడు, తాను జెప్పినదానినే సరిగాఁ జేయుఁబోవు మారీచునితో మఱల నీ మాటలు చెప్పుటలో అందము లేదు; అర్థము లేదు.

‘ఏమోయి నిన్ను అతఁడు చంపఁడు లేవోయి. విష్ణు చక్రము ఆత్మభక్తుని జంపునాయేమి ! ఆ రాముఁడు వచ్చి నాలుగు సంద్రము లింకించి నన్నేదో చేయును లే. సరేగాని, జానకీనేత్రతర్పణముగా ఇంత చెల్వైన రూపము దాల్చితివే. ఔరా ! ఎన్నఁడైన మా మందరికి ఇట్టి వినోదము కల్పించితి వటోయి ! పరశ్రేయోనిధానైక దుర్మతీ ! నీవు చేసిన పనికి ఇది సమయము కాదుగాని లేనిచో ఈ పాటికి నిన్నుఁ జంపియే యుందును’ – ఇది విశ్వనాథ రావణుఁడు తెచ్చిపెట్టిన క్రొత్త ‘కేసు’ !! కార్యము నెఱవేర్చుకొనుపట్ల యజమానుఁడు చేయవలసిన పని యెట్లుండును ? వెటకారములు – హేళనలు, నిందాభాషలు, ఇట్టిసమయములో ఔచితిని పెంచునా ! రసము నావిష్కరించునా ! లౌకికముగా ఈ కావ్యకర్త, లాఁతి వారియెడఁ జూపెడి వెటకారపు ధోరణియే నిందాపూర్వక సంభాష ణములే ఈ రావణుఁడు సైతము వేళగానివేళలో సాగించెనన్న ఆశ్చర్య మే ముండును. అక్కఱయైన ఘట్టములలో కావ్యకర్త గుణశీలములే కావ్యములో ప్రతిబింబించునన్నమాట విశ్వనాథవారి విషయములో అక్షరాల సత్యమన్నమాట కాదనలేముగదా !

రావణబ్రహ్మ ఒంటిమీఁద ఉత్తరీయ మున్నట్లు మారీచుఁడు లేడి కాఁగానే దానిచే దాని మెడకుఁ బెనవేసి ఆతఁ డాతనిని ఈ తీరుగ

మండలించినట్లు ఇట్టిది వాల్మీకమునకు మహాభాష్యముగా మనము గ్రహించి తరింపవలెనని విశ్వనాథవారి యుపదేశము కాఁబోలు !

'వ. అంత నా లేడి మేయుచున్న తల యెత్తి . . . పచ్చిక మేయుచు మారీచుండు సర్వశ్రవణంబు వారిదెసనే యుంచె' [193పు] మారీచుఁడే లేడిగా మాఱిన ఈ ఘట్టములో ఒకే వాక్యములో లేడి శబ్దముతోపాటు మారీచశబ్ద ప్రయోగ మెందులకో ! తల యెత్తుటలు బిత్తరపోవుటలు మెడ నిక్కించుటలు పచ్చిక మేయుటలు- ఇట్టివన్నియు- ఆ లేడి చేయుచుండఁగా, ఆ రూపులో దాఁగియున్న మారీచుఁడు సర్వశ్రవణంబు వారిదెసనే యుంచెనని ఒకానొక స్వారస్యము తీసెదరు కాఁబోలు ! ఆ పక్షమున వాక్యములు రెండుగాఁ జేసి కర్తృక్రియలకు అవిరోధముగా ప్రయోగము చూపవలసియుండును. ఇట్టిది చేయక చేయలేక ఇది యొక ప్రౌఢరచన యని కులికిన లాభము లేదు.

'మాయలేడిని జూడఁగానే పూలు కోసికొనుచున్న జానకి మిక్కిలి ఆశ్చర్యపడి రామలక్ష్మణులను బిలిచి దానిని జూపించెను. వెంటనే, అది పట్టి లేడి కాదు; మారీచుఁడే ఈ వేషముతో వచ్చియుండవచ్చును. ఇది యంతయు మారీచుని మాయ. దీనిని నమ్మరాదు. అని లక్ష్మణుఁడు గట్టిగాఁ జెప్పఁగలిగెను. ఆ మాట లేవియుఁ బట్టించుకొనక జానకి ఆ లేడితోలుకోసము ముచ్చటపడి దానిని దెచ్చియిమ్మని శ్రీరాముని గోరెను. లేడి యొంటిమీఁది చుక్కలకు రాముఁడు సైతము విస్మయపడి దానిని బట్టి తెచ్చి భార్య కీయవలెననియే నిశ్చయించుకొని, తమ్ముఁడా ! ఒకవేళ ఈ లేడి మారీచుఁడే అయినచో దీనిని జంపివేయుటే నా కర్తవ్యముగదా యని దానికోసము పయనమాయెను.' ఇది వాల్మీకములోని అసలు కథ.

ఆ లేడి తనకుఁ గావలసియున్నదనుటకు సీతాదేవి చెప్పిన కారణములలో హృద్యము లైనవానిని 'కల్పము' సరిగా గ్రహింపలేదు. వాల్మీకి చూపిన హేతువులలో స్త్రీజనస్వభావము ప్రాతివత్యలక్షణము చక్కఁగా వ్యక్తమగుచుండును. నాథా! ఇది నాకుఁ గావలె! చేసి

తీరవలెనని మిమ్ముల నాజ్ఞాపించుట క్షమింపరాని తప్పిదమేగాని, ఈ జింక యొంటిమీఁది చర్మము నన్ను విస్మయపెట్టుచున్నది. నే నేమి చేయవలెనన్నంతదాఁక వాల్మీకములోని జానకి అడఁకువ చూపును. ఇఁక కల్పములోని సీతవైఖరియే వేఱు.

'ఇది మాంసంబు భుజించుఁ ద్రావును మహాసృగ్వాహినుల్ దీని జె
చ్చెదమా పోషణసేఁత కష్టమని నీ చిత్తంబులోఁ దోఁచునా
పదమా! రాఘవ! పచ్చిగడ్డి తినుచుం బ్రాణంబు పోషించుచు
న్నదిగా పాపము లేడిజాతియయి యెన్నం గష్ట మిందున్నదే!
మన యానందముమాట యాపయి వనీమధ్యంబునం దక్కటా
మనమై వీడిన దీని నే పులియొ చంపన్వచ్చుఁ గాదింద యే
దనుజాధీశ్వరుఁడే వధించు సముపాత్తంబైన పాపంబు నీ
కును నే మున్నది యూహ యెవ్వరికిఁ గల్గున్ వారికిన్ గానిచో'

[194 పుట]

ఈ ధోరణిలో సాగిన ఈ జానకి హేతువులను బరిశీలింతము: ఈ లేడి, మాంసము తినునా! నెత్తురు త్రావునా! దీనిని మనము పోషింపవలసిన పనియే లేదు. ఏదో ఇంత పచ్చిగడ్డి తిని బ్రదుకునుగదా! సరే; మన యానందముమాట అటుంచి చూతము. మనము దీనిని విడిచినచో ఏ పులియో తినవచ్చును; ఏ రాక్షసుఁడో చంపవచ్చు. కావున దీనిని దెచ్చి యిమ్ము. అని ఈ పద్యములలో నున్న భావము. ఇంతే గాదు; ఇంకను మఱికొన్ని కారణములు వినిపించును. మామ గారు జ్ఞప్తికి వచ్చుచున్నారు. అప్పుడు కుంభసంభవుఁడు మీ కేమని చెప్పెను! ఈ వనములో ధరణీసుత యేది కోరినను దప్పక చేసితీరవలెను. నినుబట్టికాదా ఆమె ఈ వనమునకు వచ్చినది? అని కదా! నాథా! ఒక్క లేడిని దెచ్చిపెట్టలేవా! ఇది నేను గోరద్రగదా! ఇది విపరీతపుఁగోర్కి యందువా' ఏమో ఈపాడులేడి నన్నిది కోరఁగఁజేసినది. దీనిని ప్రాణముతోఁ బట్టవలెనన్న వల యున్నదా !జిగు రున్నదా ! దీని నిఁక ఎట్లు పట్టుకోవలెను ! పోసీ! రఘుతిలక ! దీనిని జంపి దీని చర్మమైనఁ దేవయ్యా స్వామి! జనకతనయామనః పరివ్యాప్తహృదయ! ఈ లేడిని దేవయ్యా. దీని కథ జీవితాంతము విస్మరించెడిది కాదు.

ఇట్టి యందమైన లేడి లేదు. నీ పినతల్లిమాటకు అడవులను జేరితివే. నాపయి అంతమాత్రము లేదటే? నాదగుమాటకు లేడిని దేనుజాలవా! ఈ పని నీవు చేయవేని ఈ గతిని వనము వచ్చి ఏమి ఫలము' నా ప్రభూ! వనవాసమునేత అయోధ్యాపుర మెల్ల నమ్మ వలెనా! లేదా! – ఇది వైశ్వనాథసీతమ్మ ధోరణి!!

జానకి, లేడిని జూచి దానిని గోరినవెంటనే లక్ష్మణుఁడు మాత్రమే నిజము గుర్తించి అది మాయలేడి యని శంకించి తన యభిప్రాయము చెప్పెను. మాయలేడి యైనచోఁ జంపఁదగుననియు సీతాదేవికోరిక తీర్పవలెననియు రాముఁడు ఆమె కనుకూలముగానే అభిప్రాయ మిచ్చినట్లు వాల్మీకము చెప్పినది. ఈ కల్పములో లక్ష్మణుని అభిప్రాయము వినకముందే సీతమ్మ ఈ రీతిగ పదునేడు పద్యాలలో ఏకధాటిగ పెద్ద యుపన్యాస మిచ్చినది. తాను జూచిన లేడిని చూపించి రామునితో కల్పములోని సీతమ్మ మున్మొదట అన్నమాట ఇది :—'కానలో నను దోకొంచును రాన యంటిరిగదా నన్ గొంచు రాకున్నచో మన సాకేతమునందుఁజూడనగు సామాన్యంబులా యివ్వి యున్, ననుఁ దోకొంచును వచ్చినందుకుఁ గృతజ్ఞన్ మీకుఁ బ్రాణాంతమున్' [193పు.] అడవులకుఁ దన్ను దోకొనివచ్చినందులకు ఆమె, భర్తకు కృతజ్ఞత యెఱిఁగించి ఈ యుపన్యాసము ప్రారంభించినది. నాతోపాటు నీవు రావలదన్న (శ్రీ)రామునితో సీతోడిదే నా బ్రదుకని యొప్పించి వచ్చిన జానకి, అడవిలో ఇట్టి కోరిక కోరి, నీ పినతల్లి మాత్రము నేను జేయనా! అడవికి వచ్చి యేమి ఫలము! ఇత్యాదిగ నిష్ఠురము లాడుచు దెప్పిళ్లతో 'సోది' సాగించుటలో ఔచిత్యము కన్పించునా! రామలక్ష్మణులలో ఎవ్వరును అభ్యంతరము చెప్పక ముందే ఇన్ని మాటలు సీతమ్మనోటికి రావలసిన పని యేమి! లేడిని జూచి, ఆ యిరువురకుఁ జూపినవెంటనే లక్ష్మణుఁడు శంకించినట్లు చెప్పిన వాల్మీకమును మార్చి ఈ యుపన్యాసమును ఇప్పించిన 'కల్పము' లోని అనల్పమైన స్వారస్యమును మెచ్చుకొనవలెనా! ఔచిత్యభంగము నకు నొచ్చుకొనవలెనా! తన యానందముకోసము ఈ లేడి కావలె

నఁట. పైగా దీనిని మనము విడచిపెట్టినచో ఏ పులియో రాక్షసుఁడో పొట్టనుబెట్టుకొనునఁట. ఈ మాట అన్న 'కల్పము' సీతమ్మ, వెంటనే మనకు జిగుఁరున్నదా! వల యున్నదా! పోనీ లే! దీనివెంటఁబడి చంపివైచి చర్మమైనఁ దెండయ్యా! ఆ చర్మము తీసికొని వెళ్ళినప్పుడు మనము వనవాసము చేసినట్లు అయోధ్యాపుర మెల్ల నమ్మునుగదా! అనును. ఇది అత్యంతము మెచ్చుకోఁదగ్గ బృహన్నలాకారణము. బృహన్నల సారథిగాఁ బోయినపుడు ఉత్తరకుమారుఁడు, ఓయీ! అర్జునున కున్న పేరులు చెప్పు చూతము. ఆ పేరులు నీవు చెప్పఁగలవేని నీవు అర్జునుఁడవే యని నమ్మఁగలను. అని పరీక్ష పెట్టెనఁట. వెంటనే బృహన్నల, 'అర్జున – ఫల్గున' ఇత్యాదినామములను పేర్కొని నిర్వచనము చెప్పఁగా ఉత్తరుఁ డిఁక తప్పక అతఁ డర్జునుఁడే యని నమ్మెనఁట. అవి నిజమో కాదో ఉత్తరునకుఁ దెలిసియుండవలెఁగదా! ఉత్తరునకుఁ దెలిసినప్పుడు లోకములో ఇంకొకనికిఁ దెలియవచ్చును గాదా! ఇంకొకఁడు వచ్చి ఇవి పేర్కొన్నమాత్రాన అతఁ డర్జునుఁ డగునా! ఈ యుత్తరకుమారుని తెలివితేటలే కల్పవృక్షములోని సీతమ్మ సైతము చూపినది. వనవాసము చేసినట్లు 'దాఖలా' ఉండుటకై ఈ లేడిని జంపి ఈ చర్మమును అయోధ్యకుఁ దీసికొని వెళ్ళవలెనఁట అయోధ్యవంటి పట్టణములోఁ గూర్చుండి ఈ లేడిచర్మమును ప్రభువులు తెప్పించుకొనుటకు మార్గములు లేవా! ఇట్టి కారణములు చెప్పి జానకీశీలమునకే మచ్చ కల్పించి వాల్మీకమునకు నాది భాష్యమని వాదించినచో లాభ మేమి! ఈ లేడి నెవరైనఁ జంపకమానరని జాలి పూనిన ఈ సీతమ్మ, తన నోటితోనే దీనిని జంపి చర్మమైనఁ దెండయ్యా! అనుటలో అంద మేమున్నది! ఇది యంతయు వట్టి దండుగమారి కవనము. అర్థము లేని కల్పము. అక్కఱలేని కావ్యము.

'పదమా! రాఘవ! పచ్చిగడ్డి దినుచున్ బ్రాణంబు పోషించుచు
న్నదిగా' . . . .

పచ్చిగడ్డి దినుచు పదవయ్యా రాఘవ! అని అపార్థమునీయ సమర్థమైన ఈ పద్యపాదములో 'హరిణము (తన) ప్రాణంబు

పోషించుకొనుచున్నది' అనవలసియుండి గణముకొఱకు 'పోషించుచున్న' దనవలసివచ్చెను. అది నిజమైన లేడి కాదు; మోస మేదో యున్నదని లక్ష్మణుఁడు చెప్పిన ఘట్టములో ఈ పద్యమును జిత్తగింపవలెను :—

'నిరతం బింద్రియవశులై తిరిగెడువారికి విపత్తు తెచ్చును దేదు
ద్ధర మింద్రియవశవర్తిత తిరుగనివారి కొకసారి తెచ్చియతీరున్'

[అర 196పుట]

ఈ పద్యమందలి భావమును మూఁడుముక్కలుగాఁ జేసి చూడవలెను. ఇంద్రియవశులై తిరిగెడువారికి విపత్తు తెచ్చును; ఇంద్రియవశవర్తిత దిరుగనివారికి (విపత్తు) తేదు; ఒకసారి తెచ్చియ తీరున్, అని. జితేంద్రియులకు ఆపదలు రావు; కానివారికి ఆపదలు వచ్చునన్న సామాన్యభావమును సామాన్యపద్యములో తికమకలుగాఁ జెప్పవలసినపని యేమి! లేక — ఏదో గాఢమైన భావ్యముదీనిలో లాగ వలసియున్నదా! తెచ్చును—తెచ్చియతీరున్, అనెడి క్రియలకు సాక్షాత్తుగ అన్వయించెడి కర్తృపదము లేవి!వారికి విపత్తువచ్చును—అన్న అర్థములో తెచ్చును అన్నపదము నచ్చిపడినది.

లేడినిగూర్చి సీతారామలక్ష్మణు లిచ్చెడి అభిప్రాయములను మారీచుఁడు రావణుఁడు వినుచున్నట్లును, లక్ష్మణుని సూక్ష్మపరిశీలనకు రావణుఁడు మెచ్చుకొన్నట్లును కల్పవృక్షము క్రొత్తగా కల్పించి వ్రాసినది.

'సేనలేదయేని చెల్లును, రాజ్యంబు లేదయేని చెల్లు భూదయితున
కుగ్రధీకుఁ డొక్కఁ డుండినచో మంత్రి యన్ని యున్నయట్లె యవనిపతికి'

[అర—197పుట]

ఉగ్రధీకుఁడైన ఒక్క మంత్రి ఉండినచో రాజునకు అన్నియు నున్నట్లే అని అన్వయము. అట్టి మంత్రిగా, లక్ష్మణుఁడు రామున కున్నాఁడని రావణుఁడు మెచ్చుకొనుచు, 'ఇంత భయ మెఱుంగ నే నెన్నఁడును వీని భావసరణిఁ గనిన భయము వేయు నొక్కమంత్రి యిట్టిఁడున్న చో నాకును శతములైన జనకసుతలఁ దెత్తు' [అర—197పు]

అని పలుకును. ఊహాప్రౌఢి శేముషీమహిమ గల లక్ష్మణునివంటి మంత్రులు తనకు లేనట్లును అట్టిమంత్రి ఒక్కఁడున్నను వందమంది సీతమ్మలను దాను దేఁగలననియు, ఇంత భయము నా కెన్నఁడు కలుగ లేదు; ఈ లక్ష్మణుని భావసరణిని జూడఁగా ఏదో భయము వేయుచున్నదనియు రావణుఁ డనుకొన్నట్లు కల్పవృక్షము వ్రాయుటలో సొగసు లేదు. భాసాదిమహాకవులు రామాయణకథకు మార్పు కూర్పులు చేసియుండఁగా నేనుమాత్రము చేయనా అన్న ధోరణిలో ఈ కల్పవృక్షకర్త ఏవేవో స్వకపోలకల్పనలు చేసెనేగాని వానిలో స్వారస్యము చట్టుబండలై పోవుటయే మిక్కిలిగాఁ గన్పట్టుచున్నది. లక్ష్మణుని మించిన ఉగ్రధీకులైన మంత్రు లెందఱో రావణుని కొలువులో ఉన్నారని వాల్మీకములో నున్నది. ఇది లేడిగాదు; మారీచుఁడని లక్ష్మణుఁడు అన్నతోఁ జెప్పినట్లే, ఈ పని నీకుఁ దగదని సమయములోఁ జెప్పఁగల విభీషణాదులు రావణునకుఁగూడఁ గలరు. కాని – ఆ రావణుఁడు ధీరుఁడు కావున, తాను గోరినది తప్పక కావలెనన్న పట్టుదల గలవాఁడు కావున లాఁతివారి మాటలు వినక సాహసించునేగాని, విశ్వనాథరావణుఁడువోలె 'భయము వేయుచున్న'దని బెంబేలు పడెడి వట్టి పిఱికిపంద గాడు. ఆతఁడు దుష్టుఁడో కష్టుఁడో కొందఱు కనిష్టుఁడో కావచ్చునుగాని దర్పములో ధైర్యములో హుందాతనములో తక్కువరకముగా వాల్మీకి ఆతనిని చిత్రింపలేదు. అట్టి మహామహుఁడైన ప్రతివీరుఁడు కావుననే వానిని జయించిన శ్రీరాముఁడు అంతవాఁడాయె నని వాల్మీకి మనకు నేర్పిన నీతిగా మనము గుర్తింపవలెను. ఇక్కడ, ఈ యొక్క లక్ష్మణుని వైఖరికే ఈ రావణుఁడు దిగులుపడినచో 'ముందున్నది ముసుళ్ల పండుగు' అన్నట్టు లంకలో జరుగనున్న యుద్ధరంగములో ఆతని వైఖరి యెట్టు లుండవలెను? బొందిలో ప్రాణము లున్నంతవఱకు భయమన్న అక్షరములనే పాటింపని ఊహింపని మహానాయకుఁడుగా రావణుని వాల్మీకి చిత్రించియుండఁగా ఈ కల్పములో పిఱికిపందయైన రావణుఁడు మన కంటి కెదురగుట కల్పనలోని అనల్పమైన దోషమే యనవలసియున్నది.

మాయలేడి విషయమై లక్ష్మణుని మాటలు విని జానకీదేవి, 'మాటలమీఁద బెట్టి నను మప్పఁగఁ జూతురు మీర లిద్దఱున్' అని నిష్ఠురము లాడుచు, 'ఏ నొక కోరికం జనన మెయ్యది కోరిన నద్ది యిమ్మనెన్

> మౌని తదుక్తికిన్ ఫలము మాటగఁ గోరిక గల్గె లేడిపై
> మౌని త్రికాలవేది యిది మానసమందు నెఱింగి చెప్పెనో
> కానిది నాకు లేడిపయి గాటపుఁగోర్కి యిదేల కల్గెనో' [అర-199పు]

అని పల్కెనఁట. నేనేది కోరినను తప్పక ఈయవలెనని మౌని అన్నాఁడు. ఆ మౌనిమాటకు ఫలితముగా ఈ లేడిపయి కోరిన నాకుఁ గలిగినది. మౌని, త్రికాలవేది కావున ఈ యంశము మనస్సులో గుర్తించియే చెప్పియుండవచ్చును. కానిచో నాకీ లేడిపై గట్టి కోరిక ఎందులకు పుట్టవలెను? అని జానకి రామలక్ష్మణులతో అనుచుండఁగా అవియెల్ల రావణమారీచులు విను చున్నట్లు కల్పములో మనము కనుచున్నాము. అప్పుడు సీతానిశితసుకుమార ప్రసంగ నైపుణికి మారీచుఁడు అచ్చెరు వందెనఁట. ఇఁక రావణుఁ డిట్లను కొనియె :—

> 'అతఁడు కుంభసంభవుఁ డహర్పతితేజుఁడు నిద్ద చెప్పెనా
> వేతమునందు రాఘవునిచే దనుజోన్మథనంబు కోరి యీ
> రీతి వచించియుండు వివరించిన రాముఁడు చాలుఁగాని సీ
> తాతరుణీవియోగము సుదారపయోధిఁ దరించు టెట్లగున్.
> ఏవో గూడుపుఠాణి చేయుదురు కాదే మౌను లానందవ
> ల్లీదీప్తోరులతాంతముల్ హాతజగల్లీలాకృతుల్ వారి కే
> లో దుర్మార్గులు, కుంభసంభవుఁడు కాదో చేయఁగావచ్చు మ
> ర్యాదన్, గుంభజు నేమిచేసినను నారా! బ్రహ్మదాఁకం జనన్' [అర-200పు]

మౌను లేదో గూడుపుఠాణి చేసెదరఁట. ఆనందవల్లీదీప్తోరులతాంతముల్-హాతజగల్లీలాకృతుల్, ఈ రెండు విశేషణములు మౌనులకే గదా వేసినది. ఆ మౌనులు 'విశ్వనాథ' దృష్టిలో ఇంతవారా! లేక రావణునిదృష్టిలోఁగూడ ఇంతవారైరా! ఇంతవారైనప్పుడు వారి

కేలో దుర్మార్గులన్నంతమాట రావణునినోట రావచ్చునా! కుంభజుని ఏమి చేసినను బ్రహ్మదాఁకఁబోవునఁట. ఇది కేవలము విశ్వనాథవారి 'వ్యక్తిగతసిద్ధాంతము కావచ్చును ఆ మానులనుగూర్చి ఆ రావణుఁడట్లు అనుకొనెనో లేదోగాని విశ్వనాథదృష్టిలో ఈ పురాణ మిట్లు సాగు చుండుట మనము గుర్తింపవలెను.

మాని చెప్పినట్లే నా కోరిక తీర్పవలెనని జానకి అన్నమాట విన్న వెంటనే శ్రీరామచంద్రులవా రిట్లనిరఁట:-

> 'ప్రీతిని వచ్చెఁ దా నుదుకవేసెడి దిక్కును లేక చేతులం
> బ్రాఁతిగఁ గాల్చుకోవలసివచ్చెడి దీవును నేను నేండ్లుగా
> నీ తరళాక్షి నిక్కముగ నెద్దియుఁ గోరదు మున్ను కోర్కి ప్ర
> స్ఫీతము సందియంబు కలిపించిన చోటునఁ గర్గె, జిత్రమై' [అర. 200]
> 'పుట్టిల్లును నత్తిల్లును నట్టడవిగ జేసినాను నాతికి నటవీ
> పట్టాభిషేక మారిచి పుట్టిన యొకకోర్కి చేయఁబోవనొపతినై' [అర.200పు]

'మాటలమీఁదఁ బెట్టి మీరిద్దఱు నన్ను మోసగింతురా (198పుట)' అని విశ్వనాథసీతమ్మ అన్నదానికి చక్కని సమాధానము విశ్వనాథరామయ్యయే చెప్పఁదగినవాఁడు. ఏమని!

విన్నావా తమ్ముఁడా! ఈ తరలాక్షి యింతవఱకు నిక్కముగా ఏదియుఁ గోరలేదు. ఏదో ప్రీతిచేత మనవెంటఁబడి వచ్చినది. ఈబిడయే రాదనుకో! ఈ యడవులలో మనకు ఉదుకవేసెడి దిక్కులేదుగదా! అప్పుడు మనంతట మనమే చేతులు కాల్చుకోవలసివచ్చెడిదే. పాపము! పోనీ ఈ కోరిక తీర్చుట మంచిది. అత్తిల్లు-పుట్టిల్లు ఈ నట్టడవిలోనే ఈబిడకు ఏర్పాటు చేసితిని: ఇది వైశ్వనాథరచనలోని రాముని సమాధానము. ఈ ఉదుకవేయుటలు-చేతులు కాల్చుకొనుటలు మనవంటి సామాన్యగృహస్థుల కథలు. ఇంతటి సూక్ష్మమైన అంశముసైతము కావ్యములో గర్భితము చేసెనని ఈ మహాకవిని శిష్యపరమాణువులు మెచ్చుకొనవచ్చును. కాని, సీతారామలక్ష్మణులు అవతారపురుషులన్న ధోరణిలోఁగదా ఈ కల్పవృక్షము భూమిలోన అవతరించినది. ఆ వ్యక్తుల హుందాకుఁ దగినట్లుగా ఆ చేతలు వారినిగూర్చియున్న

మాటలు వారి యూహలు చిత్రింపవలసియున్నది. కూడు ఉడుకవేయు టయే సీతమ్మకు పరమార్థమైననాఁడు ఉడుకవేయుటకే ఆ యిద్దఱు ఆ బిడను అడవులకుఁ దెచ్చుకొన్ననాఁడు-పతిదేవతయని ప్రసిద్ధి చెందిన ఆమె కథలను మన మిక మఱచిపోవలెను. సీత లంకకుఁ బోయినపిదప ఆ యిర్వురకు కూడు ఎవ్వ రుడుకవేసిపెట్టిరో పాపము! ప్రస్థానఖండ ములో ఒకచోట [అయోధ్య145పుట] ఈ శ్రీరాముఁడే 'విడిసి యొక వరాహమ్ము నొక ఋశ్యంబు నొక వృషతంబు నొక రురువు వధించి యగ్నివేల్చి వండి క్షుత్తు దీర్చికొని, సౌమిత్రి చెట్టుక్రింద బాగుచేసి యాస్తరణయోగ్యంబుగాఁ జేయు నందుఁగూర్చుండి' అన్న ఘట్టములో- ఈ అన్నయ్య రామచంద్రయ్య తానుగా ఆ మృగములను జంపి వేల్చి వండి క్షుత్తు దీర్చుకొన్నట్లును-ఆ వంటతో సీతమ్మకు సంబంధము లేనట్లును వ్రాసిరి. మోటుజాతిమానుసులు దారిని బోవుచో కంటికిఁ గానవచ్చిన ఉడుతలను తొండలను గొట్టి కాల్చుకొని తినునట్లు రాముఁడు అడవిలోఁ బోవుచు కన్పడ్డ మెకములను గొట్టుకొని కాల్చు కొని ఆఁకలి తీర్చుకొన్నట్లు వ్రాసిన ఈ కల్పములో ఆ యిర్వురన్న దమ్ములకు కూడు ఉడుకవేయుటకై సీతమ్మ రావలసివచ్చినదని రాముని నోట ఆ మాట వినవలసివచ్చెనుగదా! అడవిలో మానులకు అచ్చు ముగా అఁడుఁగూఁతులే వండి ఆర్చుచుందురా! షడ్రసోపేతభోజనము లతో కాలక్షేపము కావించుటకు రాముఁడు లీ యడవులకు రాలేదే. కందమూలాదు లారగించుటకు వంటకత్తెలతో అంతగా పని యుండదే. ఎందుల కీ అక్కఱలేని పేలవమైన కారణమును జెప్పి ఆమె కోరికను దీర్పవలెనని రాముఁ డన్నట్లు వ్రాయుట!

సరే రాముఁడు లేడిని దెచ్చుట కంగీకరించి పర్ణశాలలోనికిఁ బోఁగా సీతతోడం జని కవచాదు లందిచ్చి సాయపడి 'మరల నెప్పుడు కనిపించుట' యని ప్రశ్నిచెనఁట [అర-200పుట] 'మరల నెపుడు కని పించుట'-ఈ మాట కల్పము కల్పించి యిచ్చిన కావ్యార్థసూచనము. ఆతఁ డీమెకు మరలఁ గన్పించునది లంకలోనే. ఈ యనిష్టమును సూచించుటకే ఈ తెలుఁగుకవి ఈ కావ్యార్థసూచనము చేసెనని

స్వారస్యము తీయవచ్చును. కాని, లోకములో ప్రయాణమగుచున్న వారిని ఎప్పుడు వచ్చెదవు! ఎక్కడికి వెళ్లుచున్నావు! అని ప్రశ్నించుట మంచిది గాదని వ్యవహార మున్నది. లేడిని జంపి వెంటనే వచ్చెద నని రాముఁ డనఁగానే సీత,

'బాష్పమందాక్షమందాక్షి ప్రభువ! నీకుఁ గోపముగ నున్నఁ బోవఁబోకుము మతింతమాత్రఁ బ్రాణంబులుం బోవునా! త్రిలోక మొడ్డిగిలఁనా! యెదో కోర్కి యుడిగినంత' [201పు]

అని మహోక ధోరణిలో సంభాషణము సాగించును. నీకుఁ గోపముగ నున్నచోఁ బోవలదనుటకు రాముని కోపము ఈ కావ్యములో ఈ ఘట్టములో మనము చూడలేదు. నిన్న నేను గోరినప్పుడు ఉన్నట్లుగా నీ మొగము ఇప్పుడు లేదు. ఇంతమాత్రాన నా ప్రాణములు పోవునా! త్రిలోకము తలక్రిందులగునా! పోనీ లే! ఆ దనుజుఁడు వాఁడునయినం దానేల వచ్చెను? అందఱితో పాటు తానును జావఁగా వచ్చెనా యేమి! దైత్యసంహారణము – ధర్మరక్ష – జీవుఁడు – అఘము – జ్ఞానము – వైదికము – లౌకికము – ద్వంద్వఫలవిధాయి, ఇత్యాదిధోరణిలో, తీర – రాముఁడు ప్రయాణమైనసమయములో విశ్వనాథవైదేహి బోధింప సాగెను. ఈ బోధ లన్నియు కేవలము వైశ్వనాథములే. ఇవి విని రాముఁ డుబ్బిపోయి ఆబిడను గాఁగిలించుకొని నీ మతివైభవమును మన్నించెద నని మెచ్చుకొని కోపగించనులే యని, బాణము విల్లు నీ చేతిమీఁదుగా ఇమ్మన్నాఁడఁట. ఇంతకు ముందే సీత, తోడం జని కవచాదు లందిచ్చినట్లు ఉండఁగా, 'బాణంబు విల్లిగదే' అని మఱల ప్రశ్నించుటఁజేసి కవచాదులలో 'బాణంబు విల్లు' లే వన్నమాట మనము గుర్తింపవలెఁ గాఁబోలు!

మాయలేడిని శ్రీరాముఁడు తఱుముకొని పోవుచుండును.

'తరణికులుఁ డెంతన్ లేడిం బట్టం దాను తలంచునో విరిసి మృదువల్లత్రిక్కొాలిం దప్పించుక పోయెడిన్, తరణికులుఁ డెంతన్ లేడిం జంపం దాను దలంచునో విరవిర నదృశ్యమై గాలిన్ గన్పింపక పోయెడున్' –[205పు]

ఇక్కడ 'ఎంతన్' అన్న ముక్కలో ఏదో స్వారస్య ముండవలెను. ఎంతన్ - అనఁగా ఎంతయున్, అని అర్థము చెప్పవలెనన్నచో సందర్భము పొసఁగదు లేక, ఎంతన్ = ఎంతగా, అని అన్వయమా! ఏమోమఱి! ఆ 'యెంతన్'కుఁ దగినదే 'తప్పించుక' పోవుట.

'అలఘుఁడు రఘురామకరాగ్రబాణము' [206పు] అలఘుఁడైన రఘురామునియొక్క చేతిలోని బాణమన్న - ఈ ముక్కలో ఏకదేశాన్వయ దోష మున్నదనఁగానే 'ప్రౌఢవ్యాకరణ'ము చూపించి సంబరపడు శిష్యశిఖామణులు దండిగా నుండఁగా కల్పవృక్షకర్తకు తెలుగేమి యుండును?

'నిజానిజంబు మేను పోయి నేలఁమీఁద దైత్యుఁడై గిజాగిజన్ గలంగికొంచుఁ గృత్తిముండు భక్తుఁడై, విజాతిగొంతు వెట్టి స్వామి వేడినట్లు 'లక్ష్మణాగ్రజా' యటంచుఁ గేక వెట్టఁగా దుదిం 'గ్రజా' హాతిన్' - [206 పుట]

నిజానిజమైన మేనుపోయి దైత్యుఁడు, నేలమీఁద గిజాగిజ కొట్టుకొనుచు విజాతిగొంతుతో రామస్వామి వేడినట్లు 'లక్ష్మణాగ్రజా' అని కేక వెట్టెనఁట.

శ్లో. మ్రియమాణస్తు మారీచో దధ్యౌ కేన తు లక్ష్మణం,
ఇహ ప్రస్థాపయే త్సీతాశూన్యే తాం రావణో హరేత్.
స ప్రాప్తకాల మాజ్ఞాయ చకార చ తతస్స్వరం, సదృశం రాఘవస్యైవ హా సీతే లక్ష్మణే తి చ.' [వాల్మీ. అరణ్య: 1146 పుట]

రాముని దెబ్బ తిన్న మారీచుఁడు, కొనయూపిరితో నేలమీఁదఁ గూలిపోయి, ఆశ్రమమునుండి లక్ష్మణుని బంపించి జానకి యొంటరిగా నుండఁటకును రావణుఁ డామె నెత్తుకొనిపోవుటకును అదే అదనుగా గుర్తించి, రాముని కంఠస్వరముతో 'అయ్యో! సీతా! లక్ష్మణా!' అని అఱచె నని వాల్మీకము మనకుఁ జెప్పుచున్నది. దేశములో రామాయణకథ, ఆబాలగోపాల మిట్లే చెప్పుకొందురు. కథ, ఇట్లుండఁగా, విశ్వనాథమారీచుఁడు క్రొత్తతోవ

త్రొక్కి, విజాతిగొంతుతో 'లక్ష్మణాగ్రజా' అని కేక వెట్టుటలో భావ్య మేమున్నదో! లక్ష్మణాగ్రజా - అనఁగా రాముఁడేగదా! దితిజాతుని లక్ష్మణానినాదము' ఆమడపైన దాఁటి హెచ్చుగ వినిపించెనఁట.

'హా సీతా! హా లక్ష్మణా' అన్నమాట విన్నప్పుడే ఆ కేక శ్రీరామునిదని జానకి శంకింపవచ్చును. లక్ష్మణాగ్రజా' అని లక్ష్మణాగ్రజుఁడు కేక పెట్టవలసిన పని యేమి! ఆ కేక విని,

'అది మీ యన్న గళస్వనంబగుఁగదయ్యా కాదయేని వని
పద మం దెవ్వఁ డెఱుంగు నిన్నుఁ బిల్వంబూను నెవ్వఁ డహా'

[ 207 పు ]

అని కల్పములోని జానకి లక్ష్మణుతో అనుటలో అర్థ మేమి! ఈ యడవిలో నిన్నెవ్వఁ డెఱుఁగును? నిన్ను ఎవ్వఁడు పిల్వఁబూనును! కావున, ఆ స్వరము మీ యన్నదేసుమా! యని జానకి ఊహించెనఁట. లక్ష్మణుని బిల్వంబూనినపుడు లక్ష్మణా! అని యనవలెనా! లక్ష్మణాగ్రజా! అని పలుకవలెనా! ఎందుల కీ మార్పు!

తెలుఁగులో మనకు 'నిజము - నిజేము' అని రెండుపదము లున్నవి. ఒకటి తత్సమము; రెండు అచ్చతెలుఁగు. రెండింటికి అర్థములుసైతము వేఱు. కల్పములోని ఈ 'నిజానిజము' దేనిలోఁ జేర్చుకొని సరిపెట్టుకొనవ సియున్నదో! నిజ - తనది, అనిజ తనదికానిది, రైన మేను పోయినదనవలెనా! లేక, 'గిజాగిజ' కొసమై 'నిజానిజము' తెలుఁగురూపముగా గ్రహింపవలెనా! అసలు 'గిజగిజ' యని సర్వసాధారణముగా మనము వినుచుండెడి ఈ శబ్దము కల్పవృక్షకవిత్వములో గిజగిజ కొట్టుకొని గిజాగిజగా తేలినది. 'స్వామి వేఁడినట్లు' అనఁగా 'విజాతిగొంతు వచ్చినట్లేగదా! చర్వితచర్వణ మెందులకు! ఈ కేక విన్నపిదప, కల్పములోని సీతాలక్ష్మణు లెట్లు సంభాషించిరో మనము వినవలసియున్నది.

సీత - 'ఇది యిది యన్నఁ గాదనెద వెప్పుడు నీ వదియేమొ యట్టులే
యది జరుగున్ మృగంబయిన దక్కుట! తా హరిణంబుకాక ఘో

> రదనుజుఁడౌట నీ పలుకురాపిడి కాకమఱేమి, నీవు న
> న్నది పొలివోనినిక్కమగు నాలుక నీకు నొసంగె దైవమున్' [కల్ప.207పు]
>
> మ. అవు నాకర్మ మదిట్టులుండఁగను నేలా కాఁడు దైత్యుండు వాఁ
> డివురుక్ మెత్తనిమేని రాము హరిణం బే డొక్కలోఁ గ్రుమ్మెనో
> అవురా నీవును గేక వింటివికదయ్యా! చీమయుం గుట్టదే
> నవనీలాంబుదచిక్కణాపఘను నన్నన్ స్వామి నూహింతువా! [208పు]

లక్ష్మణా! నేన్నది కాదనుట నీకు పరిపాటియైనది. అదేమి కర్మమోగాని నీవన్నదే నిజమగుచుండును. నీవునన్నది పొలివోని నిక్కమైన నాలుకను భగవంతుఁడు నీ కిచ్చినాఁడు. ఇవురున్ మెత్తనిమేని రామునియొక్క డొక్కలో ఆ హరిణము క్రుమ్మెనేమోగదా! ఆ కేకను నీవును వింటివే. చీమయుం గుట్టదేమయ్యా! ఇవి సీతమ్మమాటలు. మఱఁదినోట ఏ మాట వచ్చునో అదే నిజమై పోవునని నోరారఁ జెప్పిన ఈ వదినె, 'తానై చనుదెంచు రాఘవుఁడు నాగుము రాహు విముక్తసూరుఁడై' [210] అని చెప్పిన ఆ మఱఁది మాటనే కాదని, "పాముచెవులు నీవి బహుసూక్ష్మములు విందు వినను రానివియును వినుచుందు' — 'ఇన్నాళ్లీ గతి బిగ్గఁబట్టితివిరా! యీ కోర్కె గ్రమ్మగ్గించుకోఁగన్నా వెంతటియోర్మి నేఁటికి సమాకాంక్షాఫలంబబ్బెఁబో' అని, ఈ రీతిగ నిరసింపవలసిన కర్మ మెందులకుఁ బట్టినది! ఇక్కడ మూలములో వైదేహి చెప్పినమాటలలో పారుష్య మున్నను హేతు వాదము లేక పోలేదు. ఆ వాద మంతయు విని లక్ష్మణుఁడు చెవులు మూసికొని మిక్కిలి బాధపడి, తల్లీ! నీ మాటల కిఁక బదులు చెప్పను; మీవు నాకు దేవతవు. నీ వన్న మాట లన్నియు ఇక్కడ వనచర దేవత లందఱు విన్నారు. ఆ దేవతలే నాకు సాక్షులు. ఆ దేవతలే నిన్నుఁ గాపాడవలెను. నీకు స్వస్తి. ఇదిగో శ్రీరాముని సన్నిధికే పోవు చున్నాను. రామునితోఁగూడ మఱల వచ్చి నిన్ను నేను జూడఁ గలనో లేనో నాకుఁ దెలియదు. అని నమస్కారములు చెప్పి ఆతఁడు రాముని దగ్గఱకు బయలుదేరును. ఇది మూలకథ.

ఇఁక విశ్వనాథలక్ష్మణుని వైఖరి చూడవలెను.

శా. అచ్చుం బ్రాపెను భక్తి స్థాణువను గట్టా! నోటికీ మాట రా
వచ్చున్ రాఁదగదంచు నెంచక మృషావాక్యార్థముల్ చేసి తీ
విచ్చో నుండినచో నఘాంశము మనోహేలావధిం గాంచెదన్
వచ్చెన్ దుష్టపుఁగాల మీవు నను నీ వాక్యంబులం గుప్పఁగన్.

ఉ. ఎందుకు నీవు వచ్చితన నింకకు వచ్చితి నంచు నోటికిం
బొందఁగరాని గొడ్డములు ప్రోగితి వన్నకు దోషివైతి స్త్రీ
లెందున నాత్మనిగ్రహమహీయసు లింతయుఁ గారనంగ నీ
యందునకంటె వేఱచట నయ్యెఁ బ్రమాణము సర్వసృష్టిలో.

ఉ. ఆసురిగ్రైన మాయ నిను నందుట నీ పలు కిట్టు లోర్చితిన్
భాసురబుద్ధి నీ విటులఁ బల్కినచో సెలకట్టె గుండియన్
దూసియ యుండు దుష్టవిధి త్రోసుక వచ్చెడు నేరి నన్నచో,
నీ సమయాన నేమిఫల మెంత లిఖించిన నంత భాగ్యమా. [కల్ప-213 పు]

ఆసురిగ్రైన మాయ, సీతను ఆవరించుటఁజేసి ఆమె పలికిన పలుకు లన్నియు ఈ లక్ష్మణుఁ డోర్చుకొనెనఁట. లేనిచో – అనఁగా, ఆ మాయ క్రమ్మని దశలో ఈ మాటలే అన్నచో, సెలకట్టె గుండియలో దూసియే యుండు నని ఈ లక్ష్మణుఁ డనుచున్నాఁడు. సెలకట్టె దూరవలసినది ఎవరి గుండెలో! ఆ మాట లన్నందులకు వైదేహి గుండెలా! అవి విన్నందులకు తన గుండెలా! ఈ దూసియయుండు నన్న మాట దేహళీదీపన్యాయముగ ఈ కవనములో అతికినందులకు ఆనందింపవలెనా! ఆపదలో నున్న ఆఁడుఁగూఁతురు ఒకవేళ అనరాని మాటలే అన్నను – ఈతని నోట ఇంతమాట వైశ్వానాధ మనిపించెనే యని విచారింపవలెనా! స్త్రీలు చంచలచిత్తలు క్రూరహృదయులు. స్త్రీస్వభావమే ఇట్టిదని వాల్మీకములో సైతము లక్ష్మణునినోట వింటిము. కాని, తుది కాతఁడు, తన్ను నిందించి గుండెలు గుండెలు బాదుకొని ఏడువసాగిన ఆ వదినను ఓదార్పఁబోవును. ఆమె మఱందితో పలుకనే పలుకదు. అప్పు డాతఁడు చేయునది లేక చేతులు జోడించి తలను వంచి జోతలు వెట్టి ఆమెవంకఁ జూచుచునే రాముని సన్నిధికి బయలుదేరును. జాలి గొలుపఁ దగిన ఈ దృశ్యము ఈ కల్పవృక్షములో రవ్వంతయుఁ

గానరాదు. 'లక్ష్మణుం, డురుతదుఃఖమూర్తి తల యూచుచుఁ బోయె వనాంతవీధిలో' అని ఒక్క ముక్కతో ఖండము అంతమగును.

'స్వభావ స్త్వేష నారీణా మేవం లోకేషు దృశ్యతే, విముక్తధర్మా శ్చపలా స్తీక్ష్ణా భేదకరా స్త్రియః, న సహే హీ దృశం వాక్యం వైదేహి జనకాత్మజే, శ్రోత్రయో రుభయో ర్మేఽద్య తప్తనారాచ సన్నిభమ్'
[వాల్మీ. ఆరణ్య 1150 పు]

వైదేహి ! జనకాత్మజే ! అని లక్ష్మణుఁడు సంబోధించుటలోనే విశేష మున్నది. అంతటి గుణవంతుఁడైన జనకుని బిడ్డవయ్యు, ఇట్టిమాటలనుట నీకు న్యాయము కాదని భావము. నీ వన్నమాటలు, ఎఱ్ఱగాఁ గాల్చిన బాణములు చెవులలో గ్రుచ్చినట్లుగా నున్నవి. ఈ యుపమానమునకు 'సెలకట్టె గుండియన్ దూసియ యుందు' ఇత్యాదికము కల్పము తెచ్చిన భావానువాదము. 'స్వభావ స్త్వేష నారీణాం' అని లోకోక్తిగా రాణించిన మూలమునకు 'స్త్రీ లెందున నాత్మనిగ్రహావహీయను లింతయుఁగారనంగ నీ యందునకంటె వేఱెచటనయ్యెఁ బ్రమాణము సర్వసృష్టిలో' - అని బారెడు దూరముగా ఈ కవనము సాగినది. ఇది స్త్రీ స్వభావము. ఇట్టిది సర్వలోకములలోఁ గన్పించుచున్నదని వాల్మీకి చెప్పఁగా - 'స్త్రీలు - ఎందున, ఆత్మనిగ్రహావహీయనులు - ఇంతయుఁగారు - అనంగ, సర్వసృష్టిలో, నీయందునకంటె వేఱు - ఎచట ప్రమాణము అయ్యె' - ఈ తీరునడకలో కల్పము నడచినది. ఇక్కడ వాల్మీకి లక్ష్మణుఁడు చెప్పిన స్త్రీస్వభావమును గుర్తింపవలెను. విముక్తధర్మాః- చపలాః- తీక్ష్ణాః- భేదకరా' అని నాలుగు దళములలో నాలుగు విశేషము లున్నవి. స్త్రీలు విముక్తధర్మలఁట. అనఁగా వినయాదిధర్మములను విడిచెడివారనియు, చపలాః-చంచలచిత్తలనియు తీక్ష్ణాః-క్రూరహృదయము గలవారనియు, భేదకరాః పరస్పరస్నేహ కార్యమును భంగపఱచువారనియు పిండితార్థము. ఈ యర్థములన్నియు 'ఆత్మనిగ్రహావహీయను లింతయుఁగా రన్న' ముక్కలో గర్భితములై యున్నవనియు - ఇట్టిదే వాల్మీకమునకు ఈ కల్పము భాష్యమువంటి దనియు మన మూహించి సమర్థించుకొనవలసియున్నది.

ఇఁక, — 'ఎందుకు — ఇందుకు — ఇంతయుఁగారు — త్రోసుక-నీవునన్నది — ఇవురున్ మెత్తనిమేని రాముఁడు—రాఘవుఁడునాఁగము—' ఇత్యాదులు ఈ ఖండములోని లాక్షణికపు సొంపులు.

ఖండాంతములో, ఈ యద్భుత కథను వినుటఁజేసి చంద్రమౌళి ప్రభువునకు నిస్తంద్రకీర్తిదీప్తిని సమకూర్చిపెట్టవే యని ఈ కవి సమ్రాట్టు, త్రిపుర దాహునికి 'సిఫారుసు' చేసిరి. 'త్రిపురదాహా'-అనఁగా త్రిపురాసురుల పట్టణములను దహింపఁజేసిన పరమేశ్వరా! యని భావము. కీర్తి దీప్తిని సమకూర్చిపెట్టవలెనన్న 'దగ్ధము' చేయఁగల వానికే సాధ్యమని స్వారస్యము కాఁబోలు. త్రిపురసంహార ఘట్టములోని దహనకర్మమునకు ఈ దీప్తికి 'శుభము' మాట ఎట్లున్నను సంబంధ మున్నదని సంబరపడవలెనా! 'హీనదోష ! ముక్త్యాల మహీనపోష'-అని సంబోధింపఁబడిన ముక్త్యాలభూపతికి, కీర్తిదీప్తి సమకూర్చిపెట్టఁగలవాఁడు త్రిపురదాహుఁడే యని కల్పవృక్షకర్త అనుటలో అబ్బుర మేముండును ? ఆయననోట — ఇట్టి యశుభములు వచ్చుట సనాతన సంప్రదాయమేగదా !

———

# వచనరచన

పద్యకావ్యమని గద్యకావ్యమని చంపూకావ్యమని సంస్కృత వాఙ్మయములో మూఁడు భాగములు కలవు. రఘువంశాదులు పద్యములు, కాదంబర్యాదులు గద్యములు, చంపూరామాయణాదులు చంపువులు. తెలుఁగులో 'నిర్వచనోత్తరరామాయణము'వంటివి ఒకకొన్నితక్క ప్రాచీనకావ్యము లన్నియు చంపూకావ్యములే యని అనవచ్చును. కథావిధానము నడపుటలో పద్యములకు గద్యభాగము చాలఁగా నుపకరించును. కథాతంతువు ఏకధారగా అనుస్యూతమగుటకు నడుమనడుమ మంచి వచనములను తెలుఁగుకవులు వ్రాసియుంచిరి.

భారతవిజ్ఞానసారమును ప్రజలలో బోధింపవలసిన యక్కఱయుండి పురాణధోరణిలో ప్రబోధమార్గములో కావ్యశిల్పములో నన్నయాదులు సంస్కృతమునుండి యనువాదములు చేసి మన కిచ్చిరి. మొత్తముగాఁ జూడఁగా వారి రచన యంతయు పద్యకావ్యమే యన్నంతగా ప్రాభవము పొందియున్నది. ఆ కాలములో తెలుఁగున పద్యకవిత్వమున కున్న 'పరపతి'గద్యభాగమునకు లేదన్నమాట కాదనము. రూపకములజోలికిఁగాని గద్యకావ్యములవైపునకుఁగాని ఆనాఁటి తెలుఁగుకవులు ఎందులకోఁ బోలేదో ఆ చరిత్ర ప్రకృతము అప్రకృతము. 'గద్యం కవీనాం నికషం వదన్తి'–అని సంస్కృతసాహిత్యములో మాత్రము గద్యభాగమునకు పెద్ద గద్దె యిచ్చిరి. తెలుఁగులో దక్షిణాంధ్రకవులు ఒకరిద్దరు గద్యకావ్యములు నిర్మించిరికాని,అవి యించుమించు సంస్కృతభాగమునకు దండాన్వయములవంటివి. తెలుఁగులో ప్రత్యేకముగ వచనరచనలో ఒకానొక శిల్పము చూపినది పరవస్తు చిన్నయసూరి. ఆతనికిఁ బిదప–ఆ భాగమునకు అందచందములు కూర్చినది 'కందుకూరి'కలము. ఇటీవలి యుగములో గద్యమున కెంత ప్రాముఖ్య మున్నది ప్రత్యేకముగాఁ జెప్పవలసిన పని లేదు.

తెలుఁగుభారతములో వచనభాగము చెదరుగా పలిగ ఏఱవలసి నట్లు కానవచ్చినను—అందు హృద్యమైన కావ్యశిల్పము కావలసినంత కలదు. విశిష్య—నన్నయ్యవచనము ముద్దులు మూటగట్టుచుండును. అదే సంప్రదాయములో పౌరాణికగ్రంథములు కొన్ని నడచినవిగాని ప్రబంధయుగములోమాత్రము మూర్పుకూర్పులు వెలసినవి. కాఁగా—భారతాదుల ధోరణి యొకటి; ప్రబంధకవుల పోకడ యొకటి; చిన్నయ సూరినడక యొకటి; వీరేశలింగాదుల వైఖరి యొకటి తెలుఁగువచనమున మనకు తేటతెల్లమగు చుండును.

ఈ పోకడలలో దేనికిని జెందక అత్యంతవైలక్షణ్యమును జూపి 'కల్పవృక్షము'లోని వచనభాగమునడక ఈ కవిత్వమున కెంతవఱకు అందచందములు కూర్చెనో పరిశీలింపవలసియున్నది కథాకథనపద్ధతిలో ఎచ్చట గద్యము వాడవలెనో పద్య మెచ్చట హృద్యముగా నుండునో ఆ రహస్యము తెలిసికొనుటయే మహాకవుల లక్షణము. ఏవో ఇన్ని పద్యాలు,ఏదో ఇంత గద్యము వ్రాసి అచ్చువేసి దేశములో వేసినంత మాత్రాన—అది మహాకావ్యముకాదు; అతఁడు మహాకవియుఁ గాఁడు.

'ఇట్లు సర్వభూతసమ్మోహనంబయిన వసంతసమయంబునం బాండురాజు మదనసమ్మోహనమార్గణబందీకృతమానసుండై మద్ర రాజపుత్త్రియైన మనోహరాకృతియందు మనంబు నిలిపియున్న నొక్క నాఁడు కుంతీదేవి బ్రాహ్మణభోజనంబు సేయించుచుండి మాద్రిరక్షణంబునం దేమఱి మఱచియున్న యవసరంబున'—నన్నయ

'ఇవ్విధంబునఁ గృతకృత్యుండయి యథాపూర్వంబుగా మజ్జన భోజనంబులు సలిపి ధర్మతనయు నివాసంబునం దేకాంతస్థలంబునఁ దారేవురును ద్రౌపదియును గూడఁబడునట్టి తెఱంగు సంఘటించి సమాగమసముచితప్రకారంబు నడపి గోగణనివర్తనంబును రణప్రవర్తనంబును నన్యోన్యవిదితంబైన యనంతరంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమున కిట్లనియె.' — తిక్కన

'ఇవ్విధంబున సంయోగవియోగంబులవలన బోధమోహంబులు వహించుచు, నవ్వరారోహ హృదయనిర్వేశేషంబగు సఖీజనంబు మెల్ల

మెల్లనఁ దోడ్కొని పోవ, నిజసభాభవనంబునకు నెట్టకేలకుం జనియె.'

-శ్రీనాథుఁడు

'అతండు లోభాకృష్టచేతసుండయ్యు వీతస్పృహుండుంబోలె జనంబులకు మనంబులు తనియ నశ్రాంతంబు వేదాంతార్థంబు లుపన్యసించుచుఁ దదాకర్ణనకుతూహలంబున మూఁగి లోకులు భక్తిం దెచ్చి యెదుర నిడిన విత్తంబు లనాదరసూచకమందహాసరోచిరుదంచిత సుందరవదనుండగుచుం గాంచి తదనుగ్రహార్థంబుంబోలెఁ జూపుల నంగీకరించుచున్నట్లు నానాఁట సముపార్జించిన విత్త మొక్క బొంతం బదిలంబుగ నునిచి కూర్చు వోసి యది కప్పికొని క్రుమ్మరుచుండు'.

– చిన్నయసూరి

వచనములో ఇదియే ప్రాచీనుల ధోరణి. ఈ ధోరణిలో వ్యాసంగము చేసినవారిలో గద్యమును జక్కఁగ వ్రాసి మెప్పించినవారు ఇప్పటి తెలుఁగుకవులలో పెక్కురు లేకపోలేదు.

అదేమికర్మమో గాని వేలతరబడి పుటలు వచనములో వ్రాసి అచ్చువేయించిన అభ్యాసము ఉన్న ఈ విశ్వనాథవారి ఈ రామాయణములో పద్యరచనలోవలె వచనములోసైతము ఆ'శిల్పము'మందునకైనఁ గాన్పింపదనుట సహృదయులు గుర్తించియే యుందురు. ఇదిగో – ఆ సౌభాగ్యము!!

'ఈ యపరదేవేంద్రున కిద్దఱు భార్యలు, పెద్దమ్మయుఁ బార్వతియు, ఏ పాపయ్యకు రామభూజాని కొడుకునకు రాజ్య మీయక వెంకటాద్రినాయఁ డేలుకొనెనో, ఆ పాపయ్య పెద్దబిడ్డను రామయ్యను గాక రెండవవానిని' ఇత్యాది – [అవతారిక. 16పు]

'పెద్యూలుదాఖలా వగైరాలతో నిండియుండు దస్తావేజుల 'మతలబు'స్ఫురించు ఈ ముక్కలలో కావ్యసౌందర్యము ఏ కోశము నను గానరాదు. 'ఏ పాపయ్యకో... ఆ పాపయ్యకు'– ఇది తెలుఁగు 'కారకమే' కాదు. సంస్కృతములో ఈ కారకము మనోహరము కావచ్చు. ఒకభాషలో హృద్యమైన కారకము మఱొకభాషలో

రోఁత గొలుపవచ్చును. ఆంగ్లేయములో అన్నారుగదా యని తెలుఁ గులో 'నే నొక కోడిపెట్టను గలిగియున్నాను'—అని పలుకుటలో అందము లేదు. పైగా ఈ వచనపుముక్కలలో ఒకచోట వెళ్లెమ్మయు, వేఱొక చోట వెళ్లెమ్మగారు, అని వ్రాయుటలో అంతర్దృష్టియేమైన ఉన్నదో యేమో! పైకిమాత్రము సొగసు లేక విసువుమాత్రమే ఈ రచనలో సంపాదించియుంచిరి.

'ఈ రాజు చేసిన పుణ్యకార్యంబులు ... ఈ ధరాజానికి ... ఈయన నిత్యపార్థివలింగార్చనాపరుఁడు, ఆ జేని యా యఖండపుణ్య ఫల మంతయు'— [అవతారిక 23 పు.]

'ఈ' లతో ప్రారంభించిన ఈ వచనములో ఒకే కర్త 'ఆ'జేనిగా మాఱిపోవుటలో అర్థమేమో! ఈపాటి వ్యతిక్రమము లేకుండ వచనము వ్రాయలేకపోవుట వైలక్షణ్యముకాక మఱేమగును.

'ఈ చిన్నారిదంపతులకు ముద్దైనకంటె ముద్దైన బిడ్డ చూడానంద రామగోపాలకృష్ణచంద్రకుమారప్రసాదుండు కలిగె'—[28]

ఈ రెండుపంక్తులలో 'ముద్దైనకంటె'—అన్న ముక్క 'వద్దన్నకొద్ది' ముద్దు వచ్చుచున్నది. ముద్దైనకంటె — అనఁగా ముద్దు అయినదాని కంటె, ముద్దైన = ముద్దువచ్చుబిడ్డ, అని భావము కాఁబోలు!!

'నలువురు వారయువతులు వీచుచున్న చేతు లడ్డముగా నొడ్డు కొని యొకళ్లొకళ్లు కన్గిలుఁపుకొని వారిలో నొక్క గడుసరి రాజుతో నిట్లనియె' — [బాల — 29 పుట]

ఈ వాక్యములో కర్త — కర్మ—క్రియల'సమన్వయము ఉన్నదా! కన్గిలుపుకొన్న దెవరు? రాజుతో ఇట్లన్న దెవరు? ఈ మాటయే పిల్లలు వ్రాసిరేని ఉపాధ్యాయులు దిద్దవలెనా! లేదా!

'ఇప్పుడే బయలుదేరుచుంటి నన' — [బాల — 29]

గణయతిప్రాసల నిర్బంధమునఁ జేసి, ఒకవేళ పద్యములో ఇట్టివి ఇతికింపవలసివచ్చుట అదొక త్రోవ. ముప్పదియెనిమిది అక్షరాల ఈ వచనపుముక్కలో ఈ 'కాలవ్యతిక్రమము' చూడఁగా కాలవైపరీత్యమే యనవలెను. 'ఇప్పుడఁట-బయలుదేరు చుంటినఁట' –వర్తమానము బయలుదేరుచున్నాను; భూతము బయలుదేరుచుంటినిగదా! ఒకవేళ ఈ కల్పముదృష్టిలో 'ఇప్పుడే' అన్నది 'భూతమై' కూర్చుండెనా! ఈ జబ్బు, ఈ కల్పవృక్షములో నిలువెల్ల నిండియుండుట భంగ్యంతరేణ ఒక వైల క్షణ్యమేమో !

'రంగనాథవ్రతంబు తో రంపుబిడ్డ' - [124 పు]

ఈ ముక్కలోని కూర్పులో సొగసే లేదు. ఈ తానులో ముక్కలే 'మానుషపుమూర్తి-ధర్మపుబొడ్డు -పరమంపువారి-పరమంపుఁ దేజము - ధవళంపుఁ దేజము - పరమా ధర్ము రాలు - తత్పరమపుటాజ్ఞ - తతమహిమంపుఁబ్రో వయనతాత'-ఇత్యాదులు

'వ. అంత విశ్వామిత్రుండు తక్కిన ఋషులను యథోచితంబుగ మన్నించి యందఱును గలసి మందమందగమనంబుల రాజగృహంబులు చొచ్చి యందుపవిష్టులైన'-[బాల_150పు]

ఇవి యచ్చులో మూఁడు పంక్తులు. ఈ ముక్కలలో కర్తలు సరిగా నడచినవేమో గమనింపఁగోరెదను. మన్నించినవాఁడు విశ్వామిత్రుఁడు. కావున 'మన్నించి'యన్న అసమాపకక్రియకు కర్త విశ్వామిత్రుఁడు. 'కలసి' అను క్రియకు కర్త 'అందఱును'. ఇఁక- 'చొచ్చి'కి కర్త లెవ్వరో సూటిగాఁ గానరాదు. విశ్వామిత్రుఁడు తత్రత్యఋషుల నెల్లరను యథోచితముగా మన్నించె ననియు, వారెల్లరు కలసి మందమంద గమనములతో రాజగృహములు చేరిరనియు-అచ్చట ఉపవిష్టులైరనియు వీధిపురాణముగాఁ జదివినప్పుడు తాత్పర్యము తెలియకపోదు. కథ నడువకపోదు. కాని గ్రాంథికవేషముతో అవతారమెత్తిన ఈ కల్పమునకు ఈ చిన్నివ్యాకరణాంశములోసైతము ఈ యపభ్రంశము

ఎందులకు వచ్చినట్టు? మూఁడు పంక్తుల వచనమే నిర్దుష్టముగా వ్రాయ లేనివారిని 'కవిసమ్రాట్టు' లని 'భాజాభజంత్రీలతో' భజనలు చేయు భక్తపుంగవులనుగూర్చి ఏమనవలెను ?

'అని తండ్రి పలుక రామలక్ష్మణు లిరువురును గాధేయపాదాభి వందనం బాచరించిన' – [బాల – 153 పు] అన్న వెంటనే–

కం. 'రాముఁడు నమస్కరించుచు నా ముని పాదములు తాకి నంతటన'–వచనములో రామలక్ష్మణు లిర్వురు గాధేయపాదాభివందనం బాచరించిరఁట పద్యములో రాముఁడు నమస్కరించుచున్నాఁడఁట– ఎందుల కీ చర్వితచర్వణము! ఒకవేళ కల్పకర్త, భావ మిట్లుండ వచ్చునేమో! ఏమని? 'విశ్వామిత్రుని కోరికచే తండ్రి కబురు పంపఁగా రామలక్ష్మణు లిర్వురు వచ్చిరి. వచ్చి వెంటనే గాధేయునకు అభి వందన మాచరించిరి. ఆ యభివందనసందర్భములో లక్ష్మణుని ఘట్టము విడిచి ప్రత్యేకముగా రాముఁ డొనర్చిన నమస్కారములోని విశేషము లను గాధేయుఁడు చూచిన చూపులలోని వైఖరిని ఆ పద్యములో వర్ణించుకొనె'నని – ఈ పాదాభివందనమన్న ప్రస్తావములోని 'పిష్టపేష ణము' లేకుండ, ఈ ముప్పదియక్షరాల వచనపుముక్కను సర్దుకొని అచ్చువేయించుకొనచ్చునే.

'తెలిసి ప్రత్యుత్థానంబు చేసి మున్ను విశ్వామిత్రునకుఁ బిఱుంద రఘుశిశువులకు నతిథిక్రియ జరిపి' – [బాల. 164]

మానులు ఎదురేగి మొదట విశ్వామిత్రునకు ఆవల–రఘుశిశు వులకు ఆతిథ్య మిచ్చిరఁట పిఱుందు అనఁగా మొలకు వెనుకటిభాగము (నింతంబము)–వెనుక, అని రెండర్థములు కలవు, 'ఆవల_తరువాత' అన్న యర్థములో ఈ 'పిఱుందునే' ఈ కల్పకర్త ఉపయోగించుకొనుటలో సారస్యము లేదు.

వ. 'కడచిన రాత్రియే సరంగులకుఁ గబురంపించి సిద్ధముగా నున్న నావవద్దకుఁ గృతాహ్నికుని గాధేయుని ఋషు లంద అనుసరించి సరాజపుత్త్రింబుగా నావ నెక్కించి మార్గమ్మరిష్టతాతిగాఁ జెప్పిన[165

ఈ మూఁడుపంక్తులలో 'కృతాహ్నికుఁడు – సరాజపుత్త్రింబు - అరిష్టతాతి'వంటి పదములను వాడి, సరంగులను దేశ్యమును 'కబురు' అను హిందీపదమును జూపుటలో రచనలో సొగసు కానరాదు.

వ. 'అధర్మసహితలైన స్త్రీలు తొల్లి మహాపురుషులచే వధింపనేబడిరి; ధర్మంబు మాకు వదలుము. నీ ప్రథమమార్గణదర్శనోత్సాహులము మాకుఁ గనువిందు సేయుము'. [బాల-168 పు]

స్త్రీలు అధర్మసహితలైనచోఁ వారిని మహాపురుషులు చంపక పోలేదు. ఈ భావములో 'వధింపనేబడిరి' అని విచిత్రమైన పదము ప్రసాదించిరి వధింపన్ + ఏ-ఇది అవధారణార్థకమా ! ఆపై, పదు ధాతువులోని పకారమునకు సరళాదేశమా ?

నీ ప్రథమ మార్గణదర్శన = నీవు ప్రయోగించు మొదటి బాణమును జూచుటలో రచనలో పట్టింపుగాఁ జూడఁదగిన ఈ యేకదేశాన్వయము వచనములో సైతము దూరవలెనా !

వ. 'సోపాధ్యాయపురోహితయు సదర్భచమస స్రుక్కయు ససమిత్కుసుమోచ్చయయు సర్త్విజయు సవిశ్వామిత్రయునైన యజ్ఞవేది భగ్గుమని మండిన'–[179 పు] యజ్ఞవేది ఏమయ్యెనోగాని ఈ వచనములోని సొగసుమాత్రము భగ్గుమని మండినట్లే యున్నది. యజ్ఞవేదిపై ఉపాధ్యాయు లున్నారఁట; పురోహితులు కలరఁట. దర్భలు–చమసములు – స్రుక్కులు – సమిధలు–కుసుమములు, ఈ సరంజాము సర్వము ఉన్నదఁట; ఒక ప్రక్క ఋత్విక్కులు, అక్కడనే విశ్వామిత్రుఁడు. ఇట్టి యజ్ఞవేది భగ్గుమని మండినదఁట. కల్పవృక్షకర్త యుద్దేశములో యజ్ఞవేదిలో నెలకొన్న అగ్నిహోత్రుఁడు చక్కఁగా మండెనని వాచ్యముగా ఒకయర్థము కావచ్చును. క్షత్రియయాజక క్రతువు గావున [బాల.257] విశ్వామిత్రుని ఈ యజ్ఞవేదిలో అగ్నిహోత్రము భగ్గున మండినట్లే–అని వ్యంగ్యము కావచ్చును. 'భగ్గున మండినట్లే–' అన్న ముక్కలో 'వట్టి ధ్వంస'మన్న స్ఫూర్తి తెలియని వారా కవి సమ్రాట్టులు? పోనీ, అవసరమునుబట్టి యజ్ఞవేది చక్కఁగా

మండినదనియు రచననుబట్టి ఈ రెండుపంక్తుల వచనము భగ్నమని
మండినదనియు సమన్వయించుకోవచ్చును. పైగా కలువులో అధిక
మాసమన్నట్లు 'సృక్కు-యు'నఁట. సృక్కు-తప్పు. స్రుక్కు- అనవలెను.
యజ్ఞోపకరణ విశేషమునకు 'స్రుక్కు-'అని పేరు.

వ 'నాకు మాత్రము మేనల్లుండ్రు కారో! నేను మాత్రము
దుఃఖించలేనో ?' – [బాల. 201 పు]

కపిలుని కంటి మంటకు దగ్ధులైన సాగరులనుగూర్చి 'గరుడి'
అన్నమాట ఇది. వాండ్రు నాకు మేనల్లుండ్రు కావున నాకుఁగూడ
దుఃఖము కలుగవలసినదేగదా ! అయినను కర్తవ్యము ఊహింపవలె
నన్న ఘట్టములో 'నేను మాత్రము దుఃఖించలేనో'అన్నమాట ఇంపుగా
లేదు. దుఃఖించఁగలను – దుఃఖించలేను–ఈ పోకడ ఈ ఘట్టమున
కంద మీయదు. ఆపై, ముత్తులో జీత్తులో పరమగునపుడు 'ప-వ'లో
గివలో వచ్చునన్న తెలుఁగు వ్యాకరణము–ఈ కవిత్వములో గోకర్ణమే
యగును. దుఃఖింపలేనో – దుఃఖింపక, ఇత్యాదులలో దుఃఖించలేనో,
దుఃఖించక, అనుటయే ఈ కల్పకర్త సృష్టించుకొన్న తెలుఁగువ్యాక
రణపు సొగసు.

వ. అనిన నందఱును భాగీరథిం దరించి యుత్తరపుగట్టు చేరి
స్వర్గోపమమ్ము దివ్యంబు రమ్యంబునైన యొక మహానగరంబుఁ గాంచి
రామచంద్రుండు.

గీ. శ్రీ విశాలమనోజ్ఞమౌ నీ విశాలనగర మేదన'–[బాల212]

అందఱును భాగీరథిని దరించిరఁట. ఉత్తరపుగట్టు చేరిరఁట.
అప్పు డొక మహానగరంబు గాంచి రామచంద్రుండు–ఈ విశాల నగర
మేది యని ప్రశ్నించెనఁట. ఈ రెండు బంతుల వచనములో రెండు
కర్తలు. 'అందఱును–' ఒకటి; 'రామచంద్రుండు' వేఱొకటి. ఈ
రెండిటికి అన్వయించు అసమాపకక్రియలు మూఁడు. 'తరించి చేరి–
కాంచి' యన్నవి. తరించినవారు చేరినవారు 'అందఱు' నఁట.

కొంచినవాఁడో లేక ప్రశ్నింపనున్నవాఁడో రామచంద్రుఁడఁట. 'చేరి'ని చేరిన అన్నచో ఏ తిప్పలు చేరవు.

వ. 'అని మఱలఁ గొంచెము శయ్యాగతులై' — 215 పు.

'కొంచెముసేపు మఱల ప్రక్కమీఁదఁ బరుండి' — అన్నభావములో వజ్రమువంటి ఈ వచనపుముక్క ఉభయపద్యమధ్యస్థమై కథను నడపించినది. 'కాస్త ఆ చెంబు ఇటు తీసక రా — కొంచెము ఒకసారి వచ్చి వెళ్లు' అన్న వ్యావహారికధోరణిలో నడచిన గ్రాంధికపుముక్క ఇది. దీనినే జాతీయమనియో పలుకుబడిలోని సొంపనియో ప్రవచింతురు కాఁబోలు ప్రబుద్ధులగు శిష్యులుగానీ ప్రాజ్ఞులగు గురుదేవులుగానీ.

వ 'అంత నమ్మహాంబుధినుండి శంకచక్రకుండలధారి దండి సకమండలువు హస్తంబున నమృతకుంభమ్ము పూని ధన్వంతరి యుదయించె [215].

ఉదయించిన దెవరు ? ధన్వంతరి. అతఁడు శంఖచక్రకుండల ధారియఁట దండియఁట. సకమండలువుఅఁట. ఈ మూఁడు విశేషణములకు ధన్వంతరి యను విశేష్యమునకు నడుమ 'హస్తంబున నమృతకుంభమ్ము పూని' యన్నమాట ఇఱికించుటలో దోస మున్న దనికాదుగాని సొగసు లేదనవలెను. 'దండి సకమండలువునగు ధన్వంతరి హస్తంబున నమృతకుంభమ్ము పూని యుదయించె, నన్నచో, ఆ వచనము ముచ్చటగా నుండవచ్చును.

'వ. నల్వురు నాల్గుదిశలందును నీవాగనన్యథాసిద్ధిగా మారుతు లని చరింతురు గాక—' [బాల. 220 పు]

నీ — వాక్ + అనన్యథా — సిద్ధి = నాయనా! నీ నోటి వాక్యాన అట్లగుఁగాక, అన్న ధోరణిలో 'వాగనన్యథాసిద్ధి' యన్న సంస్కృత సమాసములో 'నీ' యన్న తెలుఁగు సర్వనామము దూరవలసిన కర్మమేమి !

'శతానందుండు వించువించు లేచిలేచి' [బాల 239]

ఆ వార్త అతఁడు వించువించునే లేచుటలో అర్థమున్నది గాని

లేచి శేచుటలో భావ వేమో ఉపన్యాసములోనే వినవలెను. లేవలేక లేవలేక లేచెనని సారస్యమా! శతానందుఁడు వృద్ధుఁడు కాఁడాయె. ఆ వార్త అప్రియముకూడ కాదాయె. ఈ యామ్రేడితమునకు భృశార్థాదు లేవైన కనిపెట్టి 'విశ్వనాథవ్యాకరణ' మేదైన సృష్టింప వలెఁ గాఁబోలు!

వ. 'శాశ్వతులైన సమ లిట్లే యుండును.' [273]

వాల్మీకములోని 'శాశ్వతీస్సమాః' అన్నమాటకు వచనములో ఈ నకలు సృష్టించిరికాఁబోలు! శాశ్వతీస్సమాః – అనఁగా సర్వకాలమని మంచియర్థమే రావచ్చును. కాని, ఆ శ్లోకములో ఆ మాట కున్న సొగసు తెలుఁగు వచనములో దీని కున్న దేమో గమనింపవలెను! నూటు తొడిగి పిలక పెట్టినట్లు.

వ. 'అతని యిద్దఱు భార్యలు గర్భవతులై కాళింది యన్నామెకు రెండవయామె సపత్నీమాత్సర్యంబున గర్భస్రావంబు నపేక్షించి గరంబుఁ ఁనిపించిన'— [322 పు]

ఈ ముక్కలో 'గర్భవతులై' అన్నదానికి 'గర్భవతులైయుండ'— అని అధ్యాహార్యము ఊహింపవలెఁగాఁబోలు! 'గర్భవతులైరి' అన్నచో వారి చిక్కుమాట ఎట్లున్నను ఈ మాటలో చిక్కు తొలఁగిపోవచ్చు. చిక్కు లేని రచన, మన కీ'కల్పము'లో చిక్కదుగదా!

వ. వీరిద్దఱికోసము నీ కుమార్తెల సీతోర్మిళల భవద్దత్తౌరసుల వరించుచుంటినని వసిష్ఠుండు కూర్చుండెన.' [323]

రామలక్ష్మణులకోసమై సీతోర్మిళలను వసిష్ఠులవారు వరించుచున్నారఁట ఆ యింటికి వీరెంత పెద్దలైనను, దశరథమహారాజులుంగారు వసిష్ఠులవారి చేతిలో వట్టి కీలుబొమ్మలే అయినను 'వరించు శబ్దము రామలక్ష్మణులకే ఒప్పిదమై యుండును సీతోర్మిళలు–ఔరసులఁట; ఇంక నయము 'వారసు'లన లేదు. ఉన్నాను—అనుటకు 'ఉంటిని' అనుట, ఈ రచనకున్న ఒకానొక సొగసు.

వ. 'తేపటి శుభలగ్నంబునందె నాలు ముళ్లు పడనిండనిన'— [327]

ఇచ్చట 'నాల్గుముళ్లు'—అనఁగా నలువురి వివాహమని అర్థము కావచ్చునుగాని దేశములో ఆ 'మూఁడుముళ్లు' అనఁగా పెండ్లి యన్న జాతీయమునకు ఇది కొంచెము అడ్డుపుల్లగా స్ఫురింపవచ్చును.

వ. 'వివాహకాండమ్ము జరిపి ..యనేకసంతోషమ్ములు చేసిరి. [343]

సంతోషకరములైన ఏవేవో వేడుకలు చేసికొని రని సారస్యము తీయవచ్చును. కాని, 'మాకీ షాలా షంతోషం చేశావు' వంటి తురక పలుకుబడి జ్ఞప్తికి వచ్చును.

ఇది స్థాలీపులాకముగాఁ జూపిన 'కల్పము' లోని వచనరచన సొగసు. ఇంకను నిట్టి సొగసులు ముందు 'లక్షణభాగము'లోఁ జూతము. ఒక్కమాటమాత్రము నిజము. పద్యరచన చాలభాగము ఏ నడకలో నడచెనో అట్టి నడకయే ఇందలి వచనమునకు జక్కఁగా అబ్బినది. కల్పములో—ఇదియొక విశిష్టత యనవచ్చును. మొత్తము మీఁద, కల్పవృక్షకర్త వైలక్షణ్యమునే చూపెదనని చేసిన శపథములో ఈ యంశముసైతము సఫలమయ్యె ననవచ్చును.



# ప్రయోగ వైలక్షణ్యము

దరిదాపు మూఁడు దశాబ్దములకు మున్ను ఒకానొక ప్రసిద్ధమైన ప్రింటింగ్ ప్రెస్సులో ఈ 'ఖండనగ్రంథ' కర్త ఏదో బడిపిల్లల పుస్తక మొకటి అచ్చున కిచ్చెను. అందు ముమ్మొదట వ్రాసికొన్న తొలి పలుకు పది పంక్తులలో అచ్చువారు రెండు పదములు మార్పుచేసిరి. 'ససి'గా అని వ్రాతప్రతిలో ఉండఁగా 'సరిగా' అని దిద్దిరి. 'దుస్సాధ' మన్నదానిని 'దుస్సాధ్యము' చేసిరి. అచ్చులో వచ్చిన ఈ మార్పులకు కారణ మడుగఁగా–విద్వాంసులే 'ప్రూఫులు' చూచిరనియు, ఆ పదము లట్లే యుండవలెనని ఆయన అన్నారనియు సమాధాన మిచ్చిరి. వెంటనే ఆయనతో ప్రస్తావింపఁగా 'దుస్సాధ్యమే' సాధువని కొంతసేపు వాదించి, ఆ మధ్యాహ్నము వీధిలో ఎవ్వరినో 'కౌముది' చదివినవారి నడిగి తెలిసికొని 'దుస్సాధము'కూడ ఉండవచ్చునన్నట్లు అంగీకారము తెలిపిరి. ఆవల – ఆ పేజీ రద్దుచేయించి వ్రాఁతలోని పదములనే స్వీకరింపకతప్పలేదు. ఈ కథ 'రామాయణ కల్పవృక్షమును' చేతఁ బట్టఁగా చప్పున జ్ఞప్తికి వచ్చినది:–

'ఉ. పండితకీర్తనీయుఁ డిరుబాసల దిట్ట రసజ్ఞమాళి మా
రెండవవాఁడు సన్మతి ధురీణకవిత్వకళోగ్రకార్తికే
యుండును వేంకటేశ్వరు లహో! మఱి నా కవనంబదెల్ల ధీ
శౌండుఁడు తత్పరీక్షఁ బడి సంకుశఁ బోసిన తీర్థమై చనున్

[బాల – 6. పుట]

ఈ పద్యములోని (శ్రీ) వేంకటేశ్వరులే అప్పుడు ఆ ప్రెస్సులో ప్రూఫులు చూచిన విద్వాంసులు. వీరి పరీక్షలోఁ బడిన ఈ కల్పవృక్షము శంఖములోఁ బోసిన తీర్థమువంటి దని అన్నగారు చూపిన ఆదరాభిమానములకు ఆనందింపనివారు లేరు. కవిత్వకళలో కార్తికేయు లన్నమాట – 'ఇరుబాసల దిట్ట'యన్న బిరుదు 'కల్పవృక్షము' చూచిన పిదప 'అర్థవాదముగా' తోఁచినది.

ఇందలి రసవిషయచర్చ అట్లుంచి, ఇతివృత్తములోని మార్పు కూర్పుల మాట ఎత్తక, పాత్రౌచితి ప్రస్తావింపక, శబ్దశుద్ధిలోఁగాని వాక్యనిర్మాణములోఁగాని ఛందఃప్రవృత్తిలోఁగాని ఈ కల్పవృక్షములోఁ గానవచ్చు లక్షలకొలఁది అవలక్షణములను ఈ 'ఇరుబాసల దిట్ట' ఎందుల కుపేక్షించెనా యని సందేహము కలుగకపోదు. 'ఈ కల్పవృక్షము' ఒక మహాకావ్యమనియు, నన్నయ్య, తిక్కన్నలకే లేని విశిష్టత తన గురువులకు కట్టఁబెట్టిన శిష్యుని చేతిలో ఇట్టి కవితాశిల్పము పుట్టినదనియు, కవిత్రయయుగము తరువాత ఇంతటి మహాకావ్యము తెలుఁగులో ఉద్భవింపనేలేదన్నట్లు దేశములో కొందఱకు కొంత భ్రాంతి ఉండుటఁజేసి ఈ సమీక్ష కుపక్రమించి చూడఁగా దీని బండారము చిత్రవిచిత్రముగ స్ఫురించుచున్నది.

లక్షణగ్రంథములలో ప్రాచీనులు ఏ వేవి దోషములని నిరూపించి మనకుఁ జూపించిరో వానిలో ముప్పాతికమువ్వీసము 'అక్షరాల' ఈ కల్పవృక్షములోఁ గానవచ్చుననుట అతిశయోక్తి కాదు. కేవలము లక్షణములనుబట్టి లక్ష్యములను కొలతవెట్టి చూడరాదన్న వాదన కొంత యున్నను, ప్రాచీనుల ఒరవడి విడిచి మనము చేయు రచనలు ప్రాచీనకావ్యముల శ్రేణిలో రాఁదగినవి కావుగదా! ఆ శబ్దము తెలిసియే నేను వేసితిని; ఆ ప్రయోగ మెఱిఁగియే నేను జేసితినన్న 'ధీమా' ఉండవచ్చునుగాక! ఆ భావము పలువురు మెచ్చవలె. ఆ ధోరణి నలువురకు నచ్చవలె. అప్పుడుగాని ఆ కావ్యము మహాకావ్యము గాదు; అతఁడు మహాకవియుఁ గాఁడు.

ఛందస్సువంటివి వట్టి శృంఖలములని భావించు ఈ రోజులలో సైతము పద్యరచన చేయునపుడు తక్కిన 'హంగులు' కవితలో కుదురక పోయినను యతిప్రాసల విపర్యాసముగానీ గణభంగముగానీ కలుగకుండ కాపాడుకొనుట మన మెఱుఁగుదుము. శాస్త్రకర్తలు 'లక్షణ'మని పేరు పెట్టిన ఘట్టములలో 'కల్పవృక్ష' రచన ఎట్లు నడచినదో నిదానించి చూడవలసియున్నది.

నరసభూపాలీయమునకు వివరణకర్తలైన 'సన్నిధానము' వారు "అరీతి' యన్న దోషమును వివరించుచు 'శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి 'శృంగారవీధి'లో ముప్పాతికమువ్వీసము పద్యము లీ దోషముచే దూషితములై యున్నవి. అందలి పద్యము లన్నియు దీర్ఘసమాస భూయిష్ఠములై శృంగారరసమునకుఁ బ్రతిబంధకములైయున్నవి' అని వ్రాసిరి. వారే ఈ కల్పమునుసైతము పరీక్షించి సమీక్ష చేసియుండి రేని ఎన్నఁడో దీని బండారము దేశములో బట్టబయలైయుండెడిది. విద్వజ్జను లెందఱో ఈ రీతిగ 'ఈ వృక్షము' విషయమై ఉపేక్ష వహించి తమ క్షేమము పట్టనట్టు ప్రవర్తించుటఁ జేసియే నిజముగా నిది మహాకావ్యమేమో యని దేశములో కొందఱకు భ్రాంతి యుద్భవించినది.

కావ్యదోషములలో శబ్దదోషములని అర్థదోషములని రెండు విధము లుండును. పదగతములు వాక్యగతములు - అని శబ్దదోషములలో రెండు తెగలు. వానిలో రెండవవానిలో 'ఛందోభంగము — యతిభంగము' అని ఒక ఘట్ట మున్నది.

## గ ణ భ ం గ ము (క)

సంయుక్తాక్షరమునకు పూర్వాక్షరము గురువన్నది ఛందస్సులో ప్రాథమికసూత్రము. చక్రము-వంటి, అఖండపదములలో సంయుక్తమునకు పూర్వాక్షరము తప్పనిసరిగా గురువనుటలో వాదభేదము లేదు. 'హరి హర బ్రహ్మ' ఇత్యాది సమస్తపదములలో సకృత్తుగా ఏ కొందఱో రేఫమును లఘువుగాఁ జేసిన కవులు లేకపోలేదు. అట్లని అది రాచబాటకాదు; అదే ప్రధానముగాఁ జూచుకొనిసాగిన కవిత, ప్రథమశ్రేణికి రాదు. అందు కొంత 'కక్కుర్తి' ఉన్నదనక తప్పదు. ఈ దృష్టితోఁ జూచినచో ఈ కల్పములో 'బాలాయోధ్యలు' రెండింటిలోనె ముప్పది ప్రయోగములకుఁ బైగా కొట్టవచ్చినట్టు ఇట్టివి కన్పట్టును.

1 అశ్వమేధ క్రతువింతట . . . బాల. 17 పుట

2 సమస్త ప్రాణములు హద్దుగఁ దీర్చును. ,, 101 ,,

| | | | | |
|---|---|---|---|---|
| 3 | దైత్యలోక ప్రాణా . . . | ,, | 155 | ,, |
| 4 | పరాగ ప్రణీత . . . | ,, | 265 | ,, |
| 5 | ఉగ్ర ప్రచండమూర్తియై . . . | ,, | 174 | ,, |
| 6 | డిండీర ప్రసవ . . . | ,, | 265 | ,, |
| 7 | భవదంశు ప్రసారము . . . | అయోధ్య | 28 | ,, |
| 8 | అఖిలరాజ్య ప్రజల్ . . . | ,, | 32 | ,, |
| 9 | సర్వ ప్రేమవిగళ ద్వ్యాపార . . . | ,, | 150 | ,, |
| 10 | అంబు ప్రవాహము . . . | ,, | 343 | ,, |

ఇత్యాదు లనేకములు:-

## యతిచ్యుతి

1 భ్రాజిష్ణుల్ మునిరాజు లుండిరట వాల్మీకిన్ విలోకింతమా. అయో. 157పుట
2 తెమ్మ, టంచు పంపరి కాఁబోలు నేలపోయె ? . . . ,, 225 ,,
3 సమస్తభూమణాం, భోరుహ క్లృప్త దర్దురవిభాసిశరీర ,, 243 ,,

4 కం. నీ తో నాడితిని నీకు నాకును దేహా . . . 87 ,,
ఇది 'ముద్రారాక్షసము' కావచ్చు-'నాకు నీకును దేహా-'అన్నచో సరిపోవును.
5 మెడమలుపు నోరచూపుల నిలచి చూచి 'డలయోరభేదః' కాఁబోలు !!
బాల. 367 ,,
6 బహి, శ్శశ్వజ్జ్యోతిస్స్వలగుచుఁ జెలఁగెడు గాతన్ . . . ,, 259 ,,
7 శాస్త్ర, భంబైన నురమున నవధరించె (సీ) . . . ,, 216 ,,
8 రాఘవే, శ్వర గృహముల్ సమార్జదురరీ కృతశోభములై ,, 98 ,,
9 శేల్పుపీ, డేగిన వారలున్ గలర యచ్చట మానులు . . అయో. 151 ,,
'గలర యెచ్చట' అని దిద్దినచో సరిపోవును.
10 సత్యోక్తిమా, లాకంఠాభరణుండవైన నిను నే నర్థించితిన్ ,, 172 ,,
ఇత్యాది.

ఇఁక నీ కావ్యములో అఖండయతులకు లెక్క లేదు. అఖండ యతి విషయమై ఛందశ్శాస్త్రమున మార్గభేదము లుండఁగాక. కవిత్రయమువారి ప్రయోగములలోనే ఒక కొన్ని కన్పించినంత మాత్రాన, ఒకటి రెండు లక్షణగ్రంథములు మన్నించినంతమాత్రాన, చేయి

తిరిగిన కవులు — ఈ యతిని ఆదరింపరు. ఈ యతినే దండిగా ఆశ్రయించిన కవిత్వము ప్రథమశ్రేణికి రాదనుట ముమ్మాటికి నిజము. ఆ పక్షములో వందలకొలఁది అఖండయతులకు అండదండమైన ఈ కల్పమును ఎట్లు మన్నింపవలెనో విద్వజ్జనమే నిరూపింపవలసియున్నది.

(చ)

కావ్యదోషములలో 'చ్యుత సంస్కార' మొకటి.

కం. వ్యాకరణ దుష్టమగు పద మేకడఁ జ్యుతసంస్కృతాఖ్య; మిది యెట్లన్నన్
శ్రీ కమల కాంత పదసేవా కర్మఠుఁడనఁగఁ గరుణవారిధి యనఁగన్
[కావ్యాలంకార సంగ్రహము 448 పు]

రచన, 'వ్యాకరణ సంస్కారహీనమైనచో 'చ్యుతసంస్కార దోషము పట్టినట్లే' యని ప్రాచీనుల లక్షణము. దీనినే వామనుఁడు 'అసాధు' దోషమని చెప్పెను. కమలాకాంతను, కమలకాంత యనియు, కరుణావారిధిని, కరుణవారిధి యనియు వ్రాసినచో ఈ దోష మంటినట్లే యని లాక్షణికుల విశ్వాసము.

రామాయణ కల్పవృక్షము తెఱచి చూడఁగా 'కరుణవారిధి' వంటి 'మశకములు' కాదు. మనము చూడవలసి వచ్చునది; మహాగజములే ఎదురై ఘీంకారములు పెట్టును. తెలుఁగునకుఁ జాలినంత వ్యాకృతి లేదనియు, ఆ యున్న చిన్న దీపమునుబట్టి మంచిసెబ్బరలు మనము నిర్ణయింపలేమనియు వాదముకోసము వాదింపవచ్చును. కాని, కవిత్రయమువారి రచనను లక్ష్యముగాఁ దీసికొని ప్రబంధకవులు మన కొక బాట చూపఁగా, దాని నాధారముగాఁ జేసికొని లాక్షణికులు తెలుఁగునకును వ్యాకరణశాస్త్రము నిర్మించిరి. ఈ లక్షణమును — ఆ లక్ష్యములను గుర్తించుచు కావ్యభాషలో కావ్యములు సృష్టించి యిచ్చుట మహాకవుల సంప్రదాయము. ఈ సంప్రదాయము ప్రకారము పరిశీలించి చూచితిమేని ఈ కల్పవక్షము చ్యుతసంస్కారాది దోషములు పెక్కంటిచే కావ్యత్వమును బోఁగొట్టుకొన్నది. వందల

తరబడిగా నేను నేనని ముందునకు దూకు వ్యాకరణదుష్టములకు ఈ కల్పవృక్షము నిజముగా కల్పవృక్షమే. ఇంతటి మహాకావ్యములోనే ఈ శబ్దములు మనకంటికిఁ గానవచ్చుచుండఁగా, మన రచనలో మనమేల వానిని గైకొనరాదని ఆధునికరచయితలు కొందఱు భ్రాంతి పడవచ్చును. లోకవ్యవహారమునుబట్టి జీవద్భాషలో నలువురి నోళ్ళలో నాని తప్పని సరిగాఁ గైకొనవలసిన రూపములు ప్రాచీన వాఙ్మయములో సైతము లేకపోలేదు. 'ప్రవాహినీ దేశ్యా'యని నన్నయ్య అన్నాఁడుగదా యని– ఆ ప్రవాహములో కొట్టుకొనివచ్చు సర్వపదార్థములను మనము గ్రహింపవలెనని భావము కాదు. ఆ ప్రవాహమున కిరువైపుల గట్లు వేసికొని వడిలోఁ గొట్టుకొని వచ్చు తుక్కుధూళిని నెట్టివైచి ఆ మంచి నీటినే త్రావి మన మెట్లు ఆనందింతుమో, అట్లే భాషకు సైతము ప్రత్యయాది వ్యాకరణనియమములు నిర్ణయించుకొని భాషలోని మాలిన్యము తొలఁగించి రసాస్వాదనకు వీలయిన రీతిలో కావ్యములు వ్రాసి యానందింపవలెను. 'ప్రవాహినీ దేశ్యా–' అన్న శాస్త్రికారుఁడే, 'ఇహ తు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదం' అనియుఁ జెప్పెను. అనఁగా – ఈ తెలుఁగులో, ఈ శబ్దమునకీ యర్థమని సంకేతింపఁ బడినట్టిది, ప్రామాణికులైన కవీశ్వరులు ప్రయోగించినట్టిది యగు పదమునే ప్రయోగింపవలెనని భావము. 'ప్రయోగశరణాః వైయాకరణాః' అన్న సూక్తి ఉన్నదిగదాయని దానిని ఆసరా చేసికొని నా పలికిన పలుకే గ్రంథస్థము కావలెనని భీష్మించి రచన చేసినచో దాని భావిదశను లోకమే నిర్ణయించును.

వ్యాకరణధోరణిలో నాఁడుగాని నేఁడుగాని పలువురు పాటించు సూత్రములను విడనాడి, గ్రాంథికమన్న వేషములోనే బట్టకట్టిన ఈ 'కల్పము'లో అనంతముగా సాగిన ఈ యపశబ్దములను జత్తగింపఁ గోరెదను.–

1 మధ్య మధ్య

2 వారసుఁడు (ఛోరసుఁడు)

3 స్పర్శన (స్పర్శనము)

4 జ్ఞాపకము వచ్చి (జ్ఞప్తియనుటకు)

5 అయిపోతిని. రాకపోతిని [ఒకటికాదు; రెండు కాదు. వందల తరబడి]

6 జన్మలు-కర్మలు [కల్పము నిండుగాఁ గావలసినన్ని]

7 రతీదేవి

8 కండ్లున్న పుణ్యాకారంబు; కండ్లార. బజారులో వాడుకొను 'కండ్లానుపత్రుల'లోని 'కండ్లు' కల్పవృక్షములో నిండుగా వెడలినవి. కంటికి వచ్చినవన్నియు గ్రాహ్యములు కానట్లు నోటికి వచ్చినవన్నియూ ప్రయోగింపరాదు.

పల్లు (ఏక) — పండ్లు (బహు) కావచ్చునుగాని
కన్ను (ఏక) — కండ్లు (బ) కాదు.
ఇది యొక భ్రాంతిమూలకమైన వినిమయము.

దంతమనునర్థములో పల్లును - పన్ను అనరాదు. కన్నులను (బహు) కండ్లు అనరాదు. ఆధునికులు కొందఱు 'కండ్లు' అని ప్రయోగించిరని 'వజ్ఝల'వారు వ్రాసిరి. వారిలో 'విశ్వనాథవారు' ఒకరు కావచ్చు. అంతమాత్రాన 'కండ్లు' సాధువు కాదు.

9 కండ్లున్న పుణ్యాకారంబు; కండ్లార.

10 సావడి (చావడి)

11 చెల్లరేఁగఁగా (అయో. 159పు) చెలఁగి+రేఁగు - చెలరేఁగు - మిక్కిలి విజృంభించు. ఈ రూపమును 'కల్పము' గణముకోసమై 'చెల్లరేఁగఁగా' సృష్టించినది.

12 తల్లక్రిందు (అయో 217 పు) తల+క్రిందు - అధోముఖము. తల్లక్రిందని వ్యవహారమున్నను ఒక్క 'సానందోపాఖ్యాన' కర్తమాత్రమే వాడియుండెను. నేఁటికి ఈ కల్పము, దానిని వాడినది.

13 కని సీతేనా (అయో 90)

14 కురిపించన్ (అయో- 92) కురియింపన్

15 పున్నెము పాపమోన్సు (అయో. 187)

16 సుకినలు (అయో. 206 పు) సుకిని - సుఖవతి; సుకినులు (బహు)

17 వెసులుబాటు - వెసులుపాటు

18 కచ్చురానికా (అ. 239) కచ్చురము - మయిల, కచ్చురానకా

19 పుణ్యలోకాలికి (239) పుణ్యలోకాలకు

20 మృదు వాససముల్ (242పు) వాసము (రూ) వాసస్సు - వస్త్రము.

21 ఆ పైనను - ఆపైని

22 సభికులు (277) సభ్యులన్న భావములో ఈ శబ్దము సభ్యమైనది కాదు.

23 తనను బెంచిన (282) తన్నుఁబెంచిన

24 గౌరవనీయురాలు (282) అసాధువు

25 శరగ్గోపము (292) శరకోపము ప్రసిద్ధి

26 ఏలనమ్మ తల్లి! కళ్లైన ఏలశబ్దము ఈ కల్పములో ద్రుతాంతముగా వందల కొలఁది అవతారము లెత్తినది.

27 అందియీయ-అందీయ, యనుటకు

28 అందుకు - ఎందుకు - ముందుకు వెల్లుకు - విందుకు, ఇత్యాదులు కల్పములో కావలసినన్ని

29 కనిపించక, పిచ్చలించఁగా, పంకించను, పల్కరించన్, శపించవలయునే నశించదని, కదలించరాని, వాంఛించదు, తిలకించన్, ఒరిగించనిదేమి, నిద్రించదు, గోచరించనట్టి, రుచియించదు, పాలించదు ఘటించక, వారించదు ఊడికించన్ లేఁడు, పవ్వళించక, తలంచన్, మండించరయా, గుఱించఁడో బూఁటించవలెన్, తీర్చఁగాఁబలెన్, త్యజించన్-ఇట్టి పత్వవిరహితరూపము శ్రీ కల్పవృక్ష కర్త కభిప్రేతములు.

30 బ్రతికినాను - చేసిపోయినాను - ఎఱిఁగినావా-ఎంచినావో - అరుదెంచినాను- చేసినావు - తెచ్చినాను, ఇత్యాదులను మహాద్వాచకములుగా కల్పము చూపినది.

31 తననక్కున (బాల. 110 పు) 'తనయక్కున' యనుటకు

32 కిటికి-గోధుమ - అందుబాటు - గడప-ఉదాహరణ- తక్షణము(బాల.288) ప్రాణానికి-ఏలాటిదో - చేతును-బిగుసుకొని ఏమిసేతువో-పాయంగఁజేతు- వడ్డనజేతురు-అర్పణ చేతు-ముసుచుక-పట్టుక-త్రవ్వక-దూసుక-బిగ్గపట్టుక- వైచుక-కంచుక-తోలుక-తప్పించుక-ముంగిలందు-వధింపనేబడిరి. దుఃఖించ నేలేను-తలందు(తలయందుఅనుటకు)క్షీరంబులొఁగమండలువులు:బాల.215)ఈ వఱకు-ఆవఱకు- శిలయానొక్కతె - కండ్లకద్దుచు - నిరీహ మాఁబ్రహ్మసృష్టి వరుణదేవునిపోలిక - మానిరాజీవయ్యా - త్రాసుపీ-పెనాకు-మన్ననజేయుచు వసిష్ఠుల్ సేవకు (వసిష్ఠులసేవకు) వేల్పునెకిమీనందపు (వేల్పు+ఎకిమీని+అం దంపు)నీ నిల్పున్నీడలు (నీ నిల్పునట్టినీడలు) చెప్పుచుంటిని(చెప్పుచున్నాను-

అనెడి వర్తమానార్థములో ఈ భూతకాలరూపములు ఈ కల్పవృక్షములో రెమ్మ రెమ్మకు కొమ్మ కొమ్మకుఁ గానవచ్చును. కపురఁపుఁబ్రముగ్గు, గందఁపు ఇత్యాదులలో అక్కఱలేని అఱసున్న. వంగసప్పింటి దివ్వియలు (వంగసపు నింటి) కంద్లారఁగాంచి చాల్లానందధీపారవశ్యమ్ము (బాల.46పు) చాలున్ + ఆనంద – చాలునానంద అని కావలెను. కైకవధింతునందువె (అయో – 62) కైకను వధింతునన్న యర్థములో. భాసురలీలలగుఁదల్లులు. సమాజములోనొక– నీదుఁగరుణ – మీ గడప – నిరంతము (నిరంతరార్థములో) పిన్నదమ్ముఁడు– రామలక్ష్మణసీతల్ (సీతారామలక్ష్మణుల్) చాఁదినఁగందపు – నాన్నంచు (నాన్న – వ్యావహారికము) ఈ యూరందు (ఊరియందు) కస్తూరిబొట్టుకు – సురరాజుకు – నీవే నాగాథమాఁబ్రణయతేజము – నిర్విషయమాఁబ్రతాపరాసులు – మగనితనము (మగతనము అన్నయర్థములో) మేలుజూచి – చేసెడుఁదల్లులు – తీరు జూచి– మన్నన జేయరు – మోముజూచి – రఘువులిండ్ల –తాతలిండ్ల – వంచనజేసి – సకలేశుండగుఁగొసలేయుని – నడచుఁగల్యాణమండపములు – పెండ్లికూఁతుకు – ఉడిగినదానయోధ్య – ఏగెయెదఁబెట్టిన(అయో 305) దుస్థితి – చాలచెడ్డది – క్షమాపణమ్ము – ఈ మాత్రానికా – వాలి కలకుఁజూపుఁగన్ – క్రోతిరాలాకు – పల్లకిబొంకు – మీరలువచ్చిరి (అయో. 354) మీరలు వచ్చితిరి) తిరుగమూఁతగింజలు – (అయో. 357) తిరుగమూఁత కాదు; తిరుగఁబోఁత యనవలెను తిరుగఁబోఁత – తాలింపు. ఉదా – కం. 'క్రొంబొగపుఁగూర వగ తిరుగంబోఁతల' రాజవాహనవిజయము 3. ఆ. చెల్వారుఁబ్రేమంపు – నీ పొనరుచుఁజేఁత – పాడుచేసెడుఁగడంకను, పతిగా నొల్లిన నే వెలఁది (అయో. 365) వలచుధాతువునకు వ్యతిరేకములో 'ఒల్లు' విభావనగా వచ్చును. ఉదా – ఒల్లఁడు – ఒల్లరు. పక్షమున, వలవఁడు – వలవరు. వలచిన – అనవలపినచోట 'ఒల్లిన' అనుట సాహసము. దాసీలు.సదర్భ చమసస్రుక్కయు – స్రుక్కు తప్పు. స్రుక్కు అనవలెను (బాల. 179.)

## ఏకదేశాన్వయములు (ట)

సిద్ధసమాసమధ్యగతపదములలో మఱొక పదమును అన్వయింపఁ జేయుటయే ఏకదేశాన్వయదోషము. ఇట్టివి కొన్ని యెడలఁ జూపట్టు నని ప్రౌఢవ్యాకర్త సూత్రించెను. ఒకటి రెండు, ఉదాహరణములకై

దొరకెడిమాట నిజమైనను ప్రసిద్ధములైన ప్రాచీనకావ్యములలో ఇట్టివి దొరకవు ! ఒకవేళ పద్యరచనలో తప్పనిసరియైనను వచనములో ఈ దోషము అంటవలసినపని లేదు. కల్పవృక్షములో పెక్కుచోట్ల గద్య పద్యములు రెండింటను ఈ దోషము బాహాటముగా సాగుచుండును. అన్వయము చూచునపుడు ఈ లోపము కొట్టవచ్చినట్టు కన్పట్టును.

1 నీ ప్రథమమార్గణ దర్శనోత్సాహులము (బాల. 168పు)

ప్రథమమార్గణ మన్న సమాసమధ్యగతపదములతో 'నీ' యన్న శబ్దము అన్వయింపవలెను.

2 నాయగ్నిహోత్రార్థ హవ్యసంపాదిన ! (బాల. 245)

3 సవతి యిడిన గరళసహితుండు (322 పు)

4 డీల్వడిన చమూసమేతుఁడయి (310)

5 వ. ఒకవేళ తమ కులోద్భవుండెవ్వఁడైన (206)

6 నీ నా హృదంతరచంద్రామృతవర్తి (అయో. 27

7 అ వరయుగ్మపాలనకృతార్థజనుష్కుఁడ. (49)

8 నీదు కులానురూపమై (52)

9 వ. అని భరింపరాని దుఃఖ మగ్నుడైన (66)

10 మీ మృదుపదార్చననిత్యుఁడ (98)

11 మహోప్ర్యసుండౌ రఘురామ రక్ష (128)

12 మీ నాయనమ్మల యిందుమతీనిరాస్యఖ్యజంపుఁజావు (140)

13 నా వార్తాశ్రవణంబు (141)

14 అ మహావటప్రదక్షిణంబు చేసి (155)

15 తెలిచిన గృహకవాటాంతరమున (187)

16 కులింగయను నా నదీ నీరమ్మున దిగిన (221)

17 చనిన భూమీశదహనసంస్కార నిత్యకర్మలు (241)

18 రాజీవాక్షుఁడౌ రామచంద్రాయత్తంబగు (246)

19 వారి సుఖ స్థితింగభీరులము. (263)

20 పాయని దుఃఖభార వినిపాటిత చిత్తము (293)

21 తన జనిహేతుకశ్రీ (299)

22 నీ ముఖతశ్శ్రవణంబమ్మా ! (363)

ఇట్టివి అనంతములు.

## వ్యర్థసముచ్చయములు (త)

పద్యమునఁగాని గద్యమునఁగాని అర్థమునుబట్టి సముచ్చయమును వాడవలెను. 'అదియునున్నాక – దివంబునుంబోలె – నాకునుంబోలఁగ నీవు భర్తవు' ఇత్యాదులు ప్రాచీనులు సకృత్తుగవాడిరి. వారున్నూ వీరున్నూ వంటివి వ్యావహారికములైన 'దస్తావేజు' పరిభాషలు మఱికొన్ని యున్నవి. 'వినఁడును గానఁడున్ బిదప' వంటి ప్రయోగములలో సారస్యము లేకపోలేదు. కాని గణముల కక్కుఱ్ఱికై వేసెడి సముచ్చయములలో సారస్యముమాట దైవ మెఱుఁగు; చదువుటకే రోఁతవేయును. ఇవిగో లక్షలకొలఁది వెలసియున్న కల్పవృక్షములోని కొన్ని సముచ్చయముల సొగసు పరిశీలింతము

1 అద్భుతంబు ఫలవంతము యాగమంటచుఁ జెప్పిరిన్. (బాల. 23 పు
'చెప్పిరి' అన్నచో ఆ యర్థము రాకపోదు; కాని గణమునకు దెబ్బ.

2 ఎంత సొమ్ములు క్రొత్తవిన్ వింతలున్ మెయి దాల్చికొన్నది. (బా. 42.)

3 ఋణపఱచుచుంటివిని నన్నును నీదెస జన్న మింకనున్ ,, 45

4 కాలము లేదును నింకఁజూడుఁడీ ,, 47

5 ప్రాపితమైన కర్మలును నన్నియుఁ జేసిరి ,, 55

6 విస్తరిపైని వంగుటకు వెన్నును వంగదు పొట్ట వంగదున్
హస్తము లడ్డముంచినను నాగక వడ్డనఁజేతు రన్నియున్ ,, 57

7 బంధుగుల వీడి చరింపరు తప్పిపోవరున్ ,, 56

8 కబు రందఁజేసిరా నీకునున్ ,, 59
నీకునున్ – అనఁగానే ఇంకొకరికిఁగూడ కబురు చేసినట్లు
అర్థము వచ్చునుగాని, ఆ కబురు అందఁదగినవారు ఒక్కరే.

9 మూలలెన్మిదిన్ – ఇర్వదొక్కటిన్ – కాని తెచ్చిరింబడిన్; ,, 60
ఎన్మిదియున్ – ఒక్కటియున్, అనుటకు గణముకోసమై
అక్కఱయైన క్లిష్టరూపములు.

10 ఒక యైదువందలును దానాపైని బందొమ్మిదిన్ ,, 61

11 వారికి మఱిన్ వెనుదిరిగిరి నల్గు ,, 62

12. సీ. 'కదలింతురు నగేంద్రఘనమూలగండముల్
భేదింతురు పురాణవృక్షవితతి

క్షోభపెట్టెదరు నకూపార వార్నాభిఁ
జీల్చివేయుదురను క్షితితలంబు
దుమికెద రుద్భ్రమోత్తుంగపాథోరాశిఁ
జొత్తు రాకాశంపుఁజూరులందు
పట్టుదు రంభోదపటలబాహాకృష్టి
గ్రుద్ది చంపుదురు దిక్కుంభివితతి' (బా.89)

కదలింతురు - భేదింతురు - క్షోభపెట్టెదరున్ - చీల్చివేయుదురను - మికెదరు-చొత్తురు - పట్టుదురు - చంపుదురు, ఈ యెనిమిది క్రియలలో నడుమ నున్న రెండుక్రియలకు మాత్రమే సముచ్చయ ముంచుటలో సారస్యము లాగవచ్చునా! సంధికోసము గణముకోసము పడినపాట్లని చెప్పవలెనా!

13 స్నానమాడును - తడిచీర గట్టును - ప్రాశించదును - పండుకొనును. (బా. 103)

14 ఇమ్మగువిద్య నేర్పెదము నింకను ,, 154

15 మా తండ్రులున్ ... సమాదరింపుమని యన్నారున్ మహాః పేటికా. 168

16 రఘుమూర్తి స్పృశించెనునంత 172

17 మూఁడడుగు లిమ్మన నిచ్చెను దైత్యరాజునున్ 177

18 పూర్తి నందెను నగ్గాధియు 186

19 బహుశిభక్తినినాశ్రమ మేను గట్టితిన్ ,,

20 మోసికొనిపోయిరిని నిలింపులు 190

21 పరమంపుఁదేజమును నందిన 193

22 ఒడ్డుకొనంగ నైనదిన్ ,,

23 ఈ బెగడును నేగతిన్ దొలఁగఁబెట్టెదో! 197

24 అమృతమ్మును లేదు; నేమి నేసెదవొకో 215

25 అందపుఁగోన యామెయు నహల్యయు గౌతమపత్నియున్ 226

ఆమెయు నహల్యయు ననఁగా నిరువురు లేరుసుమా! ఆ యహల్య యొక్కర్తుకయే.

26 ననుఁగూర్చి యేలఁగట్టితివిని శపము 227

27 నిలుమంచు బిట్టునార్చిన 250

బిట్టు - శీఘ్రము. అవ్యయము. 'బిట్టరదంబు డిగునప్పు'భారతము

28 బ్రహ్మదండము గ్రసించెను దానిని నెల్లయస్త్రముల్ 252

| | | |
|---|---|---|
| 29 | నేను నింకటఁ బ్రసన్నేంద్రియమానసుండై (మానసుండనై) | 253 |
| 30 | ఇచ్చట నీవు నుందువును నేనును నుందునని లతాంగియున్ | 265 |
| 31 | ఒకచెల్వున దించెడువాఁడు కాఁడు నన్నే తన | 289 |
| 32 | రా! కొడుకులఁ గాంచెదవునురా | 291 |
| 33 | ఎవరికోసము చూతురు నేకతంబు | 346 |
| 34 | పిల్వఁబంపలేదు నొకరితోఁ జెప్పలేదు | [అయో. 2] |
| 35 | బలముగఁ జెప్పుచుండిరిని వత్సర మంతయు | ,, 10 |
| 36 | నిన్నునునుండి వీఁడు | ,, 12 |
| 37 | గుండియుబట్టి లేదునుఁ | ,, 15 |
| 38 | తన్పుదు రభిలషితముల భూమిపులునుఁ భర్తల్ | ,, 24 |
| 39 | రాజ్యమ్మునుఁ లేదును రాజదర్శనము లేదత్యంత | ,, 53 |
| 40 | ఎల్లప్రజలును నొకరయేమియు | ,, 56 |
| 41 | తండ్రికిఁ దండ్రితనము లేదును | ,, 56 |
| 42 | వచ్చిన నన్నును నిట్లు చేసెదో | 62 |
| 43 | ఆ పతిప్రేమయుం గలఁడు నయ్యది లేఁడును | 66 |
| 44 | నన్నును మించి పాలసుఁడు | 70 |
| 45 | అమ్మ లేదునుం దమ్ముఁడు లేఁడు | 82 |
| 46 | ఇద్దియు విశేషంబౌనో యీ నాకునున్ | 101 |
| 47 | జనకదుహిత నారకట్టను వలదున్ | 106 |
| 48 | వ్యాకులపెట్టుచుందురును నవ్వియుఁ గావలె | 108 |
| 49 | తండ్రి లేఁడును నాకును దల్లి లేదు | 173 |
| 50 | నా సుఖమందుఁ బౌలుగొనినావును | 178 |
| 51 | గాయంబునందున నంతటన్ | 194 |
| 52 | కన్నులను నెత్తి కనుంగొనవేమి ధాత్రిపా ! | 204 |
| 53 | ఎట్టకేలకును నుస్సురటంచును | 225 |
| 54 | అన్నలు లేరును దండ్రి లేఁడు | 226 |
| 55 | దుష్టన్నిన్నును గుబ్జ నేను | 246 |
| 56 | ఇదిగాకను నింటివద్ద. | 264 |
| 57 | అక్కఱలేదును నీకు రాజ్యమున్ | 268 |
| 58 | నేను రాజుఁగానును నను నాడఁగావలదునన్ | 295 |
| | [నేను రాజను గాను; నాతో ఇట్లనవలదు అన్న భావము] | |

59 ఇది వరమడుగుట కాదున్న నిది యిచ్చుటకాదు నిచ్చి యిచ్చుట కాదున్ 316

60 ఏను గోరనంచు నేల యనవు నూఁగి రెండువరములు 317

61 బాణము పోదున్ 350

## అశ్లీలము (ప)

కం. 'వ్రీడ, జుగుప్సాఽమంగళశీలములగు పదము లొకటఁ జేర్చిన గుణి యశ్లీలములగుఁ గృతి నేతస్థ్సాలములగు త్రివిధభేదముల నెఱిఁగింతున్

కం. వసుదేవయోనిగోపీ విసరమహాపీనకుచనవీనాశ్లేష
ల్లసితుండనఁ గాలిందీరసవిహరణ కరణనిత్యరసికుం డనఁగన్'

[కావ్యాలంకారసంగ్రహము 450 పు]

వ్రీడాకరము, జుగుప్సాకరము, అమంగళశంకాకరము — అని అశ్లీలము మూఁడు విధములు. ఒక పదమునకు అనేకార్థము లున్నప్పుడు అందొక యర్థము అసభ్యముగా నున్నచో అశ్లీలమని వామనాదులు నిర్వచించిరి. యోని – మహాపీన – కాలింది, అన్న పదముల వలన, వ్రీడ–జుగుప్స – అమంగళశంక స్ఫురింపవచ్చును. తెలుఁగులో సైతము ఈ శ్రేణిలో 'నీచుల్లిపాయ – మోముడ్డంబుగదల్చె' వంటివియుఁ జేరును. ఈ సూచనను లక్షణముగాఁ జేసికొని కల్పవృక్షమును బరీక్షించితిమేని ఈ యవలక్షణములు లక్షలకొలఁది ప్రత్యక్షమగును.

1 శృంగమునిన్ సిగన్ గయి ధరించి నృపాలకుఁ డశ్వమేధమున్ సాంగముగానొనర్చి . . . 68

ఋష్యశృంగ దశరథ మహారాజుల ఘట్ట మిది. యాగానంతరము ఆ మహారాజు ఆ మహర్షిని అభినందించుచు పలికిన సందర్భము. శృంగమునిన్, సిగన్ కయి, ధరించి – అసలు కావలసిన యర్థము మాట యేమోగాని, ఆ శృంగముని యొక్క తలమీఁది 'పిలకను'లంకించుకొని అన్న అపార్థము రావచ్చును.

2 మంథర మాడఁ బై డిప్పఁ గుదురుచేసి బాల.93

మంథరము – మందరపర్వతము. అడన్ – మంథరము అచ్చుతప్పు కావచ్చు.

3 అరని బత్తిమై వినతు లంజలులున్ సలిపెన్. 98

4 నెల తిరుగలేదు మగనితో నీవు గలసి 127

5 శ్రీరామచంద్రుండు నొక్కినంత కందిగింజయ్యెఁ గోసలక్ష్మాతలేంద్రసుత జగన్నాథమహా స్తనచూచుకంబు. 129

ఇది అశ్లీలమే కాదు; కందిగింజ యగుట ప్రకృతివిరుద్ధము

6 సదా త్రేఁచునట్లు తినంగా 150

7 యజ్ఞవేది భగ్గుమని మండిన 179

8 సకలావని చిల్లిపడున్ 203

9 ఓసి! యోసి! యహల్య యిట్లొక్కసారి రావె 226

మునివేసము కట్టి సందు కనిపెట్టి ఆశ్రమవీధిలో కాలు పెట్టినఇంద్రుని మాట.

10 సాయంతన మ్మతిగుప్తాకృతి వచ్చి నన్నడిగె నే నా వేళ మోహంబు నొందితి నీమోహంబు తీరఁగావలయు 229

11 రాజా! నీవును బొందఁజూతు 258

12 దంగుళ్లు గఱపించె దశరథుండు 313

13 జానకీ రహస్సంయోగసమయ వివృతసంవృతాత్ముండు 357

14 కర్ణాంత కే, శని పీతో గ్రవమజ్జరాసిత విశేషాక్రాంతి. [అయో. 2 ]

[కేశ – నిపీత; కే, శని, పీత]

15 రాముపోయిన పురంబున నే బ్రదుకఁ 116

16 అటువంటి కొడుకు పోఁగా నిటు రాయివిధాన 116

అడవికి వెళ్లిన రామునివిషయమై 'పోవు' ధాతువు అమంగళార్థమునే ఇచ్చును.

17 ఈ నీ వనీ విధుర నిర్యాణంబులో లె నాకు నందకపోదుఁ 140

కల్పవృక్షకర్త ప్రేమించు శబ్దములలో ఈ 'విధుర' శబ్ద మొకటి.

విధుర – ఎడఁబాటు, వైకల్యము. విధురుఁడు – భార్యపోయినవాఁడు

18 తెప్ప యమున చెల్లెలిఁ గడచెన్ 153

యమునానదిని తెప్ప దాఁటినదఁట

19 ఆమె ననుఁ దోలద కానన మేనె పోయితిన్ 172

సీతారామలక్ష్మణులు అడవికిఁ బోయినపిదప – ఆ వార్తలు సుమంత్రుఁడు దశరథునకు ఎఱింగించు ఘట్టము. మఱెవ్వరును కైకనేమియు ననరాదు. ఆమె ననుఁ దోలద. ఏనె కాననము పోయితిని. తోలుటకు ఈతఁడు పశువు కాదుగదా! లేదా, 'తోలు' ధాతువులోనే రామునకు కైకమీఁద కోప మున్నట్లు స్ఫురింపవలెనని కల్పకర్త

భావమా! ఆ పక్షములో ఇతరు లేమియు కైకనుగూర్చి అనరాదను టలో అర్థము లేదు. పైగా, అడవిలోఁ దా నుండియే కాననము పోయితి ననరాదు. అడవికి వచ్చితి ననవలెను.

22 వయసు వచ్చిన కొడుకు లెవ్వారు తల్లి నంటుకొనియుందురు! 180

పెద్దవాండ్రైనపిదప కొడుకులు తల్లివద్దనే ఉందురా! అన్న యర్థమునకు వయసు వచ్చిన కొడుకులు తల్లి నంటుకొనుట-అన్న అపార్థము రావచ్చునుగదా!

23 తా జనకుండు తెచ్చిన నితంబిని నేను (కౌసల్యమాట) 184

24 కామరోగదేహ ప్రవాహమే 185

25 అయ్యాలుమగలు సంగమవారి యొకఁడొకఁడు ప్రవాహ వేగంబునఁ బాడుచు కొని 187

26 స్వప్నమును జారల రాక; జారుల సన్నిధి 219

27 సంతాపం బేలను బొంద రామచంద్రుఁడు 228

28 నీ తాతగారికి నేమిధర్మ! 219

చారులు భరతునితోఁ జెప్పిన మాటల సందర్భములో ఈ సంబోధనము. నిమి – ఇక్ష్వాకువంశ్యుఁడగు రాజు. ఈ పదము 'నేమి' కాదుగదా! నేమి-నెమ్మి; గాడిద; ఘటీయంత్రము, ఇత్యాది. నేమి యొక్క ధర్మము గలవాఁడా! అన్నచో అపార్థము రాదా!

29 తొడపయిఁ జేర్చి తా నలక దువ్వి 234

కౌసల్య- భరతుని కౌఁగిలించుకొని తొడపయిఁ జేర్చుకొన్నదఁట.

30 సంతునఁ గులకర్మకుం జెడిన దుష్టుఁడు 236

31 ఎంత యిమిడించినను బొంగు లెత్తి దిశలు 311

32 కొసముంటితో వార్ధిఁ గుద్దలించి 344

33 నిన్ను న త్తలు మువ్వురు నిన్ను వదలి 340

34 సాకుము ధారణి, నీకు సాకునా? 306

35 పొందెను భోగింపు మనంగ 319

36 తనయుల కంత యా జనకుదారి 323

37 వశిష్ఠుని బ్రశ్నింతు నరుంధతవ్వపయి 333

అరుంధతి+అవ్వ – అరుంధతవ్వ

## వింత ప్రయోగములు (గ)

రచనలో వాక్యవైచిత్రి యని వైయాకరణులు పేర్కొన్న ఒక యంశ మున్నది. 'ఆతడు తిన్న విస్తరి పాఱవైచి' – తిన్నది విస్తరి కాదు; విస్తరిలోని పదార్థమును. ఏ విస్తరిలో పదార్థములు తినెనో ఆ విస్తరిని బాఱవైచి యని వాక్యార్థము. 'వ్రయ్యలు వడ్డనెవ్వగ' – వ్రయ్యలు పడుటచేఁ గలిగిన మిక్కిలి బాధ. ఇట్టి వైచిత్రి బొత్తిగాఁ గాన రాక 'కారకములో' తెలుఁగుఁదనమును దూరీకరించుచు, చర్విత చర్వణముగా అర్థమును స్ఫురింపఁజేయుచు జాతీయమును వక్రింపఁజేయు పెక్కు ప్రయోగములు – ఈ కల్పవృక్షకవితలో, కాదుకాదు; ఈ విశ్వనాథవారి రచనలోఁ గానవచ్చును. ఇవిగో దిఙ్మాత్రముగాఁ జూతము:–

1 నాస్తికులును వైతండికుల్ నగ్నమతులు! [అయో. 213]

నగ్నశబ్దమునకు మతిశబ్దమునకు అర్థము లున్నవి గాని ఈ సమస్త పదమున కర్థ మేమో భావ్యము చెప్పవలెను.

2 లెస్స మొగాలఁ జింతయను లేశము తోఁచఁగరాదు దేహళీనిస్సరణంబునందు
నని నిల్చిన వానిని నిల్చినట్లు వర్చస్సముపేతుఁ దీసికొని రమ్మని నాదునాజ్ఞ
గాఁగ, [అయో. 214]

చింతయను–అచ్చుతప్పు కావచ్చు. చింతయును అన్నచో సముచ్చయమునకర్థము లేదు. లెస్సను చింతలోనికిఁ జేర్చెదమా లేశముతో పని లేదు. 'లెస్స మొగాలకు' చెప్పఁదగిన అర్థమే లేదు. 'దేహళీ...నిల్చినట్లు'–ఇది కల్పము మనకు ప్రసాదించిన ఒకానొక తెలుఁగు జాతీయమునకు నకలు. 'వాకిట్లో ఉన్నవానిని ఆపళంగా పట్టుక రా ఎక్కడ ఉంటే అక్కడ వాడిని లాక్కురా' ఇత్యాదులను పురు డించు 'గో కం–బర్డ్' వాక్యమువంటి వాక్యము ఈ 'దేహళీ' వాక్యము. నిల్చినవానిని నిల్చినట్లు తీసికొని రమ్మని అన్న ప్రయోగమునకుమ ప్రాసకోసము 'వర్చస్సముపేతు' పదము వచ్చికూర్చున్నది.

3 ఏదియో యవసరంబైనట్టి పని. 215

అవసరమనఁగా సంస్కృతభాషలో వేళ యని యర్థము. 'సూర్యో

దయావసరమున'-ఇత్యాది. సంస్కృతపదములు పెక్కింటికి దేశ్య భాషలలో అర్థములు మాఱినట్లే 'అవసరమునకుఁ'గూడ అక్కఱ యన్న యర్థము వ్యవహారములో రావచ్చునుగాని సంప్రదాయశుద్ధము లైన ప్రాచీనకావ్యములలో ఈ ప్రయోగము ఈ యర్థములో అంతగాఁ గానరాదు.

4 ఇంతదాఁక ననుఁ జెప్పరు మంచి వివేకు లంచునన్— 219

రాత్రియనఁగా వచ్చి, ఈ వార్త నాతోఁ జెప్పరే. అవురా! మంచి వివేకులేసుమా మీరు! అని భరతుఁడు చారులతో అన్న మాట. ఆ భాషలో 'మా మువాచ' అందురుగదా యనియు, ఈ భాషలో 'సంయమీంద్రుఁ బలికె' వంటివి సకృత్తుగ ఉన్నవిగదా యనియు హెచ్చుగా ఈ కారకము నిట్లు తెలుఁగునఁ గూర్చుట మెచ్చఁదగినది కాదు. 'అంచునున్'లోని సముచ్చయసారస్యము కల్పవృక్షపాఠకులకు క్రొత్త గాదుగదా!

5 చలియుఁ జప్పుడు లేక నిశ్చలముగాఁగ. 222

'సడీచప్పుడు లేకుండ' అని లోకవ్యవహారము దశరథుఁడు లేని అయోధ్య బావురుమన్నదన్న ఈ ఘట్టములో 'చలితో' పని యేముండును ? యతిప్రాసలకోసముగాని.

6 ప్రొద్దుబారెక్కి గడపల ముగ్గుకట్టి. 224

'బారెఁడెక్కి' అన్న ప్రసిద్ధపదమునకు గణము అడ్డము వచ్చి మన కొక వింతప్రయోగము ప్రసాదించినది.

7 ఓయి యోయి నాయన! నినుఁజెప్ప రెవ్వరున్. 226

నీకు ఇక్కడివార్త లెవ్వరును జెప్పరు నాయనా! నేనే చెప్ప వలెనుగాఁబోలు — అన్న యర్థము ఈ కల్పవృక్షకారకములో ధ్వనింప వలెను.

8 పది దినంబులు చేసి దశాహకర్మ శాస్త్రవిధిగ సల్పి. 242

దశాహకర్మలోని 'తంతు' అంతయు ఒకటి రెండునాళ్ళలోనే జరుపుకొనక, శాస్త్రప్రకారము పది దినములును నిత్యకర్మగా జరుపుకొనెనని సారస్యము లాగవలెఁగాబోలు! లేనిచో 'దశాహకర్మ-

పద్ది దినము'లన్నమాట ఎందుకు ? పైగా 'చేసి – సల్పి', ఈ రెండింటికి సమన్వయ మేది ?

9 గారుడ... ప్రోక్షీశిరస్సింహాపీఠి డొసంగ్గె చన మోడ్చి. 253

ప్రాసలో పడిన ఈ 'డొసంగున'కు అర్థ మేమున్నదో ఆలోచింపవలెను.

10 సం కేతము దానిలోఁ గలరొ గెబ్బున. 262

యతికోసము అతికింపఁబడిన ఈ 'గెబ్బ' నిఘంటువులలో ఉండవచ్చును గాక ! కవులకు దూరమైనదే యగును.

11 ప్రేమో భావము కల్గియుండుటకు మతిశ్రీ లేదు. 266

మతిశ్రీలోని 'శ్రీ'కి అర్థమే లేదు. ఇఁక – కరుణశ్రీ, విజయశ్రీ – ఇత్యాదిశ్రేణిలో దీనినిగూడఁ జేర్చుకోవలెను.

12 పత్తనీ సంసర్గభయము లేక. 286

పత్తనశబ్దమునకు 'పత్తనీ' రూపాంతరము కాఁబోలు!!

## నిరర్థకము (౮)

కం. ఇలఁ 'బదపూరణ'మాత్రం బలవడిన పదంబు, కృతి నిరర్థకమయ్యెన్, దలఁపఁగ, వెలయుచు లలి, నుజ్జ్వల మగు సీతని విలాస సౌష్ఠవ మనఁగన్ [కావ్యాలంకారసంగ్రహము. 446]

ఏదైన పదము పాదపూరణార్థము ప్రయోగించినచో 'నిరర్థక' మన్నదోషము తగిలినట్లే. ఈ నిరర్థకమునే 'అనర్థక' మనియుఁ బిలుతురు. వెలయుచు–లలి–ఉజ్జ్వలము, ఇట్టివన్నియు నిరర్థకమునకు లక్ష్యములు. యతిప్రాసల నిర్బంధము హెచ్చుగాఁగల తెలుఁగులో ప్రసిద్ధులగు కవులే యతిప్రాసలలో ఈ నిరర్థకపదములను ప్రయోగించుట జగత్ప్రసిద్ధమే. 'మానుగ లలి' ఇత్యాదులు నన్నయాదుల కవితలోసైతము కన్పింపవచ్చును. కొన్ని అర్థరహితములైనను వాక్యాలంకారముగా గణింపవచ్చును. కాని కేవలము పాదపూరణమాత్ర ప్రయోజకములై

కొట్టవచ్చినట్లు కనబట్టువానిని నిరర్థకదోషముక్రింద జమకట్టక తప్పదు.

1 కడఁగి తొందర కల రాజకార్య మేమి తాను జతగూడెనో చెప్పనైన లేదు. [అయో. 219]

ఈ తానున కిక్కడ ఏమైన అర్థ మున్నదా! ప్రాసకుఁదప్ప. పైగా రాజకార్యమునకు 'తాను' విశేషణమువంటిది. జడవాచకముల కీ 'తాను' ఎట్లు జతకూడునో విద్వజ్జనులు పరిశీలింపవలెను.

2 ఘంటికారవం బొరసి శకుంతరావముల నూదుట తా వినరాదు నేఁటికిన్ 223

3 వోర్వమై దూకము నూడిపడ్డదనఁదా నుద్విగ్న కౌసల్య. 233

4 తాఁ బెదతల్లి యొంచిన విధంబున నీవును నెంచినావొ. 239

ఇచ్చటి తాను కేవలము యతిసంరక్షణార్థమేగదా!

5 తా శత్రుఘ్నుఁడు రక్తనేత్రములఁ గాంతాపాళి వీక్షింపనా... కోపవివశుండై తాను శత్రుఘ్నుఁడున్. 245

ఈ పద్యములో సైతానులవంటివి రెండు తానులు.

6 తాను గౌసల్య వచ్చెడులోన మఱల. 269

7 ఏ, మనుమనెఁ దా ధరాపతియుఁ బోణములన్ ద్యజియించె. 295

8 తాదృశంబగు నయోధ్యాపురిఁ దాను భరతుఁడు ప్రవేశించెను. 331

ఏమి సొగసు చూచి, ఏమి సారస్యము పరికించి ఈ వృత్తములో మూఁడుతానులు వాడిరో చదువరులు చదివి గ్రహింపఁగోరుదును.

9 రఘువంశమహేశ్వరమూర్తి తా జగత్పట్టపు రాణికిన్. 339

10 ఒకకథ యేమి యెల్లకథ లున్నవి తా శిబిమేను దూచు మచ్చికయు. 345

11 తా వైదేహియు నెంత కొంచము పరధ్యానమ్ముగా. 349

12 ముక్కునన్ దానై జీరును. ,,

13 కాకము, తా మనుజులపైకి వచ్చి తానునె యిది యేదో. 350

14 తాఁ బొలిమేర కోరడుల చాయన్ వచ్చు. 356

15 నీవును దల్లి! తా నయిన నీ పతి తన్నును బోలువాఁడు. 362

16 దహరాకాశములోన వెల్గువెలుఁగై తా రామచంద్రుండు. 364

అమ్మాని తా నిట్లనినన్ (నాలుగు పాదములలో రెండు తానులు) ,,

## అప్రయుక్తము (డ)

'కం. కవులు ప్రయోగింపని పద మవనిం దగ నప్రయుక్తమగు నెట్లన్నన్
ద్రవిణైలబిలుం,డల దుశ్చ్యవనమహాభోగి, ఖేటసంస్తుతుఁ డనఁగన్'
[కావ్యాలంకారసంగ్రహము 445]

రచన హృద్యముగా నుండవలెనన్న సుప్రసిద్ధములైన పదములనే ప్రయోగింపవలయును. ఏ కవులు ప్రయోగింపనివియు, ప్రయోగించి నను ఝటితిత్యర్థస్ఫూర్తిని గలింపనివియు నగు పదములను కావ్యములో ప్రయోగింపరాదని శాస్త్రము. అట్టి పదముల యర్థము వెంటనే స్ఫురింపదు గావున రసగ్రహణమున కడ్డు తగిలినట్లే. కావ్యములలో రసము ప్రధానము గావున రసభంగము గావించు దోషములను బొత్తిగా సహింపరాదు. ఈ పద్యములోని 'ఐలబిలదుశ్చ్యవన ఖేట' శబ్దములు అప్రయుక్తదోషమునకు లక్ష్యములు.

సంస్కృతములో కనిపించు పదము లన్నియు తత్సమములుగా ప్రయోగించు పద్ధతియు సరసము గాదు నాగనుశాసనులే అన్న మాట ఇది:—

'శ్లో. విరళాన్ పేచోషాదికశబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యం సంకేతితసుప్రసిద్ధమేవ పదమ్'

సంస్కృతములో ప్రచురప్రయోగము లేని 'పేచ-ఊష'మున్నగు శబ్దములను సంస్కృతశబ్దశాస్త్రపండితులు ప్రయోగించిన ప్రయోగింతురుగాక! ఈ యాంధ్రభాషలో మాత్రము (ఇహ తు) వివక్షితార్థ బోధనశక్తిమంతమగు సుప్రసిద్ధశబ్దములనుమాత్రమే ప్రయోగింపవలెను. కోశములో ఉన్నవిగదా యని వ్యాకరణసమ్మతములుగదా యని సంస్కృతభాషలోని మాఱుమూల శబ్దములను ఆంధ్రకావ్యములలో వ్యవహరింపరాదని భావము. రసస్ఫూర్తికి ప్రతిబంధకములయిన పదములను పరిహరింపవలెనని పిండితార్థము.

ఈ దోషము కేవలము కల్పవృక్షములోనే కాదు; విశ్వనాథ రచనలలో సర్వత్ర దండిగా నిండియుండును. ఇది యొకానొక ప్రౌఢత్వ

మనియు-ఈ కవిసమ్రాట్టు కవితలో ఇది యొకానొక విశిష్టత యనియు భ్రాంతివడి ప్రచారము చేయు ప్రబుద్ధులు లేకపోలేదు. శాస్త్రీయముగాఁ జూచినను కాలిదాసనన్నయాదికవీశ్వరుల కవితాప్రాభవమునులక్ష్యముగా నెంచి పరీక్షించినను దీని సత్యము తెలిసికొనఁగలము నానావిధనిఘంటువులను దగ్గఱఁ బెట్టుకొని ఏవేవో మాఱుమూల పదముల నేర్చి కూర్చి ప్రాసలలోఁ దూర్చి క్రిందిభాగమున లఘుటీకలు వ్రాసినను ఆ దోషము రసప్రతిబంధకము కాకతప్పదు. ఈ దృష్టితో కల్పవృక్షమును బరీక్షించితిమేని లక్ష్యములకోసమే ఈ కవి ఈ పదములను వాడుకొనెనా యన్నట్లు స్పష్టమగును.

1 వియద్వల్లిఁగాచిన చంద్రబాలకాయ. [బాల. 36పు.]

చంద్రబాలయనఁగా, పెద్ద యేలకులని క్రిందటీక. కాచిన యేలకుల వైఖరికి చంద్రబింబమునకు సామ్యముసైతము క్రొంగ్రొత్తది. కాఁగా 'చంద్రబాల'లోని చంద్రకు 'చంద్రబింబము'లోని. చంద్రకు అక్షర సామ్యముమాత్రము ఉండవచ్చును.

2 మింటిగట్టు నైలావాలుకంబు పండు. బా. 36

ఏలావాలుకమనఁగా నూగుదోసయఁట. ఇట్లే ఈ పద్యములో చంద్రునకు, మాఱుమూల నుండు చెట్లు చేములు పోలికలుగా వర్ణింపఁబడినవి. సోమవల్కము-నెలచంద్ర అమృత-ఉసిరిక, ఇత్యాదులు.

3 కాశ్యపిభర్త యజ్ఞపరికల్పితవాటిఁ బురోవసిష్ఠుఁడై ఋశ్యవిషాణమాని వివరింపఁగ. [బా. 54]

ఈకారాంత స్త్రీలింగమైన కాశ్యపికి భూమియనియు, ఇకారాంత పులింగమైన కాశ్యపికి అనూరుఁడనియు అర్థము లున్నవి. భూపతి యనుటకు కల్పవృక్షము 'కాశ్యపిభర్తను' సృష్టించి యిచ్చినది. భూమికి పతి యన్న యర్థములో సంస్కృతవాఙ్మయమున ప్రసిద్ధములైన పదములు పదులు గాదు; వందలు దొరకును. ప్రాసకోసము అందును తక్కువరకములో లెక్కకు వచ్చు 'శ-స' ప్రాసకోసము ఇక్కడ 'కాశ్యపిభర్త' కావలసివచ్చెను. ఆపై, నాలవపాదమున 'ఋష్యవిషాణమాని'యు ప్రత్యక్షమయ్యెను. 'ఋష్యశృంగ'కు వీరు తగిలించిన

'నకలుముక్క'. శృంగ-విషాణములు పర్యాయము లైనంతమాత్రమున సంజ్ఞావాచకముల నిట్లు తాఱుమాఱు చేయుట భావ్యమా! హస్తిపురిని 'కరిపురి' అన్నారుగదా యని 'ఏనుఁగు పట్టణ'మని పేరుపెట్టి క్రొత్తగా వ్రాయఁగలమా? ఋష్యశృంగుఁడు గణముకోసమై ఋష్యవిషాణవరా నిగా అవతరించుచు, 'నేయార్థ'మను కావ్యదోషమునుగూడ సంపా దించి యిచ్చెను.

4 ఒగిఁ గార్యవిధాఫక్కికఁ పోనీ! [బా. 85

విధా-ఏర్పాటు; ఫక్కిక—ఏకగ్రంథము; ఫక్కి-రీతి; ప్రకారము ఫక్కి-యర్థములోనే 'ఫక్కిక' ప్రయోగించెనని అనుకొన్నను అర్థము చక్కఁగా రాదు.

5 ధురామహ ఉగ్రప్రచండ, తపఊర్జితుణ, తపఉదాత్తతమాభి; ఓంకార సర్వశ ఆద్యావృత్తులై. 176

ఈ సంస్కృతసంధులు శాస్త్రసమ్మతములైనను పట్టి బలవంత ముగ వేసినట్లే యుండి తెలుఁగు రచనకు అందచందములు కూర్పవు.

6 ఆ గాథ సకలంబుతో సంబోధించిరి. 184

ఆ కథ సమస్తమును బోధించిరన్న అర్థములో ఈ ప్రయోగము. సంబోధనము - పిలుపు; ఆహ్వానము. బోధనము - బోధించుట

7 నీరంధ్ర కాంతారవీధీ కైడర్య విశాలపత్రముల. [అయో. 80]

కైడర్యము — లేకుచెట్టు, ప్రాసకు పనికివచ్చిన మాఱుమూల పదము

8 క్ష్వేడా క్రూర మా నేఁత. 173

క్ష్వేడ - విషము, ఆ చేష్ట విషమువంటిది. యతికోసము ఈ క్ష్వేడ దాపరించినది.

9 నిన్బడి వచ్చినను దప్పు లేదు. 179

బడి — క్రమము; పాఠశాల; దిట్టము; వెంబడి. నిన్బడి - నీ వెంటఁ బడి. ఇది మూఁడు బంతుల వచనము ఈ 'బడి' శబ్దము కల్పవృక్షము కాచిన కాయలలో ఒకటి. అల్లూరు బెల్లముగ ఈ కవి వాడు కొను బంగారువంటి పదములలో ఇది యొక పదమని భావము.

ఒకవేళ పద్యరచనలో ఇది వేయకతప్పదనుకొన్నను వచనములో దీనిజోలి మాని 'నీవెంట' వచ్చినను లేక, 'నీ వెంబడి' వచ్చినను దప్పు లేదన్న ధోరణిలో తప్పు లేదుగదా !

10 అహేడమానులు చని సన్నచీఁకటులు నూల్కొనువేళ. 217

హేడుఁడు — అంతఃపురపుకావలివాఁడు; మూర్ఖుఁడు, ఇక్కడ మూర్ఖులు కాని మానులని భావముకాఁబోలు. అవిధవా భవ' అన్నట్లు ఇట్టి ప్రయోగములు ఈ కవి కభిప్రేతములు.

11 శ్రీరాముఁ డాగూపయోముక్కుమ్రాకృతి. 219

శ్రీరామునకు విశేషణమైన ఈ మాఱుమూలపదముల సమాసమునకు అర్థము విచారించుటలో కాలహరణము కావలసినంత.

12 నారికేరంబునా వ్యోమైదూకము నూడిపడ్డదన. 233

వ్యోమ + ఏదూకము—వ్యోమైదూకము.ఏదూకము—మెత్తినగోడ.

13 చేతోరీఢావిధా విశేషములు. 234

కల్పవృక్ష కర్త కభిప్రేతములైన శబ్దములలో 'రీఢ' ఒకటి. రీఢ — తిరస్కారము. చేతో...ములు - మనస్సునకు కష్టము కలిగించు వార్తలు అన్నభావములో ఈ కృత్రిమసమాసము కూర్చిరి.

14 రాజపరిషత్త్రోత్ప్లుష్టిశిరస్సింహపీఠి. 253

15 భార్యపృష్ఠవంశోర్ధ్వమ్మున. 341

16 చంచదపతోక. 231

అపతోక — ఈఁచుకపోయిన ఆవు.

17 చిన్ని సుకరపాల జొన్నగడ్డ. [సుకర=మంచియావు] 37

19 తరుణాజావినివారణ (అజా:- నరకప్రాప్తియఁట) 127

ఇత్యాదు లసంఖ్యాకములు.

## క్లిష్టము (ద)

కం. దూరార్థము క్లిష్టంబగు ధారుణిఁ బవనాశనేంద్రధరమకుటాలంకారమణిజనక వరపుత్త్రీరమణకుమారరూపదీపితుఁ డనఁగన్.'

[కావ్యాలంకార సంగ్రహము 454].

క్లిష్టమనునది కావ్యమం దుండరాని పదదోషములలో ఒకటి. అర్థము నిర్ణయించునప్పుడు క్లేశము కలిగినచో అందు ఈ దోషము ఉన్న దన్నమాట. పవన + అశన + ఇంద్ర-ధర-అనఁగా శివుఁడు; మకుటాలంకారమణి యనఁగా చంద్రుఁడు. (చంద్రమౌళి) వానితండ్రి సముద్రుఁడు. ఆతని పెద్దబిడ్డ లక్ష్మి, ఆమె రమణుఁడు విష్ణువు. ఆయన కుమారుఁడు మన్మథుఁడు అతని రూపమువంటి రూపముతో ప్రకాశించువాఁడు. ఇట్టి, డొంకతిరుగుడుగా అర్థము చెప్పుకొనవలసిన ఘట్టములు చిన్నవి—పెద్దవి ఎన్నో కల్పవృక్షము మనకు ప్రసాదించును. చిత్తగింపుఁడు:—

1　జలేజ హితవంశపు ఱేండ్లకు నీవు నచ్చు సారథివి.　　బాల. 5. పు

జలే జ - హితవంశము—ఱేండ్లు—సూర్యవంశ్య రాజులు.

2　శ్రీయుత వజ్రిమహాశ్మగరిష్ఠసుసౌధముపై క్ష్మాయువతీ సుమనోహరుఁ గాంచె సుమంత్రుఁ డొగిన్.　　6

శ్రీయుత — లో అంతగా అర్థము లేదు. వజ్రి — మహాశ్మ = ఇంద్రనీలమణులు కాఁబోలు! క్ష్మా - యువతీ - సు - మనోహరు = భూపతి.

3　గాఢశుక్కద్రూసంభవదష్టులై.　　6

గాఢ, శుక్ = శోకమనెడి, కద్రూసంభవ = పాములచే.

4　నీవో యక్షుద్రాత్ముండవు.　　6

దశరథమహారాజుతో మంత్రి యన్నమాట ఇది. క్షుద్ర నీచమైన, ఆత్ముఁడు - ఆత్మ గలవాఁడు - నీచమైన ఆత్మకలవాఁడు కానివాఁడు. లేదా, అక్షుద్ర - నీచము కాని ఆత్మ కలవాఁడు. ఇదియు 'అవిధవా భవ' జాబితాలోనిదే.

5　తతమహిమంపుఁ బ్రోడయిన తాత! వసిష్ఠ.　　18

6　విద్యాతరుణీప్రాణనాథులు　　19

గొప్పవిద్యాంసులు అనుటకు వచ్చిన తిప్పలు.

7　రంగనాథప్రతతంబు తోరంపుబిడ్డకు.　　124

8 ఓ పరమంపువారి! (ఓ గంగానదీ! అనుటకు). 193

9 తాటకాప్రాణహరణ పుణ్యవాహినీ భగీరథ! శ్రీరామచంద్ర!. 221

తాటకప్రాణమును దీయుట యను గంగానదికి భగీరథుఁడైన వాఁడా!

10 తమ్మిపువుచుట్టపువంగసపింటిదివ్వియ. [అయో. 6]

సూర్యవంశమునకు దీపమైనవాఁడు. వంగసము + ఇంటి – వంగసపునింటి యని కావలెను. ఇట్టి 'పోకులు' ఇందు కావలసినన్ని కలవు. వీనిని మెచ్చుకొను సచ్ఛాత్రులు, వీనిని మన్నించిన ద్వితీయ శ్రేణివ్యాకరణములు లేకపోలేదు. శతకోటి దరిద్రులకు అనంతకోటి ఉపాయాలు.

11 అసన్నత గల్గు 'వారసుఁడు' 18

ఔరసులలో సన్నిహితుఁ డనుటకు.

12 మోకాల్మిఁదికి జాఱు కేలుగవయుఁన్. 163

ఆజానుబాహువు లనుటకు. కేలు—అనఁగా బాహువుకాఁబోలు!

13 శ్రీరాముఁడాగూపరయోముక్కుమాకృతి. 219

ఇది విచిత్రమైన ముక్క.

14 వైదేహీ మనోంబుజాంగజుఁడు. 263

మనస్సను అంబుజమునకు మన్మథుఁడఁట. క్రొత్తత్రోవ.

15 విదేహరాజతనయాపతి. 305

విదేహరాజుయొక్క తనయకు భర్త.

16 పుండ్రేక్షుప్రదరాసనాభతనుసంభూతద్యుతిప్రేంఖణుల్. 199

## పరుషము (బ)

'కం. శ్రుతికటువులైన పదములు కృతిఁ బరుషము లనఁగఁ జెలఁగు
నిలుఁ గృధ్రేడ్జా
పతి మూర్ధధృతార్ఘోడ్వధిపతిఁ గొల్తు నభీష్టసిద్ధిఫలమున కనఁగన్
(కావ్యాలంకార సంగ్రహము.)

చెవులకు కటువుగా వినఁబడు పదము పరుషము. 'కృధ్రేడ్జ్య–' ఇత్యాది. రౌద్రాదిరసములనుబట్టి ఒక్కొక్కచోట పరుషరూపదోషము దోషముగాఁ గాక గుణముగా ఉండవచ్చును. కాని, రసము–గిసము మాటయే చూడక ఈ కల్పవృక్షము పద్యములోనేగాదు గద్యములో సైతము విచ్చలవిడిగా పరుషదోషమును పదిలముగా దాఁచుకొన్నమాట కాదనలేము. కాఁగా కొందఱు కావ్యసౌందర్యము గుర్తింపనేరనివారు 'అమ్మో! మురారికవివలె కల్పవృక్షకర్తయు ప్రౌఢకవి'యని భ్రాంతి పడి అగ్గించువారును గలరు. ఇదిగో వారి'పరుష'మును రవ్వంత చూతము:–

1 ధర్మానుబంద్యద్భుతోత్ప్రేక్షలకు రాజు (గద్యము) బాల. 12

2 శాంతర్ష్యశ్శృంగులకు (గద్యము). 35
శాంతా + ఋశ్యశ్శృంగులకు

3 భ్రశ్యచ్ఛోకము. 36

4 ప్రేష్ఠమ్మ్రల్–బృందిష్ఠమ్మ్రల్ – బంహిష్ఠమ్మ్ర – క్షేపిష్ఠాశ్వంబులు – సాధిష్ఠము. 37

5 ఆ యశ్వడాద్వపాస్థానీయంబు. 63

6 ధునీశేణ్యష్ఠీవవత్ప్రణీతకిరీటా. 74

7 ధర్షణ్యాశరకామినీ. 115

8 ముగ్గురొకెత్తు వాఁడొకెత్తొముని ! 156
ఈ నడక మొత్తుకొన్నట్లే యున్నది.

9 ససమిత్కుసుమోచ్చయయు సత్రివిజయు (గద్యము) 179

10 అస్పృక్స్నప్ర శత శేనిద్రై. 179

11 దుష్టధీనివిష్టాఘోషా ! 227

12 అబ్భుతుఁడై లీనవహ్న్యశ్వత్థాకృతియై. 253

13 ససుహృత్స్వశివ్యక సత్రివిజముగ. 256

14 వినదత్త్రికి. 271

15 స్పేష్ఠేరమ్మద – ద్రాఘిష్ఠంబై – నిష్ఠావర. 286

ఈ కఠోరపదములకూర్పు ఈ కవికి కర్ణరసాయనమగుటఁజేసి కాఁబోలు – అచ్చముగా ఈ పదములే నిండారఁబోసిన ఒకే పద్యము రెండుచోట్ల (286 - 302) వాడుకొనిరి. ఆ రెండింట భేదించిన పదములు రెండే రెండు. ఛిన్నచాపంబునన్ – వాకిటన్ ఘోరమై అని.

16 ఇల్లుల్లంగిలం దడుగుల్. 297
17 శిశ్వాశిస్సులు శ్వోవసీయముగఁ దా సృష్టించి. 336
18 ప్రథక్ష్వేడాక్లిష్టవచోనిగుంఫనులు. (అయో.120)
19 దీప్తాచ్ఛహాసోజ్జ్వలద్ద్రుగ్భీషంబుగఁ జూచి. 143
20 సమ్యగ్గ్రుగ్భరుంజునివోలె. 143
21 కనిరి దృక్తైక్ష్ణ్యమది క్రమక్రమము. 201
22 అగూపయో ముక్క ప్రమాకృతి. 219
23 నతానతప్రాగ్గగనావలంబి సాంద్రాప్పతినీరదప్రథమ. 337

## ప్రకీర్ణము : గ్రామ్యము

'కం. పామరుఁ భాష గ్రామ్యము భామిని కటిగల్లములు విభాసిల్లునసన్
గోమలి చన్నులుఁ గన్నులుఁగాముని పండువు లోనర్చెఁ
గడువడి ననఁగన్.' [కావ్యాలంకార సంగ్రహము]

ఇచ్చటి గ్రామ్య మనఁగా వ్యావహారికభాష యని కాదు. నాగరకవ్యవహారము గుర్తింపక శ్రోతలకు జుగుప్స కలుగునట్లు పలికెడు భాష గ్రామ్యము. అట్టిది కావ్యభాషలో అసభ్యముగా పరిగణింపఁబడును. విద్వద్గోష్ఠులలో పలుకరాని కటి-గల్లప్రభృతి శబ్దములను కావ్య దోషములుగా నిర్ణయించి నిషేధించిరి. 'కాళ్లు' పదముసైతము గ్రామ్యమని తెలుఁగులాక్షణికులు చెప్పిరి. కాని కవీశ్వరులు పెక్కుమంది ఇట్టివి వాడుకొనుట నిజమైనను—ఈ దోషములు దోషములుగానే విద్వజ్జనులు భావింతురు. కల్పవృక్షము వీనిని బాహాటముగాఁ గైకొన్నది.

1 చిబుకంబును గల్లము నల్లఁదాఁకి. బాల.24
2 మీసలు గడ్డముల్ మీ ముఖచిబుక గల్లముల మెలఁగనే. 3[illegible]
3 సదా తేఁచునట్లు తినంగా. 50

ఈ శబ్దమునకు మాండలికముగా అసభ్యత కలదు.

4 శ్రీసతి ఫుల్ల గల్ల పరిచిహ్నిత. 267
5 అని బాష్పస్నపితాక్షి గల్లయును. 364
6 ధరణికుమారి బుగ్గలుగఁ దాల్చె సమాదర. (అయో.294

## వచన వ్యత్యాసము

1 మగిడి జనకాదులు రథాశ్వ...వీధి కానతంబుగ నడచెన్. బాల. 338

జనకాదులు నడచిరనవలెను.

2 సౌధాగ్రభాగస్థసతులు...రాముఁ గాంచి సంతోషజలరాసులగుచు ప్రమదంబుఁ గాంచు. [అయో.44

సతులు గాంచు ననుట తప్పు.

3 కామినులు...పెన్మిటిన్ అవ్వియోఁ గావలె నివ్వి కావలెన్ (అయో. 108

నా కనుచున్ భర్తను గాంచలేర!

4 బగ్గాలకున్ నిలువఁబడిరోఁ బరిచారకులున్. 203
5 పతి యున్నయప్పు డెటులో ద్రిమ్మ గానక్లే సతుల్. 210
6 శ్రీవసిష్ఠులు మాతో నిన్ను నిల్చినవాని నిల్చినయట్లగాఁ గొంచు రమ్మనిరో. 219

అన్నది వసిష్ఠుఁడు కాదు, వసిష్ఠులవారు. వసిష్ఠులవారు అనిరనవలెను. మాతో కొంచు రావలె నన్నారుగాన 'కొంచురండ' నియు రమ్మనకు రండు—బహువచన రూపమనియు ప్రాథమిక పాఠశాలా విద్యార్థులు సైతము వ్రాసెదరు.

7 శ్రీవసిష్ఠులును స్వామీ! నిన్ను వే రమ్మనెన్. 219
8 మీరెల్లన్....కంటే వసిష్ఠుల్ సుడీ. 272

(మీరెల్లరు కంటిరే యన్న ధోరణిలో)

## వైరి సమాసములు

ఇవి 'చ్యుతసంస్కార' దోషములలోఁ జూపవలసినవే అయ్యును చదువరులు ప్రత్యేకించి వీనిని గుర్తింపవలెనని ఇచ్చట ఈయవలసి వచ్చినది.

1 ప్రతిమేఁడ 2 ప్రతిమల్లెపూవు 3 ప్రతిపూట 4 ప్రతినాఁట 5 ప్రతియంగుళము 6 ప్రతిచినుకు 7 ప్రతిదానికి 8 మూలకంబముల్ (బాల. 19. పు) 9 మహారాణి (బాల 104. పు) 10. నీకృతము (అయో. 48) కృతము – చేయఁబడినది. నీచే చేయఁ బడినది.

ఇట్టివి కల్పములో పదులు కాదు: వందలు వేలు గలవు. 'ప్రతి' అవ్యయమును దెలుఁగులోఁ జేర్చి సరిపెట్టకోవచ్చునని యు, 'మూల స్తంభము' వికృతి 'మూలకంబ' మనియు, 'మహారాజ్ఞి' వికృతి, 'మహారాణి' యనియు – ఈ ధోరణిలో సాధుత్వమునకు తంటాలు పడవచ్చునని భావించువారు లేకపోలేదు. పట్టించినట్టు చూపట్టు ఇట్టి అపశబ్దముల కర్కృత్తి, కవిసమ్రాట్టులని కొందఱివాడుకలో ప్రోగు చున్న విద్వత్కవికి తగియుండునా! ఇట్టి ప్రయోగములతో సాగిన కావ్యము మహాకావ్యశ్రేణిలోఁ జేరఁగలదా!

## విపరీత ధీ ప్రదము

కం. 'జగతిన్ విరుద్ధమతికరమగునది విపరీతధీప్రదాఖ్యం బనఁగాఁ
దగుఁ గృతుల; నకులహీనుం డగు నితఁ డన నంబికావిటాసక్తుఁడనన్

(కావ్యాలంకార సంగ్రహము)

అనుకొన్న యర్థమునకు విరుద్ధమైన యర్థమును గలిగించు పదమును విపరీతధీప్రద మని యందురు. ఈ కావ్యదోషమునకే 'విరుద్ధమతికృత్తు' అని సాహిత్యదర్పణము–కావ్య ప్రకాశము మున్నగునవి పేరు పెట్టినవి. అకులహీనుఁ డనఁగా కులహీనుఁడు కానివాఁడని ప్రయోక్త ఉద్దేశము: న విద్యతే కులం యస్య సః అకులః స చాసౌ హీనః అకులహీనః – అనియు విగ్రహము చెప్పినచో 'కులము లేని హీనుఁ'డన్న అర్థము రావచ్చును. అంబికావిటుఁ డనఁగా – పార్వతీపతి కావచ్చు. తల్లికి మిండఁడన్న అపార్థముసైతము రావచ్చును. ఇట్లే 'కల్పము'లో–

1 గీ. ఇద్ది యభిషేకమయ్య! అహీనభావ!
హీనదోష! ముక్తాల మహీనపోష!' అయో–70

ముక్త్యాల భూపతికి ఈ రామాయణకల్పవృక్షమును వినిపించునట్లు వ్రాసికొన్న ఈ ఘట్టములో ఆ మహారాజును 'హీనదోష !' అని పిలిచిరి. తగ్గిపోయిన దోషములు కలవాఁడా ! అని కాఁబోలు కల్పవృక్షకర్త వివక్ష. అసలు - దోషస్ఫూర్తి ఎందులకు ? 'అనఘ' అన్నట్లు దోషములే లేని వాఁడా! అనుటకు—దోషములు తగ్గినవాఁడా అనుటకు భేదము లేదా ? అహీనభాష' లోఁగూడ ఇంత సంస్కృత వాఙ్మయము ఉండఁగా 'హీన' శబ్దమే ఈ కవిసమ్రాట్టునకు దొరకెనా?

2. అనఁగ **ధరణీ**<u>వరాహ</u>! నీదైన బలము రథములందున్న మాట. బాల. 14

ఇదిసూతుఁడు దశరథమహారాజులతో అన్న మాట. దశరథుఁడు ధరణీవరాహుఁడఁట ! ఆదివరాహము మోసినట్లుగా ఆతఁడు ధరణిని మోయవచ్చును. (పాలించుట) సైంధవ మానయ—అన్నట్లు సరిపెట్టుకోవచ్చును గదా యనవచ్చును. కాని 'ఊరఁబంది – అడవిపంది' అన్నట్లు విపరీతార్థము నిచ్చు ఈ 'వరాహము' కల్పవృక్షమున కేమి ఒఱుగఁబెట్టును ?

3. చంచదపతోకకు స్వర్గవికైన. అయోధ్య. 231

అపతోక యనఁగా ఈఁచుకపోయిన ఆవు కావచ్చును. కాని 'తోక' వెక్కిరించినట్లు లేదా ?

4. శతదాసీపరిసేవ్యమానవిభవసా<u>ద్వరాజ్య</u>రాజ్ఞీత్వభాసిత, యిక్ష్వాకుల పెద్దకోడలు వనీసీమం బ్రవేశించి. అయో. 302

దాసీజనముచే సేవింపఁబడిన <u>తన</u> రాజ్యమందలి రాజ్ఞీత్వముచే ప్రకాశించునది సీత యని కల్పవృక్షకర్తభావము కావచ్చును. కాని 'స్వరాజ్య-స్వారాజ్య' శబ్దములకు కొండంత భేద మున్నది. స్వరాజ్యము తన రాజ్యముస్వారాజ్యము – స్వర్గలోకపుదొరతనము. స్వరాజ్యాద్భవ-స్వారాజ్య అని పడో తద్ధితరూపము చేసి '<u>మా</u>యూర–<u>కా</u>పోత–<u>పై</u>క–<u>శౌ</u>కములు' ప్రేమించు 'వైశ్వనాథమును' మనస్సులో నుంచుకొని సమర్థించుకోవలెనా ?

## ప్రతత్ప్రకర్షము

కం. క్షితి నుత్కర్షము తక్కినఁ బతత్ప్రకర్షంబు; గవయభల్లూకమృగీ
వితతివిభేదనగర్వాయతసింహాభీల మీ మహాటవి యనఁగన్.
[కావ్యాలంకార సంగ్రహము]

ప్రారంభించిన ఎత్తుగడ క్రమముగా పడిపోయినచో ఈ దోషము తగులును. ఈ లాక్షణికదోషమును మనము పాటించినచో కల్ప వృక్షము మహ్వాతికముప్వీసము దీనికి లక్ష్యము కావచ్చును. అయినను మచ్చున కొక్కటి.—

1 'త్రిపురఘ్నమహాగ్ని రీఘాపినిర్దగ్ధధూమసంపిహితమా దుర్గమట్లు శిల్పికృత శ్యామలాల్పమృన్నిర్మిత క్రీడాగృహసమాజకేతువట్లు ఝంఝూనినిర్ధూత సంఛిన్నసర్వపత్రాల్ప శాఖమ్మ మహాగమట్లు, ఈ యెత్తుగడ చప్పన మాటి, మటి రాఁజిరాఁజి క్రమమ్ముగాఁజల్లారి ఘసితమై చను నిటుకామమట్లు' అన్న ధోరణిలో దిగజాటినది [అయో 122 పు.]

ఈ జబ్బులో మఱొక చిత్రమైన దోష మిదిగో చిత్త గింపుఁడు:-

'ఇటు కామమట్లు' — ఇట 'చను విటుకామ'మేమో యని ముమ్మొదట స్ఫురించినది కాని 'యతి' విటుని అడ్డగించినది ఇటుక + ఆమము – ఇటుకామమైనది కాఁబోలు! అమ్మ మేమి స్వామీ! మొదటి రెండు కాండములలోనే రెండుమూఁడు పర్యాయములు ఈ 'ఆమము' రాఁగా 'నల్లమేఁక — బ్రాహ్మణునికథ' జ్ఞప్తికి వచ్చి నిఘంటువులు తిరుగవేయవలసి వచ్చినది. ఆమము= రోగము, అపక్వము; ఆవము = కుమ్మరి కుండలు లోనగునవి కాల్చుట కేర్పఱిచిన కావు, ఆవాపము.

ఒకసారియైనచో అచ్చుతప్పు అనుకొనవచ్చును. ఇదిగో ఇం కొక చోట — 'మున్నే యిడినట్టి యామముల యిట్టికలున్'
బాల — 48 పు.

## వ్యాకీర్ణము

కం. భ్రాంతికరంబగు నన్వయ మెంతయు వ్యాకీర్ణమయ్యె నిడుఁడు
తిలకముం
గుంతలములఁ గాంతకును లతాంతంబులు సెరువుఁ డిప్పు డలరు
నసంగన్ [కావ్యాలంకార సంగ్రహము]

తిలక మిడుఁడు; కాంతకు కుంతలముల లతాంతములు సెరువుఁడు—అని అన్వయము. 'తిలకమును కుంతలముల నిడుఁడు' – అని ఒకానొక భ్రాంతికరమైన అన్వయము కలుగుచున్నది. దీనినే దర్పణ కారాదులు 'అస్థానపదదోష'మని పిలిచిరి. స్థానముఁగాని స్థానమున పదము నుంచుటలో కల్పవృక్షకర్త అందెవేసిన చేయి.

'తెలియ రాజర్షి మండలిమౌళివైదూర్య
మణిసమస్తాధ్యాత్మ మహితభావ
చర్యావినిష్కృష్టసారసంవిద్ జ్ఞాన
నిభృతమంజూషిక, నిత్యయోగి
జనకుని యల్లుఁడని జానకీభర్త
యని చెప్పఁబడు రాముఁ డడవి కేఁగె.' అయో. 254

దేహళీదీపన్యాయముగ ఇందలి విశేషణములు మామఅల్లుండ్ర కిర్వురకును అన్వయింపవచ్చును. 'నిత్యయోగి' యను సన్నిహితవిశేషణమునకు భవత్యర్థకము అనుప్రయుక్తమైనచో 'నిత్యయోగియౌ జనకుని'అని చక్కఁగా అర్థము కుదురును. అట్టి వ్యాకరణపు మెలకువలు పాటింపని ఈ రచనలో 'వ్యాకీర్ణములకు' తరుగే కానరాదు.

## సమాప్తపునరాత్తము

కం. 'క్రమ ముడిగి మగుడబూనిన సమాప్తపునరాత్త మయ్యె;
శాశ్వతు నభవుం
గమలాక్షుఁ గమలనాభుం గమలాపతిఁ గొల్తు ముక్తికై విభు
ననఁగన్' [కావ్యాలంకారసంగ్రహము]

సమాప్తమైనదానిని మఱలఁ దెచ్చుట సమాప్తపునరాత్తమను దోష మగును. కొల్తు ముక్తికై, అని వాక్యము సమాప్తము కాఁగా, మఱల 'విభున్' అని విశేషణాంతరము వేయుట దోషములోఁజేరును. యతిప్రాసల కక్కుర్తికై ఈ దోషమును పెక్కుచోట్ల కల్పవృక్షము స్వీకరించినది. ఇదిగో దిక్సూచి:-

1 'అశనివచోదురంతకుఁ డనాగసుఁ బుత్త్రిని బంపెఁ గానకున్
ప్రశమితకాముఁడౌ కొడుకుఁ బండితసత్త్వముఁడైన వానినిన్' అయో.163పు.

కానకున్ పుత్త్రిని బంపె నని వ్రాసి నాల్గవచరణములో మఱల రెండువిశేషణములు;- కొడుకు, రావలసిన పనియేమి? పుత్త్రిఁడు-కొడుకు, ఒక్కఁడే గదా! ఇట్టి చర్వితచర్వణములకు సమాప్తపునరాత్తమునకు ఈ కల్పవృక్షము నిజముగా కల్పవృక్షమే.

2 'శ్రీరఘురామచంద్రునకు సేమమె యంచన సేమమే యనన్
ధారణినేత సేమమటె తండ్రి యటన్నను సేమమే యనన్'. అయో. 219

ధారణినేత సేమమటె – వాక్యము ముగిసినపిదప అక్కఱలేని తండ్రి పదము వచ్చినది.

3 'నవమణులున్ ధనంబులు ననంతములై చను నాలమందలున్
గొనకొని యిచ్చె, బ్రాహ్మణులకున్ మృదువాససముల్ మహార్ఘముల్'
[అయో. 242]

బ్రాహ్మణుల కిచ్చెనన్న తరువాత వాససములు కూడ వచ్చిపడినవి.

## వింత సంబోధనములు

విషయమునుబట్టి సార్థకమైన ఒక్క 'పిలుపు' పిలిపించి పాత్రలచే కథ నడపించుట ఉత్తమకవితాసంప్రదాయము. పద్యములో ప్రాస కోసమో యతి కొఱకో గణముల నిమిత్తమో పాదపూరణార్థమో పదింబదిగ సంబోధనములు చూపుట కల్పవృక్షసంప్రదాయమయ్యె. ఏదో గొప్ప యెత్తుగడలో పెద్ద సమాసముతో సంబోధించి చపలన దిగజాఱిపోవుటయు కల్పమున కున్న సంకల్పము.

1 తతమహిమంపుఁబ్రోవయిన తాత! వసిష్ఠ ! బాల. 19 పు

2 తా మమకారమే ...వాఁడొకొత్తో ముని! నాకు; చీఁకటి ,, 156

3 కోణముల్ మునీ' [నాలుగు పాదములలో రెండు 'మునులు']

పైగా, విశ్వామిత్రుసంతవానిని మునీశ్వరా! అని కాక 'ముని' యని దశరథుఁడు సంబోధించెనో లేదోగాని, విశ్వనాథవారి దృష్టిలో ఆ మహర్షి 'ముని' యే కావచ్చు.

4 అనిన వసిష్ఠుం డిట్లను మనుజాధిప! ఇనకుల మర్యాద యగునటే యిది తాతా!

[వసిష్ఠుఁడు దశరథుని మనుజాధిప! అనుటలో అంద మున్నది. కాని, తాతా! ఏమిటి? ఇది తెలుఁగు తాతలోఁ జేరునా? సంస్కృత తాతలోఁ గలియునా?] బాల. 159

5 దాని వికారమ్ము మేనుదానిని రాముం డైనం దమ్ముని గని లచ్చి! ,, 169

లక్ష్మణుని 'లచ్చి' యనుటలో ఏమైన అందముగానీ అర్థముగానీ ఉన్నదా! లక్ష్మి - లక్ష్మణశబ్దముల కున్న భేదమైన గుర్తింపవలదా? నేఁడు కొందఱు బిడ్డలకు 'మధుసూదనరావు' అని పేరు పెట్టుకొని ముద్దుగా భావించి 'మదూ' అని పిలుచుకొన్నట్లు ఈ 'లచ్చి' ఉన్నది. పైగా 'రాముండైనన్'లో 'ఐనన్' ప్రాసకోసమా స్వామీ!

6 ఓ పరమంపువారి! (ఓ గంగానదీ! అనుటకు) బాల. 193

7 ప్రభు! ప్రభు! గుణగణములందు. ,, 221

శ్రీరాముఁడు విశ్వామిత్రుని సంబోధించుట. ఈ యామ్రేడిత ప్రభువులు - అధ్యాహార ప్రభువులు- పౌనః పున్య ప్రభువులు కల్పవృక్షములో కొమ్మకొమ్మకు రెమ్మరెమ్మకు వ్రేలాడుచు 'యేసు' ప్రభువును జ్ఞప్తి కెలయించుచున్నారు.

8. ఓసి! రూసి! యహల్య! యిట్లొక్కసారి రావె!... బాల-226

వేసము గట్టి వచ్చిన దేవేంద్రులవారు పిలిచిన పిలుపు

9. దుష్టధీనివిష్టా ఘోవా! [ఇంద్రునిగూర్చి గౌతముఁ డన్నమాట] బా. 227

10. ఓయి నా ప్రాణనాథ శివా! బాల. 234

శోభనాద్రి గర్భంబు శివునిగూర్చి ఈ 'ప్రాణనాథ' అనుటలో ఏదో దొడ్డ వ్యంగ్య ముండితీరును.

11. బ్రహ్మకొడుకుకన్నోయి! యోయి విశ్వామిత్ర! యోయి! ,, 245

అసలు—ఆ కథలో వసిష్ఠుఁడు అనెనో లేదోగాని, ఇరువదవ శతాబ్దిలోని ఈ కల్పవృక్షకర్త, విశ్వామిత్రునంతవానిని మూఁడు 'ఓయిలు' వాయిగాఁ జేసి పద్యములో పిలిచినాఁ డనుట మనము గుర్తింపవలెను.

12. తానును గాధేయుఁ డిదియుఁ దగునటవె ప్రభూ! బాల. 245

వసిష్ఠులవారి కితఁడు 'ఓయి'యా? ఈతనికి వారు 'ప్రభువులా' ఎంత వింతైన సంబోధనము?

13. ఓ యమ్మ! కల్మషి! నా యగ్నిహోత్రశ్రాద్ధహవ్యసంపాదినీ!
ఓ యమ్మ! శబళీ! బాల. 245

కూచిపూడిభాగవతులు జ్ఞప్తికి వచ్చుచున్నారు.

[విశ్వనాథముప్రకారము జ్ఞాపకము వచ్చుచున్నారని అనవలెను గాఁబోలు!]

14. లంజియా! యెంత క్రిందికి గుంజినావొ? బాల. 269

బ్రహ్మర్షియైన విశ్వామిత్రుల వారి నోట కవిసమ్రాట్టులు అనిపించిన కమ్మని గీర్వాణము.

15. హీనదోష! ముక్త్యాలమహీనపోష! అయో. 70

ముక్త్యాలరాజాగారినిగూర్చి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు పిలిచిన పిలుపు.

16. కలుషపూ మోము రాఘవ అయో. 78

17. సంస్థాస్వరూప! ,, 78

జానకి శ్రీరామునితో అన్నమాట. ఈ సంస్థకు అర్థమేమో!

18. శ్రీరాముండును నంతఁ దమ్ముఁ గని లక్ష్మ! యీ వనంబున్ అ. 157

'లక్ష్మ'యన్న-తమ్ముఁడు రాముని కన్నాఁడన్నమాట నేఁటికి విన్నాము.

19. హితతమురాల! రామజననీ! అ. 189

20. అసిధారావ్రతుఁడైన రాముఁ డిపుడేలా రాఁడు తాతా!
సుమంత్ర! సమూహ్యాఖిలశేత్రుపారిషదతీర్థా! మాకుఁ
దండ్రీ! వసిష్ఠ! సరే! అయో. 204

ఔరా! ఏమి మనోహరమైన సంబోధనములు? కౌసల్యకు సుమంత్రుఁడు 'తాత'యఁట. వసిష్ఠులవారు 'మాకుఁ దండ్రి' యఁట. ఆ నడుమ 'వల్లమాలిన' వేదాంతసారమును గ్రుమ్మరించెడు పెద్ద సంబుద్ధి. సంబోధనములో 'మా తండ్రీ!' యని వాఙ్మయములో వింటిమిగాని 'నాకుఁ గొడుకా! మాకుఁ దండ్రీ!' యని ఇంతదనుక వినముఁ గానమును.

21. ఓయి యోయి నాయన! నినుఁ జెప్ప రెవ్వరును అయో. 262

అయ్యో! నాయనా! ఈ మాట నీ కెవ్వరు చెప్పలేదా! అన్న భావము.

22. ఆహితసమస్తజంతుతతికర్మపరిపాకసార్వభౌమ! అ. 247

శ్రోతయైన ముక్త్యాలస్వామికి వక్తయైన 'సత్యకవి' చేసిన సంబోధనము. ఈ సంబుద్ధిలోని సారస్యమునుగూర్చి శ్రోతయైన ఆ స్వామిసమక్షమున వక్తయైన ఈ కల్పవృక్షకర్త ఆ నాఁడేమని వెల్లడించెనోగాని, తక్కిన శ్రోతలకుమాత్రము ఈ సమాసమున కొక విగ్రహవాక్యముగానీ భావముగానీ ఆధ్యాత్మికవిశేషముగానీ దురవగాహమని చెప్పక తప్పదు.

23. బిడియంపడి నిక్కము సామి! సామి! అయో. 261

గుహుని నోటిమాట. అహహా! ఏమి పాత్రౌచిత్యము!! మద్రాసువీధిలోని అఱవవాని నోటిమాట జ్ఞప్తికి వచ్చును.

24. నా యేలిక! యేడువకే, నీయెడఁ బొరపాటు పడితి అయో. 262

కైకయీతనయుఁడు దుఃఖచలితమగు గుండియచేత డస్సినపుడు గుహుఁడు సూపిన 'సానుభూతి'లోని సంబుద్ధి

25. ఓ నా యాదరువ! యోసి! యోసి! సుమిత్రా! అ. 301

ఇది కౌసల్యమాట. ఆదరువఁట! సొగసైన సంబుద్ధి.

26. మాని, యమ్మా! యొకరో యెఱుంగుదువె యీ పసిదానిని సీత అయో. 359

అది అత్రిమహర్షి యాశ్రమము. వచ్చినవారు సీతారాములు. లోపలినుండి ముసలిది వచ్చెనట. పండిన మొక్కజొన్నకఱ్ఱల తుది పొత్తుల జుత్తు కలదట. ఆ వచ్చిన ముసలిదానికి సీతమ్మను జూపి అత్రి మహర్షులవారు పరిచయముచేయుట. సనాతనాచారసంరక్షకమ్మన్యులైన శ్రీమద్రామాయణ కల్పవృక్ష మహాకావ్యకర్తలు, అనసూయమ్మను ముసలిది యనుట ఒక వింత; ఆపై 'అమ్మా' యెవరో యెఱుంగుదువె. అని అత్రిమహర్షిచే అనసూయమ్మను సంబోధింపజేయుట ఇంకొక వింత. నాటి ఆశ్రమములోఁగూడ నేటి 'అమ్మా-' ఇత్యాదిక 'అనగా సంబోధనములు ఉండెడివికాబోలు! లేక కవితలో ఇదియొక 'వాస్తవికత' అందురేమో తచ్ఛిష్యప్రశిష్యులు !!

27. ఓ వడిలుతపమ! సీదియు సావిత్రి దరుంధతిదియు సర్వానేహో భావ
నికషములు నామములు ఆయో. 360

ఈ సంబుద్ధి-అన్వయసౌభాగ్యము-భావసౌందర్యము చిత్తగింప వలెను. 'వడిలు'నకు తెలుఁగులో సరియైన అర్థమును ఇంకను బరిశీలింప వలెను. అది తపస్సునకు విశేషణమైనచో 'సీదియు' తో అన్వయము కుదురదు. 'గంగాయాం ఘోష' వోలె, లేక 'వంకాయలూ-వంకాయలూ!' అని వంకాయలమ్మువానిని బిలిచినట్లు వడిలు తపస్సు గల 'ఓ అనసూయమ్మతల్లీ!'అని అన్వయించుకొనవలెనేమో! సరే! ఆపైని, 'సీదియు-సావిత్రిది-అరుంధతియు, గణము కుదురదాయె. అచ్చులో వచ్చిన మచ్చకావచ్చు-ఆ పక్షమున, అరుంధతిదియు నామములు సర్వానేహోభావనికషములట. మీ ముగ్గురి పేరులు చెప్పుకొన్నచో సర్వపాపములు పరిహారము లగునన్న భావము కాబోలు! సీదియు సావిత్రిది అరుంధతిదియు-ఈ ధోరణి అశ్లీలార్థస్ఫోరకమై ఎంత రోఁత పుట్టించునో సహృదయులు గుర్తింతురు.

## భిన్న కర్తృకము

1. అంత మిశ్వామిత్రుండు తక్కిన ఋషులను యథోచితంబుగ
మన్నించి యందఱును గలసి . . . ఉపవిష్టులైన బాల. 150

ఇది రెండునరపంక్తుల వచనపుముక్క. ఇందు రెండుకర్తలు మూఁడు సమాపకాసమాపకక్రియలు. విశ్వామిత్రుండు ఋషులను మన్నించి—దీనికి సమాపకక్రియ లేదు. ఉపవిష్టులైనవారు అందఱును.

2. అనిన నందఱును భాగీరథిం దరించి యుత్తరపుగట్టు చేరి స్వర్గోపమమ్ము దివ్యంబు రమ్యంబులైన యొక మహానగరంబుఁ గాంచి రామచంద్రుండు

బాల. 212

తరించినవారు చేరినవారు అందఱునఁట. నగరంబు గాంచినది రామచంద్రుండఁట. ఏఁబది యక్షరముల ఈ చిన్నముక్కలో ఈ తబ్బిబ్బు ఎందులకో?

3. గంగానదిని గాంచి యందఱును రథంబు డిగ్గి నమస్కరించి శ్రీరామచంద్రుండు సుమంత్రునితో నిట్లనియె. అయో. 133

గంగానదిని గాంచినవారు రథంబు డిగ్గినవారు నమస్కరించిన వారు అందఱును. ఇట్లనియె—దీనికి కర్త శ్రీరాచంద్రుఁడు మాత్రమే.

## సంస్కృతపదములు

ముప్పాతిక మువ్వీసము సంస్కృతపదము లన్నియు తెలుఁగు భాషలో వ్యవహరించుకొనవచ్చును. భవదాదులగు హలంతసర్వనామములును—శతృ రేఫాంతాదులును సరాసరి తెలుఁగునకు రాక సమాసములలోఁ గలసివచ్చును. సర్వదా—సర్వథా వంటివి సకృత్తుగ స్వీకరించిన తెలుఁగుకావ్యములు లేకపోలేదు. ఇఁక ఈ 'కల్పము'లోనో, సంస్కృత క్రియలు—నామవాచకములు - అవ్యయములు - ఆశ్చర్యార్థకములు—సంస్కృతమునందు ఉన్నవి యున్నట్లే సరాసరి దిగుమతియైనవి. వాని యందచందములకు అర్హతకు విద్వజ్జనమే ప్రమాణము:—

1. శిరసా చేసిన ప్రణతిగ బాల. 299
2. ఏకత్రస్థితులకు సీతారాములకు ,, 340
3. శోకమంచనెద వద్ధా అయో. 28
4. వయసా కడువృద్ధులు ,, 294

5. నీ వీ యాశ్రయానర్హుండవు <u>ధిక్కృ</u>న్న
రామచంద్రునితో ,, 319
6. ప్రభూ! జాగ్రత! భద్రమయ్యెడున్ ,, 342
ఈ జాగ్రత, మన 'జాగ్రత్త' కాదు.
తస్మాత్ జాగ్రత జాగ్రత' వంటి సంస్కృతజాగ్రత.
7. <u>రే</u>! మృజాపథము సెంచితి దృ<u>ప్త</u>మతీ! అయో. 351
ఈ 'రే' తెలుఁగు 'రే' కాదు; బెంగాలీ 'రే' కాదు.
'రేరే ఘూర్జర' వంటి గీర్వాణము 'రే'.
8. నీచేత <u>వినాగ</u> అయో. 353
ఇవి యన్నియు ఒక యెత్తు. ఇదిగో ఈ సంస్కృతక్రియా రూపము ఒకయెత్తు:-
9. పరమేశా! భుంక్ష్వ సత్కృపావారాశీ! అయో. 301

## రాశి శబ్దము

రశ్మి - రాశి - పరదేశి - పేశి ఇత్యాదిశవర్ణపూర్వకేకారాంతములకు బహువచనము చేర్చినపుడు వాని 'శ' వర్ణము 'స' వర్ణమగునని తెలుఁగులో ఒకరిద్దరు వ్యాఖ్యాతలు వ్రాసిరి. వారి పద్ధతిలో 'రస్ములు - రాసులు - పరదేసులు - పేసులు, ఇత్యాదిగ రూపములు సిద్ధించును. కాని వీనికి కవిప్రయోగసమ్మతిగాని ప్రామాణికవైయాకరణికసిద్ధాంతము గాని ఆధారము లేదు. తెలుఁగునిఘంటువులలో సైతము 'రాసి' ఇత్యాదులు వైకృతములని చూపిరి. శవర్ణము సవర్ణమగుటయే నిజమైన నాఁడు 'గతాశః - ఆశ్రయాశః - జితాశః' ఇత్యాదులకు తెలుఁగుబహువచనరూపములు 'గతాసులు - ఆశ్రయాసులు - జితాసులు, ఇత్యాద్యనిష్ట రూపములు కావలసివచ్చును. కావున 'రాశి - రాశులు; కార్యదర్శి - కార్యదర్శులు; పరదేశి - పరదేశులు' ఇత్యాదిరూపములే శాస్త్రసమ్మతము లనవలెను. రాశికి వికృతిగా 'రాసులు' అగుటలో ఆక్షేపము లేదు. ఈ సంప్రదాయ మెఱుఁగని కల్పవృక్షము అంధపరంపరగా వాడిన రూపము లివిగో! చూడుఁడు:-

1. మహాతేజోరాసులఁ బిల్వఁ బంపవలె — బాల. 46
2. నూపరాసులు గంధమ్ము లీసినట్లు — ,, 57
3. భాగ్యరాసులఁ బొంగడికల్ పట్టుచుండ — ,, 106
4. పరమాద్భుతమదంబు రాసులై — ,, 223
5. గుణరత్నాంభోరాసులు — ,, 327
6. మల్లికారాసుల్ — ,, 328
7. సంతోషజలరాసు లగుచు — అయో. 44
8. కృపావారాసుల్ చనుదెంచు — ,, 274

లోకములో కొందఱకు కొన్ని వస్తువులు ఆప్యాయమగునట్టులు కొందఱు కవులకు కొన్నికొన్ని పదములు ఇంపితముగా నుండును. 'చేనిపంటలు కొయ్యలే చెప్పఁగాదె' అని శ్రీనాథుఁడు చెప్పినట్లు ఆ కవి ప్రేమించి అభిమానించి ప్రయోగించుకొన్న ఆ పదముల అంద చందములనుబట్టియే తత్కవితాసౌభాగ్యముసైతము మనకు స్ఫురించు చుండును. కల్పవృక్షకర్త అత్యంతము ప్రేమించి అల్లారుముద్దుగ పదిం బదిగ వ్యవహరించుకొను పదములు కొన్ని ఉదాహరించి ప్రకృత మీ భాగమును జాలింతును:—

1 తనుకు 2 కోసలు 3 తాన్—తాను 4 నద్ధము 5 చమువు 6 మనిసులు 7 రంహా 8 విధా 9 సమలు 10 అహో 11 శ్రీ 12 నీవుగాని 13 ప్రభు! ప్రభు 14 పైనను (పైని) 15 గల్ల 16 వనీ (వన) 17 కరళ్ళ 18 ఇరమ్మద 19 కొంపతీసి—ఇత్యాదులు.

ఈ 'కల్పమున' బాలాయోధ్యలు రెండింటిలో మాత్రమిం దిఙ్మాత్రముగ తెలిపిన అంశము లివి. రసాపకర్షకములైన కావ్యదోషము లను మాత్రమే రవ్వంతగ ఇందుఁ జూపితిని. కుంటితనము గ్రుడ్డితనము దేహమునకు రోఁత కలిగించి తన్మూలమున ఆ వ్యక్తి కున్న సౌందర్య మును మాటువఱచునట్లు కావ్యశరీరములో సైతము ఈ చూపిన దోషము లన్నియు వికారమును బుట్టించి కావ్యమునకు ఆత్మభూత మైన రసమును బగ్గముపాడు చేయును. శాస్త్రివేత్త యయిన కవీశ్వ రుఁడు పదములో పదాంశములో వాక్యములో అర్థములో రసముతో

ఇట్టి దోషములు పొరయకుండ కనుగలిగి కావ్యమును గాపాడఁకొనును. కావ్యమనఁగా – ఇన్నిపద్యములు, ఇంత గద్యముమాత్రమే గాదు. శబ్దశాస్త్రమును జదివి కవిసమయమును బాటించి రసమును పోషించుచు నిర్మించు కావ్యమే మహాకావ్యము. అట్టి కావ్యమును మన కిచ్చువాఁడే మహాకవి. తాను వ్రాసిన కావ్యములో సారస్య మిదియని ఊరూర – వాడవాడల ప్రచారము చేయవలసిన దుర్గతి మహాకవులకు పట్టదు. నేను వ్రాసినదే నిజమనియు నా పోకడలు గుర్తింపఁగలవారు నావంటివా రెవ్వరో నూటికి కోటికి ఎక్కడనో ఎప్పుడో అవతరింతురని ఎంచుటయు సత్కావ్యకర్తకు లక్షణము గాదు.

'తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యా ద్వపు స్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్.'



# సింహావలోకనము

'శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షముపై విమర్శకవ్యాసము సాధ్యమైనంత త్వరలో పంపఁగోరుచున్నాము' అని 20-5-1961 తేదిని, భారతీసంపాదకులనుండి నాపేర వచ్చిన ఉత్తరమును జూచి వెంటనే నాకు నచ్చిన వ్యాసమును వారికిఁ బంపితిని. అది వారికిని నచ్చినట్లే వారి యుత్తరములవలన నేను గ్రహించి వెంట వెంటనే తరువాతివ్యాసములను బంపితిని.

'మీ వ్యాసం చదివిన సహృదయపాఠకులు కొందఱు దానిలో వాస్తవికమైన విమర్శనం ఉన్నదని ఆనందించారు'. అని 'భారతీ'సంపాదకులు వ్రాసిన మఱొక (12-6-61) ఉత్తరమువలన కొంత ఉత్సాహము కలిగినది.

1961 అక్టోబరు 15-వ తేదిని, చెన్నపురిలో ఆంధ్రమహాసభ వారు ఏర్పాటుచేసిన సభలో శ్రీ విశ్వనాథవారు ఈ రామాయణవిమర్శనముఁగూర్చి కొంత ముచ్చటించిరి. అది యాధారముగాఁ జేసికొని ఈ యంశముపై అనేకవిమర్శనములు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో వెలువడినవి. ఆ ఘట్టములో ఒకానొకవ్యాసములో కల్పవృక్షకర్తలు నన్నుఁగూర్చి ఇట్లు సెలవిచ్చిరి:-

శ్రీ చౌదరిగారూ! శ్రీశ్రీ అన్నట్లుగా నా కవిత్వము పాషాణపాకమనీ, నేనుగూడ అనుకునేవాణ్ణేమోగాని వందలాది సభల్లో నేను చదివితే ఆనందించేవాళ్ళను చూచి నేను అనుకోలేకుండా ఉన్నాను. మీరు వ్రాసినవన్నీ దోషాలనుకొన్నా, ఇదే బాధ వచ్చింది. పలుమంది పండితులు విన్నారు. మాయింటికి వచ్చి విన్నారు. కొందఱి ఇండ్లకు వెళ్లి వినిపించాను. సభలలో శ్రద్ధగా కూర్చుని విన్నారు. వారు తప్పనలేదు. అందుచేత తప్పులు కావని ఒక అభిప్రాయం నా కేర్పడ్డదేమో!'

[ఆంధ్రపత్రిక 1961 అక్టోబరు 29]

పదిమంది వినియు ఆనందించినట్లే కల్పవృక్షకర్తకు స్ఫురింప వచ్చును. ప్రత్యక్షముగా ఆయన అనుభవించెడి అనుభూతి అది కావచ్చుఁగాక! పరోక్షముగా కల్పవృక్షమునుగూర్చి పాఠకుల తీర్పు లెట్టివో ఆయన కర్థము కాలేదు. మనము చదివి వినిపించుచుండఁగా పట్టుమని కూర్చుండి తల లూఁపినంతమాత్రాన మనము వ్రాసినది వారు మెచ్చినట్లు మనము భావింపవచ్చునా! ఆ తల లూఁపుటకు ఎన్నో కారణములు పనిచేయవచ్చును. ఈ రహస్య మెఱిఁగిన మహాకవి కావుననే కాలిదాసంతవాఁడు - 'ఆ పరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్' అని వినయము చూపెను. ఇందఱు పండితులు మెచ్చినట్లు భావించిన ఈ కల్పవృక్షమునుగూర్చి నేను వ్రాసిన వ్యాసము లయిదింటిని జూచి, ఎందఱో అభినందించుచు నాకు లేఖలు వ్రాసినదానినిబట్టి నే నేమి ఊహింపవలెను? కల్పవృక్షమునుగూర్చి తెలుఁగువారి కున్న భావమును ఈ ఘట్టములో కొంతవట్టు ప్రకటించుట నా 'బాధ్యత'గా నెంచి వారిపేరులు పేర్కొనక కొన్ని 'లేఖల'ను మాత్రము ఉదాహరింతును:-

సాంఘికముగా అధికారికముగా♦ ఏవేవో ఇబ్బంది లుండునన్న ధోరణిలో వారువారు వ్రాసిన లేఖలలోని ఈ యంశములను దీసికొనుటలో వారిలో కొందఱి పేరులు ప్రకటింపనైతిని మచ్చునకు కొన్ని మాత్ర మిచ్చెదను:-

మీరచించిన, శ్రీమద్రామాయణ కల్పవృక్షవిమర్శను పఠించితిని, అందలి నిశితపరిశీలనము - తదుచితభావప్రకటనము భావగర్భిత

♦విజయవాడ కాలేజిలో అప్పుడు తెలుఁగు లెక్చరరుగా పనిచేయుచున్న ఒక వ్యక్తి, నాయీవ్యాసములు చదివి, ఎంతో సంతోషములో అందఱికన్న ముందుగ నాపేర ఉత్తరములు నడుపసాగెను. దానికి సంతృప్తి కలిగి నేనును ప్రత్యుత్తరము వ్రాయఁగా L 'అయ్యా! అధికారికముగా మాశాఖలో 'పెద్దు' 'విశ్వనాథులవారి' శిష్యులు. నాయీభావములను వారు వినిరేని నాకు నష్టములు కలుగవచ్చును. కావున దయచేసి మీరు నడపు ఉత్తరాలు కేవలము 'కవరల'లోనే మఱొక 'అడ్రస్'లో పంపవలెనని కోరెను.

భాషావైచిత్రి - చమత్కారసంయుత వాక్యవిన్యాసవైఖరి నన్ను ముగ్ధుని గావించినవి. చిరకాలమునుండి నాకును కవిసమ్రాట్టుల కల్ప వృక్షమును గూర్చి మీ కున్న అభిప్రాయము లున్నవి. మీ యీ ప్రయత్నము విజయవంతమగునని, మీ విమర్శ తెలుఁగునాఁటఁ గల యల్పబుద్ధుల యజ్ఞానావృతసంస్కారమును బ్రద్దలు సేయఁగలదని నా యూహ. [విజయవాడ కాలేజి తెలుగు లెక్చరర్. 10-1-61]

వ్యక్తిగతముగా - అధికారికదృష్టిగా స్వార్థమునే భావించి 'తీర్పులు' తీర్పఁజూచు ఇట్టి 'వ్యక్తులు' భాషకు - సాహిత్యమునకు - జాతికి - దేశమునకు పనికిరారనియే నాభావము. ఈ 'వివాదఘట్టములో ఇట్టి వ్యక్తులు కొందఱు నా యెఱుకకు వచ్చుటచే ఇంతగా ఈ మాట వ్రాయవలసివచ్చినది.

ఈ 'లేఖలు' అక్కఱయని తోఁచిననాఁడు ఇతరులకు చూపు టకై అన్నిటిని భద్రపఱచియున్నాఁడను. వీరే ఈ వ్యాసములనుగూర్చి మిక్కిలిగా అభినందించు ఏఁడెనిమిది ఉత్తరాలు వెంటవెంటనే నాకు వ్రాసిరి. వానిలో మఱికొన్ని:-

'ఎవరు పూర్వపక్షము చేయఁజాలని కావ్యదోషములు మీరు విమర్శలోఁ జూపించితిరి. ఇది మహా సారస్వత సేవయని యస్మదాదుల యభిప్రాయము. ఆలంకారిక ప్రోక్తములయిన కావ్యదోషము లన్నియు వైశ్వనాథములో నున్నవని మీ వ్యాసములు చదివి నేను భావించి నాఁడను.' [26-6-61]

'మీరింతవఱకుఁ జేసిన సాహితీసేవ యొకయెత్తు. ఈ రామా యణకల్పవృక్షవిమర్శ మఱియొకయెత్తు.' [15-9-61]

'మద్రాసులో విశ్వనాథవారి ప్రసంగము దీనోక్తులతో నిండి యహంకారము వెలార్చుచున్నది. మీ సమాధానము సూటిగా నున్నది ఇది యతిప్రశంస యని భావింపకుందురుగాక! యథార్థవిష యము వ్రాయుచున్నాఁడను. మా యానందము తెలియఁజేయు చున్నాఁడను.' ఇత్యాది. [24-10-61]

[2]

'మీరెత్తిచూపిన యనౌచిత్యములు విశ్వనాథవారి యహం కృతిని చాటుచున్నవి. 'కల్పవృక్ష సమీక్ష' ఆనుపూర్వికముగా బాల కాండనుండి ఛందోవ్యాకరణ రసౌచితీపాత్రపోషణాది విషయములను పరిశీలించి క్రమముగా లోకమునకు చూపెదరని ఆశించుచున్నాము. పట్టిన కలము వీడకుడు' భవద్విజయాభిలాషి [5–2–61]

ఈ యుత్తరము వ్రాసినవారు తమ ఊరు–పేరులు వ్రాయకయే ఇట్టివి మఱికొన్ని ఉత్తరములు వ్రాసిరి. కల్పవృక్షకర్తకు జంకి వీరిట్లు పేరు దాఁచుకొని నాకు వ్రాసిరని ఊహించితిని.

[3]

'వైశ్వనాథకల్పవృక్షపు కూకటివ్రేళ్ళు పెళ్లగించు మీ వ్యాసములను అప్యాయనముగా చదువుచున్నాను' [విద్వాన్, సీనియర్ తెలుగుపండిట్ – రేపల్లె తాలూకా – 17–7–61]

[4]

'విశ్వనాథవారి గ్రంథాలు చదివాను. ఒక్కొక్క లక్షణమును స్పృశిస్తూ ఇంత 'సాహిత్యశాస్త్రీయదృక్పథముతో' విమర్శించిన వారు లేరు. వీటి నన్నిటిని కలిపి ఒక గ్రంథమే ప్రకటిస్తే బాగుండేది. ఇది వ్యక్తిగతదృక్పథముతో వ్రాయుమాట కానేకాదు. మీ యిద్దరి తోను నాకు పరిచయము లేదు. సాహిత్యముద్వారా తప్ప. విశ్వనాథపై వ్యక్తిగతముగా నాకేమీ కోపము లేదు. అతడు అబ్బె తెలుగంటే ఇదా! ఇన్నీ అన్నట్టు చేశాడు ఆంధ్రసాహిత్యాన్ని. చెడ్డను మొగ్గ పాటలో తుంచివేయాలి. సమర్థులైన మీరు ఇందులో ముందుకు వచ్చి నందుకు మరిమరీ నమస్కారాలు'

[... బి. ఎ. హైదరాబాద్. 12–9–61]

[5]

'ఈ కల్పవృక్షమును మేము చదివి, ఈ రచనమీద విమర్శ చేసే సహృదయులు లేరా యని వ్యథ చెందినవారిలో మేముకూడ ఉన్నాము. కల్పవృక్షముయొక్క బండారము సహేతుకముగా నిరూ

పెంచినందుకు మీకు మా కృతజ్ఞతను తెలియజేయడము మా విధియని ఈ జాబు మీకు వ్రాయుడమైనది. పరమపవిత్రమైన రామాయణానికి విశ్వనాథ చేసిన, చేస్తున్న ద్రోహాన్ని చాటి చెప్పాలని మా కోరిక. అంతే కాదు. అసలు వారి సాహిత్యధోరణినే (చెలియలికట్ట - వేయి పడగలు) దుయ్యబట్టి పాఠకులకు విశ్వనాథమీద కనువిప్పు కలిగించాలని ప్రార్థన.'

[బరంపూర్–ఒరిస్సా–ఒకఅడ్వొకేటుగారిధర్మపత్ని .17_7 61]

వీరు వ్రాసిన ఉత్తరాలు పెక్కింటిలో - మఱికొన్ని ఇవిగో:-

'ఈనాటికి ధైర్యముగాను నిష్కర్షగాను విశ్వనాథవారి పాండిత్యాన్ని బయటపెట్టి వారి రచనలో గల లోపాలను సహేతుకముగా నిరూపించినందులకు ఆంధ్రులు ఎంతైనా ఋణపడిఉన్నారని మా ఉద్దేశము. ముఖ్యముగా పండితులు ఇంతకాలంగాను విశ్వనాథవారిని గుఱించి ఉపేక్షించినందులకు సిగ్గుపడవలెనేమో అని కూడ అభిప్రాయ పడుచున్నాము. రామాయణములో ప్రతిపాత్రను ఆయన ఎంతగా ఖూనీ చేశారో, చచ్చిన ఆ పాత్రలను వారి శిష్యులు ఇంకా ఎంతగా చంపారో వ్రాయవలెనంటే మీవంటి పండితులు వ్రాయగలరు. ఎంతటి ఉదాత్తమైన పాత్రకూడా విశ్వనాథచేతిలో చచ్చి ఊరుకుంటుంది'

[14–8–1961]

'విశ్వనాథవారి సాహిత్యప్రభావము మీ ధైర్యమువలన విమర్శలవలన చాలమందికి తెలిసినది. లోగడ వ్రాసిన పుస్తకాలు చాలక 'పురాణవైరగ్రంథమాల' అనే పేరట పదహారు పుస్తకాలు మళ్లీవ్రాశారు.'

[14–11–1961]

'కల్పవృక్షము తిరిగి ఎప్పటికీ చిగురుపెట్టకుండా మొదలంటా ఛేదించే గొడ్డలి నొకదానిని సృష్టించే బాధ్యత మీ మీద ఉన్నదని ప్రార్థిస్తూ, అందుకే ఈ జాబు మీకు వ్రాయడమైనదని మనవి చేస్తూ ముగిస్తున్నాను' ఇత్యాది.

[26–3–1962]

[6]

'మీరు కల్పవృక్షముపై వ్రాసిన సోదాహరణ విమర్శవలన పాఠకుల కొక 'నీతి' గమనార్హమౌతుంది. 'అపరిణత సాహితీపరులు గర్వమున మిడిసిపడిన తగు పరాభవము పొందెదరు' అని-

[తెలుఁగు పండితులు...నూజివీడు 26-10-61]

[7]

'మీ రట్టిసభలోనే వాదింప నవకాశము తటస్థింపవలెనేగాని అస్మదాదులము రెక్కలు గట్టుకొని వాలుటకు సిద్ధమగుదుము'

[తెలుఁగు పండితులు... ముసునూరు 27-10-61]

[8]

'మీ విమర్శ చూచితిని. అపూర్వముగా ఉన్నది. ఇంత వఱకు ఎవ్వరు ఇట్టి నిష్పాక్షికమైన విమర్శ కల్పవృక్షముపై చేసియుండ లేదు. కేవలము పొగడ్తలతోనే వ్యాసములు వెలువడుచు వచ్చినవి. ఆధునిక కావ్యముమీఁద ఇటువంటి విమర్శలు ఎంతైనా ఆవశ్యకము. ఇందు మీరు చేసినకృషి అమోఘము. అనన్యసామాన్యము. మీకు నా ధన్యవాదములు.' [చిత్రాడ...29-10-61]

[9]

'విశ్వనాథవారిపై దుమారము గమనించుచునే యున్నాము. పిల్లి మెడలో గంటవలె-విశ్వనాథవారి దురహంకారము నెదుర్కొన ముందుకు రా జంకుచున్న లోకమునకు మీ మూలమున ప్రకృతమవకాశము దొరకినది. విశ్వనాథవారికి లోక మిచ్చు జవాబులే మీ వాదమును బలపఱచుచున్నవి.'

[సీనియర్ తెలుఁగు పండిట్- తెనాలి. 6-11-61]

[10]

'ప్రక్కచూపులఁబఱపక ముక్కునకు సూటిగా (పండిత వర్యులు విమర్శకులు సెబాస్ అనునట్లు) చక్కని రాచబాటను సాగిన మీ యిరువుర (శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి) - ప్రకృత -

కల్పవృక్ష ఖండనకర్త) సమాధానాలు కొండాడఁదగియున్నవి. అనవస రములగు గొడవలు రేపుచు గుమ్మడికాయల దొంగయన్న భుజాలు దడవి చూచుకొనెనను సామెతను సార్థకపఱచు మహాకవివర్యుని (విశ్వ నాథ) వాక్యవిన్యాసము వారి (కీర్తిప్రతిష్ఠలకు) గౌరవపదవులకుఁ దగిన స్థాయిని నడవకుండుట విచార్యము. నిజముగా 'విమర్శ లేక'పోవుట భాషకు ద్రోహమె. మఱి అయ్యది 'సాహిత్యానికే లోపము'. అట్టి కొరతను దొలగించుటకై పరమోదారమతితోఁ దామువ గావించు నిట్టి కడఁక ప్రశంసనీయము.

[ఆంధ్రభాషాజీవి... విద్యావయోవృద్ధులగు పండితులు,
అనంతపూర్ 30–10–61]

వీరే మఱొక యుత్తరములో :—

'సంగతిసందర్భములను బాటింపక అనవసరములగు వ్యాఖ్యా నములు గావించుచు నెదుటివారిపై దుమ్మెత్తిపోయు స్వభావము శ్రీ విశ్వనాథవారికి నుగ్గుపాలతోఁ బొందినదనవచ్చును. [9–11–61]

[11]

'విశ్వనాథవారికి మీరిచ్చిన రెండు సమాధానములు గౌరవ ప్రదముగా సముచితముగా ఉన్నాయి. ఈ వాదోపవాదములలో మీ ధోరణిని పూర్తిగ ఆమోదించి అభినందించు వారలలో నేను ఒకడను. విశ్వనాథవారి తలబిరుసు ప్రవర్తనము—పరుషభాషణములను తుచ్ఛ మయిన కులప్రస్తావనలను హేయధోరణిని జూచి బాధపడినాను. కడుపు మండినది. మీ సాహసము అద్భుతము. ఇందుకు మా మిత్రు లందరు మిమ్ములను ప్రశంసిస్తున్నారు. మీకు నైతికబలము చేకూర్చడము కనీసధర్మముగా భావిస్తున్నాము.

ఈ యుద్ధములో వెనుకాడకండి. మరింత ఉత్సాహముతో విశ్వ నాథను ఢీకొనండి. విశ్వనాథ తప్పని నిరూపించి జయపతాక ఎత్తండి. మీకు జయ మగుగాక!'

[కొత్తఢిల్లీ... ఒకానొక ఉద్యోగి M. S. C. 15–11–61]

[12]

'రామాయణకల్పవృక్షాన్ని మీరు విమర్శనారంభంతో క్రొత్త పెట్టి నుళ్లూ తిరుగుళ్లూ వంకరటింకర్లూ వెల్లడించడం శ్రేష్ఠమైన పని. శ్రీనాథునికి సీసపద్యం చేతకాదనీ, కాళిదాసుకు వ్యాకరణం రాదనీ, వాల్మీకికి వర్ణనలు కుదరవనీ వాగిన అహంకారులు—వారి అనుచరులు మీ విమర్శనకు ఈర్ష్యాద్వేషాలు కులదురభిమానాలు అంటగట్టడం బుద్ధితక్కువతనంగాక మరేమీ కాదు. శాస్త్రవిరుద్ధప్రయోగాలకు పూర్వకవిప్రయోగాలు చూపుతా మంటున్న వీరు శ్రీనాథకాళిదాసాదులకు అట్టి ప్రయోగాలు ఆధారం లేవని వారిని విమర్శించారా! ఏది ఏమైనా విశ్వనాథ సత్యనారాయణ జీవించి ఉండగానే మీ కలంపోటు తినడం ఆయన అహంకార ఫలితం. వెంటనే మీ విమర్శనను గ్రంథ రూపం చేయగోర్తాను'. [...C/o విశాలాంధ్ర-విజయవాడ 19-11-61]

[13]

'విశ్వనాథవారి రామాయణకల్పవృక్షములోని పాత్రల అనౌచిత్యమును వ్యాకరణదోషములను చక్కగా మీరు తెలిపినందులకు అనేకవందనములు. రామాయణకల్పవృక్ష ఖండనము తుదిదాకా సాగించగలరని అందుకు తగిన పాండిత్యము ధీశక్తియు మీవద్ద గలవని నా విశ్వాసము. తుదకు మీ వాదమే నెగ్గగలదు.

[బాపట్ల...20-11-61]

[14]

'కవిసమ్రాట్టు.మీయొక్క విమర్శలు చదివి చాలా ఆనందించినాము. మీ విమర్శన చాలా తేలికగా ఉన్నదేమో! ఇంకా ఘాటుగా ఉంటే బాగుండునని మా వూహ. మీరు పెద్దలు పండితులు కవులుగాన ఎటుపోయి ఎటువచ్చునో అన్న జిజ్ఞాస ఉండవచ్చు. 'నమ్రంతి ఫలితా వృక్షాః నమ్రంతి చ బుధా జనాః' అన్నది మీయందు సార్థకము. ఆయన, నేనేమో మొనగాడను, నావలె ఎవ్వరు కవిత్వం చెప్పలేరు. కాళిదాసవ్యాసుల కావ్యాలలోగూడ చాల తప్పు లున్నవి అని అనుట క్షమింపరాని తప్పిదము. ఇదివరలో 52, 53 సంవత్సర

ములలో కర్నూలులో ఒక పండితసభలో శ్రీనాథుని-శేషశాస్త్రిని,
శ్రీపాదవారిని ఈతడు విమర్శించినాడు. కవిసార్వభౌముడైన శ్రీనాథు
నికి కవిత్వమే తెలియదట. సీసపద్యముకూడ వ్రాయలేడు. వ్రాసినను
తేటగీతదగ్గరకు వచ్చునప్పటికి గొంతు పట్టుకుంటుందట. విమర్శకుని
వలననే కవిప్రతిష్ఠ ఇనుమడించును. తప్పు చూపిన వానిని గౌరవింప
వలెగాని కించపరుపతగునా! కాల్చి చంపుటకు తనమీదపగ ఉన్నదా!
తాను రోషపూరితుడగుటకు తన కవితలో దోషము లున్నవనే నిదర్శ
నము కాదా! ఈతనిది నైసర్గికకవిత్వము కాదు. ఈయనను శ్రీమం
తులు, మంత్రులు భాషాజ్ఞానశూన్యులు మెచ్చుకొనవలసినదేగాని ఏ
మాత్రం శబ్దజ్ఞాన మున్నా మెచ్చుకొనరు. సూత్రాలు భాష్యాలు
వ్యాకరణాలు ఎట్లు ఉన్నప్పటికీ చెవుల కింపు మనస్సున కానందము
లేకపోతే ఆ కవిత్వం తగలబెట్టనా! అహంతో పుట్టిన ఈ కవిని కవి
త్వాన్ని బాగా విమర్శించి సాహితీపరులకు విద్యార్థులకు ఆనందము
కలిగింపవలసినదిగా మిమ్ము ప్రార్థించుచున్నాను.

[డాక్టరు... 'కళావిశారద'... నెల్లూరు జిల్లా 16-11-61]

[15]

'ఇంతటి దుమారం లేస్తుందని నే నెన్నడూ ఊహించలేదు.
ఇలాంటి విమర్శలు జరుగుచుండుట మంచిదే. విశ్వనాథయొక్క
వ్యక్తిత్వం ఎలాంటిదో మాకు పూర్తిగ బోధపడింది. మీరు చూపిన
తప్పులు పూర్వకవులే చేసిరనేమాట సరిగాదు. ప్రచురణకర్తలలోను
పరిష్కర్తలలోను కొన్ని లోపాలు ఉండవచ్చును. వాళ్ళు తప్పులు చేసి
నారని మనము ఒప్పుకొంటున్నాముగదా! ఆ తప్పులు మనము కూడ
చేయుటయేనా! కనుక ఆ వాదన సరిగాదు. ఈ విమర్శనలను వేస్తు
న్నారనే అక్కసుమీద భారతిలాంటి పత్రికను విశ్వనాథవారు విమ
ర్శించారు. ఈ విషయములోనే వారి మనస్సు ఎంత సంకుచితమో
బోధపడుతుంది. ఈయన చెప్పే ఉపన్యాసములుగూడ అహంభావముతో
కూడుకొన్నట్టివే. నేను సరిగా చదవలేకపోయాను కల్పవృక్షాన్ని.
కొన్ని ఊకపద్యాలు కొన్ని శృంగారరసపద్యాలు కొన్ని పాషాణ

పాకములో నడచిన పద్యాలు ఉన్నాయి: మీరు దీని గొప్పతనాన్ని గూర్చి బయటపెట్టినందుకు మీకు వందనములు. ఇలాంటి విమర్శలు జరుగుతుంటేగాని ఒక్కొక్కరి మనస్తత్వాలు బయల్పడవు. తన గర్వమే పతనానికి దారి తీస్తుంది: M. A. చదివినట్లుగాని లేక ఒక కవి సమ్రాట్టుగా గాని ఆ ఉపన్యాసాలు కనిపించడం లేదు. 'నా రచన రెండువందల యేండ్లుండును. నాలాంటివాడు పుట్టలేదు. పుట్టడు'— ఈ మాటలు వింటుంటే వయస్సులో నాకు 26 సంవత్సరాలైనప్పటికీ సాహిత్యంలో పైచేయి కాకపోయినప్పటికీ నాలో నేనే Feel అయ్యాను'. [చల్లపల్లి-కృష్ణాజిల్లా 11–12–61]

[16]

'వి.స. రామాయణవిమర్శనము భారతిపత్రికలలో చదివి చాల సంతసించితిమి. గ్రంథకర్త, వారి అనుయాయులు ఇది కల్పతరువని భ్రమించి యహంకరించుచుండగా, ఇది కల్పతరువు గాదు, కంటకగుల్మ మని నిరూపించి వారి భ్రాంతిని బోగొట్టి యహంకారమునకు తగిన చికిత్స చేసితిరి. అహంకారము సర్వానర్థములకు మూలముగదా! ఆట గాడు బుట్టబొమ్మలో దూరి యాడించినట్లు, అహంకారపిశాచము వి. స. గారి నావేశించి యాడించినది. బుట్టబొమ్మ యాటను జూచి పిల్ల లానందించునట్లు, గ్రంథకర్త యహంకారచేష్టలను జూచి వారి యనుయాయు లానందించుచున్నారు. వారి యనుయాయులకు యథా ర్థమును దెల్పి వారి భ్రాంతిని బోగొట్టినందులకు వారు మీకు సర్వదా కృతజ్ఞులై యుండవలసియుండగా ద్వేషించుచుండుట యవివేక మగును. ఎవరు ద్వేషించినను భూషించినను సత్యమును జాటుటయే గదా మహా త్ముల యాశయము'... [స్వామిజీ... ఏలూరు 1–1–1962]

[17]

'రామాయణకల్పవృక్షముపై మీరు వ్రాసిన సమీక్షలు చదివినాడను. మీ అభిప్రాయములతో సర్వథా నేను ఏకీభవింతును. నిష్పాక్షికములును ఉదాత్తభావభరితములును, శాస్త్రీయములును, అగు మీ విమర్శలు బహుజనశ్లాఘ్యము లనుట కెట్టి సందియములును

లేవు. ఇందు మీరు చూపిన విమృశ్యకారిత్వము ప్రశంసనీయము. మీకు నా ధన్యవాదములు'.

[డాక్టరు. (పి. హెచ్ డి.) రీడరు—ఆంధ్రవిశ్వవిద్యాలయము 23-1-63]

[18]

'మీ రామాయణ విమర్శక వ్యాసములు' చదువుచున్నాము. చాల బాగున్నవి. జంకు గొంకు లేకుండ చక్కని విమర్శ చేసినందులకు మా ధన్యవాదములు. ఎన్ని రకములైన ప్రతివిమర్శనములు గానీ అవాంతరములుగాని వచ్చినప్పటికి వెనుకంజ వేయక మీ విమర్శను తుదివఱకు సాగింపగలరని ఆశించెదము'.

[ఒక పౌరుడు—తెనాలి. 21-1-61]

[19]

'సత్యనారాయణగారి రచనలపై ఎన్ని విమర్శనలు చేసినా చేయ వచ్చును. మీరువ్రాసేవి యధార్థాలని పండితులు ఒప్పుకొంటున్నారు':

[ప్రసిద్ధ పత్రికాసంపాదకులు - మచిలీపట్టణము 23-1-61]

[20]

'తాము ప్రకటించిన 'కల్పవృక్షవిమర్శనము' (తెలుఁగువిద్యార్థిలో) చదివితిని. నాకుఁ గలిగిన అన్ని భావములను మీరు ప్రకటించితిరి. మీ విమర్శనము ప్రత్యక్షరసత్యము. 'విశ్వనాధ' పేరుప్రతిష్ఠలను బట్టి అత్యుత్తమధోరణిలో కల్పవృక్షరచన సాగియే యుండునని గంపెడాసతో సుమారు ఏడు సంవత్సరములక్రిందట బాలాయోధ్య కాండలు పఠించితిని. ఉత్త కంకఅపాకము దోషముతో నిండినట్లు తోఁచుటవలన అప్పటికి నా బుద్ధికి తోఁచిన దోషములను కొన్ని వ్రాసి పెట్టితిని. విశ్వనాధవారికి చెక్కభజన చేయువారు చాలమంది కలరు. లోపములను తెలిసికొనియు మన కేల యని ఉదాసీనముగా ఉండువారును చాలమంది కలరు. విశ్వనాధవారు బోదకాలు బలుపు వలె పెద్ద నవలలు తక్కువరకపు భాషలో రచించిరి. ఆ నవలలో చాల అనౌచిత్యాలు ఉన్నవి. అనవసరమైన 'హాస్య'తో పెరిగినవి. వారి

'భజనదారులు' తెగబడి పత్రికలలో కల్పవృక్షరసమును పొగడు చున్నారు. నిజమున కా పొగడ్తలు స్వవిరచితములై పరనామములతో ప్రకటితములగుచున్నవని వదంతి. మొదటి రెండుకాండలలోను గణ యతిప్రాస భంగములు శతాధికముగ నున్నవి. వ్యాకరణవిషయమున దోషము లనంతములు'.

ఇట్టివి మఱికొన్ని అంశములతో ఈ 'అజ్ఞాతవ్యక్తి' అరటావు సైజులో ఇరువదిపేజీలదాక వ్రాసి, ప్రస్తుతము నన్నుగూర్చి తెలిసికొన ప్రయత్నింపకుండనియు, సమయానుకూలముగ నేనే తెలియఁజేసికొందు ననియు ఈ లేఖ ప్రకటింపవలదనియు కోరెను. ఇది నాకు చేరి పది సంవత్సరములు కడచినను వీరి ఊరిపేరులు ఇంతవఱకు తెలియలేదు. కవరుమీఁది ముద్రనుబట్టి 'విజయనగరము' అని తెలిసినది–ఇట్టి 'అజ్ఞాత వ్యక్తులు' ఎందఱో ఈ రామాయణకల్పవృక్షమును గూర్చియు విశ్వ నాథవారి తత్త్వమునుగూర్చియు ఎన్నో లేఖలు వ్రాసి పంపిరి. అన్నింటిని గ్రంథవిస్తరభీతిచే ప్రకటింపనైతిని. ఇంతకు దీని సారాంశమేమనగా – తెలుఁగుదేశములోనే కాక, కలకత్తా–ఢిల్లీ–పూనా– బొంబాయివంటి ప్రదేశముల నుండియు ఈ కల్పవృక్షమునుగూర్చి నాపేరట వ్రాసిన లేఖలనుబట్టి, విశ్వనాథవారు తనకావ్యమును గూర్చి అనుకొన్నది సత్యము కాదనియు, దాని మంచిచెడ్డలను గూర్చి ఇతరు లెందఱో భావించుచున్నవానినిగూడ గ్రంథకర్త సంతోషముగ స్వీకరించుట భావ్యమనియు నా భావము.

## కొందఱి సూక్తులు

[1]

'పాషాణపాకప్రభూ!' [విశ్వనాథవారిని గూర్చి] 'జలసూత్రం' "విశ్వనాథవారు వజ్రాలని మనముందు పోసిన రాళ్ళగుట్టల్లో రకరకాల దోషాలు చాలా ఉన్నాయి.

[2]

వారు చేసిన–చేస్తున్న–చేయబోతున్న అవకతవక లన్నింటికీ హారతి పట్టనక్కరలేదు. ['శ్రీశ్రీ' భారతి 1962 జనవరి]

[3]

కల్పవృక్షంలో నూటికి తొంబదిపాళ్ళు పద్యాలు అనవసరమైన ద్రుతాలతో మాత్రమేకాదు; అన్వయక్లిష్టతతో కూడి ఉన్నాయి. దీనికి వారి గ్రంథమంతా సాక్ష్యమిస్తుంది.' 'శాంతిశ్రీ'

వీరే మఱొకచోట భారతి 1962 జనవరి

'ఈ యాంధ్రభాషాప్రపంచమందు జరిగే విమర్శలలో వ్యక్తిద్వేషము (బౌద్ధ) మతద్వేషము ఈర్ష్య—ఆవేదన మొదలగు గుణముల నన్నిటిని దూర్చుట ప్రారంభించినది నాకు తెలిసినంత వఱకు విశ్వనాథ వారే. [శాంతిశ్రీ]

[4]

'భావనాశూన్య – పదాడంబర – ధారాశుద్ధివిహీన-కర్ణకఠోర–నీరసా – నవసరసముచ్చయ – పునరుక్తి – పాదపూరణ – వ్యర్థపదా–ప్రయోగా—నౌచిత్య—క్లిష్టాన్వయ—దుష్టాన్వయభూయిష్ఠ కుహనారచన విశ్వనాథవారి రచన.' [శ్రీ ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులు, మహబూబ్ కాలేజి-సికిందరాబాద్ 6–11–61.]

[5]

(క) గణాలు_యతులూ_ప్రాసలూ తెచ్చే నిర్బంధాలు, సంప్రదాయాలు మోసుకొచ్చి మనముందు పడవేసిన ఉత్ప్రేక్షలు - సమాసాలూ - దూరాన్వయాలు-పాదపూరణావసరాలు_భాషాఅన్వయవ్యతిక్రమాలు ప్రవేశించి కవిని చెప్ప గలిగినట్లుగా చెప్పవలసివచ్చినట్లుగా చెప్పనివ్వవు. 'విశ్వనాథ'వారి అసంఖ్యాకపద్యాలలో ఈ చికాకు లన్నీ కానవస్తాయి.

(చ) విశ్వనాథవారు ఉపయోగించే విభక్తులు ఒకదానికి బదులు ఇంకొకటి తయారవుతూ ఉంటయి. ఊహాలు చప్పగా తేలిపోతాయి. పరమంగా ఎబ్బెట్టుగా ఉంటుంటాయి. కవిగారి వ్యాఖ్యానాన్ని పలుకుతాయి పాత్రలు.

(ట) విశ్వనాథవారు, తాము అన్నది ఎటు లాగుతుందో రెండోసారి చూమకోరను కుంటాను.

(త) వీరి సీసపద్యాలపాదాలు మూడు నడచేసరికి నాలుగోది ఇంకోదారి తీస్తుందా అనిపిస్తుంది.

(ప) వాల్మీకాద్యాదులు విష్ణుశస్త్రాహతులకు సారూప్యత చెప్పలేదు. విశ్వనాథవారు (వారి సామ్మోంపోయింది?) ఇచ్చేశారు. ఇది వారి నందరినీ దాటుకపోయిన మెఱుగని స్తోత్రపాఠకులు అనవచ్చును.

(గ) విశ్వనాథవారికి తర్పణకర్మలంటే ఎక్కువ ప్రీతి.

(జ) తమ అభిమానాలను—అలవాట్లను—తమచేతిలో బడిన పాత్రలకు ఆరోపించడం విశ్వనాథవారి గుణం. అది శ్లాఘనీయమైనది కాదేమో!

(డ) వీరికి శక్తి కావలసినంత; శ్రద్ధమాత్ర మంతంత. అందుకే వీరిరచనలలో శిఖరాల ప్రక్కన లోయ లుంటాయి చదువరికి ప్రయాస; పరీక్ష!

(ద) వీరి రచనలలో దూరపుమాటలూ, వాక్యాలమడతలూ, విమార్గగమనాలు హెచ్చు.

[డా: శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. 'భారతి'—1963 ఏప్రియల్]

[6]

విశ్వనాథవారినిగూర్చి శ్రీ గడియారము వెంకటశేషశాస్త్రి గారి అభిప్రాయ మిదిగో!!

'పద్యమో గద్యమో గేయమో ఖండమో దేని కది దాని ధోరణిలో విచ్చలవిడిగాఁ బోవును. ఆయన రచనలలో పక్వాశయ వ్యక్తీకరణము ప్రస్ఫుటము కాదు. వారి పద్యములకు వారే వ్యాఖ్యానము వ్రాయవలసియుండును. అంతటివారే ఆ పద్యములను చదువవలసియుండును. వారి రచనలలో మహాకావ్యమన్నది రామాయణకల్పవృక్షము. అది పండితుల గ్రంథము. ప్రజ లందఱు భక్తులై పండితులైనప్పుడు అది యాదర్శగ్రంథము కాఁగలదు.'

[శివభారతోదయము 108 పుట
ప్రకాశకుఁడు : సి. సుందరరామయ్య]

ఇఁక విశ్వనాథవారి ప్రకృతి—వాగ్వైఖరి నిరంకుశత్వము ఇతర భాషాద్వేషము పరమతద్వేషము ఇత్యాదులను గూర్చి ఇతరు లెట్లు భావింతురో మఱొక ఘట్టము ఉదహరింతును:—

[A]

'1965 మే నెలలో తిరుపతిసాహిత్య సభలు జరిగినవి. ఆ సభలకు విశ్వనాథవారు ప్రారంభోత్సవం చేశారు. వ్యక్తిగా సత్య

నారాయణగారిని గౌరవించినంతగా వారి సిద్ధాంతాలను గౌరవించడం మోమాటమూ దురభిమానము వదలితే అందరికీ సాధ్యమయ్యే పని కాదు. పిలిచినవారిని తిట్టూనే అన్ని సమ్మానాలు చేయించుకోవడం వారి రివాజు. ఇవి ఆయన నేర్చిన అనంతముఖశిల్పంలో భాగాలు. ఏవేవో ప్రశ్నలు వేసి ఆంగ్లభాషమీద దండయాత్ర చేశారు. పరమేశ్వరానుగ్రహం ఉంటేనే భాషాగతసౌందర్యం ఆరంభమౌతుందన్నారు. అయితే ఆంగ్లభాషలోని గొప్పతనాన్ని తెలిసికొనే విషయంలో ఆయనకు పరమేశ్వరానుగ్రహం లేదనే అనుకోవాలి.

తనకు జ్వరం వచ్చినప్పటికీ తిరుపతి వచ్చారట. ఉపన్యాసం ఇవ్వడం మొదలుపెట్టినతర్వాత జ్వరం తగ్గిపోయినదట. ఆయనను జ్వరం వదలిపెట్టి వినేవారికి పట్టుకుందని ఒకాయన వ్యాఖ్యానించాడు. ఆంగ్లభాషవలన తెలుగుదనం నాశనమైపోయినదట. ఆంధ్రభాష, జ్వరాన్ని రక్తదోషాల్ని నివారించుతుందట! మనసులో దుష్టభావాలు ఉన్నచో భాషకూడ దుష్టంగా ఉంటుందట. ఈ సిద్ధాంతం వారి కన్వయించితే ఏమవుతుంది? షేక్స్పియర్ 600 గంగిరెద్దులవాడి గుడ్డలతో సమానమట. కాళిదాసు నాలుగు పట్టుదారాలవంటివాడట. పాశ్చాత్యులకు శుభ్రము లేదట. భోజనప్రియత్వంతో వంటయింటిని, దాని చుట్టుపట్టులను కసవుదొడ్డులుగా చేసే మన సంప్రదాయాన్ని వారు మఱచినట్లుంది.

విశ్వనాథవారి ఉపన్యాసంనుండి జ్ఞానాన్ని పొందాలనడం ఉన్మాదమే అవుతుంది ఆయన ఉపన్యాసంలో, ఆయన సృష్టించిన సాహిత్యంలో మాదిరిగా సత్యమూ—హేతువూ లేవు.

విశ్వనాథవారు సభ్యభాషను సభలో ఉపయోగించారా! బైబిలు వాక్యాన్ని ఉదాహరిస్తూ 'ఏసుక్రీస్తుగాడు' అంటే అర్థమేమిటి? శంకరభగవత్పాదులను 'తిక్క-శంకరయ్య' అంటే విశ్వనాథవారు ఊరుకొంటారా! 'వాక్కు' 'అమ్మవారి' లాంటిదని వారన్నారు. నిజంగా వారిని అమ్మవారు పూనిందని ఒకాయన అన్నాడు.

తెలుగుదనానికి వారు ఉదాహరించిన మాటలు రెండు :- 'వేళాపాళా లేకుండా భూపాలరాగం', ముడ్డిలో తోక పెట్టితే బొడ్డు దాకా పోవడం.'

తెలుగుదనాన్ని ఇంగ్లీషు నాశనం చేసిందా! మఱి సంస్కృతం చేసినదేమిటి? షేక్స్పియర్ను తిట్టితే తెలుగుదనం వస్తుందా? విశ్వనాథవారు షేక్స్పియర్ అంతస్తుకు వెళ్ళగలరా? భాషాశాస్త్రజ్ఞులను తన సహాధ్యాయులను విశ్వవిద్యాలయోద్యోగుల్ని ఆసరాగా చేసికొని తిట్టడంలో ఏమంత సొగసు ఉంది? ఆత్మవిమర్శ లేని అశక్తమయిన పతనమయిన జాతి, ఇతర జాతులను-ఇతర సంస్కృతులను దూషించి ఆత్మతృప్తి పొందుతుంది. తెలుగుభాష జ్వరాన్ని రక్తదోషాలను పోగొట్టుతుందేమో తెలియదుగాని ఆంగ్లభాషమాత్రం బుద్ధిజాడ్యాన్ని నివారిస్తుంది. పోయిన రెండువందల యేండ్ల భారతదేశచరిత్రయే దీనికి తార్కాణం.

సాయంకాలసభలో విశ్వనాథవారు మఱల ఆంగ్లభాషను – షేక్స్పియర్ను తిట్టారు. కొంతసేపు వేదాంతం చెప్పారు. ప్రాచీనాంధ్రకవుల తేజస్సు విశ్వనాథలో మూర్తీభవించిందిగదా! కనీసం పద్యరచనాసౌందర్యమునకు సంబంధించినంతవఱకు ప్రాచీనకవుల తేజస్సు విశ్వనాథవారి పద్యాల్లో ఎంత ఉందో ఎవరయిన వివరించినట్లయితే నిజం తెలిసేది. పద్యరచనాకళ బాగుగా తెలిసినవారు నవీనకవుల్లో ఏ అయిదారుగురో ఉన్నారు. వారిలో విశ్వనాథవారు లేరు. గణములు-యతులూ ప్రాసలూ మాత్రమే ఉన్న పద్యాలు విశ్వనాథవారివి.

[భారతి–1965 జూలై–ఒక పరిశీలకుడు.]

[B]

ఈ తిరుపతి సభలకు చెందినదే మఱొకరి అభిప్రాయము

## 'విశ్వనాథవారి ఏసుక్రీస్తుగాడు'

తిరుపతిసాహిత్య సభలలో నేనుగూడా పాల్గొన్నాను. విశ్వనాథవారి ప్రసంగాలు విన్నాను. ఆయన ప్రసంగ వశాత్తు 'ఏసుక్రీస్తుగాడు' న్న వాక్యంగూడా విన్నాను. గారు అనేది పొరపాటున నాకు వినబడి

ఉంటుందిలే, అంత పెద్దవాడు డెబ్బయియేండ్లు దాటినవాడు-అలా అని ఉంటాడా నా చెవుల దోషమే - అనుకొని ఆరాటపడే హృదయాన్ని సమాధాన పఱచుకొన్నాను.

భారతిలో 'ఒక పరిశీలకుడు' వ్రాసిన సమీక్షలోను 'ఏసుక్రీస్తు గాడు' అనీ విశ్వనాథ అన్నట్లు చదివినపిదప నిజంగానే బాధపడ్డాను. నేను ఆ మతంవాణ్ణి కావడవల్ల మఱింతగా.

ఉపనిషత్సంస్కృతి - ఋషులతేజస్సు - ఆర్యమహామహుల గుణగణ విశేషాలు మూర్తీభవించినట్లు శ్రీ జమదగ్నిశర్మ మొదలయిన వారు తెగ పొగిడిన విశ్వనాథవారి నోటినుండి ఇలాంటి అవాచ్యాలురా వచ్చునా? మా పూర్వులు గొడారివారట. మేముకూడహిందువుల దేవత లను మహాపురుషులను నీచంగా వ్యవరించమే. సర్వమతసామరస్యం ప్రబోధించి జ్ఞాన తేజోలోకాలు సందర్శింపజేసే ఉపనిషత్తుల సంస్కృతిని జీర్ణింపజేసికొన్నామనుకొనే విశ్వనాథవారి మాటలనుబట్టి చూస్తే వారికి ఆ సంస్కారం చర్మదఘ్నమో-రోమకూపదఘ్నమో అనే అనుమానం నాకు కలిగింది. ఆ సంస్కారం ఒంటబట్టినవారి మాటలు అలా ఉంటాయా? కబీరు అన్నట్లు, ఏసునాథుడే అన్నట్లు అపూర్వపరిమళం ప్రసరింపజేయవూ ?

ఏసుక్రీస్తుని తూలనాడదగిన తాహతు విశ్వనాథవారికి దేనిలో ఉందో ? ఆయన జీర్ణించుకొన్న తనవిధంగానే శిష్యసంతతిని తయారు చేస్తున్న విశ్వనాథవారి సంస్కారానికే ప్రాబల్యం ఉంటే, బ్రాహ్మ ణులు అనుకొనేవారు తప్ప తక్కిన సప్తదశకులాలవారు మాడిపోయే వారే.

ఇంతకూ విశ్వనాథవారి ఆధిక్యం మతదృష్ట్యా ఏమిటి ? ఆభి జాత్యదృష్ట్యా ఏమిటి ? ఆయన గోత్రప్రవరలనే పరిశీలించుకోమనండి ఎంత సాంకర్యముందో! ఎందఱు అనార్యులు ఆర్యులతో చేరారో? సందేహం కలిగితే చరిత్రకారులను అడుగమనండి. వారి 'కల్పవృక్ష' నాయకుని పురోహితుడు అనార్యఋషిదా కా! అయితే విశ్వనాథవారు

ఆర్యులు - బ్రాహ్మణులు గాదా ! వారు వ్యవహరించే భాష ఏమిటి? ఆర్యభాష ఎలాపోయింది ? ద్రావిడ భాష ఎలా అలవడింది? ఈ సాంకర్యం ఏమిటి? తక్కిన ఉత్తరాదివారు — అసలు ఆర్యులు తమభాషలు మఱువలేదే. ఋషుల గోత్రప్రవరచరిత్ర తిరగవేయమనండి. బుద్ధుని వంటివాడు ఋషులను తిట్టలేదే. అప్పటి చర్యలను మాత్రమే ఖండించాడే.

ఏవో నవలలు కావ్యాలు వ్రాసి మందిమార్బలం పోగుచేసి కొనిఋషికల్పులమని విఱ్ఱవీగుతూ మతప్రవక్తలను మహానుభావులను నిందించడం శ్రేయస్కరం కాదు. ఈ విషయం విశ్వనాథవారు వారి శిష్యబృందం గ్రహించడం నిశ్శ్రేయసం.

టి. ఏసోబు - రేణిగుంట. భారతి - 1965 ఆగస్టు

[C]

ఇంకొక్క ముక్క

తిరుపతి సాహిత్యసభలనుగూర్చి 'జులైనెల భారతి'లో వెలువడిన 'ఒక పరిశీలకుని' సమీక్ష శ్రద్ధతో చదివి ఆనందభరితుడనైనానని వ్రాయుటలో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు. నావలెనే మఱెందఱో చదువరు లుంటారని నా నమ్మకం. ఇత్యాది;-

ధూళిపూడి ఆంజనేయులు - మద్రాసు 1965 ఆగస్టు.

ఈ సూక్తులే గాక ఈ భావములే గాక ఇట్టి యభిప్రాయములనేకములు నాకుఁ జేరినవి, చేరుచున్నవి; ఈ యంశమునుగూర్చి నా వ్రాసిన విమర్శనమునకు అభినందనము లనేకములు నిత్యము నా పేర వచ్చు యోగక్షేమాల ఉత్తరాలలోసైతము కన్పించుచున్నవి నా వాదమునకు సంవాదముగా బలవర్ధకముగా ఇట్టివి ఉపకరించుచునన్న ధోరణిలో వీని నిక్కడ ఉదాహరింపలేదు. తెలుఁగువారిలో విశ్వనాథ వారి రచనలనుగూర్చి విశేషించి 'కల్పవృక్షమును' గూర్చి అభిప్రాయము లెట్లున్నవో గుర్తించుటకే స్థాలీపులాకముగా వీని నిచ్చట ఇచ్చితిని.

'కల్పవృక్షములో' ఇట్టిలోపములు దోషము లనేకము లున్నవని తెలుఁగుదేశములో తెలిసిన పండితులు పెక్కురు కలరు. వారిలో, ఇట్టి ఘట్టములందుఁ జూచియుఁ జూడనట్టు పోవువారు ముప్పాతిక మువ్వీస ముందురు. రచనలలో వెల్లడింపఁగలవారు సాంఘికముగా – ఆధికారికముగా ఏవైన 'అవాంతరములు' రావచ్చునన్న జంకుతో ఉపేక్షించు టయు కద్దు.

కేవల సంస్కృత పండితులు – ఈ తెలుఁగు రామాయణమును క్రీఁగంటనైనఁ జూడరు. కాఁగా – ఈ రామాయణకర్త శిష్యప్రశిష్యులు మాత్రము ఏవేవో విశేషములు ఈ 'కల్పము'లో ఉన్నవంచు పాడినదే పాటగా చర్వితచర్వణముగా నిత్యము మడిగట్టుకొని పారాయణము చేసికొంచు ఒకవర్గముగా సిద్ధమై 'ఐదారువందలమందిమి ఉన్నాము సుమండీ' అని సూచనగా బెదరించుచు కేకలు వేయుచుందురు. ఎన్ని వందలమంది 'ఘూళులు – దుమ్ములు, అగ్గులు – బొగ్గులు యాములు – జాములు, వావులు – వరుసలు పిల్లక్రోఁతిగంతులు వేసినను బిభీషికలు జరిపినను 'ఆఱు – మూఁడు తొమ్మిదేకాని' మఱొకటి కాదుగదా! అమావాస్యను పూర్ణిమ అనలేరుగదా!

ఆ కేకలలో – ఆ బిభీషికలలో – ఆ గూడుపుఠాణిలో అంతర్గతమైన పిండితార్థమును ఒక విధముగా ఇట్లని సిద్ధాంతీకరింపవచ్చును:–

'విశ్వనాథవారు, నన్నయ తిక్కనలతో సమానులే కాదు, వారికంటెను పైరే ఘనులు. ఎఱ్ఱాప్రెగ్గడ, అసలు లెక్కకే రాఁడు. ఈ శిష్యకోటి కావించు ప్రచారము ముమ్మాటికిని సత్యమే యని గురువులవారికి గట్టి విశ్వాసముకూడ కద్దు. అది కాదన్నవారు ద్రోహులే కాదు, కులతత్త్వవాదులును.' విశ్వనాథవర్గము అసలు 'కులతత్త్వవాదమును' బొత్తిగా ఎఱుఁగనట్లు.

ఇది సిద్ధాంతము చేయుటకే ఈ కల్పవృక్షకర్త, 'అవతారికను' సృష్టించెను. కవిత్రయమువారు తెలుఁగులో భారతమును దెచ్చిరేగాని రామాయణము జోలికిఁ బోలేదు. తిక్కనవారి రామాయణము

లేవియు 'ఆంధ్రభారతస్థాయికి' రాలేదు. ఇన్నేండ్లకుఁగాను ఇంత తపస్సు చేసి ఈ కవిసమ్రాట్టు ఒక్క చేతిమీఁదుగా ఈ కల్పవృక్షమును భూలోకమునకు దించి కవిత్రయమువారి సహపంక్తికి రాఁగలిగిరి. ఒక విధముగా కవిత్రయమేగాదు, ఆదికవి వాల్మీకియు కల్పవృక్షకర్తకు సాటిరాఁడు. కొన్ని వందల యేండ్లకుఁగాని ఇట్టి యవతారపురుషులు కవీశ్వరులలో పుట్టరు. ఇది మీరందఱు త్రికరణశుద్ధిగా నమ్మి 'భజనలు' చేయవలెను' అని.

ఈ 'భజనలలో' నిజ మున్నదని 'జీవుఁడు' చెప్పుటవలననో యేమొ ఆ గురువర్యులుకూడ పదే పదే 'నా రచనలన్నీ విజ్ఞానదాయకాలు. సామాన్యప్రజలకు అర్థమయ్యేలాగున వ్రాశాను. ఎనభైవంతులు స్వీయరచన, ఇరవైవంతులు వాల్మీకిరచన ఆధారంగా రామాయణ కల్పవృక్షం వ్రాశాను' అని ధీమాగా పలుకుట పరిపాటి అయినది. [భారతి - 1971 ఆగస్టు 73 పేజి]

ఈ నారచన అచ్చగుచున్న సమయములో కల్పవృక్షకర్త 'పలుకులు' కొన్ని వార్తాపత్రికలలో వినవచ్చినవి.

'వ్యాసుని హృదయం చాలామందికి తెలియదు. ఆ మాటకు వస్తే నన్నయతిక్కనలే వ్యాసుణ్ణి సరిగా తెలిగించలేక పోయారు నే ననేకం చదివాను. నాలాగా సంస్కృతాంధ్రాంగ్లాలు చదివినవారు లేరు. నేను చదివిన చదువుకంటె నా వూహాబలం గొప్పది: ఆ మాటకు వస్తే నేను ఋషిని.'

[ఆంధ్రప్రభ - 9-9-1971]

కల్పకర్త రచనలు 'విజ్ఞానదాయకాలు' - అనుటలోని విజ్ఞానమెట్టిదో, అవి సామాన్యప్రజలకు అర్థమగుననుటలో ఎంత అసత్యమున్నదో చదువరు లీపాటికి గుర్తించియే యుందురు. ఈ యసత్యమునకుఁ దోడుగా రామాయణ కల్పవృక్షము 'సృజనాత్మక సాహిత్యరచనలోఁ' జేరినట్లు 'జ్ఞానపీఠం' వారు ప్రకటించుట చిత్రవిచిత్రము. [భారతి - 1971 అగస్టు]

తెలుఁగు దేశము విద్యావంతులకు గొడ్డుపోలేదు సంస్కృతాంధ్రాంగ్లాలలో ఆరితేరిన 'కళాప్రపూర్ణులు' ఎందఱో ఉన్నారు. ఒక వేళ, అందఱికన్నఁ దామే గొప్పవారమని 'జీవుఁడు' చెప్పినను, ఆ మాట తానాగా అనుటకన్న లాఁతివారనుటలో కొంత అర్థ ముండును. పైగా – ఈ పాండిత్యముకంటె తనకు 'వూహాబలం' గొప్పదఁట. దీనిని ఒక విధముగా అన్వయింపవచ్చును.

'వాల్మీకములోని ఇతివృత్తమునకు శృంగారాదిచేష్టలచే వికారాకారము సృష్టించి పాత్రౌచిత్యము పాడువఱిచి, పురాణపాత్రలను మట్టిముంతలుగా తయారు చేయుటలో ఈ కల్పకర్త కున్న 'ఊహాబలం'చాలఁగా ఉపకరించినది. ఆపైని తాను 'ఋషి' యఁట. అన్నేండ్లు తపస్సులో మునిఁగిన విశ్వామిత్రునకే 'ఋషి' శబ్దము లభించుట చాల కష్టమయ్యె నని ఈ రామాయణమే చెప్పినది. ఈ 'కల్పకర్త' దినచర్యలు వాగ్వైఖరి – మనస్తత్త్వము, ఇత్యాదికములు నిత్యము గుర్తించు వారికి ఈ 'మాట' ఎంత హాస్యాస్పదముగఁ దోఁచునో చెప్పవలెనా ? పోనీ, కొందఱి దృష్టిలో ఈ వ్యక్తి ఋషిగా నిర్ణయమున్నచో, ఈ ఋషివంటివారే కాఁబోలు వీరి రచనలలోని 'పురాణఋరుషులు'కూడ అని స్ఫురింపవచ్చును.

'వృద్ధాస్తే న విచారణీయచరితాః'

'వృద్ధుల బుద్ధులు సంచలింపవే'

ఈ ధోరణి ఈ గురుశిష్యులలో ఉద్భవించుటవలనను–ఇమ్మాగా ప్రచారకాండకు పత్రికాప్రపంచము సైతము అవకాశ మిచ్చుటవలనను–రాజకీయవైచిత్రివలనను – ఆధికారికముగా ఏవేవో 'పదవులు' వరించుటవలనను నిజముగా 'కల్పవృక్షకర్త' అంతవాఁడే సుమా? ఆయన రచనలు 'సృజనాత్మక సాహిత్య'మే సుమా ! ఆయన 'ఋషి' వంటి వాఁడు కాదు, కేవలము'ఋషి'యే సుమా! అనెడి భ్రాంతిలోకొందఱైన

ఉండవచ్చును. ఈ భ్రాంతి కొంత తొలఁగుటకే ఈ 'ఖండనము' జోలికి రావలసి వచ్చినది.

చూచిన కొలఁది - పోయిన కొలఁది 'కల్పవృక్షము' లోని అవకతవకలు అనేకరీతులుగా కొట్టవచ్చినట్టు కన్పట్టుచున్నను గ్రంథ విస్తరభీతిచే విరమింపవలసి వచ్చినది. ఇప్పటికి 'విశ్వనాథ' రచనలలో రెండింటినే పరిశీలించి అచ్చునకుఁ దెచ్చితిని. ఈసారి, వేనరాజో-హీన రాజో, వేయిపడగలో-వేయి పిడకలో పరీక్షించి చూడవలసియున్నది. ఇప్పటి కిది చాలును. సెలవు.

రచన 1961 - జనవరి

शम्

భారతీ ప్రెస్, తెనాలి.

# దిద్దుపాటు

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| కవిత్వా | కవితా | ౧౦౯ | ౨౦ |
| కితిక | కీతిక | ౧౧౬ | ౧౨ |
| వాల్మీ | వాల్మీకి కవిత | ౧౩౦ | ౨౮ |
| వాడుకుండు | వాడుకొండు | ౧౬౨ | ౨౫ |
| సీతో) | సీతోఁ | ౧౯౨ | ౧౩ |
| పీవు | నీవు | ౧౯౪ | ౨౭ |
| చోసిన | చోషిన | ౧౯౬ | ౯ |
| ముందున | మందున | ౨౦౮ | ౧౮ |
| ఆఁడది | ఆఁడుది | ౨౧౮ | ౧౧ |
| కొను | కొనుచు | ౨౨౧ | ౭ |
| మేమియు | మేమియు లేక | ౨౩౧ | ౧ |
| లేక | తీసివేయవలెను | ,, | ౩ |
| నవిని | నని | ౨౩౬ | ౭ |
| శుర్పణఖ | శూర్పణఖ | ౨౩౮ | ౧౬ |
| దదర్మ | దదర్శ | ౨౩౯ | ౧ |
| రకతుంగ | రక్తతుంగ | ౨౪౨ | ౧౮ |
| కూరుఁడు | క్రూరుఁడు | ౨౪౨ | ౨౬ |
| శూర్పఖా | శూర్పణఖా | ౨౪౬ | ౨౧ |
| పరంజిత | పరిరంజిత | ౨౫౧ | ౨ |
| యిష మేమి | యిష్ట మేమి | ౨౫౫ | ౫ |
| తొలి | తోలి | ౨౬౧ | ౮ |
| మందరికి | మందోదరికి | ౨౭౭ | ౧౪ |
| గోరద్రగ | గోరఁదగ | ౨౭౯ | ౨౩ |
| లలఘు | అలఘు | ౨౮౮ | ౫ |
| అచ్ఛంబ్బా | అచ్ఛంబా | ౨౯౧ | ౧ |
| నింతంబము | నితంబము | ౨౯౯ | ౨౨ |

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| సృష్టింనినది | సృష్టించినది | ౩౧౧ | ౨౧ |
| వలపిన | వలసిన | ౩౧౩ | ౨౩ |
| మంటచు | మటంచు | ౩౧౫ | ౧౧ |
| ఇంకొకరికికి | ఇంకొకరికి | ౩౧౫ | ౨౧ |
| పులింగ | పుంలింగ | ౩౨౬ | ౨౨ |
| బంద్య | బంధ్య | ౩౩౧ | ౧౦ |
| అగూప | అగూప | ౩౩౨ | ౧౧ |
| డునరా | పునరా | ౩౩౭ | ౨౨ |
| అరో 262 | 226 | ౩౪౧ | ౧౦ |
| అశిలార్థ | అశ్లీలార్థ | ౩౪౨ | ౨౩ |
| అజాత | అజ్ఞాత | ౩౫౯ | ౬ |
| ఉదహరింతు | ఉదాహరింతు | ౩౬౦ | ౨౫ |
| పురాణ బురు | పురాణబు | ౩౬౭ | ౧౬ |
| న్న వాక్యం | అన్నవాక్యం | ౩౬౭ | ౨౬ |

## ఈ గ్రంథకర్తవి

1. వైదిక వాఙ్మయచరిత్ర రూ 3_00
2. సతీసప్తతి (పద్య) 0_25
3. కథావింశతి 0_65
4. చంద్రాపీడచరిత్ర 0_50
♦5. కామశాస్త్రము 3_00
6. కావ్యమాల 1 భా. 1_50
7. కావ్యమాల 2 భా. 1_50
8. సుభాషితము 0_25
9. ధర్మశాస్త్రము[మనుస్మృతి]4_00
10. కవులకథలు 0_75
11. వరరుచి 1_25
12. ఈశ్వరసేవకులు 1_00
13. విక్రమకథలు 0_65
14. మ్రొక్కుబడి (పద్య) 1_00
15. నవనాథము 1_50
16. బృహత్కథలు 0_75
17 వత్సరాజు 1_25
18. విక్రమాదిత్యము 0_75
19. సాలభంజికలు 0_68
20. బాపూజీ (పద్య) 1_00
♦21. చారుదత్తము 2_00
22 నీతిచంద్రిక (కరదీపి కావ్యాఖ్య) 3_00
23. చిన్నయ్య (సూరిచరిత్ర) 0_50
24. నైషధము 1_25
♦25. కలిపురాణము (పద్య) 4_00
♦26. ప్రతాపసింహము 2_00
27. వీరపూజ 2_00
28. చాణక్యము 2_00
♦29. దివ్యమూర్తులు 2 00
30. స్వరాజ్య కథలు 2_00
♦31. మాయాభిక్షువు (పద్య) 2_00
♦32. కలిపురాణము (2 భాగ) 4_00
♦33. మాస్వామి (పద్య) 3_00
♦34. మంజరి ,, 2_00
♦35. జాతకకథలు 0_75
♦36. సైరంధ్రి 2_50
♦37. పంచశతీ పరీక్ష 1_00
(విశ్వనాథవారి పంచశతికి విమర్శనము)
♦38. కవిరాజు (త్రిపురనేని) 3_00
♦39. వష్టిక (పద్య) 0_60
♦40. సాహితి వ్యాసములు) 3_50
♦41. రామాయణరహస్యాలు 4_00
♦42. మోహనదాసు (పద్య) 2_50
♦43. వసంతసేన (రూపకము) 3_50
♦44. కులపతి (శ్రీవరదాచార్య) 2_75
♦45. కల్పవృక్ష ఖండనము 10_00
♦46. పంచదశి (సంస్కృతము) 0_25
47. శకుంతలా (సంస్కృతము) 1_25

### అముద్రితములు

48. ధూర్తుని స్వగతము 1_50
49 మా పేరిగాఁడు 1_50
50. వేయిపడగలలోని విషజ్వాలలు 5_00
51. విశ్వనాథుని వేనరాజు 2_00
52. మేవాడవిజయము 2-00
53. కలిపురాణము (3భా.పద్య) 4_00
54. కలిపురాణము (4భా. ,, ) 4_00
55. కలిపురాణము (5భా. , ) 4.00
56. మహారథులు 2.00
57. అంజలి (పద్య) 1_50
58. లోకతంత్రము ,, 1_50
59. స్వరాష్ట్రము ,, 1_50
60. త్యాగయ్య 2_00
61. రామరాజ భూషణము 2_00
62. మాలిక (పద్య) 1_50
63. కావ్యకథలు 0_75
64. తెలుఁగు వెలుఁగులు 0_75
65. చిత్రకథలు 0_70
66. కవిత్రయము 1 50
67. పండితుఁడు (పద్య) 0_50
68. శిశుఘ్న ,, 0_50
69 తెనుఁగు లక్షణము 1_55
70. నాయుపాధ్యాయగిరి 1_50
71. బాల-ప్రౌఢప్రశ్నోత్తరమాల 1_50
72. సూక్తిముక్తావళి 2 00

♦ఈ గుర్తుగలవి మాత్రమే అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.